# మునుం

## తెలంగాణ కవితా పుష్కరం

*2000-2011*

సంపాదకులు

వేముగంటి మురళీకృష్ణ
కాంచనపల్లి
వఝల శివకుమార్
అందెశ్రీ
దాసరాజు రామారావు



# MUNUM

*Telangana Kavitha Pushkaram (2000-2011)*
*Impressions of Telangana poets*

Telangana Sahithya Samakhya Publication-2
*First Edition*
**April 2012**

Copies : ***1000***

***Cover Painting & Design :***
Ramana Jeevi

***Composed by :***
***Sai Graphics***
O.Venkateshwarlu
Cell : 9849705688

***Printed at :***
Anupama Printers,
126, Shantinagar, Hyderabad -28
Ph : 040-23391364

***Available at :***
Disha Book House,
Navodaya Book House
Palapitta Book House
Sahachara Book House
Samaanthara Book House
Vishaalaandhra Book House

Rs. **300/-**

**$ 20**






మా రక్తంలో పోరాట వారసత్వమై ప్రవహిస్తున్న...

రాణీ రుద్రమ

సమ్మక్క

సర్వాయి పాపన్న

చాకలి ఐలమ్మ

బందగీ

వట్టికోట ఆళ్వార్‌స్వామి

దాశరథి

సదాలక్ష్మి

జయశంకర్

....లకు

ఆకాంక్షల నాగేటి చాళ్ళ నిండా ఉద్యమ భావాల నాట్లు నాటడానికి నడుం బిగించి 'మునుం' పట్టి కదలివచ్చిన ఆత్మగల్ల చేతులకు శనార్తులు....

**ఆరుట్ల సుశీలాదేవి**
కా. ఆరుట్ల కమలాదేవి & రామచంద్రారెడ్డి ఫౌండేషన్, హైదరాబాద్

**తెలంగాణ డెవలప్‌మెంట్ ఫోరం యు.ఎస్.ఏ.**
**T.D.F. - USA**

**నారపరాజు రామచందర్‌రావు**
న్యాయవాది, హైదరాబాద్

# ఈ మునుం వెనక చేదోడు వాదోడు వీరు..

**ఉప్పల శ్రీనివాస్ గుప్త**
దక్షిణ మధ్య రైల్వే బోర్డు సభ్యులు, హైదరాబాద్

**డా॥ చింత రమేష్**
సివిల్ అసిస్టెంట్ సర్జన్, మహబూబాబాద్

**డా॥ ధర్మవరం రమేష్**
జనరల్ సెక్రటరీ, టి.జి.జి.డి.ఎ. గాంధీ హాస్పిటల్

**డా॥ కాశ శివరామాచారి** ఎం.డి.
పిల్లల వైద్యనిపుణులు, సిద్దిపేట

**శాలిబిండ్ల భాస్కర్‌రెడ్డి**
ఎన్ఆర్ఐ, ఆస్ట్రేలియా

**ముచ్చర్ల ఫణీందర్**
ఎ.డి.ఇ. కె.టి.పి.ఎస్. పాల్వంచ

**బొమ్మి సునితా శ్రీనివాసరావు**
ప్రభుత్వ ఉపాధ్యాయులు, కాగజ్ మద్దూర్

**కొండపల్లి నీహారిణి**
రచయిత్రి, హైదరాబాద్

**సముద్రాల భాస్కర్ రావు**
హైదరాబాద్

**ఒద్దిరాజు ప్రవీణ్ కుమార్**
హైదరాబాద్

**దాచరాజు గోపాలకిషన్‌రావు**
ఎ.ఎ.ఓ.(టి&ఎ)ఆబ్కారీ&ప్రొహిబిషన్, కరీంనగర్

**డా॥ దామెర రాములు** ఎం.డి.
జనరల్ మెడిసన్ నిర్మల్ నర్సింగ్ హోమ్

**డా॥ అప్పాల చక్రధారి**
పిల్లల వైద్య నిపుణులు, నిర్మల్

**అందె మల్లుబాయి**
హైదరాబాద్

**పైతర మహేందర్‌రెడ్డి**
ఎన్ఆర్ఐ. ఆస్ట్రేలియా, సిద్దిపేట్

**దాచరాజు నరేష్ కుమార్**
ఎ.డి.ఇ. కె.టి.పి.ఎస్. పాల్వంచ

**పొరల్ల వెంకటేశ్వరరావు**
ఎ.డి.ఇ. కె.టి.పి.ఎస్. పాల్వంచ

**మెట్టు అభిశేఖర**
స్టోర్ ఇన్‌ఛార్జ్, బి.హెచ్.ఇ.ఎల్. హైదరాబాద్

**దాతారి సూర్యప్రకాష్ రావు**
ప్రిన్సిపల్, ప్రతిభా డిగ్రీ కాలేజ్, సిద్దిపేట్

**మచ్చ సురేఖారెడ్డి**
డి.పి.ఎమ్., డి.ఆర్.డి.ఎ, రంగారెడ్డి

**తిరుకోవెల నరసింహస్వామి (టి.ఎస్. స్వామి)**
మేనేజర్, బి.హెచ్.ఇ.ఎల్, హైదరాబాద్

**వంగ గాలిరెడ్డి**
కవి, సిద్దిపేట్

# వరుస....

# రక్త సిక్త కవిత్వం

ఫలానా నాయకుడికి మంత్రి పదవి దక్కి ఉంటే తెలంగాణ ఉద్యమం వచ్చి ఉండేదా? అన్న విమర్శాత్మక ప్రశ్న మనం తరచు వింటుంటాము. అది చవకబారు ప్రశ్న కాబట్టి జవాబు చెప్పనక్కరలేదు. 1990 దశకంలో వరుస దుర్భిక్షాలు ఏర్పడకపోతే, ప్రత్యేక ఉద్యమం వచ్చి ఉండేదా? అన్న ప్రశ్నలో కొంత జిజ్ఞాస ఉన్నది. దానికి జవాబు చెప్పుకోవచ్చు. అనేక బాహ్య, వస్తుగత అంశాల ప్రభావంతో ఒక నిర్ధిష్ట పరిణామం ఎట్లా రూపుదిద్దుకుంటుందో అవగతం చేసుకోకపోతే, ఉద్యమాలకూ, అందులోని వ్యక్తులకూ, విడివిడి సంఘటనలకూ ఉండే తార్కికమైన సంబంధం అర్థం చేసుకోకపోతే మనకు తప్పుడు సమాధానాలే దొరకుతాయి. 1995 తరువాత తిరిగి మొలకెత్తి మొక్కై మహావృక్షమై ఎదిగిన తెలంగాణ ఉద్యమానికి మూలాలు సుదూరచరిత్రలోను, సమీప చరిత్రలోను, ఈ పదిహేడేళ్ళ వర్తమానంలోనూ ఉన్నాయి. తెలంగాణ స్థలంలోను, రాష్ట్రంలోను, దేశంలోను, ప్రపంచమంతటా ఏర్పడిన పరిస్థితులు, జరుగుతూ వస్తున్న పరిణామాలు ఉద్యమ అవతరణకు, వ్యాప్తికి సానుకూల వాతావరణాన్ని కల్పించాయి. నాలుగు దశాబ్దాలు గడచినా ఏకత ఏర్పడని విఫల అస్థిత్వం. వివక్షలతో అణగారిపోయిన ఉనికిపై ముంచుకవచ్చిన ప్రపంచీకరణ పెనుముప్పు, నిరంతర రక్తపాతపు చిత్తడి, క్షేత్రస్థాయి గ్రామీణ వాస్తవికతలో వచ్చిన వాస్తవ, ఊహాత్మక మార్పులు- ఇవీ బహుశా తెలంగాణ ఉద్యమాన్ని మోసుకువచ్చిన రుతుపవనాలు. మరే అస్తిత్వ ఉద్యమంతో పోల్చలేని విధంగా తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమం సాహిత్య ఉద్యమం సాహిత్య సాంస్కృతిక అభివ్యక్తిలో విశ్వరూపం ప్రదర్శించింది. నిద్రాణంగానో, అనాదృతంగానో అణగారిపోయిన తెలంగాణ సృజనాత్మకత ఒకసారిగా పునరుజ్జీవనం పొందింది.

తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడాలన్న రాజకీయ ఆకాంక్ష బలపడడానికి నేపథ్యంగా తెలంగాణ అస్తిత్వ ఆవిష్కరణ జరిగింది. ఏ అస్తిత్వానికయినా

తన-పర అన్న నిర్వచనం కీలకమైనది. అస్తిత్వ ఉద్యమాలన్నీ అంతకు ముందు చెలామణిలో ఉన్న అస్తిత్వాలను చీల్చుకుని వచ్చేవే. తెలంగాణ అస్తిత్వం అంతకు ముందు ఉనికిలో ఉన్న తెలుగు అస్తిత్వాలను చీల్చుకుని వచ్చింది. తెలుగు అస్తిత్వం భాషను ప్రాతిపదికగా సూచిస్తే, తెలంగాణ అస్తిత్వం భౌగోళికతను ప్రాతిపదికగా చెబుతుంది. సాంస్కృతిక, భాషా ప్రత్యేకతలకు కూడా భౌగోళికతే కీలకంగా ఉంటుంది. తెలంగాణ భౌతిక హద్దులలో చరిత్రలో వర్తమానంలో జీవించిన జీవిస్తున్న వారందరికీ కలిపి ఒకే చరిత్ర, ఉమ్మడి జ్ఞాపకాలూ ఉన్నాయని అస్తిత్వ వాదం చెబుతుంది. వర్తమానంలోని వివక్ష, చరిత్రలో ఔన్నత్యంగా ప్రతిఫలిస్తుంది. అవకాశాలు లభిస్తే తామూ వృద్ధిలోకి వచ్చేవారమనే బాధ, వివక్షలేని ఒక చారిత్రక (కాల్పనిక కూడా కావచ్చు) కాలంలో తాము సుఖంగా ఉన్నామనే విశ్వాసం నుంచి ఉపశమనాన్నీ, ప్రేరణనీ పొందుతుంది. జాతీయోద్యమకాలంలో భారత జాతీయత తనను తాను ఇట్లాగే నిర్మించుకున్నది.

అంతరాలు, తారతమ్యాలు, వివక్షలు వంటివి ఉన్న చోట్లన్నిటిలో ఈ ప్రత్యేక అస్తిత్వ భావన వస్తుందనడానికి లేదు. వాటి తీవ్రత, విస్తృతి తగినంత ఉండాలి. అంతే కాక, అనేక చారిత్రక కారణాలు, వర్తమాన పరిణామాలు, సాంస్కృతిక ప్రత్యేకతలు, నైసర్గిక విశిష్టతలు, ప్రజలలోని వైరుధ్యాలు తగ్గుముఖంలో ఉండడం వంటి అనేక ఇతర కారణాలు జతకూడితే తప్ప ప్రత్యేకత విభజనకు సానుకూలంగా పరిణమించదు. అందువల్లనే, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలన్న ఆకాంక్ష గతంలోను అనేక పర్యాయాలు వ్యక్తం అయినప్పటికీ, 1995 తరువాతి ఉద్యమం మాత్రమే పూర్తిస్థాయి అస్తిత్వ ఉద్యమ స్వభావాన్ని సమకూర్చుకున్నది. అప్పటికిగానీ అన్ని పరిస్థితులూ అనుకూలం కాలేదు.

1956లో ఆంధ్రప్రదేశ్‌గా రూపొందిన తెలంగాణ - ఆంధ్ర ప్రాంతాలు మొదటి దశాబ్దకాలంలో ఆ విలీనంతో పూర్తిగా సమాధాన పడ్డాయని చెప్పలేము. ఒక మంచి రాజధాని దొరికిందన్న సంతోషం, తెలుగు మాట్లాడే ప్రాంతాలన్నీ ఒకటయ్యాయన్న భావనాత్మక ఆనందం కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లో సాధారణ స్థాయిలో నెలకొని ఉండవచ్చు. ఆంధ్రప్రదేశ్

అవతరణ నుంచి పిండుకోగలిగిన ప్రయోజనాల గురించి అవగాహన ఉన్నప్పటికీ, అందుకు తగ్గ విధాన కాలక్రమణికను రూపొందించే సమయం నాటి పాలకులకు లేకపోయి ఉండవచ్చు. ఆ ప్రయోజనాలను త్వరిత గతిన చేజిక్కించుకోవాలని ఆత్రపడే వర్గం కానీ, సాధించుకునే వర్గం కానీ అప్పటికింకా సీమాంధ్రలో ఏర్పడి ఉండకపోవచ్చు. ఏర్పడినా వారింకా మద్రాసు నగరంతోనే లంకె వేసుకుని ఉండవచ్చు. ఇక తెలంగాణ ప్రాంతమైతే విలీనంతో మొదటి రోజునుంచి పేచీపడుతూనే ఉన్నది. మొదటి దశాబ్దంలో కూడా అడుగడుగునా నిలదీస్తూనే ఉన్నది. ఆంధ్రపాలకులను అనుమానిస్తూనే ఉన్నది. అయితే 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని అణచివేయడంలో ఇందిరాగాంధీ కరకు జాతీయవాద నిరంకుశత్వం వహించినంత పాత్ర, నాటి ఆంధ్ర పాలకవర్గాలు వహించాయా అన్నది ఒక చర్చించవలసిన అంశం. వహించి ఉంటే, తెలంగాణ ఉద్యమం చల్లారిన వెంటనే జై ఆంధ్ర ఉద్యమం (అందుకు ప్రేరణలు ఏమైనప్పటికీ, ఆ ఉద్యమంలో బాధిత ధోరణి కంటె ఆధిపత్యవాదమే ప్రతిఫలించినా) వచ్చి ఉండేదా అని సందేహం కలుగుతుంది. ప్రత్యేక తెలంగాణ అంటూ ఏర్పడితే హైదరాబాద్‌ను తగలబెడుతాము ఉట్టి చేతులతో వెళ్ళము అని ఆనాడు అన్న వ్యక్తి కోట్ల విజయభాస్కర్ రెడ్డి. సరి అయిన రాజధాని ఆంధ్ర రాష్ట్రానికి లేదని బాధపడిందీ, తమ ప్రాంతంలోనే రాజధానిని ప్రతిపాదించి ప్రారంభించినా అది శాశ్వతంగా మారకుండా జాగ్రత్త పడిందీ రాయలసీమకు చెందిన కాంగ్రెస్ నాయకత్వం అని గుర్తుచేసుకుంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. అయితే, సంజీవరెడ్డి దగ్గరనుంచి విజయభాస్కరరెడ్డి దాకా నాటి కేంద్రప్రభుత్వంపై తిరుగులేని ఒత్తిడి పెట్టగలిగే శక్తి ఉన్నవారా? పై ఇద్దరు రాయలసీమ నేతలకు తోడు కాసు బ్రహ్మానంద రెడ్డిని కలుపుకుంటే - అది ప్రాంతీయ కూటమి కాక, సామాజిక కూటమిగా భావించాలా? ఆ సామాజికవర్గానికి విశాలాంధ్రలో ప్రయోజనాలుండి 1969 ఉద్యమాన్ని నిరోధించే ప్రయత్నం చేశారా? అప్పటికింకా ద్వితీయ స్థానంలోనే ఉండిన మరో కోస్తాంధ్ర సామాజిక అగ్రవర్ణం, తెలంగాణలో కానీ, హైదరాబాద్‌లో కానీ పెద్దగా ప్రయోజనాలు లేక విభజనకు సానుకూలంగా

తన-పర అన్న నిర్వచనం కీలకమైనది. అస్తిత్వ ఉద్యమాలన్నీ అంతకు ముందు చెలామణిలో ఉన్న అస్తిత్వాలను చీల్చుకుని వచ్చేవే. తెలంగాణ అస్తిత్వం అంతకు ముందు ఉనికిలో ఉన్న తెలుగు అస్తిత్వాలను చీల్చుకుని వచ్చింది. తెలుగు అస్తిత్వం భాషను ప్రాతిపదికగా సూచిస్తే, తెలంగాణ అస్తిత్వం భౌగోళికతను ప్రాతిపదికగా చెబుతుంది. సాంస్కృతిక, భాషా ప్రత్యేకతలకు కూడా భౌగోళికతే కీలకంగా ఉంటుంది. తెలంగాణ భౌతిక హద్దులలో చరిత్రలో వర్తమానంలో జీవించిన జీవిస్తున్న వారందరికీ కలిపి ఒకే చరిత్ర, ఉమ్మడి జ్ఞాపకాలూ ఉన్నాయని అస్తిత్వ వాదం చెబుతుంది. వర్తమానంలోని వివక్ష, చరిత్రలో ఔన్నత్యంగా ప్రతిఫలిస్తుంది. అవకాశాలు లభిస్తే తామూ వృద్ధిలోకి వచ్చేవారమనే బాధ, వివక్షలేని ఒక చారిత్రక (కాల్పనిక కూడా కావచ్చు) కాలంలో తాము సుఖంగా ఉన్నామనే విశ్వాసం నుంచి ఉపశమనాన్నీ, ప్రేరణనీ పొందుతుంది. జాతీయోద్యమకాలంలో భారత జాతీయత తనను తాను ఇట్లాగే నిర్మించుకున్నది.

అంతరాలు, తారతమ్యాలు, వివక్షలు వంటివి ఉన్న చోట్లన్నిటిలో ఈ ప్రత్యేక అస్తిత్వ భావన వస్తుందనడానికి లేదు. వాటి తీవ్రత, విస్తృతి తగినంత ఉండాలి. అంతే కాక, అనేక చారిత్రక కారణాలు, వర్తమాన పరిణామాలు, సాంస్కృతిక ప్రత్యేకతలు, నైసర్గిక విశిష్టతలు, ప్రజలలోని వైరుధ్యాలు తగ్గుముఖంలో ఉండడం వంటి అనేక ఇతర కారణాలు జతకూడితే తప్ప ప్రత్యేకత విభజనకు సానుకూలంగా పరిణమించదు. అందువల్లనే, తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఉండాలన్న ఆకాంక్ష గతంలోను అనేక పర్యాయాలు వ్యక్తం అయినప్పటికీ, 1995 తరువాతి ఉద్యమం మాత్రమే పూర్తిస్థాయి అస్తిత్వ ఉద్యమ స్వభావాన్ని సమకూర్చుకున్నది. అప్పటికిగానీ అన్ని పరిస్థితులూ అనుకూలం కాలేదు.

1956లో ఆంధ్రప్రదేశ్‌గా రూపొందిన తెలంగాణ - ఆంధ్ర ప్రాంతాలు మొదటి దశాబ్దకాలంలో ఆ విలీనంతో పూర్తిగా సమాధాన పడ్డాయని చెప్పలేము. ఒక మంచి రాజధాని దొరికిందన్న సంతోషం, తెలుగు మాట్లాడే ప్రాంతాలన్నీ ఒకటయ్యాయన్న భావనాత్మక ఆనందం కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాల్లో సాధారణ స్థాయిలో నెలకొని ఉండవచ్చు. ఆంధ్రప్రదేశ్

అవతరణ నుంచి పిండుకోగలిగిన ప్రయోజనాల గురించి అవగాహన ఉన్నప్పటికీ, అందుకు తగ్గ విధాన కాలక్రమణికను రూపొందించే సమయం నాటి పాలకులకు లేకపోయి ఉండవచ్చు. ఆ ప్రయోజనాలను త్వరిత గతిన చేజిక్కించుకోవాలని ఆత్రపడే వర్గం కానీ, సాధించుకునే వర్గం కానీ అప్పటికింకా సీమాంధ్రలో ఏర్పడి ఉండకపోవచ్చు. ఏర్పడినా వారింకా మద్రాసు నగరంతోనే లంకె వేసుకుని ఉండవచ్చు. ఇక తెలంగాణ ప్రాంతమైతే విలీనంతో మొదటి రోజునుంచి పేచీపడుతూనే ఉన్నది. మొదటి దశాబ్దంలో కూడా అడుగడుగునా నిలదీస్తూనే ఉన్నది. ఆంధ్రపాలకులను అనుమానిస్తూనే ఉన్నది. అయితే 1969 ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని అణచివేయడంలో ఇందిరాగాంధీ కరకు జాతీయవాద నిరంకుశత్వం వహించినంత పాత్ర, నాటి ఆంధ్ర పాలకవర్గాలు వహించాయా అన్నది ఒక చర్చించవలసిన అంశం. వహించి ఉంటే, తెలంగాణ ఉద్యమం చల్లారిన వెంటనే జై ఆంధ్ర ఉద్యమం (అందుకు ప్రేరణలు ఏమైనప్పటికీ, ఆ ఉద్యమంలో బాధిత ధోరణి కంటె ఆధిపత్యవాదమే ప్రతిఫలించినా) వచ్చి ఉండేదా అని సందేహం కలుగుతుంది. ప్రత్యేక తెలంగాణ అంటూ ఏర్పడితే హైదరాబాద్‌ను తగలబెడుతాము ఉట్టి చేతులతో వెళ్ళము అని ఆనాడు అన్న వ్యక్తి కోట్ల విజయభాస్కర్ రెడ్డి. సరి అయిన రాజాధాని ఆంధ్ర రాష్ట్రానికి లేదని బాధపడిందీ, తమ ప్రాంతంలోనే రాజధానిని ప్రతిపాదించి ప్రారంభించినా అది శాశ్వతంగా మారకుండా జాగ్రత్త పడిందీ రాయలసీమకు చెందిన కాంగ్రెస్ నాయకత్వం అని గుర్తుచేసుకుంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. అయితే, సంజీవరెడ్డి దగ్గరనుంచి విజయభాస్కరరెడ్డి దాకా నాటి కేంద్రప్రభుత్వంపై తిరుగులేని ఒత్తిడి పెట్టగలిగే శక్తి ఉన్నవారా? పై ఇద్దరు రాయలసీమ నేతలకు తోడు కాసు బ్రహ్మానంద రెడ్డిని కలుపుకుంటే - అది ప్రాంతీయ కూటమి కాక, సామాజిక కూటమిగా భావించాలా? ఆ సామాజికవర్గానికి విశాలాంధ్రలో ప్రయోజనాలుండి 1969 ఉద్యమాన్ని నిరోధించే ప్రయత్నం చేశారా? అప్పటికింకా ద్వితీయ స్థానంలోనే ఉండిన మరో కోస్తాంధ్ర సామాజిక అగ్రవర్ణం, తెలంగాణలో కానీ, హైదరాబాద్‌లో కానీ పెద్దగా ప్రయోజనాలు లేక విభజనకు సానుకూలంగా

వ్యవహరించిందా? ఇటీవలి చరిత్రకే సంబంధించిన ఈ అంశాలపై లోతుగా దృష్టి సారించవలసి ఉన్నది. 1972-73 లలో జై ఆంధ్ర అన్న సామాజిక శక్తులే, ప్రస్తుతం తెలంగాణకు ప్రధాన అవరోధంగా ఉన్నారన్నది ఈ సందర్భంగా గుర్తు పెట్టుకోవాలి.

ప్రస్తుత తెలంగాణ ఉద్యమం విషయంలో కేంద్రప్రభుత్వం తన వరకు తాను తటస్థంగా ఉండడమో, కనీసం అసహనంగా లేకపోవడమో కనిపిస్తుంది. మోసకారితనం ఉన్నా దాని వెనుక రాష్ట్రపాలకవర్గాల ప్రభావమే కనిపిస్తుంది. స్థానిక ప్రయోజన శక్తులే పరిష్కారానికి అడ్డుపడడం స్పష్టంగా తెలుస్తుంది. ఇప్పుడు అడ్డుపడుతున్న శక్తులు, మొదటి ఉద్యమకాలంలో సమైక్యరాష్ట్రం మీద పెద్ద ప్రేమ ఉన్నవారేమి కాదు. వేర్పాటుకైనా సిద్ధపడిన ఆ శక్తులకు నాడు తెలంగాణలో కానీ, హైదరాబాద్‌లో కానీ వదలుకోలేనన్ని ప్రయోజనాలు లేకపోవడమే ఆ వైఖరికి కారణం. 1983 తరువాత తెలుగుదేశం పార్టీ అధికారంలోకి వచ్చిన తరువాత, ఆంధ్రుల ఆత్మాభిమానం నినాదానికి తెలంగాణ ప్రాంతం కూడా సానుకూలంగా స్పందించిన తరువాత - వలసీకరణ పెరిగింది, ఉధృతమైంది. చెన్నైలో బిగించుకున్న ఆర్థిక, సాంస్కృతిక శక్తులన్నీ హైదరాబాద్‌కు తరలివచ్చాయి. తెలంగాణ వలసీకరణ విధానీకరణ చెందింది. తెలంగాణ పరంపరాగతంగా అనుసరిస్తూ వస్తున్న వ్యవసాయపద్ధతులు నాశనమయ్యాయి. మొత్తంగా అభివృద్ధి విధానమే తెలంగాణకు ప్రతికూలంగా మారిపోయింది. ఈ విధానీకరణ, ఆర్థిక సంస్కరణల వేడితో, వరుసకరువులతో జతకలిసి తెలంగాణ క్షేత్రస్థాయిలో మనుగడల సంక్షోభాన్ని సృష్టించింది. వర్తమానం విధ్వంసమై జ్ఞాపకాలలో, గత వైభవంలో కాసింత తడి వెదుక్కునే స్థితి ఏర్పడింది. అప్పటికి రెండున్నర దశాబ్దాలుగా సాగుతున్న విప్లవోద్యమం సడలుతున్న సూచనలు కూడా కనిపించి, తెలంగాణ తన ఉద్యమస్ఫూర్తికి మరో ఆలంబన వెదుక్కోవలసిన అవసరమూ ఏర్పడింది. భూస్వామ్యం సారాంశంలో పెద్దగా బలహీనపడకపోయినా, కమతాల విస్తీర్ణంలో, రైతాంగ సామాజిక స్వభావంలో వచ్చిన మార్పులు, గ్రామీణప్రాంతాల నుంచి సాంప్రదాయ భూస్వామ్యవర్గాలు భౌతికంగా తప్పుకోవడం వల్ల కలిగిన మార్పులు - ఒక కొత్త వాస్తవికతను

రంగం మీదకు తెచ్చాయి. తెలంగాణ గ్రామీణ సమాజానికి సమష్టిగా కొన్ని సమస్యలు, ఆకాంక్షలు రూపుదిద్దుకున్నాయి. తెలంగాణకు బయట శత్రువును వెదుక్కొని ఆ ప్రాతిపదిక మీద ఐక్యత నిర్మితం కాసాగింది. జాతీయోద్యమ కాలంలో జరిగినట్టు ఒక వైభవ జ్ఞాపకం (అది అసంకల్పితమైనదైనా, వాస్తవమైనదైనా), చెరిగిపోతున్న జీవనవిధానాల మీద బెంగ, పచ్చటి భవిష్యత్తు మీద కోరిక తెలంగాణను కుదిపివేయ సాగింది.

ఈ బెంగను మొదట గుర్తించింది కవులే. తెలంగాణ లోని శైథిల్యాన్ని మొదటగా కనిపెట్టి దానికి గొంతునిచ్చింది కవిత్వమే. అయితే, ఆ దశలో, అంటే 1995కు ముందూ వెనకాసంవత్సరాలలో, దాని రాజకీయ వ్యక్తీకరణ తెలంగాణ ప్రత్యేకరాష్ట్ర ఆకాంక్ష అని ఆ కవులకు స్పష్టంగా తెలియకపోయి ఉండవచ్చు. ఎండిపోతున్న చెరువుల గురించి, అణగారిపోతున్న వృత్తుల గురించి, రైతు దీనస్థితి గురించి, వలస వెళ్లడంలోని వేదన గురించి, ప్రకృతిలో వస్తున్న మార్పుల గురించి, సమిష్టి జీవనానికి సంబంధించిన అవశేషాలు కూడా తొలగిపోవడం గురించి వాళ్ళు కవిత్వం రాశారు. ముంచుకువస్తున్న ప్రపంచీకరణలోని పెనుముప్పును, వ్యవసాయానికి డంకెల్ తలపెట్టిన హానిని కూడా తెలంగాణ కవులు రాస్తూనే ఉన్నారు. ఆ వ్యక్తీకరణల్లో సైతం సార్వత్రిక అంశం కంటె, తెలంగాణ నిర్దిష్టతే ఎక్కువ. 1997-98 నాటికి స్పష్టత అందుకునే లోపు తెలంగాణ కవి అసంకల్పితంగా స్థానికతావాదం దిశగా ఎట్లా ప్రయాణించిందీ ఒక ఆసక్తికరమైన అధ్యయనం అవుతుంది. కవిత్వంలో సాధారణీకరణంగా కూడా ఉంటుంది కాబట్టి, తెలంగాణ అట్టడుగు వాస్తవికతనుంచి కవి స్థానికతకు సంబంధించిన ప్రాతిపదికలను, తాత్వికతను కూడా ప్రతిపాదించాడు. తెలంగాణ ఉద్యమం అంటే, స్థానిక వనరుల మీద స్థానికులకు అధికారం కోరుతున్న ఉద్యమమని, ప్రపంచీకరణకు సమాధానమో విరుగుడో స్థానికీకరణ అని కవిత్వం అన్యాపదేశంగా అయినా సూచిస్తూ వచ్చింది.

2000 దాకా వచ్చిన కవిత్వంలో - 'ఇతరులను' సంబోధించి రాసే కవిత్వం కంటె, ఇతరులు ఇతరులెట్లా అయ్యారో చెప్పే కవిత్వం కంటె, తెలంగాణ తన గురించి తాను పలవరించిన, బెంగపడిన కవిత్వమే

ఎక్కువ. ఆగ్రహం కంటే దీనత్వమే, పోరాటం కంటె నిస్సహాయతే ఎక్కువ. రాస్తున్నప్పుడు వారు ఆ కాలపు కలవరాన్ని మాత్రమే పలికారు. ఆ కవిత్వం తెలంగాణ అంతటా లక్షలాది హృదయాలలో నిశ్శబ్దంగా సుడులు తిరుగుతున్న ఆవేదనలు అసంకల్పితంగానే ప్రతిధ్వనించింది.తెలంగాణ క్షేత్ర వాస్తవికత ఒక రాజకీయ ఆకాంక్ష దిశగా నడుస్తున్నదని అతి త్వరలోనే కనిపెట్టింది కూడా సాహిత్యకారులే. విప్లవసంస్థలకు అనుబంధంగా పనిచేస్తున్న ఉద్యమసంఘాలు, కొన్ని మేధావుల సంఘాలు మినహాయిస్తే, మొదటగా సమీకృతులైనది కూడా తెలంగాణ రచయితలూ, కవులే.

తెలంగాణ కవులు తెలంగాణవాదకవులుగా మారిన పరిణామం సులువుగానే జరిగింది. విప్లవోద్యమంలోని పాట, వచన కవిత్వం రెండూ మొదట తెలంగాణ కోసం గొంతు అరువు ఇచ్చాయి. తరువాత వాటికి తోడు తెలంగాణకు సొంత గొంతుకలు మొదలయ్యాయి. ప్రగతి విప్లవ భావాలకు వ్యతిరేకంగా లేదా దూరంగా ఉండి పోయినవారు తెలంగాణ సంకేత స్థలం దగ్గర తమ పాత మిత్రులను కలుసుకున్నారు. దళిత, మైనారిటీ ఉద్యమాలు కూడా క్రమంగా తెలంగాణకు దగ్గరయ్యాయి. తమ తమ సాంస్కృతిక ప్రత్యేకతలను ప్రాంత అస్తిత్వంతో ముడివేసిన వ్యక్తీకరణలు తెలంగాణ సాహిత్యాన్ని సంపన్నం చేశాయి. తెలంగాణ మాండలికాలు, నైసర్గిక ప్రత్యేకతలు, పండుగలు, జనజీవితంలోని సానుకూల అంశాలు కవిత్వీకరణ చెందాయి. అయితే, తెలంగాణ అస్తిత్వ ఉద్యమం సాంస్కృతిక ప్రవాహానికి పాటే అగ్రగామిగా నిలిచింది. వచనకవిత్వం రెండో స్థానంలోనే నిలిచింది. పాటకున్న జనసమీకరణ శక్తి మాత్రమే అందుకు కారణం కాదు. తెలంగాణ సాంస్కృతిక అస్తిత్వానికి తగిన సాహిత్య రూపం కాబట్టే అది నాయకస్థానంలోకి వెళ్లింది. తెలంగాణసమాజంలో ఆధునిక మధ్యతరగతి ఇంకా ఒక శ్రేణిగా రూపుదిద్దుకోకపోవడం, మధ్యతరగతి చెందేవారు సైతం ఇంకా గ్రామీణ, వ్యవసాయసమాజపు పునాదులతో సంబంధంతోనే ఉండడం- వారి కవిత్వాన్ని కూడా దాదాపుగా వచనంలో రాసిన పాటగానే నిలిపాయి. ఆధునిక ప్రయోగవాద శైలిలో, శిల్పంతో తెలంగాణవాద కవిత్వం రాయడం సాధ్యం కాదనిపిస్తుంది. అట్లా వచ్చిన కొన్ని కవితలు సానుభూతిపరులైన

ప్రాంతేతరులు రాసినవి కావడం విశేషం. వచన కవిత్వం ఆధునికులైన మధ్యతరగతివారి సాహిత్య కవిత్వ రూపమని అందుకోసమే తెలంగాణలో మధ్యతరగతి లేని లోటు వచన కవిత్వం మీద ప్రభావం వేసిందని అనుకుంటే, మరి తెలంగాణ ఉద్యమంలో అసంఖ్యాకంగా వచ్చిన సమాచార, విశ్లేషణాత్మక వచనం సంగతేమిటి? కవిత్వంతో పోటీపడుతూ తెలంగాణ వాదాన్ని వివరిస్తూ, ప్రతిపాదిస్తూ, ప్రచారం చేస్తూ వచ్చిన బౌద్ధిక వచనం దేన్ని సూచిస్తున్నది? తెలంగాణలో ఉధృతంగా సాగుతున్న పరిశోధన దేనికి సంకేతం? బౌద్ధిక వ్యాపకానికి ఇంతగా అవకాశం ఇస్తున్న ఉద్యమంలో, బుద్ధి జీవులు ఇంతటి చొరవతో పనిచేస్తున్నప్పుడు, తెలంగాణ ఉద్యమానికి కవిత్వ నాయకత్వం పాట కావడం విశేషం. ఇది లోతుగా ఆలోచించవలసినవిషయమే. అలాగే తెలంగాణ వాద కథ ఎందుకు ముందుకు వెళ్ళలేదు? కారణాలేమిటి? కూడా చర్చించవలసి ఉన్నది.

2000 సంవత్సరం తరువాత, బషీర్‌బాగ్ కాల్పుల సంఘటన తరువాత తెలుగుదేశం ప్రభుత్వం మీద వ్యతిరేకత బలపడడం మొదలుపెట్టాక, 2001 లో తెలంగాణ ఆకాంక్ష సాధనకు ఒక ప్రధాన స్రవంతి రాజకీయపార్టీ అవతరించాక- తెలంగాణవాద గమనంలోనూ గుణాత్మకమైన మార్పులు వచ్చాయి. అంశాల వారీగా పోరాటాలను కానీ, పాక్షికమైన పోరాటాలను కానీ చేపట్టకపోయినప్పటికీ, రాజకీయ పార్టీ అవతరణే ప్రత్యేక రాష్ట్ర అంశంపై భావపోరాటానికి కారణమయింది.అప్పటిదాకా సాహిత్య సాంస్కృతిక రంగాలలోను, కొన్ని ఉద్యమ వేదికలలోను ఎటువంటి అభిప్రాయాలను ప్రకటించినా చర్చలోకి రాని ప్రాంత ఆంధ్ర రాజకీయులు, సాహిత్య కారులు - రాజకీయపార్టీ అవతరణ తరువాత గొంతువిప్పారు. తెలంగాణ ఉద్యమం ముందుకు తెస్తున్న అనేక వైఖరులకు, అభిప్రాయాలకు ఖండనలు కూడా రాసాగాయి. కొంత కాలం భారీ జనసమీకరణలతో తెలంగాణ వాదం ఒక ఉత్సవంగా మారింది. సాంస్కృతికమైన వ్యక్తీకరణలు పెరిగిపోతూ వచ్చాయి. బతుకమ్మ ఒక తెలంగాణ స్వాభిమాన ప్రకటనగా మారింది. రాజకీయంగా జరిగిన జిమ్మిక్కులు, రాష్ట్రంలోను, ఢిల్లీ లోను నేతలు చేసిన మాయలు అన్నీ జనాన్ని ప్రేక్షకులుగా మార్చినప్పటికీ, తెలంగాణ అస్తిత్వవాద

వ్యాప్తి నిరాఘాటంగా సాగుతూ వచ్చింది. 2009లో కెసిఆర్ నిరాహారదీక్షకు ముందూ ఆ తరువాత జరిగిన పరిణామాలు, దశాబ్దానికిపైగా సాగిన భావసన్నాహాల తరువాత ప్రజలకు ప్రత్యక్ష పోరాట అవకాశాన్నిచ్చాయి. ఈ పదేళ్ళ కవిత్వం ఈ పరిణామాలన్నిటిని ప్రతిధ్వనిస్తూ వచ్చింది. 2000 నుంచి పన్నెండేళ్ళ కాలంలో, ఉద్వేగపరచిన ఏ సందర్భాన్నీ కవి వదిలిపెట్టలేదు. సంఘటనలు లేనికాలంలో, ఇంకా నిరీక్షణే సాగుతున్న సమయంలో కవి అస్తిత్వస్పృహతో చరిత్రనో, వర్తమాన సమాజాన్నో చూడడానికి ప్రయత్నించాడు. లేదా 2000 కు ముందు రాసినట్టు, బెంగలను, వనరుల వినాశనాన్ని పల్లె కన్నీటిని రాస్తూ పోయాడు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పరచబోతున్నట్టు కేంద్రప్రభుత్వం తరఫున 2009 డిసెంబర్ 9 నాడు కేంద్ర మంత్రి చిదంబరం చేసిన ప్రకటన తెలంగాణ ఉద్యమంలో విజయోత్సాహాన్ని నింపగా, దాన్ని వెనక్కి తీసుకుంటూ డిసెంబర్ 23 నాడు చేసిన మరో ప్రకటన నిస్పృహను, నిస్సహాయతతో కూడిన ఆగ్రహాన్నీ కలిగించింది. తెలంగాణనంతటినీ ఒక్కటీ చేసింది. తటస్థులను సైతం తెగింపులోకి లాగింది. ఫలితమే ఆత్మాహుతుల పరంపర.

ఈ పన్నెండేళ్ళ కాలంలో ఉద్యమం చెబుతున్న అస్తిత్వ వాదాన్ని ప్రకటించే కవిత్వమూ, 'ఇతరుడి'ని సంబోధిస్తూ , హెచ్చరిస్తూ, చైతన్యపరుస్తూ రాసిన కవిత్వమూ, తెలంగాణను, చరిత్రను కీర్తిస్తూ రాసిన కవిత్వమూ ఒక ఎత్తు కాగా, అంతకు ఇబ్బడిముబ్బడిగా వచ్చిన కవిత్వం చివరి రెండేళ్ళది. గుండెను పిండి, మండించే కవిసమయాలను అనేకం ఈ కాలం కవికి ప్రసాదించింది. హైదరాబాద్ ఫ్రీజోన్, కెసిఆర్ నిరాహారదీక్ష, అది జరుగుతూ ఉండగానే శ్రీకాంతచారి ఆత్మాహుతి, డిసెంబర్ 9, 23 ప్రకటనలు, ఉద్యమరాజధానిగా మారిన ఉస్మానియా, పోలీసు నిర్బంధం ఎడతెగని ఆత్మహత్యలు, శ్రీకృష్ణకమిటీ నియామకం, మానుకోటలో జగన్ పర్యటన, కృష్ణ కమిటీ నివేదిక వచ్చాక అందులో ఆరో సిఫారసు, ఎనిమిదో చాప్టర్ మిలియన్ మార్చ్, విగ్రహ విధ్వంసం, సకల జనుల సమ్మె, తెలంగాణ కవిని మథనపెట్టి కవిత్వం రాయించిన సందర్భాలు. వీటన్నిటిని ఈ

పుస్తకంలో చదవవచ్చు.

తెలంగాణ వాద కవిత్వంలో అద్భుతమైన వచన కవిత్వం వచ్చింది. మంచి దీర్ఘకవితలూ వచ్చాయి. గ్రామీణ, వ్యావసాయిక జీవనానికి సంబంధించి వచన కవిత్వంలోని అభివ్యక్తిని తెలంగాణ నేపథ్యంలో ప్రత్యేకంగా పరిశీలించాలి. విప్లవ కవిత్వంలో కంటె తెలంగాణకవిత్వంలో పల్లె వచన కవిత ఎక్కువ. అన్ని ఉద్యమకవిత్వాల విషయంలో జరిగినట్టే, తెలంగాణ కవిత్వంలో సైతం తరచు పలచటి రచనలు, బలహీనమైన, అనుచితమైన వ్యక్తీకరణలు తారసపడతాయి. భావుకత ఏమాత్రం లేకుండా శుష్కమైన సిద్ధాంత చర్చలు చేసిన కవితలు కనిపిస్తాయి. ఒక భౌగోళిక ప్రాంతంలో విస్తారంగా వ్యాపించిన భావోద్వేగాలు ఎన్నో రకాల, స్థాయిల వ్యక్తీకరణలకు ఆస్కారం ఇస్తాయి. కవిత్వంగా సాధారణస్థాయి అయినా, ఆ వ్యక్తీకరణలకు ఒక చారిత్రకమయిన గుర్తింపు ఉంటుంది. పదేళ్ళ కిందట వచ్చిన 'మత్తడి' 'పొక్కిలి' సంకలనాలు తెలంగాణ ఉద్యమ ప్రారంభదశలో ఆ దశ కర్తవ్యాలను నెరవేర్చే పనిచేశాయి. తెలంగాణ విధ్వంసాన్ని, వేదనను, ఆక్రోశపు తీవ్రతను చాటిచెప్పడానికి ఆ సంకలనాలు పనికివచ్చాయి. కవిత్వంలో తెలంగాణ స్థానికతాయుగం వచ్చేసిందని అవి ప్రకటించాయి. స్థిరపడిపోయిన తెలంగాణవాదం ఆచరణలో ఎట్లా ఉన్నదో తరువాతి దశాబ్దం చెబుతుంది. ఆ దశ కవిత్వమే 'మునుం'. మునుం అంటే వరుస, అవధి. వాదపు ఆరంభాన్ని మత్తడి, పొక్కిలి ప్రతిబింబిస్తే, దాని రాజకీయ వాస్తవ రణరంగాన్ని 'మునుం' ప్రతిఫలిస్తుంది. ఇది పోరాటాల 'మునుం'.

**–కె.శ్రీనివాస్**

మార్చి 18, 2012

# తెలంగాణ సాపెన

తెలంగాణ మొత్తం ఇయ్యాళ తుక్క తుక్క ఉడుకుతుంది. ఆసరయితడనుకున్న కొడుకు అంటుపెట్టుకొని 'జై తెలంగాణ' అంటూ కాలిపోతుండు. పానాల్దీసుకున్న బిడ్డల జూసి ఎడ్సి ఏడ్సి గుడ్లల్ల నీళ్లెండిపోయినయి. సాపించి సాపించి తల్లుల గొంతులు బొంగుర్లు పోయినయి. కావురం బట్టినోళ్లు అడ్డగోలుగా మాట్లాడుతుంటే గళ్ళ బట్టుకొని కచ్చీర్కాడికి గుంజెటోడు, పంచాతి పెట్టెటోడు కనబడ్తలేడు. సావొద్దు బిడ్డా మనుండి తెలంగాణ సాధించాలె అని ధైర్యం నూరి పొయ్యలేక పోతున్నం. కాష్టాల గడ్డకు పోతే రాష్ట్రం రాదు. అందర్కి తెల్సిన ఈ ముచ్చట ఒక్క సుతితోటి చెప్పడం కుదుర్త లేదాయె! ఎవ్వని సార్ధం అందాయె! పాలకులు తమ సార్ధం తోటి తెలంగాణను పజీత పజీత చేస్తుంద్రు. కంట్లె పెట్టుకుంటుంద్రు. కాల్సుకు తింటుంద్రు. పగోడైనా సరే సస్తె సూశొస్తం. కాని ఆళ్ళు శాసనసభల సంతాప తీర్మానం జెయ్యడానిక్కూడా తీరొక్క ఏషమేశింద్రు. ఆఖరికి తెలంగాణ పేరు లేకుండనే కత కత అనిపించింద్రు. పూటకో మాట, సాటుకో ముచ్చట, నేటుకో ముచ్చట. దొంగ నివేదికలు, చ్చొ...చ్చొ....చ్చొ సప్పరింపులు. ఇట్లాసొంటోల్లతోటి ఇగ కలిసుండడం కల్ల. నూరేండ్లయినా యెయ్యేండ్లయినా కొట్లాడుడే! సచ్చేదాకా కొట్లాడుడే..కాని సచ్చి కాదు. ఇవ్వాళ తెలంగాణ సావు బతుకుల మధ్య ఉంది. తెలంగాణ తల్లి 'గొంతు' నొక్కుతున్న వాళ్ళ చెరనుండి విముక్తి కావాలి.

ఎనుకటి సంది తెలంగాణది దండి గుండెనె. సమ్మక్క, సారక్క సర్వాయి పాపన్న, తుర్రెబాజ్ ఖాన్, రాంజీ గోండు, కొమురం భీమ్, బందగీ, షోయెబుల్లాఖాన్‌లు కొసదాకా కొట్లాడింద్రు. దొడ్డి కొమురయ్య మొదలు సాయుధ రైతాంగ పోరాటంలో, 1953 ముల్కీ ఉద్యమంలో, 1969 ప్రత్యేక తెలంగాణ పోరాటంలో, అటెన్క నక్సలైట్ ఉద్యమంలో ఎప్పుడైనా తూటాలకు ఎదురు నిల్చి కొట్లాడింద్రు. పానాలుపోయినా ఎత్తిన కత్తి దించలే! ఎన్ను సూపలే!! మరిప్పుడిట్లెందుకయింది. అయితుంది.

బత్కు మీద భరోస భస్మమెందుకయ్యింది? అప్పుడు దుష్మన్ కండ్లకు కనబడెటోడు. ఇప్పటంత కువ్వారం ఉండేడిది కాదు. అప్పుడు ఏదో తెలియని 'శక్తి' తనది కాని దాన్ని కాజేయాలనే ఆలోచనల్ని కట్టడి చేసింది. దానికి నైతికత, పాపభీతి, స్వాతంత్ర్య సమర స్ఫూర్తి ఇట్లా ఏ పేరైనా పెట్టొచ్చు. తర్వాత్తర్వాత స్ఫూర్తి తరిగి దోసుకోవడం పెరిగింది. పెద్దమనుషుల ఒప్పందాన్ని 'తుంగ'లో తొక్కింద్రు. ఉప ముఖ్యమంత్రి ఆరో వేలని మజాక్ చేసింద్రు. తెలంగాణ ఉద్యోగాలు, బడ్జెట్‌లను దోసుకుంద్రని లలిత్ కమిటీ, భార్గవ కమిటీలు తేల్చి చెప్పినయి. ఇవన్నీ కాంగ్రెస్ జమానల్నే వచ్చినయి. పచ్చిమోసం జేసింద్రు. పలారము పలారము అని తెలంగాణ నీళ్ళు, నిధులు, ఉద్యోగాలు వాళ్లోళ్లకు పంచి పెట్టింద్రు. ఇదేందని అడిగినందుకు 69ల 369 మందిని సంపి బొందపెట్టింద్రు. నిధులు తెలంగాణయి నీళ్లు ఆంధ్రల పారినయి. రీజినల్ కమిటీ ఉండె గాబట్టి కొంత వొళ్ళు దగ్గర బెట్టుకొని దోసుకుంద్రు. తప్పుచేస్తె నిలదీస్తరని అంత బరితెగించలే! ఈశ్వరీభాయి, సదాలక్ష్మి, కొండా లక్ష్మణ్ బాపూజీ, కొండా వెంకటరంగారెడ్డిలు అసెంబ్లీ వేదికగానే అన్యాయాల్ని ఎదిరించింద్రు. కనీసం వీళ్లకు మాట్లాడేతందుకు ఛాన్సన్న దొరికింది. మరి ఇయ్యాల అంతా తారుమారయ్యింది. దీనికంతటికీ కారణం తెలుగుదేశం, దానితో ఐడెంటిఫై అయ్యే 'కమ్మ' సామాజిక వర్గం.

ఇదే విషయాన్ని కవులు ఈ 'మునుం' కవితా సంకలనంలో ఇడమర్చి చెప్పింద్రు. ఒక కులపోల్లని తప్పుపట్టడం అందరికీ అంత ఈజీగా మింగుడు పడదు. కానీ తప్పడం లేదు. 'మునుం' సంకలనాన్ని మొదటి కమ్మ నుంచి చివరి కమ్మ వరకు 'కమ్మ' సామాజిక వర్గానికి అన్వయిస్తూ చదువుకున్నట్లయితే తెలంగాణ రాష్ట్రానికి ప్రధాన అడ్డంకి వాళ్లే అని తెలుస్తది. ఎందుకంటే ఆంధ్ర- రాయలసీమల ఉన్న ఈ సామాజిక వర్గం పార్టీలకతీతంగా వచ్చిన తెలంగాణను అడ్డుకుంది. రాయలసీమల చంద్రబాబు, పయ్యావుల కేశవ్, ముద్దుకృష్ణమ నాయుడు, గల్లా అరుణకుమారి ఆంధ్రల దేవినేని ఉమామహేశ్వరరావు, నన్నపనేని, లగడపాటి, రాయపాటి, కావూరి, కోడెల శివప్రసాద్ తదితరులందరూ రాత్రికి రాత్రే కుట్ర చేసి

రాజీనామా నాటకాలాడింర్రు. తెలంగాణల రేణుక చౌదరి, తమ్మినేనిలు తమ శక్తి మేరకు ఆంధ్రోళ్ళకు అండగా నిలబడ్డరు. ఈళ్లకు తోడు 'మేధావి' రూపంలో నాగభైరవ జయప్రకాష్ నారాయణ తన 'సత్తా' మేరకు హైద్రాబాద్‌లోనే ఆంధ్రప్రదేశ్ రాజధాని ఉంది. అట్లాంటప్పుడు తెలంగాణను ఎట్లా ఏర్పాటు చేస్తరు అని ఢిల్లీ ఆంగ్లపత్రికలల్ల వ్యాసాలై యిసం కక్కింది. ఓయూలో లాఠీచార్జి జరిగితే ఖండించకుండా 'లా అండ్ ఆర్డర్' రక్షించాలని అసెంబ్లీలోనే లొల్లి పెట్టింది. అందుకే అందరి మనసుల్లో ఉన్న ఆలోచనల్ని 'మల్లేష్' ఆచరణల పెట్టింది. 'హీరో' అయ్యింది.

వీళ్ల డ్రామాలు, మోసపుటెత్తుగడలు, ఆక్రమించిన భూములు, కొల్లగొట్టిన కొలువులు అన్నీ కవితా వస్తువులయ్యాయి. ఇట్లా పుస్తకంలోని 600 పేజీల్లో దగ్ధమౌతున్న తెలంగాణ బతుకుల్ని కైగట్టింర్రు. వీటన్నింటికి మూలం తెలుగుదేశం పార్టీ ఆవిర్భావంలోనే ఉంది. అంతకు ముందు కాంగ్రెస్ పార్టీ, పాలక వర్గ రెడ్లు దోసుకున్నప్పటికీ బరి తెగించలేదు. తెలంగాణ రీజినల్ కమిటీని అగౌరవ పరచలేదు. అకాడెమీలల్లో అంతో ఇంతో తెలంగాణోళ్ళకు తావుండేది. ఈ బరితెగించినతనాన్ని బరిబత్తల నిలబెట్టింర్రు కవులు. తెలంగాణ స్థితిని, అస్తిత్వాన్ని, బీసీ, దళిత, మైనారిటీ దృక్కోణాల్లో ఆవిష్కరించింర్రు. 2000 సంవత్సరం నుంచి 2011 మధ్య కాలంలో తెలంగాణలో కారు, సైకిల్ తిరిగిన మలుపులు వినిపించింర్రు. చెయ్యిచ్చిన కాంగ్రెస్, ఉద్యమ తీరుతెన్నులను కవులు అక్షరబద్ధం చేసింర్రు. ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక ఆధిపత్యానికి, దోపిడికి వ్యతిరేకంగా తమ కలాల్ని పరుగెత్తించింర్రు.

'కమ్మనిస్టులు కత్తు కలిపిన గొంతు/ బలవంతుడు బలహీనుని/ వీపుమీద ఎక్కి తొక్కిన సవారీ/ గుంటూరు పల్లెలు, కమ్మ పాలెలు/ కవాతులు కట్టి కొల్లగొట్టిన బతుకు/ ఏకు మేకైన సందర్భం' అని అల్లం నారాయణ తన యాది-మానాదిలో కలవరించింది. అట్లనే 'కమ్మగూడెం వచ్చి అమ్మగూడెం ఆగమయిందని' 'కయాలు' కవితలో యం.వెంకట్ చెప్పింది. 'మాది మాగ్గావాలం'టూ పప్పుల రాజిరెడ్డి 'బంగారం పండె ర్యాగల్లు అగ్గువకే దొబ్బితిరి/కార్ఖానాలు మీయె-కాలేజిలు మీయె/సినిమాల

పేరు జెప్పి ఎకురాలకెకురాలు దొబ్బితిరి/ పత్రికలు మీయె పలుకుబడి మీదె/ మా జాగాల్ని దోచుకొని మమ్మల్ని జీతం బెట్టుకుంటిరి' అని నిలదీసింది. ఇక్కడి ప్రజల ఉమ్మడి శత్రువుగా 'కమ్మ' సామాజిక వర్గాన్ని ఐడెంటిఫై చేసే దశలో నేడు తెలంగాణ సమాజముంది. తెలుగుదేశం ఆవిర్భావం నుంచే తెలంగాణ వనరుల దోపిడి వేగమయింది. లెక్క పత్రము లేకుండా మూల మూలాల కొల్లగొట్టింద్రు.

అవును తెలంగాణ పురాగ తీన్ తెర్లయింది ఎన్టీఆర్ కాలంనుంచే! ఒనరుగ తిరుగుతు తప్ప తీసుడు వాండ్లకు బాగా తెలిసిన విద్య. మీది గురిగి మీదుండంగనే కింది గురిగిని మాయం జేసింద్రు. మత్సరించి మాయజేసింద్రు, బుదుగరిచ్చి బుట్టలేసుకుంద్రు. ఇన్ని విద్యలు తెలిసిన ఆళ్లు, 'తెలుగువారి ఆత్మ గౌరవం' ముసుగులో విస్తరించింద్రు. తమ ఇష్టా రాజ్యంగా ఎన్టీఆర్ సామాజిక వర్గం తెలంగాణలోని అంగుళం అంగుళం దోసుకుంద్రు. తెలంగాణను ఒట్టి పోయిన ఆవును జేసింద్రు. కువ్వారంతోటి ఈళ్లు చేసినంత నష్టం, దోపిడి, మోసం, దగా అంతా ఇంతా కాదు. నీళ్ళు, నేల,గాలి, నిప్పు (కరెంటు) అన్నీ అమురుకుంద్రు. అవును గాలిని కూడా కమ్ముకుంద్రు. పట్నంల ఉన్నా పటంచెరువు పోయినా ముక్కుకు బట్టలేకుండా బతుకులేకుండా జేసింద్రు. కంటికి మంటికి ఏకధారగా సోకం బెట్టి ఏడుస్తున్న తెలంగాణ ఇయ్యాల మొత్తం పెట్రోల్ వానల తడిసుంది. ఎవ్వడు పుల్ల గీకినా ఆగని మంటలు చెలరేగుతయి. ఎన్ని మిలిట్రీ ఫైరింజన్లొచ్చినా ఆర్పుడు అయ్యే పనికాదు.

1982లో ఏషియన్ గేమ్స్‌తో పాటుగా ఇండియాలో కలర్‌టీవీలు ప్రారంభమయ్యాయి. అప్పటి వరకు వెండితెరమీద వెలిగిపోయిన ఎన్టీఆర్ రాజకీయప్రవేశం నాటికి టీవీల విస్తరణ ఆరంభమయ్యింది. దాంతో కమ్యూనికేట్ చెయ్యడం ఈజీ అయింది. వెండితెర దేవుడు ఇట్లనే కన్పించడంతో వీడు మనోడే అనే భావన, ఆరాధన ఏర్పడింది. దీనికి తోడు అప్పుడప్పుడే వైజాగ్ నుంచి హైదరాబాద్‌కు వచ్చిన ఈనాడు పత్రికా రంగంలో తమ పట్టుని సాధించడం ప్రారంభించింది. దానితో పాటే 'ఆంధ్రజ్యోతి' హైదరాబాద్

ఎడిషన్‌ని అట్టహాసంగా ఆరంభించింది. దీని యాజమాన్యం కూడా కమ్మలదే! తెలుగుదేశం పార్టీకి 'ఈనాడు' మౌత్ పీస్‌గా మారింది. ఇట్లా మీడియా మొదటి నుంచీ 'థాట్ పోలిసింగ్'కు దిగింది. తాము చేయదల్చుకుంది, దోసుకోదల్చింది మన నోటితోనే చెప్పించింది. అందుకే ఆల్విన్, నిజాం షుగర్ ఫ్యాక్టరీలు మాయమైనాయి. అట్లా ఎన్కటి నుంచి తెలంగాణకు బతుకుని, ఆదరువునిచ్చిన డిబిఆర్, ఆజాంజాహి, అటు రామగుండం ఎరువుల ఫ్యాక్టరీ అన్నింటిని పొతం బట్టింద్రు. యే ఎండకాగొడుగు పడుతూ కమ్యునిస్టులతోటి, బిజెపితోటి (రెండూ పార్టీల్లోనూ కమ్మోల్ల ఆధిపత్యమే నడుస్తది) పొత్తుపెట్టుకొని కొత్త కొత్త ఎత్తులేసింద్రు. ఎన్టీఆర్ ముఖానికి రంగే కాకుండా'నక్సలైట్లు దేశభక్తులు' అనే ముసుగేసుకుండు.

ముసుగు లేకుండ తెలుగుదేశం మనలేదు. అది ఎప్పటి కప్పుడు కొత్త ఏషం గట్టి ముందుకొస్తుంది. అందులో భాగమే ఇయ్యాల్టి రెండు కండ్ల సిద్ధాంతం. దానికి అండగా నిలబడే మీడియాది మాత్రం ఒంటి కన్ను సిద్ధాంతమే. ఒక్క సీమాంధ్ర తప్ప వాళ్ల సూపుకేది ఆనదు. ఆంధ్రుల అరటి చెట్టు ఇరిగిపోతే హడావుడి చేసే వీళ్ళు తెలంగాణ బిడ్డలు సస్తున్నా అయ్యో అన్న పాపాన పోలేదు. ఇది ఇయ్యాల్టి ముచ్చట కాదు. ఎనుకటి సంది ఈళ్లతీరే అంత. తెలుగుదేశం పుట్టుకే 'గోబెల్స్' ప్రచారం మీద జరిగింది. 'తెలుగు వారి ఆత్మగౌరవం' అంటూనే తెలంగాణోళ్లని తొక్కి పెట్టింద్రు. తెలుగుదేశం పుట్టుకకు ముందు ఒక వైపు ముఖ్యమంత్రి టి. అంజయ్య, ఆయన భాషను, యాసను పత్రికలు, సంపాదకులు ఎద్దేవా చేసింద్రు. ఎగతాళి చేసింద్రు. ఈ పత్రికలన్నీ కమ్మోల్ల చేతుల్లోనే ఉండేయి. ఇప్పటికీ ఆళ్ళ చేతుల్లోనే ఉన్నయి. ఇప్పుడు పత్రికలతోబాటుగా టీవీ ఛానెల్లు కూడా వాళ్ళవే! ఇదే అంజ్యయకు రాజీవ్‌గాంధీ చేతిలో అవమానం జరిగిందని, తెలుగు వారికి అందంలం దక్కలేదని అరిచి గీపెడుతూ 'ఆత్మగౌరవ' నినాదంతో ఊరూరా తిరిగి మీ కోసం, బీసీల కోసం, దళితుల కోసం, అక్కల కోసం, చెల్లెల కోసం, అన్నల కోసం, తెలుగు తమ్ముళ్ళ కోసం అంటూ ఏన్టీఆర్ డైలాగ్‌లు దంచిండు. కాంగ్రెస్ మీది కోపం తెలుగుదేశానికి వరమయ్యింది. తెలంగాణ సహా ఆంధ్రప్రదేశ్ అంతటా

తెలుగుదేశం గెలిచింది. అదే తెలంగాణ నాశనానికి పునాది అయింది. అధికారం అందుకున్నాక ఎన్టీఆర్ సామాజిక వర్గం వాండ్లు హైదరాబాద్‌ని, తెలంగాణని లిటరల్‌గా 'రేప్' చేసింద్రు. అందిన కాడికి ఒక వైపు దోసుకుంటూనే, మీకు కల్చర్ లేదు, చరిత్ర లేదు అంటూ ఇక్కడ పుట్టి పెరిగిన వాళ్ళని ఎగతాళి చేసింద్రు. తెలంగాణ భూములకు రక్షణగా ఉండి, అన్యాయాలను కొంతమేరకైనా ఎత్తి చూపించిన, ఆపిన 'తెలంగాణ రీజినల్ కమీటి'ని కతం చేసింద్రు. ఒక వైపు కారంచేదులో దళితులను ఊచకోత కోస్తూ మరోవైపు హైదరాబాద్‌లో తమ వారి విగ్రహాలను ఏర్పాటు చేసుకుంద్రు. దీంతో తామేది చేసినా చెల్లుతుంది అనే భావన ఆ సామాజిక వర్గంలో బలంగా నాటుకుపోయింది. అందుకే చంద్రబాబు హైదరాబాదీలకు పొద్దుగాల లేసే అలవాటు చేసింది ఏన్టీఆరే అనే ధైర్యం చేసిందు. నిజాం రాజు మబ్బుల నాలుగ్గంటలకు లేసి కింగ్‌కోఠి నుంచి మక్కామసీదుకు వొచ్చే విషయం బాబుకు తెల్వదు. కాబట్టి తాననుకున్నదే కరెక్ట్. అందుకే ఆయన చరిత్ర అవసరం లేదని చెప్పిందు. దానికి తగ్గట్టుగానే తమ ప్రాంతం నుంచి వచ్చే వారికి హైదరాబాద్ పరాయిదిగా కాకుండా ఇది మాదే అన్న భావన కలిగే విధంగా భవనాలకు, ప్రభుత్వ పథకాలకు పేర్లు పెట్టింద్రు. 'బాగే ఆమ్' – పబ్లిక్ గార్డెన్ రాత్రికి రాత్రి తెలుగు లలితకళాతోరణంగా మారింది. 'ఇమ్లీబన్' మహాత్మగాంధి బస్టాండ్‌గా మారింది. రాత్‌కి బారాభజే గాని నిద్రపోని హైదరాబాద్‌ని వింతగా చూస్తు రాత్రి దస్ దాటితే బస్సులు బందని హుకుం జారి చేసింద్రు. దుక్నాలు బంద్జేయించింద్రు. ఇదంతా దోస్కోపోనొచ్చినోళ్లకు సద్దులు గట్టిన ముచ్చట.

ఆళ్లందరూ యిసపాత్కపోళ్ళు కాకపోవచ్చు. వలసొచ్చి వనరుల్ని కబ్జా చేసి ఈడ పుట్టి ఈడ పెరిగినోన్ని మాదాపూర్ మొదలు రింగురోడ్డు సుట్టుతా బేదఖల్ చేసింద్రు. అంతే కాదు 'హైద్రాబాద్ మీ అబ్బసొత్తా?' అంటూ ఈ సామాజిక వర్గపోళ్ళే డైలాగులు కొడుతుంద్రు. సినిమావోళ్ళు హైదరాబాద్‌కు వస్తమంటే స్టూడియోలు, ఫిల్మ్‌సిటీలై దారులేసినం. నమ్మకద్రోహం వాళ్ళ ఇంటి పేరు కాబట్టే తెలంగాణోళ్లను ఇండస్ట్రీలో ఏడ కానరాకుండా చేసింద్రు. తెలంగాణ ఇంకెన్నాళ్లు? అని నిలదీసినందుకు ఇక్కడి సినిమాలను

ఆడకుండనే చేసింద్రు. ఉన్నదంత పెట్టి మన నరసింగరావు సినిమాల్దీసి అవార్డులు తెచ్చిండు. ఆళ్ళు సిన్మాల్దీసి పైసలేసుకుంద్రు. తెలంగాణోళ్ళని విలన్లుగా, రౌడీలుగా, బఫూన్లుగా సూపిచ్చింద్రు. అట్లనే వైద్యం అందర్కి అందాలని నిజాం సొంత పైసల్తోటి కట్టిచ్చిన 'నిమ్స్' బొక్కల దవఖానను 'కాకర్ల'కు రాసిచ్చింద్రు. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అన్న దాశరథిని ప్రభుత్వ ఆస్థాన కవిగా సూద్దం ఇష్టం లేక ఆ పదవినే పీకేసిండు. ఏకాఎకిన అకాడెమిలన్నింటిని ఎన్టీఆర్ రద్దు జేసిండు. ఎందుకంటే కొత్తగ అధికారమెక్కినోడు దాన్ని నిలుపుకోవడానికి, ప్రజల మీద అజమాయిషీకీ సంస్కృతినే ఆసరగా చేస్కుంటరు. ఎన్టీఆర్ కూడా అదే జేసిండు. అకాడెమీలను రద్దు చేసి 'తెలుగు యూనివర్శిటీ'ని ఏర్పాటు చేసిండు. దానికి తన కులపోడే అయిన తూమాటి దొణప్పను మొదటి వీసీని జేసిండు. తెలుగు సంస్కృతి పేరిట తెలంగాణ భాషకు, సంస్కృతికి, కళలకు సమాధి కట్టింద్రు. ఇండ్ల పన్జేస్తున్న ఉద్యోగులు ఏ కులపోళ్లో లెక్క తీస్తే సాలు, జరిగిన అన్యాయం దోసుకున్న కొలువులగుట్టు బట్టబయలైతది. అట్లనే 'మీకు ఎవుసం రాదు'. మేమొచ్చి నేర్పినమని 'రేగడి విత్తులై' ఇసపు నాట్లేసింద్రు. ఈ నాట్లకు 'తానా' తందాన అంటూ అమెరికా కమ్మోళ్ళు లక్షల రూపాయల అవార్డులిచ్చింద్రు. చంద్రలతలైనా, చంద్రబాబైనా అందరి ఆలోచన ఒక్కతీరుగుంటది. తెలంగాణల ఏమీ లేదు అంతా మేమొచ్చి చేసినం అని బడాయి ప్రచారం. ఈళ్లు ఇయ్యాల కొత్తగొచ్చినోళ్ళు కాదు. అంతకు ముందు నుంచే ముఖ్యంగా 1952 తర్వాత కమ్యునిస్టుల ముసుగుల వచ్చి నీళ్లెంట పరుసుకు పోయింద్రు. కమ్యునిస్టులంటే బారాఖూన్ మాఫ్ కాబట్టి ఆ ముసుగులొచ్చింద్రు. (ఇగిప్పుడు 'జనచైతన్య వేదికల' మాస్కేస్కొని' బత్తిని సోదరుల చేపమందుకు ఎసరు తెచ్చింద్రు.) సాయుధ పోరాటం పేరుతోటి మాకినేని, 'చంద్ర' బాబులై అలుముకుంద్రు. గుండుకు గుండెను ఎదురుబెట్టి పానాలిచ్చింది మేమైతే లీడర్లై ఊరేగింది వాళ్లు. ఇప్పుడు బాగా తెలిసొచ్చింది. కమ్యూనిస్టులంటే 'కమ్మ'నిస్టులని. ఈళ్లని మేధావులని కూడ బమిసినం. ఏబీకేని మోస్తూ ఆయన ఎంట పత్రికలన్నీ తిరిగినం. ఆయనేమో ఇయ్యాళ కొత్త రాష్ట్రాలు ఏర్పాటు చేసే చట్టాన్నే రద్దు చేయ్యాలంటుండు. అంతే

కాదు పెన్నుల ఇసం నింపి తెలంగాణ మీద గుప్పుతుండు. తెలంగాణను పీన్గుల పెంట చేస్తున్న ఈళ్లని మనుషులుగా సంబోధించాలంటేనే గొంతు సరం బదుతుంది.

తమ సామాజిక వర్గానికి దక్కాల్సినంత ప్రాధాన్యం దక్కడం లేదని ఏన్టీఆర్‌ని రాజకీయాల్లోకి తీసుకొచ్చింది నాదెండ్ల భాస్కరావు. ఆయన్ని ముఖ్యమంత్రిని చేసే బాధ్యతను కమ్మ యాజమాన్యంలోని పత్రికలు భుజానేసుకొని పనిచేశాయి. అణిచేసినోళ్లే. అవహేళన, ఎద్దేవా చేసినోళ్లే 'తెలుగు వారి ఆత్మగౌరవం' పేరిట ఆంధ్ర - తెలంగాణ అన్నదమ్ములం అన్నరు. భాష పేరిటనే 'తెలుగుదేశం' పార్టీ పెట్టి తెలంగాణ యాసను ఈసడించింద్రు. రొంద్రూపాయలకు కిల బియ్యమిచ్చి భూమిగావాలని అడిగేటోళ్ల నోళ్లు మూసింద్రు. ఆఖరికి కులం పేర్జెప్పి మేం బీసీలను ఉద్ధరించేతందుకు వచ్చినం అని కతల్జెప్పింద్రు. ఈళ్లు ఎన్ని ముసుగులేసుకొని వచ్చినా చేసింది మాత్రం తెలంగాణను దోసుకునుడు, హైదరాబాద్‌ని కబ్జచేసుడు. అయినకాడ్కి వాళ్లొల్లకు అడ్డికి పావుశేర్ ఇచ్చుకున్నరు.

బీసీలను మేమే ఉద్ధరించినం అని చెప్పుకుంటుంద్రు. అదే నిజమైతే 'జలదృశ్యం'ల కెల్లి కొండా లక్ష్మణ్ బాపూజీని అదృశ్యం చేసేటోళ్ళు కాదు. ఆయన పాపం ఇప్పటికీ కిరాయింట్లనే ఉంటుండు. బీసీలను ఉద్ధరించినమనేది ఉత్తమాట. తెలంగాణల యాడ కమ్మోల్లుంద్రని, వాళ్లకు సీట్లిచ్చి మంత్రులను జేసింద్రు. ఒక్క నిజామాబాద్ జిల్లాల్నే బాన్స్‌వాడ, బోధన్‌ల నుంచి ఎస్వీఎల్ నరసింహారావు, థామస్ చౌదరీలకు సీట్లిచ్చి గెలిపించింద్రు. మండవ వెంకటేశ్వరరావు కులపోల్లు ఎందరుంద్రని బీసీలను గెలవకుండ చేసింద్రో తెలంగాణకు తెల్వదా? అంతెందుకు మొన్న బాన్స్‌వాడ ఉప ఎన్నికలల్ల ఏండ్ల సంది ఆడనే ఉంటున్న కమ్మోల్లందరు కాంగ్రెస్సోలతోటి అంటకాగి ఆళ్లకే ఓట్లేసిన విషయం తెలిసిందే! అందుకే కాంగ్రెస్‌కు డిపాజిట్ దక్కింది. ఇది గెలిచిన పోచారం శ్రీనివాస్‌రెడ్డి స్వయంగ జెప్పిన ముచ్చట. ఇన్నేండ్ల సంది బువ్వ పెట్టిన తెలంగాణను, హైదరాబాద్‌ని మరిసి 'మాప్రాంతం మా ప్రాంతం' అంటూ పలవరిస్తుంద్రు. ఈడ

సంబంధం చేస్కున్నది లేదు.ఎన్నడు బత్కమ్మ ఆడింది లేదు. ఇక్కడి మాట లేదు. యాస లేదు ఈళ్లని మనోళ్ళని ఎట్లనుకోవాలె! గండిపేట నీళ్ళు తాగి పెరిగిన చంద్రబాబు కొడుకు లోకేశ్ గానీ, జూనియర్ ఎన్టీఆర్ గానీ ఎప్పుడూ ఆంధ్రప్రాంతంతోటి ఐడెంటిఫై ఐతరే గానీ తాము తెలంగాణ వాళ్లమే అనిచెప్పుకోరు. అందుకు ఇష్టపడరు కూడా. వీళ్లది తినే తిండొకరిది పాడే పాటొకరిది. ఒక్క నిజామాబాద్ గాదు హైదరాబాద్ల కాట్రగడ్డ ప్రసూనకు టికెట్లిచ్చి మంత్రిని జేసింద్రు. వరంగల్ల సైతం కల్పనలకు ఏ లెక్కన ఎంపీ టికెటిచ్చిండో చంద్రబాబు చెప్పుకోవాలి. ఇగ ఖమ్మం జిల్లా అయితే కమ్మోళ్ళ సంస్థానం అయిపోయింది. నామా నాగేశ్వరరావుకు ఏ లెక్కన టికెట్లిచ్చిండు. జనాభా నిష్పత్తి ప్రకారం వాళ్లకు దక్కాల్సిన వాటా ఎంత? దక్కిదెంత? అది ఎవరికి దక్కాల్సి ఉండే లెక్కలు తీస్తే బీసీలకు తెలుగుదేశం చెసిన మేలు తెలిసిపోతది.

అలిపిరి మందుపాతర పేలినప్పుడు దేవేందర్గౌడ్ హోంమంత్రిగా మీటింగ్ బెట్టిండు. నువు మీటింగ్ ఎట్లపెడతవ్? ఏం ముఖ్యమంత్రి నయిదామనుకుంటున్నవా? మర్యాద్దక్కదు అని ఆయన తోటి కమ్మ మంత్రులే బెదిరించింద్రు. అంటే బీసీలకు తెలుగదేశం ఇచ్చిన గౌరవం తెలుస్తది. బీసీలకు జనాభా నిష్పత్తి ప్రకారం ఎన్నడూ సీట్లిచ్చిన పాపాన పోలేదు. యాన్నో ఒకటి రెండు సీట్లు విదిల్చి దానికి ఉద్ధరింపు అని పేరు పెడితే మాత్రం సహించేదిలేదు. ఎందుకంటే తెలంగాణల నీకు ప్రధాన శత్రువు కాంగ్రెస్, దాని పాలక వర్గం రెడ్లు. ఆ రెడ్లని ఓడిచాలంటే నీ సామాజిక వర్గం వాళ్ళకు సీట్లివ్వాలి. కాని దురదృష్టవశాత్తు తెలుగుదేశం అధినేతల సామాజిక వర్గపోళ్లు తెలంగాణల పుట్టినోళ్లు కాదు. ఏప్పుడో ఒకప్పుడు వలసొచ్చినోళ్లే. అందుకే రెడ్లను ఎదుర్కునే బీసీలకు కొన్ని సీట్లు విదిల్చింద్రు. అంతేగాని బీసీల పట్ల ప్రేమతో కాదనే విషయం అందరికీ తెలుసు.

తెలుగుదేశం పార్టీ ఆవిర్భావానికి, నిలదొక్కుకోవడానికి 'కమ్మనిస్టు'లేసిన పునాదే ప్రధానకారణం. ఆ పునాది పైనే నిర్మించబడ్డ తెలుగుదేశానికి తెలంగాణలో కూడా ఆక్సెప్టెన్సీ వచ్చింది. నిజానికి కమ్యూనిస్టులు 'కమ్మనిజా'నికి

లొంగకుండా ఉండి ఉంటే తెలుగుదేశానికి పుట్టగతులుండేవి కావు. వాళ్లే కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా ఎదిగేవారు. సిపిఐ. సిపిఎం, తెలుగుదేశం, కొంత మేరకు కాంగ్రెస్ ఇట్లా 'కమ్మోళ్ళు' ఏ పార్టీలో ఉన్నా వాళ్ళ మాటే నడిచేది. వాళ్లపనులయ్యేవి. 'ఉద్యమాల ఊహల ఎత్తుగడల అలల మీద/ అన్ని రంగుల జెండాల రెపరెపలమీద / తెలుగుతేజం 'కమ్మ'ని ఎజెండాలమీద దూకింది ఇక్కడే / రాయితీల రతనాల మీద / దండుబాటల కిటుపక్క మీరే అటుపక్కమీరే" అని ఈ పరిస్థితిని కవులు ఆనాడే రాసింద్రు.

వేములపల్లి శ్రీకృష్ణ చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా అంటూ తెలంగాణని విస్మరించిండు. బహుశా కాకతీయులు కూడా కమ్మవారే అని నమ్మి ఒక్క 'రుద్రమ్మ' భుజశక్తిని కీర్తించిండు. ఈయన 1972ల అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడు. తర్వాత పువ్వాడ నాగేశ్వరరావు హవా సాగింది. ఇక సిపిఎం అయితే కమ్మోల్ల జాగీరేనాయె! మొన్న ఖమ్మం మీటింగ్ సందర్భంగా వరంగల్ వీరయ్య సిపిఎం కార్యదర్శి అయితడని పుకారు రాంగనే దాన్ని పార్టీల చర్చించకముందే ఆయనకాదు అని తమ్మినేని వీరభద్రం తేల్చేసిండు. ఇది ఆ పార్టీలో ఉన్న ప్రజాస్వామ్యం.

నిజానికి ప్రపంచీకరణకు తెలుగుదేశానికి అవినాభావ సంబంధ ముంది. తనకు తాను ముఖ్యమంత్రిగా కాకుండా సిఇవోగా పిలిపించుకోవాలని తాపత్రయపడ్డ చంద్రబాబు సామాజిక వర్గమే ప్రపంచీకరణ వల్ల లాభపడింది.. 1983లో తెలుగుదేశం అధికారంలోకొచ్చిన తర్వాత 'కమ్మ' సామాజిక వర్గం గతంలోని సారాయి (ఎన్టీఆర్ భాషలో చెప్పాలంటే వారుణవాహిని), కాంట్రాక్ట్, సినిమా రంగాలతో పాటుగా రియల్ ఎస్టేట్ రంగంలోకి ప్రవేశించాయి. వైద్యాన్ని వ్యాపారంగా మార్చింద్రు. కాలేజీలు పెట్టింద్రు. సదవునమ్ముకుంద్రు. లారీ ట్రాన్స్‌పోర్ట్, ట్రావెల్స్ ఇట్లా వివిధ వ్యాపార రంగాల్లో విస్తరించిన వర్గమే 1990లో గ్లోబలైజేషన్ మూలంగా లాభ పడ్డరు. పేదలు, ఎస్సీలు, బీసీల బతుకు ప్రపంచీకరణ వల్ల నాశనం పదారుగంతలైంది. పల్లె కన్నీరు పెట్టింది. వీళ్లు పట్నంల మకాం బెట్టింద్రు. పంటకో ఫ్లాట్ కొనుక్కున్నరు. నార్నె ఎస్టేట్స్, జయభేరి కన్‌స్ట్రక్షన్స్, ప్రొగ్రెసివ్ కన్‌స్ట్రక్షన్స్ ఇట్లా నగరం,

నగరం చుట్టూతా పర్చుకు పోయింద్రు. అభివృద్ధి జపంతోటి వందల వేల కోట్లు చేజిక్కించుకుంద్రు. నీళ్లు రాని ప్రాజెక్టులు ఏండ్ల సంది కట్టూనే ఉన్నరు. నిత్యం పైసలు రాలే టోల్‌గేటలయి వెలిగి పోతుంద్రు.

తెలంగాణలోని పది జిల్లాలల్ల 'శాంతినగర్', లక్ష్మీనగర్, గుంటూరు పల్లెలు, కమ్మపాలెంలై విస్తరించింద్రు. స్థానికులని బేదఖల్ చేసింద్రు. మన సంస్కృతి పట్ల మనకు ఆత్మన్యూనత భావాన్ని కలుగజేయడం. ఆత్మన్యూనతకు లోనయినోన్ని లొంగదీసుకోవడం ఈజీ. కూసోని ఇరానీ ఛాయ్‌లు తాగడం కన్నా నిలబడి 'దర్శిని'ల్లో టిఫిన్లు చెయ్యడం గొప్ప అనే సంకేతాల్నిచ్చింద్రు. పాలకుల సంస్కృతిని ఫాలో కావడమే గొప్పగా మారింది.

ఈ పరిస్థితుల్లో ఎండిపోయిన చెరువు, ఎత్తగొట్టిన నోటి కాడి నీళ్ల పటువ, నాశనం పదారుగంతలైన ఎవుసం, ఫ్లోరిన్ విషాదం, పాలమూరు వలస బతుకులు, అదిలాబాద్ అడివి బిడ్డల ఎతలు, బొగ్గుబాయిలు , ఆగమైన బతుకు, దళిత, ముస్లిం, బీసీ గుర్తింపు, అస్తిత్వ కవిత్వం, ఆత్మగల్ల హైదరాబాద్ కన్నపేగుని కట్ చేసిన బాధను, మగ్గం గుంటలో పండిపోయిన జీవితం, సంస్కృతి, మర్సిపోయిన ఒనగుంటలు, సిర్రగోనెలాట, భాష–యాస, యాది, మనాది ఈ పుష్కర కవిత్వంలో పుష్కలంగుంది.

1925లో మొదటిసారిగా తెలంగాణ ఔన్నత్యాన్ని కీర్తిస్తూ 'నిజాం రాష్ట్ర ప్రశంస' పేరిట శేషాద్రి రమణ కవులు కవిత్వాన్ని ప్రచురించింద్రు. ఈయన వలసొచ్చినా జీవితాంతం ఇక్కడే ఉండి తెలంగాణను ఓన్ చేసుకుండు. ఆ తర్వాత 1934లో గోలకొండ కవుల సంచిక ప్రచురితమయింది. దానికి కొనసాగింపుగా ఆంధ్రప్రదేశ్ అవతరణ సమయంలో ఆళ్వారుస్వామి సంపాదకత్వంలో 'ఉదయ ఘంటలు' వెలువడింది. అయితే ఉదయఘంటలులో సీమాంధ్ర ప్రాంతంవారి కవిత్వం కూడా వుంది. హైద్రాబాద్ కవులు 1950లోనే 'ప్రత్యూష' కవితా సంకలనాన్ని తీసుకొచ్చింద్రు. అలాగే 'తొలి కారు' పేరిట 1957లో వరంగల్లు నుంచి కవిత్వ సంకలనం వచ్చింది. తెలంగాణ అస్తిత్వ ఉద్యమ స్ఫూర్తితో సుంకిరెడ్డి నారాయణరెడ్డి, అంబటి సురేంద్రరాజులు 'మత్తడి' కవితా సంకలనాన్ని వెలువరించింద్రు. 'పొక్కిలి'

కూడా ఈ కోవలోనిదే. సుంకిరెడ్డితో కలిసి నేను 1969 తెలంగాణ ఉద్యమ కవిత్వాన్ని తీసుకొచ్చి ఆనాటి ఉద్యమస్ఫూర్తిని నేటి తరానికి అందించినం. ఆ తర్వాత కూడా కొన్ని తెలంగాణ సంకలనాలు జాగో జాగవో, దిమ్మెస లాంటివి వచ్చినయి. ఈ పరంపరను 'మునుం' కొనసాగిస్తుంది. ఉదయఘంటలులో మాదిరిగా ఇందులో కూడా ఇరు ప్రాంతాల వారు రాసిన కవిత్వముంది. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటుకు ప్రధాన సమస్య హైదరాబాద్' అన్నది ఆజాద్, ఆంధ్రోళ్ళ మాట. దానికి మూతోడ్ జవాబిస్తూ హైదరాబాద్ ఎట్లా తెలంగాణ వాళ్లదయితదో లోచన్, షాజహానా, వనపట్ల సుబ్బయ్యలు కవిత్వమల్లిండ్రు. పన్నెండేండ్ల కాలంలో తెలంగాణ నడిచిన అడుగుల ముద్రలు ఇందులో అచ్చయ్యాయి. తెలంగాణ కవులు కవిత్వం రాయడానికిచ్చిన ప్రాధాన్యం వాటి అచ్చుకు ఇవ్వరు. పత్రికల్లో అచ్చయినా దాని కాపీ కవి దగ్గర ఉండదు. పుస్తకం వేసుకోవడం ఖర్చుతో కూడుకున్న పని. ఇట్లాంటి పరిస్థితుల్లో వందల సంకలనాలను, అంతకుమించి పత్రికా ప్రతులను ఓపికతో వెతికి పుష్కర కవిత్వానికి ప్రాణం పోసిన సంపాదకులు అభినందనీయులు. బీసీ, దళిత, ఆదివాసీ, మైనారిటీ, మహిళల పట్ల ప్రత్యేకమైనా శ్రద్ధ తీసుకుని వారి కవిత్వాన్ని సేకరించి అందించడం శ్రమతో కూడుకొన్న పని, శ్రమకు తగ్గ గుర్తింపు వర్తమానంలోనూ, భవిష్యత్‌లోనూ సమాన విలువ కలిగి ఉంటుందనే అంశంలో సందేహం లేదు.

కొంతమంది బయట వీర తెలంగాణ వాదులుగా ముద్రపడ్డరు. కాని వాళ్లు పన్నెండేండ్ల కాలంలో తెలంగాణపై ఒక్క చెప్పుకోదగ్గ కవిత రాయలేదంటే అది ఉద్యమ వైఫల్యమా? కవి అలసత్వమా? విశ్లేషించుకోవాలి. సాయుధ పోరాట కాలంలో ఉద్యమకారులే కవిత్వం, కథలు, నవలలు రాసిండ్రు, మరి ప్రస్తుత సందర్భంలో కథలు, నవలలు దాదాపు మృగ్యం, తెలంగాణ భాషలో రాసిన రచనలు పత్రికలు యాజిటీజ్‌గా ప్రచురించ నిరాకరించడంతో కొంత సమస్య ఎదురైతుంది. దీన్ని అధిగమించేందుకు మార్గాలు అన్వేషించాలి. మన రచనలు బులిటెన్‌ల రూపంలో అందరికీ చేరువయ్యేలా చేయవచ్చు. బ్లాగుల్లో పెట్టొచ్చు. ఈ పని కొంచెం బాధ్యతతో చేయాల్సిన అవసరముంది.

ఈ పన్నెండేండ్ల 'మునుం' కవిత్వంలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తెలంగాణ ప్రజల ఉమ్మడి శత్రువు 'కమ్మోళ్ళు' అనేది రుజువయింది. ఇక్కడి చెరువులు, ఆవుకాఫ్ భూములు పోయి లాంకో హిల్స్ వచ్చినయి. మాధాపూర్, కొండాపూర్‌ల కొండలు, గుట్టలు మాయమై 'జయభేరి' లు మోగినయి. సెంటు భూమి లేనోళ్లు సగం బంజారాహిల్స్‌ని ఆక్రమించుకుండ్రు. ప్రభుత్వమెవ్వరిదైనా రాజ్యం వీళ్లదే! అయితే ప్రత్యక్షంగా, లేదంటే పరోక్షంగా, అందుకే ప్రత్యేక తెలంగాణను ముందుండి అడ్డుకుంటున్న వీళ్లే ఇక్కడి ప్రజల ఉమ్మడి శత్రువు. కేవలం రాష్ట్రానికే కాదు. మొత్తం జాతికే వీరి తీరు అవమానకరం. జాతీయ రహదారుల నిర్మాణంలోనూ, పొగాకు ఎగుమతుల్లోనూ వీరి అడ్డదారుల్ని ప్రపంచబ్యాంక్ స్థాయిలో తప్పుపట్టింద్రు. 'కృషి'చేసి బ్యాంకుల్ని దివాళ తీయించింద్రు కాంట్రాక్టుల్లోనూ ప్రతిచోట అడ్డదారులల్ల పోయింద్రు. దేశానికి చెడ్డపేరు తెచ్చింద్రు. ఇంతచేసి తామే దేశసేవ చేస్తున్నామనే 'ముసుగు' ఏసుకొని ముందుకొస్తుంద్రు.

ఒర్రి ఒర్రి వాడుపాయె ఒండుక తిని మనం బోతిమి అన్నట్టుంది సీమాంధ్ర వలసవాదుల సంగతి. ఒకటి - ఒకటిన్నర శాతంకూడా లేని కమ్మోళ్ళు ఇప్పటి వరకు 56 యేండ్ల ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు 16 యేండ్లు పాలించింద్రు. లూటిపోయిన శేనోతిగ ఉన్న కాడికి భూములన్ని ఐనోళ్ళకు అయ్య జాగిరోతిగ రాసిచ్చింద్రు. తెలంగాణ బిడ్డలు ఆత్మగౌరవంతోని బతకాలంటే కావాల్సింది ప్రత్యేక తెలంగాణ. ఈ ప్రత్యేక తెలంగాణ సాధనకు, ఉద్యమ వ్యాప్తికి, తెలంగాణ ఔన్నత్య దీప్తికి ఈ పుస్తకం కరదీపిక. ఈ కరదీపికలోని అక్షరాల్ని కరవాలాలుగా మలచాలి.

తెలంగాణ తెచ్చుకునేందుకు దాన్ని అడ్డుకుంటున్న వాళ్లని నిలదియ్యాలి. ఇప్పటికే తెలంగాణ బిడ్డలు మా ఊళ్లెకు మీరు రావొద్దు అని కాంగ్రెస్, తెలుగుదేశం ఎమ్మెల్యేలకు, మంత్రులకు ఫ్లెక్సీల ద్వారా పొలిమేర్లనే సాటింపేసింద్రు. ఇగిప్పుడు జేఏసీ పూనుకొని తెలంగాణను వ్యతిరేకించే అన్ని పార్టీల జెండా దిమ్మెలు, ఆ పార్టీ నాయకుల విగ్రహాల్ని ఊర్లల్లనుంచి తొలగించాలి. ఇది అంతా ఈజీ గాదు. అయినప్పటికీ గ్రామస్థాయి

జేఏసిలను ఏర్పాటు జేసుకుని స్వచ్ఛందంగా దిమ్మెలను తొలగించే ఉద్యమాన్ని చేపట్టాలి. తెలంగాణ ప్రజాసమూహానికి వ్యతిరేకమైనా ప్రతీకల్ని కూల్చకుండా తెలంగాణ సాధ్యం కాదు. ఇదే విషయాన్ని ఇప్పటికీ తామూ తెలంగాణ వాదులమే అంటూ తెలుగుదేశానికి, కాంగ్రెసుకు ఓట్లేస్తున్న, ఓట్లేయిస్తున్న ప్రజలకు, నాయకులకు ఇడమర్సి చెప్పాలె. కార్యకర్తల బలం సూస్కొని విర్రవీగుతున్న తెలుగుదేశం, కాంగ్రెస్ పార్టీల మెడలు వంచితేగాని తెలంగాణ స్వప్నం సాకారం కాదు. అర్థమయ్యేట్టు చెబితే ఆ పార్టీల కార్యకర్తలే జెండా దిమ్మెల్ని, పార్టీ ప్రతీకల్ని కూలదోస్తరు. కూల్చిన దిమ్మెలపైనే తెలంగాణ వినిర్మాణం సాధ్యమైతది. అందుకు ఈ పుస్తకం ఊతమిస్తది. ఈ ఉద్యమం పల్లె పల్లెకూ విస్తరించాలి. అప్పుడే అన్ని పార్టీలు, నాయకులు కదులుతరు. ఆత్మహత్యలాగుతయి. అది రాష్ట్రసాధన ఉద్యమానికి ఊపునిస్తుంది. పార్టీలకతీతంగా ఉద్యమం 'ముందు వరుస'లో నిలబడేందుకు ఈ 'మునుం' తోడ్పడాలని ఆశిస్తూ....

*-సంగిశెట్టి శ్రీనివాస్*

*5, ఏప్రిల్ 2012*

# మా మాట

ఆరు దశాబ్దాల నమ్మక ద్రోహంనుండి వివక్షతల విచ్చుకత్తులనుండి మొలకమండెలో విత్తులకు బాధ్యతల పాలు తాగిస్తూ ఆర్తితో వెలువడ్తున్న కవిత్వం ఈ మునుం. ఈ తెలంగాణ కవుల ఉద్యమ పుష్కర సంకలనం ఊపిరినిచ్చే నేల విముక్తి, ఉనికి బ్రతుకు విముక్తి తెలంగాణ తల్లికి వలసవాద ఆధిపత్య పీడన నుంచి విముక్తి.

1946 నుంచి ఎనిమిదేళ్ళు ప్రత్యేక రాష్ట్రంగా భారతయూనియన్‌లో కొనసాగిన హైదరాబాద్ 90కోట్ల మిగులు బడ్జెట్‌తో సుభిక్షంగా ఉండేది. 28 కోట్ల లోటు బడ్జెట్‌తో కర్నూలు రాజధానిగా కొనసాగే ఆంధ్రను దీనిలో విలీనం చేసింద్రు. ఆంధ్రుల కపటంవల్ల, తెలంగాణ నాయకుల అమాయకత్వం వల్ల ఇది జరిగిపోయింది. ఈ పరిణామం వల్ల తెలంగాణ రెవెన్యూ ఆంధ్రపెత్తందార్ల చేతికి వెళ్ళిపోయింది. అక్కడి ప్రజలకు, ఇక్కడి ప్రజలకు తీరని అన్యాయం జరిగింది.

సాంస్కృతికంగా తెలంగాణ తన అస్తిత్వాన్ని కోల్పోయింది. క్రియా పదాలతో సహా ఆంధ్రభాషను పనిగట్టుకొని తమవాక్యాల్లో ఇరికించడం అలవాటు చేసుకున్నారు. హైదరాబాద్‌లో తెలంగాణ వాళ్ళు రెండవ శ్రేణి పౌరులుగా బతకాల్సిన దుస్థితి ఏర్పడింది. ఎన్.టి.ఆర్. లాంటి ఆంధ్రా నాయకున్ని తెలంగాణ తన నాయకునిగా చలామణి చేసుకుంది. గురజాడ శ్రీశ్రీ, రాయప్రోలు లాంటి కవులను తెలంగాణ సాహితీవేత్తలు తమ కవులుగానే గుండెకు హత్తుకున్నారు. కాని ఆంధ్ర సాహిత్యకారులు తెలంగాణ భాషను, ఆచార వ్యవహారాలను పాతాళంలోకి తొక్కేశారు.

మళ్ళీ 1969లో రెండోసారి తెలంగాణ ఉద్యమం ఊట వరదై పొంగినపుడు విద్యార్థులు ముందుండి ఆ ఉద్యమాన్ని నడిపించారు. అదే సందర్భంలో వచ్చిన ఇడ్లీ సాంబార్ గోబ్యాక్ అంటూ తెలంగాణ ప్రజలమీద రుద్దబడ్డ ఆంధ్ర తిండ్ల (నిజానికి ఇడ్లీ సాంబార్ తమిళ ఫలహారం) ను విద్యార్థులు వ్యతిరేకించారు. ఇది ప్రత్యేకంగా గమనించాల్సిన విషయం.

మళ్ళీ 1990 దశకంలో వచ్చిన ప్రపంచీకరణవల్ల ప్రపంచంలో పెను మార్పులు సంభవించాయి. ఈ క్రమంలోనే దళిత, స్త్రీవాద మైనారిటీ వాద సాహిత్యోద్యమాలు, అదే క్రమంలో నివురు గప్పిన నిప్పులా ఉన్న తెలంగాణ రాష్ట్ర ఉద్యమం మళ్లీ పుంజుకుంది.

విప్లవ, దళిత, స్త్రీవాద కవిత్వాలన్నీ ఆంధ్ర సాహితీవేత్తలు సమర్థించారు. ఈ వాదానికి చెందిన సాహిత్య సృజనకు నాయకత్వం వహించారు. ఇదే క్రమంలో వచ్చిన తెలంగాణ వాదం పట్ల మాత్రం ఉదాసీనంగా ఉంటూనే దీన్ని విలోమ సాహిత్యమన్నారు. అప్పుడప్పుడు మేం తెలంగాణకు వ్యతిరేకం కాదని మూగ సైగలు చేస్తున్నారు.

అప్పటివరకు మేం తెలంగాణకు వ్యతిరేకం కాదు అని చెప్పిన రాజకీయ నాయకులు, కొందరు సాహితీ వేత్తలు తీరా డిసెంబర్ 9, తెలంగాణ ప్రకటన వచ్చేసరికి తమ అసలు రంగు బయట పెట్టుకున్నారు. వచ్చిన తెలంగాణ వెనక్కి పోయింది. ఈ కాలంలో కవుల గుండెనుంచి పెల్లుబికిన కవితా క్షిపణులు వలసవాద అవకాశవాద ఆధిపత్యాలకు దడపుట్టించి మహోగ్ర తెలంగాణ ఉద్యమానికి ప్రేరణ కలిగించినై. ఫ్రీజోన్ నిరసనలు, మిలియన్ మార్చ్ ఉద్యమం. మానుకోట పోరాటాలు, విగ్రహ విధ్వంస నిరసనలూ, సకలజనుల సమ్మెలు యావత్ప్రపంచానికి తెలంగాణ ఉద్యమ తీవ్రతని అచంచల లక్ష్యాన్ని ఎరుక చేసినై.

2000 నుంచి 2011 వరకు తెలంగాణ సాహిత్యకారులు చాలా కవిత్వాన్ని సృష్టించారు. తమ కవితల్లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఆవశ్యకతను పదే పదే చెప్పారు. ఈ పుష్కరకాల కవిత్వాన్ని తెలంగాణ సాహిత్య సమాఖ్య 'మునుం' రూపంలో ఆవిష్కరిస్తున్నది. ఈ ఉద్యమపుష్కరం గోదావరికి రేలపాటల గలగలలు నేర్పిన తెలంగాణ ప్రాణహిత పుష్కరాలు కావడం ఒక విశేషం ఈ పుష్కరం ఆరు దశాబ్దాల సుదీర్ఘ పోరాటాల రక్తాక్షరాలు పొదుగుకుంది.

ఈ 'మునుం' నిండా బతుకమ్మల్లాంటి కవితలున్నయ్, బందూకుల్లాంటి కవితలున్నయ్. చాలామంది తెలంగాణ ఆకాంక్షల్ని బతుకమ్మలు పేర్చినట్టు

కలల జెండాలు తెలంగాణ జడకొప్పులమీద ఎగిరేసినట్టు తమ భావనల్ని కవిత్వీకరించారు. ముక్కలైన తెలంగాణ బతుకు చిత్రాన్ని అతికించాలనే ప్రయత్నంగా ఈ కవితా పుష్కరాన్ని తీసుకువస్తున్నాం. మనిషికి కష్టమొచ్చినా, సంతోషమొచ్చినా నదితోని పంచుకునుడే పుష్కరాలు. ప్రజల కష్టాల్ని, ఆలోచనల్ని, ఉద్యమాన్ని తెలంగాణ మట్టి తాంబాలం పేర్చి అమరుల కలల తీరంలో కదలాడిన బంగారు బతుకమ్మ రాజ్యం కోసం మేం ఈ 'మునుం' పట్టినం. మీ ముందుకు తెచ్చినం. మా బతుకులకు అమ్మ తెలంగాణ. దాని కోసమే ఈ 'మునుం' కవుల ఆరాటం, పోరాటం.

ముందు మాటలు రాసిచ్చిన ప్రముఖ సాహిత్యవిమర్శకులు డా॥ కె.శ్రీనివాస్, సంగిశెట్టి శ్రీనివాస్‌లకు 'మునుం' సంపాదకవర్గం తరపున కృతజ్ఞతలు. పాత పత్రికల్లోని కవిత్వాన్ని సేకరించి ఇచ్చిన కవి మిత్రుడు చైతన్యప్రకాష్‌కు, ఓపికతో కవిత్వాన్ని టైప్ చేసిన కవి, రచయిత ఓదెల వెంకటేశ్వర్లుకు, చక్కటి పేయింటింగ్ వేసి 'మునుం'ను అందంగా డిజైన్‌చేసిన రమణజీవికి సంస్థ లోగో తయారు చేసిన అహోబిలం ప్రభాకర్‌కు కృతజ్ఞతలు.

- మునుం సంపాదక వర్గం

# మెరిగెలు

● రామగిరి శివకుమారశర్మ

అందరూ "పల్లెతల్లి" అనెటోళ్లే ! అవ్వను అరుసుకోను వచ్చెటోళ్ళెవల్లేరు. చూడొచ్చెటోళ్ళెవల్లేరు. వచ్చుడు పోనీ! పట్నానికెగిరి పోయేటోళ్ళె ఉన్నోళ్ళ బతుక్కుగూడా పైసాశ జూపి గుంజుక పోయెటోళ్ళే!

మాడలు మాడ్చే ఎండలల్ల వాగుల్లనించి ఇస్కనింపి మీకు పంపాలె! బురుద ముద్దల్జేసి, ఇటుకలపోత పోసి, బట్టీలేసి పంపాలే! గుట్టల్ని పల్గజీరి, కణీలు జేసి, కంకరగొట్టి, మీ పునాదులకు పంపాలె! చెట్ల మొద్దుమోపులు గట్టి మీకు పంపాలె.

మళ్ళా, పునాదులు దీసెతందుకు, వాటి కదుపులు నింపెతందుకు, గోడలు నిలబెట్టెతందుకు, తలుపులు తనబ్బీలు జేసెతందుకు పల్లెకూలీల్నే మీకు పంపాలె.

గొర్రెల మేకల మందల్ని,జీవాల్ని కోళ్ళను, బాతుల్ని కాసికాసి బలిపించి, బలికి పంపిచ్చాలె.

ఇంతజేస్తే!
రాళ్ళు జీల్చినోళ్ళకు గూళ్ళులేవు
ఇటుకలు జేసినోళ్ళకు ఇండ్లులేవు
గొర్రెలు గాసినోళ్ళకు గొంగళ్లులేవు

అట్లో! ఇట్లో! అందరూ పోయోటోళ్ళే! దూపబోయిన పోరగాండ్లు అటే! యాపారం జేసెటోళ్ళు, కాయ కష్టం జేసే టోళ్ళూ అందరూ కుశ్చిని సంకనబెట్టుకొని పోయెటోళ్ళే! పట్నానికి తరలిపోయేటోళ్ళే , ఇగ ఉన్న సగంమంది మబ్బున పోయిన మాపటికొచ్చేటోళ్ళే పల్లె బొక్కజెరం వచ్చినోని తీర్గ బక్కబడిపోయింది పట్నం జెర్రిపోతయింది.

ఇప్పుడు మేమెట్లోస్తం ? అందరు బతుకొచ్చినట్లు నేలను సంకనబెట్టుకొని

మేమెట్లొస్తం ? మేమే వొస్తే తల్లేరు తెగినట్టే కాదా? అయినా, అన్నీ పంపిస్తనే ఉన్నం. నేల బతుకునిడిస్సి మేమెట్లొస్తం?

పట్నం పోయి ఉన్నోళ్ళను రమ్మంటే "పల్లెల పొద్దు పోదంటరు"

"తొమ్మిదినెల్లు పెరిగిన కడుపును పెక పెక తన్నినందుకే 'మాయ'ల్నుంచి బైటపడ్డం" అనెటోళ్ళకేం చెబుతం?

ఇన్ని పంపుతున్నా మీకాకలితీరిందా? గడ్డిమేసే పస్రాలేమన్నయ్? జంగిటీ గోజలన్ని మేతకు బోయేటివి. కోతకు పోయినయ్. అంగళ్ళకు లారీలొచ్చి, మళ్ళా మాట్లాడకుండా, నగదిచ్చి నింపుకపోయినయ్ ఐల్మీటికే అమ్మినం! చచ్చే చావు చూడలేకనే అమ్మినం! మీద మొగుళ్ళు లేవు. కింద గడ్డిలేదు. చెర్లల్ల కాల్వలల్ల నీళ్ల చుక్కలేదు ఎండుకపోయిన జాగానెంతకని మేస్తయ్?

పల్లెకు నీళ్ళు లేకపోతే మీకేంపట్టె? మీ యిండ్లల్ల నల్లాలు నీళ్ళు కక్కితే సరిపోయె! ఇగ మీకేం పట్టె?

పెద్దపెద్ద కట్టలుబోసి, చెరువు గట్టి, తలుపులుబెట్టి, పెద్ద మోటర్లతోటి నీళ్ళను మీదిక్కు ఉరికించుకుంట్రి. కరంటి కోసరం మిగిలిన నీళ్ళ నాపుకుంటిరి. రెప్ప గొట్టకుండ, యిండ్లల్ల కరెంటెల్గాలనాయె! మాయి యెట్లైనా చిమ్మన్ చీకటి బతుకులేనాయె! పావుగంట టీవీల కరంటు బందయితే లొల్లల్ జేస్తరు. పొట్టకొచ్చేకాలానికి రోజులకు కరెంటి బందయితే ఎంత లొల్లి జేసినా ఇచ్చేటోళ్ళెవలూ?

నెత్తిమీది మొగుళ్ళంటే గాలికి గొట్కపాయె! కాళ్ళకాడ తార్లడిన నీళ్ళు ఎటుజారిపాయె? ఉన్న నీళ్ళు మలుపుకున్నంక, కరంటు మలుపుకున్నంక,పంటే పండించుడు కష్టమైనంక, ఇగ గడ్డినెక్కడ పండిస్తం? అందుకనే పస్రాల్ని కోతకమ్మినం

ఆవుల్లేకపోతే ఎడ్లేవి? బండెట్లా గట్టాలె? నాగలెట్లా నడవాలె? పోతులు పోతులేనాయె! ట్రాక్టర్ గడ్డి మేస్తదా? పైసలే తాగుతది!

ఊర్ల దండం బెడదామంటే దేవుడు దొర్కుతడేమోగాని, ఆవులు దొర్కయి! అవ్వ పాలెండిపోతే ఆవుపాలేగద! సంటోడికి ఆవంటే మరో అవ్వగాదా?

మళ్ళా మీ దగ్గరకే రమ్మంటరు, పాలెండబోసి, పసరుబలం పారబోసి, పొడిచేసి, రంగులేసి ప్యాకిట్ల పెట్టిన పాల పొడికోసం అట్లాట్లా తిరిగి మల్లా గాడికేవచ్చినం.
మీ పట్నం గాడిల్నే పడ్డం.

*సింగిడి సంకలనం, మార్చి, 2000*

# అమ్మలా చెరువు

● అంబటి వెంకన్న

సుక్కలు నిండిన కొండపై
వెన్నెలారబోసినట్టు
నిండు చెర్లో
అలలపడవల మీద ఆడుకునే గంగమ్మ

తడలతో తట్టి తట్టి
వొల్లురుద్దె సల్లని నా తల్లి
వొందు సేతుల నడుమ సాప పిల్లల్లా

మా బుడ్డగోశి బతుకుల్ని
వొళ్ళే బెట్టుకుని ఒడుపులు నేర్పి
వొడ్డుకు దీసిన కన్నతల్లి నా చెరువు

శెరువార్న నిలబడి
సెయ్యడ్డం బెట్టి
అందినంత ఆనందాన్ని కడుపునింపుకుంటి

ఆటుకు అరబుట్టి సాపలు ఆకిలెల్ళునై
లచ్చిందేవై ఇల్లునిండిన నీసుంజూస్కొని
భూమెందుకురా సెరువున్నంక
అని తాతన్న మాటలకు
గవిరిమెంటు నెలజీతానికి
నీళ్ళొదిలికుసున్న కొడుకులు
కమ్మని కలిలా
నిండు ఆర్పుకుండోలె
ఆకలిదీర్చె అమ్మలా చెరువు
సూరీడంత బొట్టు బెట్టుకుని

సెయ్యినిండా గాజులతో
ఎండ రంగుచీర కొంగుగప్పి
గల గల పాటలతో
అలుగు ఊయలలూపి
జోల పాడిన తల్లి నా చెరువు

అసవంటిది
ఎటుబోయిందో ఆ సక్కదనం

ముండ్ల బుట్టిన సర్కారువనం
ఇపుడు నా తల్లి వంటి నిండ
మండలు గీర్క పొందే
బయటికి రాలేని పొద్దు
ఎన్నెల రాత్రుల్లో
ఎగిరెగిరి తుంగ దొక్కిన కాలు
ఇపుడు కదిపితే గాయం
బీర చిక్కె విచ్చిన నెర్రెల్లో
గంగజాడ కోసం
చూపు చితికిన కనుగుడ్లు

ఎవడు గీశాడో
నా తల్లి నుదుటిపై గీత
ఎవడెత్తుకెళ్ళాడో
నా తల్లి పూల నవ్వుల్ని
లే లేత కేరింతల్ని

నడూళ్ళో లింగమై మొల్సిన శివుడా?
నడిరాత్రి లేచినడిసే అన్మంతుడా?

ఈ నేల తీరో
నా పల్లె తీరో
సుట్టుపక్కల ఊళ్ళకు ఊళ్ళు

ఉప్పొంగుతుంటే
దూపదీరక నా తల్లి
నోరు దెరిసి బిర్రబిస్కింది

కరువు మీద కరువొచ్చి
తొట్టెల్లో బిడ్డని తొక్కి సంపింది
ఈ పాపం ఎవరిదనుకోను?
నా తల్లిని ఎక్కడని దొవులాడుకోను?

*చింత అక్టోబర్ - నవంబర్ 2000*

# అతనెప్పుడు కలగంటుంటాడు

• కౌముది

తుపాకిని రెండు ముక్కలుగా విరిచి
చేతుల్ని పైకెత్తి గాలిలో ఊపుతూ
దారి కిరువైపులా వేసుకుంటూ పోతూపోతూ
పచ్చని పైరుగా మారి పడేసినవాడు
బహుశ ఇది యుగాల నుండి ఎడతెగని
ధారగా కంటున్న కలకావచ్చు
ఆకాశానికి గోరుకొయ్యలు కాయించి
కోడికూతకు గొంతిచ్చి లేవండోయ్ అంటూ
మనల్ని నిద్రలేపుతుంటాడు బహుశా
అతనికి నమస్కారం చేస్తూనే సూర్యుడు కూడా నిద్రలేస్తాడేమో
రాత్రి కన్నకలలు ఒకటొక్కటిగా పేరుస్తూ
కుమ్మరి సారెమీద మట్టి ముద్దకు
అద్భుతమైన ఆకృతిని ఇచ్చినట్టుగా
మన ముందేదో అనిర్వచనీయ నిర్మాణాన్ని ఆవిష్కరిస్తాడు
అప్పుడతని చుట్టూతా
బాలింతరాలి ఒంటినుండొచ్చే జీవివాసన గుప్పుమంటుంది
అతడో విరామమెరుగని బాటసారి
నడుస్తూ నడుస్తూ నుదుటిమీద చెమట చుక్కల్ని తీసి
తలలూస్తున్న పిచ్చిపువ్వు నోట్లో చిలకరించి
ముఖంలో ముఖం పెట్టి దానికి నవ్వడం నేర్పిపోతాడు
నడుస్తున్న దారి ఇరుకుగానో లేదా
ప్రమాదభరితంగానో ఉన్నచోట
శరీరమునుండి ఒక అవయవాన్ని పీకి
మైలురాయిగా నాటిపోతాడు
అతడు....అతడే.... అతన్ని ఓ ఊరికో పేరుకో

కుదించాలని ప్రయత్నం చేసిన ప్రతీసారీ
తన పాదం కింది పిడికెడు మట్టినితీసి
తలమీద పెట్టుకుని
నాగలి కర్రుకంటిన మట్టి ముద్దగా మారిపోతాడు
అతడికో రూపాన్నివ్వాలని
ఒక రూపంగా చూడాలని అనుకుంటామా
ప్రేయసీ ప్రియుల ఏకాంత నిశ్శబ్ధసన్నివేశానికి
తెరదించే ముద్దవుతాడు
అతడు....అతడే అతడు సున్నితుడు కాదు
అలాగని కఠినుడు కాదు

సంక్రాంతి పండుగ నాటి పొద్దుటి పూట
వాకిట్లో మా అవ్వ ముగ్గులేస్తున్నప్పుడు
వేళ్ళ సందుల్లోంచి పట్టులా మెరుస్తూ
సుతారంగా జారిపోయే ముగ్గుపిండి - అతడు

తెల్లారింతర్వాత వాకిట్లో కసువు నూకుతూ
మా అవ్వ అరచేతిలో బిగించుకున్న చీపురు - అతడు
అతడెప్పుడూ కలగంటుంటాడు
ఎడతెగని ధారగా కంటున్న అతడి కలలాగే
అతన్ని చంపే కుట్రొకటి
యుగాలనుండి వెంటాడుతూనే ఉన్నది
కలకత్త వీధుల్లోనో కొయ్యూరు అడవుల్లోనో
అతడిప్పటికి ఎన్నిసార్లు
చంపబడ్డాడో ఖచ్చితంగా చెప్పలేను కానీ
అతడు చచ్చాడని అందరూ అనుకుంటున్న
ప్రతీసారి...
మన ఇంటి గుమ్మానికి
ఓ కలను వేలాడదీసిపోతాడు

*చనుబాలధార, మే, 2000*

# తమాశ బత్కులు

• అద్దంకి తిరుమల వాణిశ్రీ

న్యాల పర్రెల నడుమ నిండిన కొయ్యకాలై
డ్యామ్ కింద మేపోచ్చినా బత్కని ఎడ్లనమ్మక దిన్న
మా బత్కులు-
ఈ త్యాప-
కొయ్యని జొన్నెన్నుల మీద మొల్కలై మొల్సె
కల్లంల వోసిన అడ్లోలె అల్గుల గొట్కపాయె
పోయ్యింట్ల నీల్లల్ల దేలిన సత్తు తల్లెవోలె
కక్కుడు బైలు బెట్టి సంటోడు తేలిపాయె
తూము కాడి మన్ను నూకబోయిన ఇంటోడు
ఖాళి బడ్డ గుమ్మెలె ఉబ్బిపాయె
కాలు నడ్మ లేవని ముసల్ది
మంచంతోనే వరదల్ల మున్గిపాయె
పల్గిన పత్తి కాయల్ల తడ్సిన పత్తోలె
ఇత్తుల్ని నన్ను ఇడదీసి
సొద్యం జూడ వడ్తివి గద సామి!
అన్ని కార్తెలు మిర్గ జేసి తమాశ జూస్తుంటివేంది?

*మంజీర తీరం, ఆగస్ట్, 2000*

# భద్రకాళి చెరువులో రుద్రమ దాచిన తల్వార్

● జగన్ రెడ్డి

చెదిరిపోయిన ఆకాశం హద్దులలో
నీ శూన్యపు దిగంతాల మరకలు
నువ్వు మా కొన్నెత్తురు ముంతవు
తేటతెల్ల పెరుగుబువ్వవు
నీ పిడికిట కత్తయి నక్షత్రాల ఆవలిగట్టు
నీ నొసటి బొట్టులో చంద్రిగాడు
పునరుద్ధానాలలో కాలం కొంగ్రొత్త రంగులు కురుస్తున్నది
వెన్నెలలు శ్వాసోపశ్వాసలు
యుగాలన్నీ నీ ముందు సాష్టాంగ ప్రణామాలు పలుకుతున్నాయి
శివసత్తుల శిరోజాల ప్రాణ ప్రతిష్టలు
రక్త పంకిలాలను నీ చరిత్ర పిండార బోసుకుంటున్నది
ఎన్నో పసుపు కుంకుమలు చెల్లిపోయి
తెగిన మొండాలపై నీ హస్తసాముద్రికాన్ని చదువుకుంటాం మేము
కొండగొర్లు కొత్త చిగుర్లు పోసుకుంటూ ఏటి ఆటలు మేస్తున్నాయి
భాష్యాలకు దొరికిపోయిన నా కన్నీళ్లలో మునిగి తేలుతున్నాం
మేము...
విలయతాండవాలలో విస్తుపోతున్నది మేము కానేకాదు
ధైర్యము జారిన ఈ లోకమే
వీర కుంకుమలకు కాళ్ళ దుమ్మయినా మిగలలేదు
ఎవరికని బొట్లు పెట్టేది కూలిపోయిన బొమ్మరిండ్లలో పైరగాలులు
పాతపాటల్ని తెంపుకొస్తాయి రాత్రి పూజలకు
తేపతేపకు మేము కాశగడ్డి చలికాపుకుంటాం
ఎర్రబోనాలను పుదిస్తూ ఎర్రి పాటలు కట్టుకుంటున్నామింకా

తెలంగాన! తెలంగానా!
పువ్వులన్నీ పుప్పొడి తరగల్ని తరుముకొస్తుంటే
ఏరు ఎగతన్నుతున్నాది
మునిమాపటీల మునగ తీసుకుంటాయి మారోజులు

రా తల్లి! రా!! నీ కొడగట్టిన రూపానికి ఆకుపసర్లు పూస్తాను
నా కన్నీళ్లలో కసితో నీ గండదీపాలను దగ్ధమిస్తాను

వస్తాను
వేయిన్నొక రాత్రుల్ని చిదిమేసి
వస్తాను ఒకే పేరుతో వందలసార్లు
నా బుచ్చిపిల్ల! కొంటెపోరి భద్రకాళి చెరువులో
రుద్రమ దాచిన తల్వార్ రజాకార్ రాబందులపై
గొట్టి ముక్కల ఎక్కుపెట్టిన బందూక్
జొడెన్ ఘాట్‌లో కొమురం భీం వదిలేసిన బాణం

వెయ్యి వసంతాలు పూసి రాలిపోతాయి
వంద శరద్ రాత్రులు తూలిపోయి

బాభేర్ఖురి - భువనగిరి
మంజీరలు - మానేరులు
రామగిరులు - సాలచెట్లు
నల్లమలలు - రేలపూలు
కొమురెల్లిలు - కొమురయ్యలు
అయిలేనులు - ఐలమ్మలు
పోతన్నలు - పోతరాజులు
సోమన్నలు - సోపతి గాళ్లు
వెయ్యి వసంతాలు పూసి రాలిపోతాయి వంద శరద్ రాత్రులు
తూలిపోతాయి తెలంగాన ! నా తెలంగాన!!

*సాహితీ గవాక్షం, సోమవారం, ఆంధ్రప్రభ, 19, జనవరి 2001*

# జోలి

● పగడాల నాగేందర్

మోదుగు డొప్పులో వెన్నెలను జుర్రుకున్న గీ నేల
సలుపుతున్న సనుబాల తీపిని
మేస్తుంది!

నెత్తుటితో తడిసిన
తంగేడు పూల వనంలో
జీరబోయిన బాలసంతు పాట
గుండెగూటిలో గువ్వై ఒదుగుతుంది

అంటరాని జాతంతా అలలుగా
కదుల్తుంటే
మట్టి పొత్తిళ్ళలో తల్లి
మాయిని నెమరేస్తుంది!

గడప గడపకు జోలెలో నింపుకున్న కన్నీళ్ళు
లిపిలేని బాధను మోస్తున్నవి
ఆకులు అల్లల్లాడుతున్న గీ అడవంతా
కొలుపు గుంతల్ల వెండి కొడవళ్లై పూస్తుంది!

మట్టి పాత్రలు బీటలెత్తినప్పుడు జీవితం ఓ పాచి మడుగు
బుడుంగున మునగాలి
కైగట్టిన పాటకు
దప్పుమీద దరువు మార్చాలి
కులపు ఊబిలో అల్లుకుపోయిన నాచుమధ్య ఎంత కాలం,
జలపాత ప్రవాహాలమై సాగాలి!

అర్థం కాని యుద్ధంలో
ఆశల నిచ్చెనలు జార విడుచుకున్నాక
పొలాల్లో పరిగలేరుకుంటున్న కలల్ని
ఈ నేల ముఖచిత్రంగా ముద్రించాలి! కాసేపన్నా -కిరీటాల్ని
కీర్తిగానాల్ని
పక్కకు నెట్టి
తడి నెత్తురునే పొదువుకోవాలి

కవిత్వంలో జీవితంలో
సాకబోసిన కన్నీళ్లనే ప్రేమించాలి
తగలెట్టాలి - కసిగా
డొల్ల కవిత్వాన్ని - కపట ప్రేమల్ని

పుష్పించాలి కొత్తగా
ఓడిపోయిన వీళ్ళకలల్లో
వెన్ను పాములమై
నెత్తురోడుతున్న మోదుగుపూలమై!

ఈ మట్టె మొలచిన ఆత్మల్ని
మల్చుకొచ్చిన కన్నీటి కాలం
వెయ్యేండ్ల గాయాల్ని
కెలుకుతుంది

ఇప్పుడిక - బోనం కుండల్లో
చేయిజొనిపి తిన్న
వెన్నెల ముద్దల్లేవ్
జాతరలో వేలాడదీసిన చిలుకల దండల్లేవు
దరిద్రాన్ని మరిపించిన మోట పాటల్లేవు!

బుగులు బుగులైన ఈ నేలంతా

ఏ తల్లి సాపెనో
ఈ పీనుగుల పెంటల్లో
జంగపోళ్ళమై తిరుగుతున్నం
బొందల గడ్డలకు కాటి పాపలమై
కాపలా కాస్తున్నాం!

నెత్తిన మన్ను బోసుకొని
కదుపు కొట్టుకుంటూ
భోరున ఏద్వడమే మిగిలింది గీ గడ్డకు

ఇప్పుడు
ఈ భూమిలోంచి ఎక్కడ పిడికెడు మట్టి తీసుకున్నా
ఒరిగిన వీరుల కనుగుడ్లే కదలాడుతున్నాయ్!
నుజ్జునుజ్జయిన
జీవాల ఆత్మకతలే వినిపిస్తున్నాయ్!!

*గమనం, సాహిత్య ప్రత్యేక సంచిక ఏప్రిల్, 2001*

# పోగుల గూడు

● పులిపాటి గురుస్వామి

పండగ లేదు
పబ్బంలేదు
పగల్లేదు
రాత్రి లేదు
చేసుకున్నోనికి చేసుకున్నంత.

తెల్లారి పొద్దూకె
వయసంతా మగ్గం గుంటలో ఇంకిపోయె!
నరాలు తేలిపాయె
సూపుకు దారం తక్కువాయె!
రోగాలు నొప్పులు
కొంప చుట్టూ అల్లుకుపాయె!

అద్రగనంగ సంపాదించింది లేదు
తాతలు పంచిపోయింది లేదు
వాన ముసురుకు
ఉన్న ఇల్లు ముసలిదై
పొటుకులు పెట్టి పెట్టి సీకిపాయె!
వరదొచ్చినట్టు
మీదికి మీదికి ఆడపిల్లలు
అగుడు తినుడుకేం తక్కువ లేదు
ఎవరు సచ్చినా పుట్టినా తందాన తానే
దావతులు నాశనం గాను!
షావుకారు మంచోడే
అడిగినంత అప్పు ఇస్తనే ఉంటదు

సూస్తుంటే సూస్తుంటెనే
తలకాయకన్న వట్టలు లావాయె!
ఇంటి(రాజులు వళ్ళొంచి చేసినా
పిట్టకింత బెల్లం నాకింత బెల్లం అన్నట్టే

సొమ్ములేవు సోకులేవు
పసుపు తాడుకింద పచ్చపతకం తప్ప
బతుకంతా పట్టుచీరల మధ్య గడుస్తున్నా
కట్టింది లేదు పెట్టింది లేదు
ఉద్దెర కాటన్ చీర దసరకు కొంటె
మళ్ళీ దసరాకు మంచిగుంటే కడితిమి
లేకుంటే పాతచీరల మీద
పండగ పోతనే ఉంది

ఏండ్లకేండ్లు ఉపాసాలెక్కడ బాయెనో!
పండగపండగకు పూజలెక్కడ బాయెనో!
కన్పించిన రాయికల్లా
తలకాయ కొడితిమి గుడి చుట్టూ తిరిగితిమి
గుండ్లు కొట్టించుకుంటిమి
దేవునింట్ల పీనిగెల్ల
ఒక్కసారన్నా కన్నీటు తిప్పిందా!
ఏ కూర లేకున్నా కారం కలుపుకొని
అంచుకు ఉల్లిగడ్డన్న కొరుక్కునేది
అదిగూడ దక్కకుండాయె!
బతుకంతా
మిద్దెచెక్కల కింద
బొంద పెట్టినట్టే ఉండె.

*'చెమ్మ' కవితా సంకలనం, మే, 2001*

# దాలి

● సుంకిరెడ్డి నారాయణరెడ్డి

భూమి ఏ మాత్రం కదలదు
ఏ మీడియాల కంటపడకుంటనే
బొక్కలు నుగ్గు నుగ్గయితయి
నుసి కమ్ముకుంటది
నింగికైనా దెల్వదు
బంగారు యెన్నులు
మన్నుల గలుస్తయ్

ఒక్క కొబ్బరి చెట్టిరిగితే పరిగెత్తె ఫైళ్ళకు
లక్ష వరెన్నుల శోకం సోకనే సోకదు

మోసే చేతులగుపించవు
పాడె ఒక్కటే కదిలి పోతుంటది

ఏడ్వకుంటనే తలకొరివిపెట్టే నాయకుడు అగుపించడు
కాష్టం అదే అంటుకుంటుంది

ఏ ఇసుక తుఫాను రాదు
పొరల్లోకి పోయే పురా శాస్త్రవేత్త చేయి జంకుతది

దృశ్యం కాని భీభత్సం

డిస్కుల కాలం డిస్కోల కాలం
డాలర్ రథయాత్ర కింద వరి యెన్ను నుగ్గు నుగ్గయిన కాలం
వేలెడు ప్లాపీ ముందు మడి బలాదూర్ అయిన కాలం
కన్నమ్మ సెరలు పడి మడి వురివిప్పితే మార్కెట్టు మంత్రగత్తె
యెచ్చమెలిపాయె కరువాయె
మట్టిని నమ్మిన మొసగాడెపుడో

మట్టిని నమ్మనోడిపుడు మిలియనీరంట
కర్రు మాయ
కాడిమాయ
యెలువు మాయ
సలువు మాయ

Water be the primary element
of all that exists - Thalse

నీటి నోరు నొక్కితే - తేలిన తూగుటుయ్యల్లు
నీల్లు నోరు విప్పితే మునుగుతున్నయ్

భూమి బ్లాంక్ చెక్కు
నీల్లు విలువను రాస్తయ్
భూములు ఖాళీ తలెలు
పంచభక్ష పరమాన్నమిచ్చేది నీల్లు

సాటలో పడ్డ శిశువులు భూములు
నొసటి రాత రాసే బ్రహ్మ నీల్లు

అవతలి దేశాలకు విమానం నీల్లు
బవంతలూ బజార్లూ
సినిమాలు డాట్‌కామ్‌లూ
నీటి అవతారాలే
నీల్లు లేక కాదు
నీతిలేక
బ్లాంక్ చెక్ నా తెలంగాణ

నదులు తర్లొస్తే
జహ్నువులై పుక్కిట పడ్తిరి
నీటి దొంగల్లారా
సగరపుత్రుల కాష్టాలగడ్డ పునీతమయ్యేదెట్ల

కలలనించి జారె కన్నీటి పుట్ట
నీళ్ళలో మొసలి నీరుడు కాదు
పుట్టలో పాము
నీటి యుద్ధం

తల్లియేరు దీసి మెడల పేగేసి
మేడలెక్కుతున్రు
తల్లిపేరు జెప్పి
పుంజీతం ఆడుతుండ్రు
నీరాలికే కనుగుడ్లను
తరాజులకెత్తుతుండ్రు
ఇంటి దొంగల పని ఇంతింత గాదయా

నువ్వు నరికినగాని నువ్వు నరికినగాని
నువ్వునరికిన గాని
గరక మన తల్లి
మల్లమల్లా యిగురేసే పాట మన తల్లి
యిగురు యిగురుకు పూత వస్తనే వుంది
పూతమ్ముకుంటున్న సావుకారెవడు?

సాని కవుల్నిగని
తల్లి తల్లడిల్లుతున్నది
నీల్లు లేక పెదిమెల్ల నెర్రెలు
పదవులకు పానసరం బడతరా
నీలి మబ్బు మన తల్లి
నేను మబ్బు పదవులు
ఊమ్మింగితే కడుపు నిండుతదా

మనిషి నేలకు సలాములెందుకు
అమీబాల నేలకు సలాముజేయుండ్రి

ఆడెవడో
అరబ్బు కవంట
పాలస్తీనా కన్నీళ్ళు తుడవడానికి
కన్రెప్పలతోనే
కర్చీపు నేసిచ్చిండంట
ఈ కవులేమో
నా తల్లి కన్రెప్పలతో
కార్పెట్లు పరుస్తుండ్రు

పేడి మూతుల మీద
రుద్రమ్మ కొప్పు ముడి
పేరు మారె
మాట పేగు మారె
హైదర్ఆబాద్ బెజవాడవుతున్నది
నా తురకల్లారా
దక్కనీయత రూపుమారుతున్నది
పాన్దాన్ వుగల్దానవుతున్నది
దార్లు మారె
చెర్లు మారె
దిల్మే పత్తర్ ఫేంక్ రహీహై

చార్మినార్ కుంగుతున్నది
రోష్ని చలే జా రహీహై

ఆ రెండు మహానగరాలు మనవేనా

నీల్లెంట కాల్లకాడికొస్తె
అయితె మాయనుకుంటిమి
వలసకొచ్చిన కొంగ
చెరువు నాదంటదా

నా మాట లేని భాష బలాదూర్

మెలిబెట్టిన యేర్లను యిప్పుకోవాలె

మాట తీరు మార్చె సయిమమొచ్చింది

అరే తుమ్ కోన్‌హో మేరా జమీన్‌మే
పేరు దెల్వదు
ఊరు దెల్వదు
మన్ను రుచి దెల్వదు
ఎడ్దడుగుల ఏడు తీర్ల నేల
పంట నిర్ణయిస్తవా

Who are you to set the rules in my land

దమాఖ్ లేదంటావ్?
కోంద్ర తెలువదంటావ్?
నన్ను కవిని సుత కాదంటావ్?
సాలు జాగా కోసం తలలు పగులగొట్టేటోన్ని
తలాపు జాగ కోసం తలనిచ్చేటోన్ని

ఆటనాది పాటనాది ఓటు నాది తుపాకీ నాది
కానూన్ కోన్ బనాయేగా?
రంగేదైతేనేం

ఎవదురా నాకు నడక నేర్పింది
భూమిని గిర గిరా తిరగమని నేర్పిందెవదురా

విశాలాంధ్ర
తెలంగాణ కదొక వీసాకార్డ్

దెరీడా నిజం
భాష మోసగత్తె

స్వర్ణాంధ్ర
సరికొత్త పాస్‌పోర్ట్

వేళ్ళు తంబూరాను మీటితే
మరణ మృదంగ నాదం
కమ్మగా పదాల్ని కలిపితే
బందూకుల మోత
పాత బస్తీలకు ఊరి శివార్లకు
ఇంకొక ట్రంప్ కార్డ్

భాష ఇప్పుడు బాస కానే కాదు
పెదాలే పదాల కాష్టాల గడ్డలు
గమ్మత్తుగా బొల్లిచర్మం విశ్వవిపణి పెద్ద దర్వాజా

గా
అమీబాతోని నన్ను కలిపిందెవడు
పాడెకట్టెలు పల్లకిని జేసుకుంటోడు
సావు బొంతల పాన్పుజేసుకుంటోడు
అటుచూసి ఇటు బొర్లి
అటు పెదవి ఇటు పేజి
నాలుక బదులుగా నాణెమైనోడు

గా
అమీబాతోని
ఔరంగజేబుతోని నన్నంటగట్టిందెవడురా
అయినోడిదైనా కానోడిదైనా
మా కండ్లు గట్టిన
కట్టుకథలా సంతకాలు
మా కడుపు గొట్టిన
ఇసపు గీతలాసంతకాలు
మూడు కోట్ల ఏలిముద్రలదే
ఇంక ఆఖరి తశ్వ.

*దాలి తెలంగాణ దీర్ఘ కవిత, జూలై 2001*

## తెగింపు

• *ఏలేశ్వర నాగభూషణాచార్య*

భరించలేని అవమానాల ఖాకీల జులుంలో
పల్లె కకావికలై ఎదపై లబోదిబో గుద్దుకుంటూ
తలమునకలై తల్లడిల్లుతుంది
తెల్లారీ తెల్లారక ముందే బతుకు బండిని సాగదోలుకుంటున్న
వలసల నేపథ్యంలోనే పల్లెలకు పల్లెలన్నీ ఖాళీ....
బుడ్డగోచి లేని బుడ్డపోరడు మాయమవుతుండు
అవ్వసంకల కెల్లి సంటిపోరి ఏడ్పు సటుక్కున మాయమవుతోంది
ఎక్కడెక్కడని గావుకేకేసి ఎక్కిళ్ళు పట్టేడ్చిన
అవ్వ ఆరో[్]ప్రాణం ఆవిరైపోతుంది
ఇవాళ తెలంగాణ పల్లెల్లో అమ్మ ఆఖరి చూపు కరువైపోతుంది
తెలంగాణ వీరోచితమైనదే
చరిత్ర పుటల ఆనవాళ్ళ సాక్షిగా నెత్తుటి ధార మీద
గతించిన చరిత్రను నెమరేసుకున్నదే! నెమరేస్తున్నదే!!
ఇక్కడ మొన్న మొన్న మొలచిన నెత్తుటి బిడ్డ సైతం
అమరుల త్యాగాల తెగింపు గూర్చి
ఆవులింతలతో పుక్కిలించగలడు
బావురుమని గీపెట్టే బరిబత్తల పసిపోరగాడు
తెలంగాణ భవిష్యత్తు చిత్రపటం మీద
తీయతీయని పాటల్ని పాడగలడు
కాని?! తెలంగాణ పిల్లల కన్రెప్పలమీద ఆవగింజంత కునుకులేదు
ఏ క్షణాన ఏ సవ్వడో?! ఏ క్షణాన ఏ రువ్వులో?!
అంతా మొగులైనట్టు మెదళ్ళు మొద్దుబారిన దృశ్యం
తొట్టెలూగుతున్నట్టూ పల్లెలూగుతున్న ప్రకంపనాలు

ఏమైనా మొగులుతెప్పల్ని ఆలోచనాఖడ్గంతో చీల్చేసుకుని
ఊరువాడా పొలిమేర్ల సైతం తెలంగాణ నినాదానికి
లక్షల గొంతులు ఏకమై దరువందిస్తున్నాయి
ఎంత తెగింపుదనం తెలంగాణది?!
పచ్చని పైరుపంటల పచ్చల్ని పొదిగిన
తెలుగుతల్లి ఒడ్డాణం మీద నెత్తుటి మరకలే
నిలువెత్తు చారికలయ్యాయి
తెలంగాణ మీద చిమ్మిన వీరుల రక్తం మరిగి గడ్డకట్టి
ఇవాళ తెలంగాణ మహాౖవ్రణమయ్యింది
రేపు బుజబుజై చీము కారుతుంది
కారిన ప్రతి చీము చుక్క ప్రజా తెలంగాణా గూర్చి
పాటలు పాడుతుంది పాఠాలు నేర్పుతుంది
నెత్రలు బారిన బీళ్ళ మీద నెత్తుటి బొట్లు రాలి
పచపచ్చని గడ్డి మైదానాలని మొలిపిస్తాయి

*'ఏదపాయలు' సంకలనం, అక్టోబర్ 2001*

# యాది-మనాది

● అల్లం నారాయణ

జంపన్నా వాగుల్ల అబ్బియ్యా!
జాలారీ బండల్ల అబ్బియ్యా!
సమ్మక్కా సమ్మక్కా
మా పురా ఆత్మా!
కలవరిస్తున్నాం కదే, నిన్నొక దేవతలా!
తల్లీ,
ఏడేడు లోకాలు
ఆది ఆత్మలు
అంతరించిన జాతులు
కట్టని పన్నులు
చిట్లిన బతుకులు
కడగొట్టు బిడ్డలు
కట్టు గొర్రాళ్ళు
శివసత్తి పలుకులు
నల్ల సరబ్బండలు, సబ్బండ వర్ణాలు
ఎత్తుగట్టిన బంగారం
ఎక్కొచ్చిన వరాలు
కాకతీయుని మీద కత్తి దూసిన సమ్మక్కా..
నిను తలచుకుంటూ....
వలపోస్తూ...తలపోస్తూ...తలపోస్తూ....

❀ ❀ ❀

తెలంగాణ ....
నీ శరీరం మీద బరువులు
మూపు మీద వలసల వికృతాలు

మైదానాల మీద
రేగడి పొలాలల్ల రేగిన పుళ్ళు
కట్టిన దళ్లు... కళ్ళకావళ్ళు...తలాపున సముద్రాలు
దూపతీరని పాపలు
వలసలేని చోట విముక్తి పోరాటాలు
'ఎస్టేట్'ల నుంచి ఎక్కితొక్కొచ్చిన రెసిడెన్సీలు
మదరాసీల ముందర 'ముంగి' ఆంధ్రుడు
తెలంగాణ ముంగీసయిందు
మూ చూడని రేగడి లేదు
ముట్టని భూమి లేదు
పారిచ్చుకోని కాలువ లేదు
పాదం మోపని ప్రాజెక్టు లేదు
రేగళ్ళ పొంటచ్చి రాజీర్కమేలిందు
కాల్వల పొంటచ్చి
కోటగోడలు కట్టిందు
భూమి ఒక పరాధీన
కాలువ ఒక బిడ్డకు దక్కని స్తన్యం
పాలధార....పాలధార...
సేపులస్తన్నయ్..బిడ్డా!
రొమ్ము సలుపుతున్నది
పాలు పొంగుతున్నయ్...
కన్నబిడ్డలు పాలకేడుస్తున్నరు
కడగొట్టు బిడ్డలు పాలకేడుస్తున్నరు
నీళ్లెయ్యి
ఎటు మళ్లినయ్
ఆధునిక దేవాలయం ఆంధ్రుల పంట కాలువ
కన్న కొడుకును ఒదిలి గోదారి
పరాయి బిడ్డకు పాలిస్తున్నతల్లి.....

కృష్ణ పరవళ్ళు..గుంటూరు మళ్ళు.....
ఎక్కడ పుట్టినవ్ బిడ్డా
ఎవనికి పుట్టిన బిడ్డా
కడగొట్టు బిడ్డ తెలంగాణ
అంగట్ల పుట్టిన అవ్వా!
పాలసేపులు...పచ్చి పాలకుండ
భళ్ళున వరదలైన పాలధార
రొమ్ము సలుపుతున్నది.....
పుడమి శోకం బెద్తున్నది...
కె.ఎల్.రావుకు నీళ్ళొదులుదాం
తిలోదకాలతో సహా
అతనొక కుట్రదారు
నీళ్ళ మాయలో ముతమైన తెలంగాణ
నల్లగొండ కాళ్ళొంకర
కన్నొంకర
నీరందని బతుకొంకర
నల్లరేగళ్ళ మీదుగా, పారేగోదారి మీదుగా
నైజాం కొరీర్లను కమ్ముకున్నదు వాడు
గొడ్డుకారం, సల్లగడ్క
మెట్ట భూములు ఆయిందపు లొట్టలు
సజ్జ జొన్నలు, సర్పాలు తేళ్ళు
తాడెత్తు జీవధారలు
నవ్విన పువ్వులు, పసుపు తంగెళ్ళు
పచ్చటి బతుకులు, పండుగ బతుకమ్మలు
సిర్రగోనెలు, శిలువను మోసిన రైతులు
అంబరాసాలు, అయిరేని కుండలు
పట్టుకూసాలు, పరుపు బండలు
గుండె లోతుల్ల పుట్టిన 'జల'లు
మురిసిన నవ్వులు...ముసిరిన చీకట్లు

నెగడు మంటలు నేత సింగిడీలు,
ఉరుసు తీర్థాలు, పడిలేచిన పీరీలు
పీరీల గుండం తొక్కిన నిప్పు
అస్సోయ్‌ధూలా...
నెనరు మాటలు, వెయ్యి పాటలు
దంచవొయ్యి మిముసాత్తి కొడుకో...
ఆశన్నా ఊశన్నలార
ఆట సిలుకలు - పాట సిలుకలు
అవని సంబరాలు
కుక్కలు దునికిన కాడ
గుఱ్ఱాలు దునికిన తెగువ
పాపారాయుడి యాది
అలాయి బలాయిలు
ఆత్మ సంభాషణలు
మనసును ముట్టుకునే
అగ్గి పర్వతాలు
బతుకు సారపు సామెతలు
ఆటుమాటలు, అక్కర మాటలు
'తౌరక్యాంధ్రము' పేరిట
ఎగ్గడించిన బతుకులు
బోర్లిచ్చిన గుమ్ములు
ఎన్నడూ నిండని గరిసెలు
భాష ఒక బతుకుపటం
భాష ఒక అలాయి బలాయి
భాష ఒక ముట్టిచ్చిన దీపం
భాష ఆత్మల అనుసంధానం...
ఆరాట, పోరాట విరాట్ స్వరూపాల
అమ్మలగన్నయమ్మ భాష
యాసేడిది...

తెలంగాణ ఒక జీవద్భాష
మనసు ముచ్చట
కృతక, ఘాతుకం మీది...
ఉల్టా బనాయింపు మీది .
భాష ఒక కడగొట్టు స్వప్నం
విలన్లు మీరు...వీణలం మేము
ఉల్టా...ఉల్టా ..ఉల్టా.
నువ్వొక మాయ జలతారు పరదా.
మేకమెడచన్ను...

* * *

గెట్టు పంచాది కాదు
పంపకాల పంచాది కాదు
కొల్లగొట్టిన నీళ్ల పంచాది
సంకరం చేసిన భాష పంచాది
నిలబడి కలెబడే సంస్కృతి పంచాది
పచ్చటి పొలాలల్ల లేపిన బంగ్లాల పంచాది
అటు అరవై మైళ్ళు, ఇటు అరవై మైళ్ళూ
రాళ్ళేసి, ఆక్రమించుకున్న
హైదరాబాద్ పంచాది
తరలించుకుంటున్న సంపద
అమ్ముకుంటున్న ఆత్మ,
ఒక కల్పిత దేహం.. రెండు ఆత్మలు
ఒక ఒర..రెండు కత్తులు
ఇటేటు రమ్మంటే ఇల్లంత నాదంటడు
ఇల్లలికి పేరు మరిచిన ఈగల శాస్త్రం
కొల్లగొట్టిన వనరుల జాడ
పాము పడగల నీడల్ల
వాడిపోతున్న పచ్చటి బతుకులు

రెండు అసమ సమాజాల పొత్తు...
రెండు ఆత్మల దేహం
ముక్కలవక మానదు...
బద్ధలవుతున్న దునియా

ఆయిటి పూనింది
మొగులు ముట్టింది
పసుల రంకె
కోడె తవ్విన ఒరం
ఎర్రమట్టి విలాసం
ఆరిద్రల తిరుగుబాటు
ఉసిల్ల పుట్ట పగిలిన రాత్రి
నాగండ్లు సీలలెయ్యాలె....
కర్రులు సరిపియ్యాలె...
ఎడ్లకు బొట్లుపెట్టి
నాగలి భుజాన బెట్టి
'సాగువాటు" కు సై అన్నది తెలంగాణ
యాదికున్నదా!
1969,
గుంటూరు గూడాలు కాలికూలినయ్
బజార్లు నెత్తురోడినయ్
వరద కట్టిన నెత్తురు..
అగ్గి ముట్టిచ్చిందెవరు?
అగ్గెట్ల పుట్టింది?
నిప్పుల మంటల నాల్కల కొసల మెరిసిందెవరు?
దీపస్తంభాల మీద పేర్లు,
స్తూపం మీద చెక్కని నాలుగొందలపేర్లు
ఫెడీఫెడీ కేకలు
ఆత్మ నాదాలు, ఆర్త నాదాలు

మాకు తెలంగాణ కావాలె
మా కొలువులు మాకు కావాలె
ఆరు సూత్రాలు ఒక అబద్ధాల పత్రం
పెద్ద మనుషుల ఒప్పందం ఒక కుట్ర
అర్సిపెట్టిన కేకలు...
ఊరేగింపు కదులుతున్నది
జనం కదులుతున్నది
రోడ్లు ప్రవాహాలవుతున్నయ్
పుట్టలు పుట్టలుగా పుట్టిన మాటలుగా
ముల్కీ కోసం బలైన ఆ ఆరుగురునీ
స్మరించుకుంటున్న జననదీ ప్రవాహం
తెలంగాణ గాయం రేగుతున్నది ..
ఒక యుద్ధం..
ఒక సంరంభం, రోడ్డు మీద పోర్లాడిన యవ్వనం
జులూస్ కదులుతున్నది
1956, నవంబర్ 1
ఒక విద్రోహ దినం
ఒక బలవంతపు సమీకరణ
ఒక సంకర సమాజావిష్కరణ
'కమ్మ, నిప్పులు కత్తి కలిపిన గొంతు
బలవంతుడు, బలహీనుని
వీపు మీద ఎక్కి తొక్కిన సవారీ
గుంటూరు పల్లెలు, కమ్మ పాలేలు
కవాతులు కట్టి కొల్లగొట్టిన
బతుకు
ఏకుమేకైన సందర్భం
నినాదాలు..ఆకాశం మీద హరివిల్లులు
ఫెడేల్... ఫెడేల్ ...ఖణేల్...ఖణేల్
జై తెలంగాణ ..జైజై తెలంగాణ

గుంటూరు గూడాలకు అగ్గిదల్గ
అవి మన భూములు ఆక్రమించినయ్
అవి మన కొలువులు కొల్లగొట్టినయ్

యాదికున్నదా!
1969 జూన్, 1
ఖాదర్ఘూట్ సాక్షిగా
అరుణ తెలంగాణ పొద్దుపొడుపైన
అరుణారుణ కిరణం
మతికున్నదా!
తూటా తగిలిన దుర్బల శరీరంమీది అంగిని తీసి
ఎగరేసిన నెత్తుటి జండా
పాడండి తెలంగాణను
నా తెలంగాణ ప్రజలారా!
ఆలకించండి.....
అలనాటి నినాదాలు,
అలనాటి శబ్దాలు అలనాటి నిట్టూర్పులు
నెత్తురోడిన శరీరాలు
బుల్లెట్లు మింగిన కాలేజీ పిల్లలు
గుండె రంపె కోతలు
స్తూపాలకెక్కని పేర్లు

ఘాంసీ బజార్, అలీజా కోట్ల,
కాలీకమాన్, పత్థర్ఘట్టీల నుంచి
పల్లెపల్లెకూ పాకింది తెలంగాణ
'గులామ్‌కీ జిందగీసే మౌత్ అచ్ఛీహై!'
బానిసగా చనిపోవడం కన్నా
మరణమే మేలు
కె.వి. రంగారెడ్డి పిలుస్తున్నడు
ఆలకించండి...చెవొగ్గి వినండి

అలనాటి నినాదాలు, అలనాటి నిట్టూర్పులు
అలనాటి ధర్మాగ్రహాలు
రోడ్డు మీద కవాతు సాగుతున్నది
నెత్తురోడిన శరీరాలు
యాది .. మానాది
మలబారు, మహారాష్ట్ర, ఉత్తరప్రదేశ్, జమ్మూ కాశ్మీర్,
కర్ణాటక, తమిళనాడు,బీహార్, గూర్ఖాలు..... .. ఎన్నెన్ని
బలగాలు
ఒక అగ్గి పుట్టింది
ఆ అగ్గిని ఆర్ప
నానా జాతి బలగాలు
ఒకటే ఆయుధం ..తెలంగాణ
ఎన్ని లారీలు, ఎన్ని బుల్లెట్లు

తల్లులారా! దుఃఖించకండి
వాళ్ళొక ఆగిన అధ్యాయాన్నిచ్చి వెళ్ళారు
ఆశ్వాసాల్ని వదిలి వెళ్లారు
వాళ్ళొక కాగల కార్యాన్ని వదిలి వెళ్ళారు
పూర్తికాని కార్యాన్నిచ్చి వెళ్ళారు
చరిత్ర పొత్తిళ్ళ మూటలిచ్చి వెళ్ళారు
తెలంగాణ ఒక నిర్బంధ ప్రయోగశాల
పురానాపూల్ నుంచి హుసేనీ ఆలం మీదుగా
నడుస్తున్నదెవరు?
జంగ్...ఇది ప్రాంతం మీద పెత్తనం చేస్తున్న
శక్తుల మీద పోరాటం
చార్మినార్ దాకా దండు కదులుతున్న దృశ్యం
పట్ట గొలుసుల కాళ్ళు
వెండి మట్టెల కాళ్ళు
చేతుల్ల జెండాలు, శిరస్సులపై నినాదాలు

తెలంగాణ కోసం....తెలంగాణోడి తెగువ
తెలంగాణోడి చావు
మా కొలువులు మాకే కావాలి
మా నీళ్ళు మర్లగట్టిన మోసం తవ్వాలె
స్తూపం... మీది పేర్లు...
నా కొడుకు తెలంగాణను కన్నడు
కనిరాలే
చెన్నారెడ్డి ముఖ్యమంత్రయిండు
మదన్‌మోహన్, మల్లిఖార్జున్‌లు ఏడున్నరు?
నా కొడుకు జాడ ఏడున్నది?
ఎవరు ద్రోహి? ఎవరు త్యాగి!
ఏ మోసం నిను కడతేర్చింది!
నా బిడ్డ స్తూపంలో వున్నడా!
వాని కల ఏడున్నది
బ్యాలెట్ పెట్టెల్లో పాములుంటాయ్
పాములు పుట్టాయ్
కాంగ్రెస్ ఒక కలను చిదిమింది
ఆంధ్రోళ్ళు చాలుగాళ్ళన్నడు తండ్రి నెహ్రూ
కూతురు ఇందిర కుంపటి బెట్టింది
మట్టకు రాసిన బెల్లం కరిగిపోయింది
నా కొడుకేదున్నడు?
చెన్నారెడ్డీ..చెన్నారెడ్డీ..తెలంగాణ కడుపుల
చెడబుట్టిన మాయావీ!
ఒక ఆశ్వాసం తాత్కాలికంగా ఆగిపోయింది
ఒక యాది ...ఒక మనాది...
ఒక జ్వలన జ్వాల చల్లారింది
వాళ్ళింకా మరణించే వున్నారు
వాళ్ళింకా స్థూపాల మీద చెక్కని పేర్లలో
కలలు గంటున్నారు

వాళ్ళిప్పుడు మరో మారు మేల్కొంటున్నారు

పొదిగిన రాళ్ళ మధ్య నిక్షిప్తమైన
పేలని ఆటంబాంబుల్లా వున్నారు
వింటున్నారా ..స్థూపాలు మాట్లాడడం
స్థూపాలు కలగనడం
ఒక స్థూపంలో నిక్షిప్తమైన
వెయ్యి టిఎన్‌టిల శక్తి

❀ ❀ ❀

పారీన నెత్తురు పీపాలలెత్తింద్రు
రాలీన నెత్తురు.. ఖాళీ తల్లి వొడి
వొడివించపండి...
ఆ తల్లుల శోకం.....
'బందగీ బందగీ ఎక్కడ తండ్రీ నువ్వెక్కడ'
దొడ్డి కొమురయ్యా
నీ పేరు జెప్పి దీపం ముట్టిచ్చుకుంటా
ఐలవ్వా...ఐలవ్వా....
ఎన్నెల కోనా లెనియ్యలో
ఎన్నెల కోనా లెనియ్యలో
ఎలుగురవ్వా లెనియ్యలో
ఒక ధర్మాగ్రహం
ఒక దుఃఖం
ఒగ బాధ మళ్ళింది
తెలంగాణ విప్లవమైంది
అది అంతర్జాతీయ కలలుగన్నది
మాసియాంగ్‌ను మరల నిలబెట్టింది
పేదోడి వడిసెల రాయయ్యింది
మరట్ తుడుం పాయానా

మనం తుడుం కొట్టాలె.....
సబ్బండ వర్ణాలను తట్టి లేపింది తెలంగాణ
అది లెనిన్‌ను గిరిజనుల్లో పసిగట్టింది
ఏనాన్ గాలులు ..ఎర్రపూలవనాలు
పొలాలు నాగళ్లు, వడిసెల రాళ్ళు
ఎర్రజెండాల కవాతు
రోడ్డు మీద సూర్యుడు
ఇప్పుడు వీస్తున్న గాలి...సర్వ దోపిడీల నుంచి
విముక్తి...
ఒక నెత్తురు గాదు..
తెలంగాణ గాయపడ్డ చెరసాల
తెలంగాణ రేపటి విప్లవానికి
ఇవ్వాల్టి వేగుచుక్క
సరాంచిన గొంతులు
పాటలు, పదాలు,....
లెల్లపాటలు, ఎర్ర జండాలు తొడుక్కున్నయ్
పదపద....విప్లవం కనుచూపు మేరలో వుంది
విప్లవం క్యాంపస్‌లను చుట్టుముట్టింది
గంగారం....గంగారాం....
గజ్జెల గంగారాం
యోధుడా...
ఏడో తరగతిలో నువ్వు
గుంటూరు గుడిసెను అంటించినవ్...
ఏడున్నవ్ కొడుకా..సమాధుల్లో
ఒక కలకు కొనసాగింపు
తెలంగాణ బీడుపడ్డనేల
కాడుపడ్డనేల
మూతబడ్డ గడి
గడ్డి మొలవని నేలలో

తుపాకులు మొలిచిన నేల
మందుపాతరలై పేలిన నేల
తెలంగాణ పగిలిన అద్దం
విరిగిన పాళీ
రొమ్ము సలుపుతున్నది
గాయాలు రేగిన జాడలు.....
భూమి ఏది? ఎక్కడ?
చెరపడ్డ భూమి సంకెళ్ళు తెంచు
నా జానెడు భూమి కోసం
నా బరిబాతల...అంగీలేని పెయినిస్తా
వీపు మీద నాలుగు పర్వతాలు
ఖననాలు...కళేబరాలు
దహనాలు...దగ్ధమైన గీతాలు
ఏకెగన్నులు..మలిగిన పెన్నులు
కైజాము ములాఖత్‌లు
క్రీనీడ ప్రేమలు
రాయని రక్తాక్షరాలు
దృశ్యాదృశ్యాల నుంచి అదృశ్యమైన ఆగంతక
సమూహాలు
లాకప్‌లు, చిత్ర హింసలు
అకాల మరణాలు, పుడమి తల్లి శోకాలు
తెలంగాణ చీకటి చెరసాల
నెత్తురోడిన నది
దుఃఖం నదికన్నా పురాతనమైంది
మాపున జరిగిన కాల్పులు
ఉదయాస్తమయాల్లో దొరికిన శవాలు
ఎవరి శవాలివి..ఎవరి జాడలివి
ఏ నెత్తుటి అడుగులివి...
కమిలిన శరీరాలు...కనలిన దుఃఖాలు

విముక్తం కాని కలలు
సాఫల్యత లేని భగ్న హృదయాలు
బీడుపడ్డది తెలంగాణ
కాదు పడ్డది తెలంగాన
ఉక్కు పాదం కింద ఊపిరాడని పొద్దు
తెలంగాణ ఒక ప్రయోగశాల
విప్లవం ఇంకా రానే లేదు
విప్లవం ఇంకా రానేలేదు..

❖ ❖ ❖

ఒంట్లో బద్దె పురుగు ప్రవేశించింది
అభివృద్ధి మేడారంలో వంతెనయింది
పత్తి కొత్త వలస సారం
పత్తి బతుకును అత్తిపత్తి చేసింది
కాలం ఆత్మహత్యలని కన్నది
శవాలు కాలుతున్న వాసన...
ఫ్యాక్టరీలు మూశారు...
వీధుల్లో అడుక్కు తింటున్న బాల్యం
కొనవోయిన కొరివి అమ్మబోయిన అడివి
నిన్నటి దాకా వున్నదేదీ నేడు లేదు
నువ్వు పుట్టిన ఆస్పత్రి మీద
అయిదంత్రాల బంగ్లా...
రోడ్డు, చెట్లు, పురా జ్ఞాపకం
కదులుతున్న నది...
సర్వం మింగేసిన వలస
జీపీ ఆర్, జయభేరీ, రామోజీ ఫిల్మ్‌సిటీ
ఎన్టీఆర్, ఏఎన్ఆర్, ఇంకా ఇంకా ఇంకా....
హైదరాబాద్ ఇప్పుడొక
పదిమంది ఆస్తి....

గుప్పిట బిగుస్తున్నది
ఇంకుడు గుంతల్లో
ఇంకి పోయిన బావుల ఘోష
'ఎస్టేట్'లలో నియమబద్ధకుట్ర
జలయజ్ఞంలో మునిగి అణగారిన
బోరుబావి పూడిక
మూలిగే నక్క మీద కరెంట్ స్తంభం
కాలువలు మళ్ళగొట్టుకున్నోనికి వంద
నీళ్ళే లేని దూపదీరని భూమి పుత్రునికి 560
అక్షరాలా సంస్కరిద్దాం రండి!
బతుకు ఛిద్రం .బతుకు విధ్వంసం
విత్తనం మీద బహుళజాతి పేరు
ఎవనికి పుట్టిన బిడ్డయినా
అంగట్ల అమ్మే అపసవ్యపు సరుకు
నెలలు నిండని శిశువులను కన్న
ప్రపంచీకరణ
గుమ్మంలో తోలు బొమ్మలాట
మట్టి కుండలో కోకాకోలా
నట్టింట్లో కలర్ కలల కంప్యూటర్లు
ఆత్మహత్యలు కాస్తున్న కళాశాలలు
నాకున్నది సెలక ఒక కోంద్రెడు
నీకున్నది
'స్ప్రింక్లర్' చుక్కలతో ఇజ్రాయిలీ
వ్యవసాయం చేసే
నూరెకరాల క్షేత్రం
నువ్వూ నేనూ కలిసి ఎగురుదాం
అనంతాలకు అట్నుంచటే
స్వర్ణాంధ్రకు
ప్రపంచ బ్యాంకు మూచూసిన కుక్క

అది కాలెత్తినప్పుడు
పరవశిస్తున్న స్వదేశీ పాలకుడు
బతుకుల్ల అగ్గిదల్గ
ఆకుకు అందది...పోకకు పొందది
అటురాదు..ఇటు పోదు
బోరు బావి బావురుమంటున్నది
నాగలి విరిచి పొయిలో పెట్టు
కమ్మరోడు, కుమ్మరోడు, వడ్లోడు
ధాతి మడిచి పెట్టి, కొలిమి సల్లార్చి, సారె
పారిపోయిన, బతుకులు....
ఇప్పుడు ట్రాక్టర్‌కు రెండెడ్లను కట్టు
ఎడ్ల బాటల మీదుగా
నేరుగా స్వర్ణాంధ్రకు...
విజన్ 2020 ఒక మాయవి పత్రం
కోస్తాంధ్రది, వలస సమర్ధన చట్రం

పత్తిరైతు మరొకడు ఆత్మహత్య చేసుకున్నడు
వ్యవసాయ క్షేత్రాల మీద అతను ప్రసంగిస్తున్నాడు
ఆత్మహత్యల నీదడం తరమా?
బతుకవ్వన్....
అది కుక్కల్ చింపిన విస్తరి
ఒక మొలతాడు లేని దెయ్యం
మార్కెట్‌లో తారాడుతున్నది
దాని పేరు యుద్ధం..రక్త పింజెర
దాని పేరు అమెరికా
దాని పేరు వరల్డ్ బ్యాంక్
మెక్సికన్, మిర్చి రైతులు వీధుల్లో పోరాడుతున్నారు
టీవీలు టీవిలుగా విస్తరిస్తున్నది సంస్కృతి
మాటలు మాటలుగా అల్లుకుంటున్నది అభివృద్ధి సర్పం

ఊపిరాడనివ్వని అభివృద్ధి?
ఇంతకీ నా గుంటెడు భూమి
నా బుడ్డగోసి
నా గొంగడి
నా కిర్రు చెప్పులు
సగం తాగిన సుట్ట
విజన్ 2020 దాకా వుంటాయా? వూడ్తాయా?
పీడాబాయె!
అయింతగోసిపోతె...ఏమున్నది
తోకమట్ట..దిగేసి కొట్ట
అయిందపులొట్ట
అగ్గితల్గిన పంట...అరిమల్లె లేసిన పొలం
కాపలా కాస్తున్న దిష్టిబొమ్మ విత్తనం
అయితే బిటి కాదంటే పోటా
పొక్కిలయిన తెలంగాణ వాకిలి
తెలంగాణ ఒక ప్రయోగశాల
ఒక గినీపిగ్..గినీపిగ్
సలసల కాగిన నదీ ప్రవాహాల
దారి మళ్ళింపు
ముసలి మూర్ఖుడు తవ్వజాలని కొండ...

✤ ✤ ✤

పల్లెంత పొర్కపోడు
బిడ్డా ఏడేడ కొట్టింద్రు
వీపు సందు లేదు
గాయాలు సలుపుతున్న బాధ
కొత్త గాయాలు రేగుతున్న వ్యధ
విప్లవం ఇంకా రానేలేదు
అవనతమవుతున్నది జండా

దొర మారుటి రూపు పట్నంలో రియల్టర్
బ్రాందీ షాపుల్లో బార్లా తెరచుకున్న జ్ఞానం
సింగేసి కట్టిన సన్నటి ధోతి
ఖద్దరైంది
దొరిప్పుడు విద్య నమ్ముతున్న వ్యాపారి
భూమి అమ్ముతున్న దళారి
వేర్లు పీక్కొనచ్చిన భూస్వామి
ఇప్పుడు పట్నాన్ని అమ్ముతున్న బేపారి
కలల బేహారి
దీపం మలిగిన గడి ముందు బొర్లాడుతున్న ఊరకుక్క
బీడుపడ్డ భూమి కాడువడ్డ కూలీ
శత్రువెవడో! మిత్రుడెవడో?
తేల్చాలే వున్నది ఏదీ మునుపటిలా లేదు
అది గుర్రం కాదు ఇది మైదానం కాదు
రాజ్యంతో యుద్ధం రక్షణ వలయం
వాడ్రాయి విసిరితే భళ్ళున పగిలే గాజుగోళం
తెగనరికిన తల చెప్పిన రహస్యం
ఇప్పటికీ విప్లవం వర్ధిల్లాలి
మోట బొక్కెన చిల్లు
తొండం అతుకులు పడని తోలుతిత్తి
భుజం మీద తుపాకి సలుపుతున్నది
అడివిలో తిరుగాడుతున్న జీమూత వాహనుడు
తెలంగాణకు ఏమి కావాలి?
నెత్తురోడిన శరీరమా?
ఒక సందిగ్ధ, సందేహం
తూర్పు పవనాలు మళ్ళినయ్
మార్కెట్ ముందు మోకరిల్లిన సంపూర్ణ సత్యాలు
విప్లవం ఇప్పుడొక అర్ధసత్యమా
జాడ తెలియని నాగరికతలు అల్ప జీవితాల ఛిద్రుపలు

చిదిమిన మిణుగురు దీపాలు
ఏడు నెలలు నిండని మృత శిశువు
పిండం అడ్డం తిరగనూలేదు
బయట పడనూ లేదు.
రొమ్ము సలుపుతున్నది...
తల్లిప్పుడు ఏ శిశువునూ కనజాలని
రోగగ్రస్థ.... అడవిలోకి ఇంకి పోతున్న సూర్యుడు
ముప్పయేళ్ళుగా మాట్లాడ్తున్న ఏక వాక్యం
ఒక్క పదమూ మారని ప్రణాళిక
జ్వరపడ్తున్నది మనసు
నేపాల్‌లో ఇప్పుడు వీస్తున్నగాలి
బొలీవియాలో సమాధి నుంచి లేచొచ్చిన సూర్యుడు
బ్రెజిల్ సోషల్ ఫోరంలో చేగువేరా బొమ్మ
ఊరేగింపులో కదుల్తున్న నానా 'జాతులు'
జాతులు విముక్తిని కోరుతున్నాయి
వలసలు విముక్తిని కోరుతున్నాయి
పరాధీన సంస్కృతులు తల్లివేరును తవ్వుతున్నాయి
సంస్కృతి నాయకత్వం వహిస్తున్న రాజకీయమా,
ఏది గెలుపు!
చే, ఒక ప్రాంతం అస్థిత్వవేదన నీకు తెలుసా!
ఒక జపటిస్టా ఏం కోరుతున్నాడు
చియాపస్ కొండల్లో మార్కోస్ మాటేసి
ఏం మాట్లాడ్తున్నాడు

మార్కోస్, ఇట్లా అంటున్నాడు
"ఒక అరాచకుడు ఒక మాజీ మావోయిస్టు
వొక తిరుగుబాటుదారు
స్పెయిన్‌లో అనార్కిస్టు
శాన్‌క్రిస్టోబాల్ వీధుల్లో ఆదివాసీ

పాలస్తీనాలో ముస్లిం విద్యార్థి
నాజీల జర్మనీలో యూదుడు
బోస్నియాలో శాంతి కాముకుడు
కమ్యూనిస్టు పార్టీలో స్త్రీవాది
పెరూలో గెరిల్లా
పారిస్‌లో 1968 నాటి విద్యార్థి
సోమాలియాలో అన్నార్తుడు
చైనాలో అసమ్మతివాది
భారత దేశంలో భూమి లేని దళితుడు

కొనసాగింపుగా అస్థిత్వ వేదనలో తండ్లాడుత్తున్న
కలలు భగ్నమై, మొలకెత్తినాక
వీధుల్లో, కవాతుల్లో, క్రీ నీడల్లో
బహిరంగ సమావేశ మందిరాల్లో
తచ్చాడుతున్న జీబురు గడ్డం
తెలంగాణ వాది
ఇక చాలు...ఇవ్వాల్టికి లొంగి పోయిందేమీ లేదు

❖ ❖ ❖

కేవలం కత్తులు కొట్లాడినందువల్ల
నెత్తురు ఏరులై పారినందు వల్ల
ప్రజా ఉద్యమం నెలకొంటుందనేది భ్రమేనా?
అంతిమ విముక్తిలో అస్థిత్వాల జాడ
అప్పటి దాకా ఏం చెయాలి?
లెనిన్ చెప్పి వున్న జ్ఞానమా!
అచ్చంగా ఇప్పటికిప్పుడు నాకొక తెలంగాణ కావాలి
వనరుల మీద పెత్తనం పోవాలి
ఒక సందిగ్ధ సంధ్యలో
ఒక ప్రాంత
ఒక స్థానిక

ఒక జాతి
ఒక అణగారిన ఆత్మ ప్రతినిధి ఎవరు?
తెలంగాణంటే భౌగోళికమా?
ప్రజాస్వామికమా?
అంతిమ విముక్తా?
అటెంకా తీర్పు
నాదే అయిన ఊట చెలిమ సంస్కృతి
నాదే అయిన ఆట నాదే అయిన మాట
నాదే అయిన పాట నా మనాది...నాయాది...
ఎవడి బిడ్డ గోచి యాతన వాడిది
ఇప్పటికే ఉలిక్కిపడ్డ పీడకల
చెర్లరాయి పడ్డ అలల ఉలికిపాటు
బానిసత్వం మృత్యువుకన్నా శీతలమైంది
ఎవడి ప్రాంతంలో వాడు పరాయి కావడం
ఊపిరాడని ఉత్పాతం
మరో మార్చింగ్‌ను మరో ఊరేగింపును
మరో మోహరింపులు
మరో జంగ్‌ను....కలగంటున్నాను
శివాలు తూలుతున్నది శివసత్తి
మేడారం వంతెన మీదుగా ఎదురెక్కిన
సేపలదండు అదృశ్యమై పోయి
సిలుకల గుట్టెక్కిన సమ్మక్క గద్దెనెక్కుతున్నది
ఒక పురాయాది జంపన్న వాగు పొర్లుతున్నది
జలజలా జనం... ఇక రాదు ఇక కాదు
ఇప్పుడే... మరి లేదు... మరిలేదు...
ఔర్‌ఏక్ దక్కా...
ఒకే ఒక నినాదం జై తెలంగాణ

*ప్రజాతంత్ర సాహిత్య సంచిక, ఏప్రిల్, 2002*

# ఇది వంద యుద్ధాల ఒడి

● *జయధీర్ తిరుమలరావు*

సన్నాయి రాగాలు
కిన్నెర గానాలు
ప్రకంపనల పల్లవులవుతాయి
పచ్చని పండంటి పైరు పొలం
ఏడాదికి సరిపడే ధ్యానపు గుమ్మి
దగ్ధ గీతిక అవుతాయి
ఉరుములు మెరుపులు
గుడిసెలోని పెన్ను - పొలంలోని కంచె
గావుకేకల వేదిక అవుతుంది
ఇది వందయుద్ధాల రాగాల మడి
ఆకాశం నుంచి రాలిపడే చినుకులు
మబ్బుల్లోంచి జాలువారే చాందినీ
భూమ్మీదికి చేరేసరికి
పెటిల్మని పగిలిన శిథిలాలవుతాయి
పారేది ఈ నేల నదులు
ప్రతిఫలపు పంట ఆ కోన
ఈ విషమ అసమ రాజకీయార్థిక శాస్త్రం
ఒక తీతువై ఎలుగెత్తుతుంది
దేశానికి ఒక కొత్త పాఠ్యం బోధించదానికి
వ్యాకరణాన్ని తిరగదోడే ప్రణాళిక సంసిద్ధత
ఇది వందయుద్ధ పల్లవుల గీతం
అవునూ ఇక్కడ యుద్ధం లేని రోజుందా
నాలుగు మహా రాజవంశాలు

ఈ యుద్ధభూమిలో జనించి
యుద్ధరంగంలో పెరిగి
యుద్ధ సంస్కృతిలో విస్తరించి
యుద్ధంలోనే కదా చరిత్రె పరిమళించింది
కటకం నుంచి కన్యాకుమారిదాక విస్తరించిన
దండనాధులు ఈ నేల కూనలే
ఇవ్వాల రాజకీయమై
పెట్టుబడై, ఆధిపత్యమై
వారే ఈ నేలని క్షతగాత్రం చేస్తున్నారు
విజేతలై విజయాలై జైత్రయాత్రలైన
బక్క పలచని గోసిగాళ్ళు
మరో చోట సెంటు భూమి నాదన్నారా?
గోదదాటి గోమాతల పాలు పితకలేదు
గోదదూకి గోడల పెరళ్ళనాపలేదు
నాలుగు మహారాజు వంశాలు
ఈ నేలమీద అదుగెట్టి
మతాన్నో మైసమ్మనో
కులాన్నో కూదుగుడ్డల సంస్కృతినో
ఎగతాళి చేసినందుకు
ఒట్టు
ఏ పొలం గుట్ట కింద భూగర్భంలో
ఓడిన ఆధిపత్యపు ఆనవాళ్లైనాయి
ఢిల్లీ సుల్తానా, గోలకొండ ప్రభువు
నైజాం నవాబు, ఆంగ్లేయ ప్రభువూ
ఎవదు నిలిచాడిక్కద?
రోహిలా సైన్యాలను చీమలు తమ పుట్టల్లో
పడదోసిన దృశ్య పేటిక ఇది

2

వేల ఏళ్ళ భాషా సౌందర్యం కంకానికి
ఏభై ఏళ్ళ సాంకర్యపు కంటకమాల ఇనాం
భాషంటే జీవజనం - జనజీవం
యాస పేరుతో దూషించేవాడా
నాలుక నాలుగు ముక్కలవదా?
ధూర్తత్వం ముళ్ళ కంచెల్ని చేసి
నా చుట్టూ నిర్విరామంగా నిలిపి
సెంటువాసన పైకి పూసి
ముంతపొగ కసిగా వేస్తూంటే అనిపిస్తుంది
దారి దోపిడిగాళ్ళయినా బాగుండేది
ఆభరణాలు అప్పగించే వాళ్ళం
బందిపోట్లయినా బాధుండేదికాదు
సర్వసంపదలని వొలిచి ఇచ్చి
సంస్కృతినైనా దక్కించుకునేవాళ్ళం
మాతో పాటు
తినడానికి వచ్చి
ఇక్కడి నీళ్ళు తాగి సేదతీరడానికి వచ్చి
ఇక్కడ జీవ సంస్కృతిలో
సహచరులుగా వచ్చి
నీ పిల్లని కోడలిని చేసి
నా వంశాంకురాన్ని దత్తత తీసి
కలగలిపిన కవలలమయ్యాక
కూడిన డబ్బు వడ్డీపేర పేర్చిన సంపద
రాలే చెమటని పారే కరెన్సీ నదిగ చేసి
నేలని కొని ఊళ్ళని కొని
అడివిని అన్యాక్రాంతం చేసి....

ఇప్పుడు దృశ్యాల్లో అక్షరాల్లో
నా భాషకి వెక్కిరింతల భాషని సాంస్కృతిక ఆధిపత్యరూపం చేసి
నా కవచాన్ని బయటపెట్టిన ఎకసైక్కాలతో
ఎక్కుపెడుతున్నావు పరీక్షించకు ఆక్షేపించకు
ముళ్ళ పక్షస్థలాన్ని కౌగిలించలేనందుకు వగవకు
నువ్వెప్పుడైనా నా బతుకమ్మ పాటకి పల్లవైనావా
నువ్వెప్పుడైనా కొమిరెల్లి మల్లన్న 'పట్నం' చూశావా
నువ్వెన్నడైనా సమ్మక్క జాతరల భాగమయ్యావా
నువ్వొక ఎలియన్‌వి ప్రజల్ని పరాయికరించిన రూలర్‌వి
మా బతుకు మీద చావు దెబ్బలు పడినా
అయ్యో అనని ధీరోదాత్తుడివి బతక వచ్చిన తమ్ముళ్ళ కోసం
మా అమ్మ వడిని పరిచే ఉంచాం
వారు మా ఆత్మీయ పచ్చకార్డులు
బతుకుల్ని కొల్లగొట్టే బిగ్‌బ్రదర్లపై మాత్రం
రుధిర బిందువులమై ఘనీభవిస్తున్నాం
యుద్ధారంభపు సమాధిస్థితి ఇది
ప్రజారాజ్య నినాదానికి తూట్లుపడ్డ
విశాలాంధ్ర ఉందా ఇప్పుడు?
ప్రైవేటు వేటు మా పేగుల్ని మెలితిప్పుతుంటే
రాజ్యాన్ని మీ భాగ్యాన్ని రక్షించుకోండి
ఆత్మయైన మా భాషని, గౌరవమైన పాటని
మా చిందునీ బైండ్ల కథల్ని
మా ఒగ్గు ఢమరుకాల్ని మాత్రం మేం దాచుకుంటాం
ధనిక దోపిడి కూలదోసి చిన్న నేల మీద చిన్న ప్రజల అధికారాన్ని
పెద్ద ఎత్తున నిలిపే
మరో యుద్ధానికి కాకితో కబురంపితే మాత్రం
సిద్ధంగా ఉంటాం.....

*తెలంగాణ రాస్తా, 13, ఏప్రిల్, 2002*

# గాజువాక పోకిరోళ్ళం కాదు!

• సహవసి

గాజువాకే పిల్లామాది గాజులోల్లమే పిల్లామేమని
ఆడపోరలెంటబడి వేధించే
నీచ సంస్కృతి మాకొద్దు...
సిరిపురమే పిల్లా మాది చీరెలోల్లమే పిల్లామేమని
చీరెలిస్తే చిత్తకార్తె శునకపు
చేష్టల్ని మాకంటగట్టొద్దూ...
మేం మెదిన్ 'ఆంధ్రా' స్టూడెంట్సో
గాజువాక పోకిరోళ్ళమో కాదు....
పట్నం నుండి పల్లెదాక విస్తరిస్తున్న
మీ సామ్రాజ్యవాద సినీ (చ) సంస్కృతికి
పరమగీతం పాడే తెలంగాణ పల్లె తల్లి
మానాల కనుపాపలం...
గాజుల గలగలల వెనుక ఒట్టిపోయిన వెట్టి జీవితాన్ని
పంటిమీద రైకగుడ్డగ్గతిలేని తల్లి చనుబాల చేవతో
ఆకలి పేగుల్ని నూలుపోగులుగా అతికి
చీరెల్నిస్తున్న సిరిసిల్ల సంస్కృతి మాది...!
మీ ఒంటి కంపునొదిలించడం కోసం
మా స్వేదాన్ని పరిమళంగా సబ్బుల్లో నింపుతూ
నిత్యం మా వళ్ళంతా పెంకుల్తో రుద్దుకుంటున్న వాళ్ళం
సబ్బుల్తో ఆపోళ్ళ వీపుల్ని రుద్ది...అందాల పోటీల్లో
అంగాంగాల్ని దోచే మీ మల్టీనేషన్ క(ప)వర్‌కల్చర్‌ని
కొవ్వెక్కిన పంటి పొరల్ని .....పొగరెక్కిన మీ కంటితెరల్ని
మా తెలంగాణ శ్రమసంస్కృతితో శస్త్రచికిత్స చేయాల్సిందే

*అవ్యాపమూల, ఏప్రిల్, 2002*

# ఇసం నీళ్ళు

● మోతుకూరు శ్రీనివాస్

నీళ్ళన్ని ఇసమెక్కినయ్
ఒంట్లెబొక్కలన్ని సుట్కపోతుండె
సవుట నీళ్ళు తాగితే
ఒల్లెలుపున నెత్తురు సచ్చి
పెదవులమీద తుమ్మ పూలు పూస్తుండె

ఏరు పురుగు తాకినట్టు
ఎక్కడి మన్ని అక్కన్నే కూల్తుండె
పిలగాండ్లు నకిరెంబట్టి పోతుండ్రి
భూమి అంత పులిసింది
ఇత్తు మొలుస్తలేదాయె
మస్క సీకట్ల
ఏడుసుకుంట కూసుంది మా ఊరు
మాట్లాడకుంట కూసున్న
మా నాయినమ్మ లెక్క

తలుసుకుంటెనే కండ్లపొంటి నీళ్ళు
పటా పటా దునుకుతుండే
తుమ్మ ముల్లు దిగినట్టు
పానం తింటుండే
నోటి కాడి నీళ్ళన్ని
పొట్లాలు కట్క పోతుండ్రు
పటువలన్ని ఏడుసుకుంట కూసున్నయ్

*ముల్కి, ఏప్రిల్, 2002*

# కొత్త తోవ

● మడిపల్లి రాజ్‌కుమార్

కండ్లల్ల వొత్తులేసుకు జూస్తున్న ఊరు
మొండి మొగులు చిన్న తెప్పైన జూడలేదు
ఉన్న దూదివాము మబ్బు కరుగుడు కల్ల
సుక్క రాలుడు కల్ల

పొలంనాల్కె పంటకాల పిడసకట్టుకుపాయె
వొరి గొల్సులెయ్యకమునుపె గొడ్రాలిగ ఎండవట్టె
బుడిబుడి నడకల ఎండ్రికాయలు
ఒడ్ల పొక్కలిడిసి తూములకుర్కవట్టె
తూముకింద రాల్ల నడిమిట్ల
బెల్లంగొట్టిన రాయోలె గోంద్రుగప్ప

ఈ పాలికి పొల్లగాండ్లు చెర్ల మెరుపులు పూయించెటోల్లు
పాడుకాలమొచ్చి మర్రినీడల్ల వూగే వూడలైపోయిరి
గడ్డిపోచ కరువై
గుట్టకోటి చెట్టుకోటైన గొడ్డుగోదా

చెరొడ్డున మూతుల్లేని కాగులు
పొయిరాల్లు యిడిసినై
ఉతుకులు లేవు ఊపిరి విసురులు లేవు
యిరుగ మరుగ పెరిగిన బేషరం చెట్లు
యాడనో ఓ కాడ
గుంటలల్ల కప్పగుడ్లకళ్ల బురదనీల్లు గాక
ఏమున్నయ్ చెర్ల?

పొద్దుగూకె పొలికే పల్లెకట్టం
పచ్చగడ్డి మోపునో పళ్ళకాయల గంపనో
ముల్లెనో మూటనో నెత్తికెత్తుకు ఇల్లు చేరేది
కరువు కాలం పొడుగాను
తల్లుల తలలకు నీల్లకుండలు మొలిపించె
అడీల తోవ తప్పిన మనిషి ఏదో తోవల నడుస్తనే
వోతడుగని నడకనాప్తడా?

ఊరేగింపుగా ..
అనుమాండ్లకు గంగనీల్ల తానాలుపోసి కొత్తచందూరం రాస్తిరి
లింగానికి గంగనీల్ల చిల్లుకుండలు కట్టిరి
పిల్లగాండ్లు రోకలికి కప్పనుకట్టి
"కప్పతల్లి . .కప్పతల్లి ....కడుపునింపు
చాటెడంత మొగులు చేసి చెరువు నింపు
కప్పకు తానాలు పోస్తిరి - పసుపుకుంకాలు చల్లిరి
ఎన్ని జేస్తిరని
ఊరికి పండుగొచ్చినా కష్టమొచ్చినా దేవుడేకదా!

దారులన్నీ మూసుకుపోయి
పురుగుమందు తాగిన ఊరు
గిప్పుడిప్పుడే
కండ్లల్ల వొత్తులేసుడాపి మెదడులో వొత్తులేస్తున్నది
మొండి మొగులును కాదు
నేలను జూస్తున్నది
నేలపై జరుగుతున్న మోసాన్ని జూస్తున్నది
తోవలన్నింటిని కాదని
"కొత్త తోవ తవ్వుకుంటున్నది

*పొక్కిలి సంకలనం, మే, 2002*

## కొంచెం మాట్లాడుకుందాం

• *ఉదారి నారాయణ*

ముఖం మీది చమటచుక్కలు
నేరాన్ని రుజువు చేశాక
రహస్య మెందుకు!
కన్రుమొనకు కపాలం చెప్తున్న
కథల గూర్చి చర్చించుకుందాం

రోకలి గోరుచుట్టుకోసం సిద్ధమైంది
యుగాల ఉక్కుపాదాన్ని
పంటిమొనపై భరిస్తూ
మృత్యుకుహరంలో సగం చొరబడ్డవాణ్ణి

ఇక భయంలేదు నిజం చెప్పు?
నన్ను దగా చెయ్యలేదా నా దేహాన్ని చలిమంటలోమాడ్చలేదా
నా నేలని ఎడారికప్పగించలేదా?...

నేడు నా తెలంగాణ రక్తరాగాల వీణ
నా పల్లెతల్లి వల్లకాదుకు కన్నతల్లి
ఉడుకునెత్తుటి మంటకు తోలు సంచి చిట్లుతున్నది
అంతరాంతరాల్లో దగ్ధమవుతున్న
నిజం నిప్పై రాజుకుంటుంది

ఇక నన్ను విధూషకున్ని చేయడం
అంతా సులభం కాదు ప్రవాహం సైతం
బలాత్కారం నుంచి తప్పించుకునే
పసి మొగ్గ ప్రయత్నంలా వుంది
మరి నేనో...

*పొక్కిలి, మే, 2002*

# సాయుధజలం

• *నాళేశ్వరం శంకరం*

జలపాతం గొంతు విప్పి పిలిచింది
దాచుకున్న మానవీయ మమకారాన్ని కానుకగా ఇచ్చింది
వువ్వెత్తున ఎగిసిపడే అలల ఆత్మనూ
వానస్వరాలను జలపాత గానాలనూ, సెలయేటి సవ్వడులనూ
సముద్రాంతర సంగీతాలనూ జలశృతి పేటికనూ బహుకరించింది

ప్రాణాపాయ సందర్భంలో ఆవిరైపోవలసిన రహస్యాన్ని
ఘనీభవించే సంఘటనలో ద్రవీభవించే నేత్రాన్ని
పల్లాన్నిబట్టి నడవాల్సిన నడకల్నీ
ఎత్తునుబట్టి మట్టాన్ని పెంచుకునే శక్తినీ
యెదురయ్యే రహస్య రహదారుల్లో
రాళ్ళకూ అడ్డుతగిలే రప్పలకూ యెడంగా నడుచుకునే శీలాన్ని
అవసరమైతే తరిమికొట్టగల ధైర్యాన్ని ప్రసాదించింది

తల్లి నాకు జన్మస్థానమైనట్టు
జలగర్భానికి జన్మస్థానం సముద్రమే!
పంచేంద్రియాలలో కలిసి జీవించే
సాయుధజల త్యాగాల్ని స్మరించుకున్నప్పుడల్లా
జలపాత స్వగతంలోనే మునిగిపోతాను
నీళ్లనూ కన్నీళ్ళనూ విడదీసే కవిత్వరసాయన క్రియనైపోతాను

జలంమీద కూర్చుని జలసమూహంలో కదిలే
చేపపిల్లల కన్నీళ్లను కవిత్వీకరిస్తాను
నీళ్ళతాళ్ళతో పేనిన ఉయ్యాలలో ఊగినప్పుడే ఊహించాను
ప్రజల ప్రాణవాయువులో జలసాయుధుడి

ప్రాణవాయువు కూడ మిళితమై ఉందనీ
అఖండ అగ్నిగోళపు అనలాన్ని తనలో యిముడ్చుకోగలదనీ
మానవ ఆనందాశ్రువులలో మలినం కాకుండా
బతకగలదని గ్రహించగలిగాను

జలమనో విలయంలో నేల తన
అవయవాలను భద్రపరుచుకుందో
లేక జలవనరులను అజ్ఞాతంగా తనలో
దాచిపెట్టుకుందో చెప్పలేను కానీ
దాని జలాత్మలో మునిగితే తప్ప సమస్త ప్రాణాత్మను అర్థం చేసుకోలేం
జలజీవితం సముద్రంలో ఉన్నంత కాలం స్థిరమైందే కానీ
అది నదిలోకి అడుగిడినప్పుడే తెలుస్తుంది
అదెంత చలనశీలం కాగలదో దాని జీవనాడిని బట్టే తెలుసుకోగలం
అలిసిన జలం యేదోవాక కొండమీంచి
యేకాంతలోయలోకి స్నానం చేస్తున్నప్పుడు
సుఖభోగ మేధావులు దాని జలపాత కురులలోంచి
నగ్నదేహాన్ని చూసి చూసి వివశులైపోతారు
హృదయ మేధావులేమో
జలానికి ఫౌంటేన్ జరీజలధారల వేషం వేసి
విద్యుత్ జల్దకాంతి నక్షత్రాలను కూర్చోబెట్టి
జలం చేత జలనృత్యం చేయిస్తూ మురిసి మురిసి పోతారు

తొలకరి వానజల్లై ఇంటిముందు కల్లాపి చల్లినప్పుడైనా
మట్టి సుగంధాన్ని మనోపరిమళంగా దాచుకోవాల్సింది
ఆకుపచ్చని దాని అరణ్యగృహంలో అక్షరాభ్యాసం చేయాల్సింది
ఆకాశం విసిరిన సూర్యబంతిని పట్టుకోలేనప్పుడే కదా
ఈ నిత్యజలాటగాడు శతకోటి సెంచరీలు కొట్టి
ప్రజల గెలుపునకు పాటుపడుతున్నది

ఆదిమ అర్ధనారీశ్వర జాతిని ప్రేమించింది ఈ జలకన్యనే కదా
లక్షల యేళ్ళ బట్టి అజ్ఞాతపు సముద్రంలో
మంచుబండలా బతకబట్టే కదా
మనకింత భూమి మిగిలింది మనకింత సంపద మిగిలింది
ఈ ఎడారి యిసకలో సైతం నిషేధానికి గురైనా
ఒంటెల పొట్టలో యేలా తలదాచుకుంటుంది యిప్పటికైనా గుర్తించాలి
జలప్రాణం జలానిది కాదు మనందరిది
ఇది నేల తనువులోనే కాదు మన తనువులోనూ మనకోసం
జీవిస్తున్నది
మోచేతినీళ్ళు తాగి పాలించే పాలకులు కూడా
సాయుధజలంతో చర్చించకతప్పదు చర్చలను సఫలం చేయకతప్పదు
ప్రజలకోసం జలవనరులను రక్షించుకోకతప్పదు!

*ఆదివారం వార్త, 7, జూలై, 2002*

# రిచ్చపిట్టలు

● అనిశెట్టి రజిత

ఇన్నొద్దులు పులికూనలు మాయన్నలు
పిల్లులోలిగె మజ్జుగ ముడుసుకున్నరు
ఉన్నొద్దులు బూమి బిడ్డలు మాయక్కలు
సోయిదప్పి సుస్తిగపన్నరు
గది జూసి గా కొంగ్రీసుగాల్లు
మాటేసి ఏటాడిగ్రు
మన మూల్గులు పీల్చి డొల్ల జేసిన్లు.

గిప్పుడు దునియంత సుత ఏడీసురోగం
బయ్యంతోని సస్తాంది గని
నాకైతె మరి గసొంటి సోడిగాళ్ళ తోటి
గిన్నేండ్లు సోపతి జేసిన మన
సావుదైర్నానికే ఇచ్చంత్రమయితాంది
వావ్వో పాములను పక్కల పండేసుకోని
ఇసపు కాట్లతోటి ఇంక బతికున్నమంటె
ఇచ్చంత్రం గాదు మరి

నరాలన్ని పుటుకు పుటుకున్న తెగినయి
బొక్కలన్ని సున్నం సున్నమయినయి
పెయిమీన మాంసం సచ్చి తోల్జాగుతానయి
ఒక తిప్పలగాదు
పూర్త శెడంగసుత ఇంకింక నమ్మినందుకు
నడ్డిలిరిగి న్యాలబాకుడు గతైందిగని
ఇంగేం మిగిలింది బొంద....బొచ్చా!
సడాలు సచ్చిన యవ్వారాలిడిసి

ఇగ సోయిల కొత్తాన్లు మనోల్లు
లొల్లిల కలుతాన్లు
చల్ పొమ్మని సీత్కారం జేస్త
ఇగ ఇడమర్సి వైలల్ల రాస్తాన్లు
పొడుసుకచ్చె పాటలు పాడుకుంట
ఉడుకు బుట్టే సబలు రాజేస్తాన్లు.

పచ్చీసు పుంజీతం కచ్చగాయలు
ఒనగుంటలు సిర్రెగోనెలాటలను పునుకుతాన్రు
ఈలపీట కొడవలి బాడిస గడ్డపారలు
దాలి ఒత్తు మంగులం ఇసుర్రాయి
కొప్పెర గోలెం గంగానం వాడకంకు తెస్తాన్లు
తలెముంతలు గురిగిగూనలను తడువుతాన్లు
కలంబలి గంజిగట్క రాగుల జావను
వట్టిసాపల కూర పచ్చిపులుసు ఇప్పకుడుములను
ఎల్లిపాయెకారం సింతపండు తొక్కును
ఎంతో ఇష్టంగ విందులు జేస్తాన్లు

గిప్పుడు ఎవలది వాల్లు పంచుకునుడె సైయ్యని
ఎవలిచ్చ వాల్లు బతుకులెంచుకునుడిగ జరూరేని
కెక్కరెల్ల మెక్కిందిజాలు ఇగ తప్పుకోండ్లని
తొండిజేసిన మొండోల్లమీన్కి కలెబడెనీకి
ముక్కులు చెక్కు తాన్లు
గాల్ల దమాక్‌లు దిమ్మదిరిగేటట్లు
రచ్చకెక్కి రిచ్చపిట్టలై ఒర్రుతున్లు
దూమ్ దూమ్ జేస్తున్లు
దుమారమై లేస్తున్లు

*తెలంగాణ రాస్తా బుధవారం, 21, జూలై, 2002*

# గుక్క

● కాసుల ప్రతాపరెడ్డి

దుగుట్ల రూపాయి
నీ మొగుడు సిపాయి
సీతాకోక చిలుక రెక్కల మీద ఆశల ప్రయాణం
పాదాలకు నేల తాకదు
భూమి మీద అడుగు ఆనదు
కొండ మీది కోతిని పట్టుకుంటవా?
చిట్టడవిలో దూరిన పాము పాలు కార్చింది
పిక్కల పైదాక ముతక చీర కట్టి
నాటేస్తే చూశాదే నా షోకు
నల్ల నల్లదాన్నని
ఒల్ల ఒల్లావనలేదు
కన్నుల్లో బుస బుసలు కనిపించని
గుండెల్లో బాకు దించనీ
పొయ్యి మీదికి ఎసరు పెట్టి
పొయ్యి కిందకి వెతుక్కున్నట్లే...
వంచిన నడుం ఎత్తుడే లేదు
యాష్ట పడిన బతుకు మీద పల్లేరు గాయాలు
ఎవడు వాడు ఎదుటి వాడు
ఇటు వచ్చిన నల్లవాడు
ఎవడెందుకొచ్చిండో ఎరుక లేదాయె
కాకితో కబురైనా పెట్టకుండా వచ్చిన చుట్టమని
అంగలార్చి అక్కున చేర్చుకుంటే
నా నల్ల నల్లని రేగళ్ళ మీద పచ్చి పుండ్లు పడె
మల్రెడ్డీ నిరంజనా!

దారి తప్పిన యవ్వనమో దారి చూపిన ఆవేశమో!
ఏమి చెప్పుదు, ఏమి చెప్పుదు
ఆగమైన బతుకు అడవి దారి పట్టిందా, మల్రెడ్డి!
కల్లు తాగిన కోతినయ్యావా మల్రెడ్డి
ఊరు పొమ్మంది, కాదు రమ్మంది
కాట్లె గలిపిన బతుకు కాటికే చేరింది
పాలల్ల నీళ్ళుకలిపినట్టు
వర్గంలో కులం కలిపినావా, పాపయ్య!
ఏ యేషం నీదని అడిగితే
కరుణాకరంటివో, నిరంజనంటివో!
ఏమేమంటివో, ఎటెటు పోతివో!
కొరివి దయ్యం దారి చూపితే పోసయ్య!
బోనగిరి గుట్ట కింద నట్టనడని పట్నం
పట్టపగలు నీకు బొందలగడ్డయ్యేనా?
నువ్వు పాలు పోసి పెంచిన నాగులే నిన్ను కాటేసేనా?
శెట్టర్ల అరచేతులడ్డం పెట్టి సూర్య కాంతినాపేశారా?
భుజాల మీద దర్జాగా బైరాయించిన బేతాళుడు
జారిపోయి చెట్టెక్కె కదా!
చినిగిన బట్టలేసి కుట్టిన బొంత ఈ నేల
మొగులు కింద గన్ను కోలాటాలు
పెయ్యంతా తూట్లే, తూట్లు
ఊరు ఊరంతా కానీ బడయిందా?
బడి పంతుళ్లు ఒక్కరా, ఇద్దరా?
కోదండముండది, గోడ కుర్చీ వుండదు
బొందితో కైలాసం ఖాయం
కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది
యాది చేసుకుంటే బొండిగ దాటని వెక్కిళ్ళు
పజ్జొన్నల పిసికిళ్లు

కాల్చుకు తిన్న సిల్పక్కాయలు
పచ్చి పుండు మీద పురుగు మందు
పొలాల నిండా కొయ్యకాళ్లే
పర్రె కాలువలేని చెరువు ఊటలేవి?
మింటికి, ఒంటికి ఏకధారగా కురుస్తున్న చీకటి
రెక్కలిరిగినై కాల్లు విరిగినై
చిలుకెగిరి పోతున్నది ఎగిరిపోతున్నది
వాసాలు అందుకుని
ఊగరా! ఊగరా
ఉరి పెట్టుకుందెవరు? ఉసురు తీసిందెవరు?
నేనెరుగ,నేనెరుగ
ఏలినోడినడుగు, ఏలుకున్నోడినడుగు
కరువా, కాటకమా, ఆకలా కడుపుమంటా
కాదు కాదోయే మల్లన్న చేవ చచ్చిందంటడు
అక్కడేసిన గొంగడి ఇక్కడెందుకంటే
భయంగల్ల కోడి చెలకల్ల పత్తి వేసినందుకు
గాంధీ యెవరు? వినోబా యెవరు?
చరఖా తిప్పిన పోచంపల్లీ, పోచంపల్లీ!
దారం పోగులు ఉరితాళ్ళయినయే తల్లీ!
భూమి దానం తీసుకున్న బిచ్చగాడెవడో
భూమిని చుట్టేసి చంకన పెట్టుకుందు
చెంగు చెంగున దూకిన జింక పిల్లను
పొట్టనపెట్టుకుందెవడో
కట్టుకథలల్లిందెవడో, కాకమ్మ కబుర్లు చెప్పిందెవడో?
పాతాళగరిగె వేస్తే దొరికే గాయాలెన్నో
చెవుల్ల సీసం, కండ్లకు గంతలు
నోటికి తాళం కప్పు...
ఎక్కడి దొంగలు అక్కడే గప్‌చుప్

మంత్రమేసేనో, మాయ చేసేనో, మరుగుమందే పెట్టెనో
ఆత్మ పంచదరంలో పిట్ట
కదం తొక్కుతూ, పదం పాడుతూ
ఎర్రెర్రని పలుకులు, ఎదురొడ్డిన రొమ్ములు
వీర భక్త హన్మంతులు
గుండె చీల్చుకుంటే సూర్యుళ్లే
నిన్ననా, మొన్ననా, ఆవలి మొన్ననా!
కాలచక్రం కింద పడి నలిగిన దేహాలెన్నో
పుట్టలో చేయి పెడ్తారా నా బిడ్డలూ!
పాల పిట్టలై చస్తారా నా బిడ్డలూ!
కాష్టాలగడ్డ మీద ప్రేతాల ఊరేగింపు
ఏక్ దో తీన్ చార్ పాంచ్ పఠానా
తెలంగాణ నెత్తి మీద డోల్ బజానా!
ఎవరికి పుట్టిన బిడ్డరా అంటే
ఎక్కెక్కి ఏడ్చే తల్లి
ఏ గాలి సోకిందో.... ఏ తూర్పు గాలి విసిరిందో
కాకులు దూరిన ఇల్లు
గుడ్లగూబలు చేరిన ఇల్లు
ఉప్పు గల్లు తీసి తల చుట్టూ తిప్పి
నిప్పులయేసి దిష్టి దియ్యనమ్మా

నారు పోసినోడికే నీరు లేదు
నాగలెట్లా కట్టనమ్మ గొర్రు తోలనమ్మ!
నాగులోల్లింటి కాడ నల్ల తుమ్మ చెట్టు కింద
నాగులేమన్నాడో శాపమేది పెట్టాడో
విషమై పారుతున్న పాతాళగంగ
కాల్లొంకర, కండ్లొంకర

పసి పోరగాళ్ళయినా పండ్లిగిలిస్తే నల్లని గారలు
నెదర్లాండా! నెదర్లాండా!!
పథకాలకు, పాతరేసి, పైసలెత్తుకుపోయిన గద్దలు

తోక చుక్క పొడిచింది
తోడు లేని బతుకయింది
కుదుట్ల వడ్లుపోసి రోకలెత్తి పోటు వేద్దామా!
గోరుకొయ్యల పొదుపు చూసి మోటలే కడుదామా!!
గంప కింద కమ్మిన కలలయ్యేనా!
పోటు తప్పదు, పాటూ తప్పదు
పాట కాటు వేసిందా, దేవులాటే దీవెనయిందా?
ఎందుబోదు, ఎందుబోదునమ్మో నా తల్లి
పాడెతో పాటు అడుగులేసుడే బతుకాయెనో, నా తల్లీ
వొరం తియ్యలేదు, వొరం పెట్టలేదు.
మునుమెట్లా పడుదునో! కలుపెట్లా కలుద్దునో!!
అంబెటాల్ల దాటె, ఎసర్రాల్ల ఎక్కొచ్చె, దూపకేదమ్మో?!
నొష్టి రాత మారదు, ఉప్పుగల్లు పుట్టవు
గుడ్లల్ల నీల్లు దోసిట్లపట్టి, డొప్పల నింపు!

మొగులు మొగులంతా తెల్ల దెయ్యాల ఆట
నల్లవాడె, అమ్మమ్మో ఎంత గడుసరివాడె
రథం తోలడు, ఉరుము ఉరుమదు, మెరుపు మెరవదు
చెరవుల గొలుసులుండె కదా!
నీటి మూటలే పట్టి పెట్టే కదా
దొంగలు పడి ఆరు నెలలే అయిందో
ఆరు పదులే దాటిందో!!
వచ్చినవారు ఫల్గుణుడు కాదాయె!
ఇంకుడు గుంతల కథలు చెప్పవట్టే
ఇగురమేడ నేర్చెనో, గారడీలెవడు నేర్పెనో

అన్నా హజారే అక్కరొచ్చునట
పుట్టి బుద్ధి నేర్చింది కాదు
బుర్రలో పుట్టింది కాదు
దాగుడు మూతలు దండాకోల్

గ్లోబల్ విలేజ్, గ్లోబల్ విలేజ్!
ఏడేడు సముద్రాల ఆవల
పటేలు, పట్వారీలు వాడి పక్కనున్నరు
ఇరుకు ఇరుకైతుంది, మొసెల్తలేదు
నెత్తి నోరు కొట్టుకుంటివా, నా తల్లి

మిగిలిందేమిటి, మిగిలేదేమిటి?
బూడిదకుప్పలు గుట్టలు గుట్టలు!!
మంత్రాలకు ఓట్లు రాలిస్తివి
మాటలకు సీట్లు ఇస్తివి
చంకనేసుకొని ముద్దు జేస్తివా
పాలు తాగి రొమ్మే గుద్దెనా?
కొనబోతె కొరివి, అమ్మబోతే అడవి
తల్చుకుంటె పుట్టెడు దుఃఖమొచ్చె
లేచిన యాల్లేదో, చూసిన మొకమేదో
చెప్పుకుంటే సిగ్గుపోతది
చెప్పకుంటే మానం పోతది
తైతక్కలు, తందనాలు
బుడుబుక్కలాటలు, తోలుబొమ్మల సయ్యాటలు

సత్తెవ్వా! సత్తెవ్వా!!
నీకు తెల్వదు గాక తెల్వదు

నిజం దేవుడెరుగు, ఏలుతున్నోడెరుగు
తండ్లాట, పొర్లాట, తల్లడమల్లడమే
అప్పుడా, ఇప్పుడా
దాడీలనాడు, దండు మొదలైంది
చెర మొదలైంది చేటు మొదలైంది
వాగుల్ల వరదల్ల, ఎండల్ల వానల్ల
రెక్కలు ముక్కలాయె, బతుకుల రేగల్లు మొలిచె
పటేలా, పటేలా, రామయ్య పటేలా!
కడుపుల మంట కండ్లల్ల ఎగిసి పడె
మోట కాలువల పట్టిన రొయ్య పిల్లలేవి?
పచ్చి మిరపకాయల పచ్చి పులుసేది?
వేసిన తడక వేసినట్టే వుంది
కండ్లల్ల మన్ను కొట్టిందెవడు?
కైలి కోడెను దొడ్డి దాటించెనెవడు?
దొడ్డి నింపిన దొరావు
కాడి మీదికి కోడెనిచ్చిన ఆవులు
దొడ్డి దొడ్డంతా పీనుగుల పెంట
ఏనాటిదేనాటిది?
కట్టిన ముడుపులు తీర్చలేదు
సిద్ధుల గుట్ట కాడ కోల్లాగనొదల లేదు
మర్మానమొచ్చినోడు మదమెక్కి కూస్తుండు
కావాల్సిందిప్పుడు యిదుపు కాయితాలే
ఆగమాగమైంది, తీన్ తెర్లయింది
కాగుల్లేవు, గుమ్ముల్లేవు
పోసేందుకు ఇత్తు లేదు
కాలుగర్ర వద్ద తల్లి, కుక్కి మంచమెక్కిన తల్లి

వానదేవుడో, వర్షదేవుడో
ఒక్క చుక్కయినా రాల్చిపోడో..
వాగుల్లు వంకల్లు, ఉసికె లేని లొందలు
వరదగూడు కడ్తలేదు
మొగులైతలేదు, చినుకు రాల్తలేదు
సాగువాటు లేదు, సల్లని సూపు లేదు

అవ్వా, సత్తెవ్వా!
పుట్టిన యాల్ల మంచిది కాదంటివి
లక్ష్మిదేవత గడప దాటిందంటివి
జెష్ట దేవత తిష్ఠ వేసిందంటివి
ఇండ్లల్ల పీనుగులెల్తున్నై, పనగట్ల ఆడుతున్నై
జానెడు పొట్ట కోసం జెర్రిపోతుల ఆట
నేనేమి చేతునమ్మో నేనెందు బోదునమ్మో!
పుట్టిందెక్కడో, పెరిగిందెక్కడో
బతుకు బజార్ల పడ్డది
పీరు లేస్తలేదు, ఊదు కాల్తలేదు
నిప్పులగుండం చుట్టూ ఒకటే గెంతులు
సోది చెప్ప వచ్చిన తల్లి
శాంతి చేయాలంటున్నది
కాగల కార్యం తీర్చే గంధర్వులేరి?
బాలనాగమ్మవో తల్లి, తెలంగాణా!
చెర విడిపించిన బాలవద్దిరాజేడి?

నెత్తి మీద గద్దలెగురుతున్నై
కాళ్లకింద బొక్కలు తేలుతున్నై

చేతికందిన కొడుకులు
కలేజా ఉన్న కొడుకులు
చెట్టుకొకరు, పుట్టకొకరు
కాకపోతే రాజ్యాల పొంటి-
దచ్చన్నదారిలో దచ్చన్నదారిలో
గూడన్న చెరడేమో దచ్చన్నదారిలో
కూడన్న పెట్టడేమో దచ్చన్నదారిలో

రా దారి లేదు, రాదారి లేదు
గద్దల కాపలా, కాకుల పహరా
తన్నుకుపోయెనో, ఎత్తుకుపోయెనో...
గొంగట్ల మెతుకులేసి ఏరుకోవడమే
చీకటి అర్రల ఒంటరి మొత్తుకోలు
చందమామ రాకె, జాబిల్లి రాకె
పొద్దీకినా, పొద్దు పొడిచినా
ఆర్చేదెవరు, తీర్చెదెవరు?
ఆగిపోయిన మోట గిరక ఈ బతుకు

ఇరుసు రాలిన బండి పయ్య ఈ బతుకు
ఎనుగు దుంకిన పసురాలు
మర్లేయి, మర్లేయి, ఓ ఎల్లన్నా!
చేతికొచ్చిన నేల, చేవ ఉన్న నేల
ముద్ది కిందేసుకుందు, బొర్ర పెదుతుందు
నీళ్ళు మనవిరో, నేల మనదిరో
వాడి ఎవుసమేందిరో, వాడి దున్నుదేందిరో!
కాదన్న మాదన్న ఎవడన్నా

దండుగేస్తుండు, కారు కూతలు కూస్తుండు
చెల్లు చీటీ లేదు, మిత్తికి మిత్తి కడుతుండు
ఎత్తిపోసే నీళ్ళకు నోరు తెరిస్తివి
ఏడేడు జన్మాలకు ఎండిన గొంతేనాయె
తీర్చేటోల్లెవలు, ఆర్చేటోల్లెవలు?
కలో గంజో తాగుతావా
కురాడు కుండ పచ్చెలు పచ్చెలు
ఊరు నాది కాదు, వాడ నాది కాదు
బడితె ఉన్నోల్లయి బర్రెలు
నోరున్నోల్లదే ఊరు కట్లె పిట్టలు కారుకూతలు
పజీత ...పజీత...
నోరు నొక్కేస్తరు, గొంతు పిసికేస్తరు
బట్ట కాల్చి మీదేస్తరు పైలం కొడుకో, కొమురన్న
జర భద్రం కొడుకో! నిప్పు చేతులుంది, నిలువునా కాల్చేస్తది
నక్కల ఊళలు, నాగుల బుసలు
తొవ్వలేసిన పాపం మెడకు చుట్టుకుంది
కంట్లె కారం కొడుతుంద్రు
నా జాగ మీదే నన్ను పరాయి జేస్తుంద్రు
పాలోడు కాదు, పగోడు కాదు
పక్కల బల్లెం, నెత్తుర్ల విషం
కోరలు మొలుస్తున్నె కాటు వేస్తున్నె
ఇదిగ వొడ్సిపోదు, ఆరిపోదు
చెప్ప వొశం కాదు

***ముల్కి సంకలనం, జూలై, 2002***

# విశ్వకర్మలు

● దాసోజు కృష్ణమాచారి

పెద్ద బాడిసకు పలుగురాయి నెరుసు
మొద్దుకు పదనుబెట్టి
చేతిగిలక చక్రంబండితో
నడక నేర్చి.... పొట్టగిన్నెల ఉగ్గు పాలుతాగి
కడుపుతన్ని కాళ్ళకు నాడెలు కొట్టె
కొలిమిన నిప్పుల నమిలిన
నాగలికర్రు సేతుల పలుగుపార
మెడలమీద కాడెడ్ల మోసి
ఎర్రబూమిని పక్కున పల్లజీరి
పచ్చదనానికి వన్నెలార్చిన....
అరిసేతుల పదును రాసిన కొడవలి
సెమట చుక్కలకు రాలిన వడ్ల గింజలు
రాసులు పోసిన గోనె సంచులు
కట్టడిసేసి తాలు నూకలు..
ఊపిరంతా పోసి ఉలితో సెక్కిన
రాయగిరి రాయి బొమ్మైన బింబం
సూడలేని అందం మాట్లాడలేని బాస
నడిసముద్రంలో ఊయలూగుతుంది
కంచు కనిజాలపైన నగిషీలెన్ని సుడులు తిరుగుతున్న
పేగులన్ని వయసు ముదిరి వన్నె తగ్గిన నరాలు
సకల దేవతలను సిన్న పిలల్ల చేసి సాన్నంపోసి
కండ్లల్ల వత్తులెస్కోని వెలుగునిచ్చె దీపంత...
పొద్దు కొస్తున్న సూర్యున్ని సూడకుండా

దీపం పొగకు పొగసూరిన కండ్లు
సురచనాలకు చెవుల దాపు
గుడ్ల జనలు కరిగి సెవులు కమ్మలద్ది
జీడిగింజలతోటి దిష్టిదీస్తూ
మెదలు వంచి ముగతాడేసి
ఈసంలా మాసం గుంజిండన్న బద్నాం ..
కాళ్ళు సేతులు కడుపుల పెట్కోని
కంటహారంల పొదిగిన రాళ్ళల్ల రాలిపోయిన రాయి
బువ్వ కంచంల పల్లు కింద రాయయింది

*ముల్కి సంకలనం, జూలై, 2002*

# కయాలు

• *యం.వెంకట్*

నీల్లు లేవు నీరికంటి లేదు ఏరు లేదు ఎంక్రికిచ్చులేదు
ఆకుల్లేవు ఆగులమాసం లేదు
ఎల్లాయికి ఎడ్లులేవు మల్లాయికి బర్లులేవు
బుడుబుంగకు ఇంగ అడుగుంగాట లెక్కడియి
కమ్మగూడెం వచ్చి అమ్మగూడెం ఆగమైంది
పత్తి మందు తాగి నేల పడిగిప్పింది
పండుగా పండుగకు పానమున్నదన్న కుశాలె

వంటి సన్నె బాయి తాగు బిడ్డా బాయి, గుండెన్న దిక్కు సాల్లు గుంజినై సాలుసాలుకు సగలం బెట్టిన సేతికి సమురంటలేదు. ఎన్నుకు మట్టుండెనో మన్నుండెనో ఏమి జెప్పుదు వూర్ల బడ్డనో బాయిల బడ్డనో ఈడు లేనప్పుడే గీ యింట్లబడితి బొక్కలన్నీ అరగదీసుకుంటినా, కొట్టే దొంగని
కానక కరిసే పాముని జూడక కన్నమ్మ సాకిరికి ఎట్టిపిట్టనై గీ మట్టి మీద ఎగురుతుంటి.

పొద్దున మునిగి సీకట్ల తేలితె వలవల దుఃఖం ఓ బిడ్డా! కాలం పొడుగున కండ్లు కమ్ము మీన, నెత్తిమీన ఎత్తిపోయిన కాలం ఎట్టుంటది. చెయిజూసి పోయినోడు పోయిలూసి పోయిండు. నీడలు గుంజినై గోడలు పగిలినై సూరు సూరుకు ఈ వూరు ఎండిన సీరికల జల్ల. వులుకు పలుకు లేని వుట్టి మీన గుబులు గూడు గట్టుకుంది.
కాగుల సెయ్యిపెడితె కడుపుల కలుక్కుమంది. కండ్ల నింద మెతుకులే బిడ్డా, కుందెన్లో కుతికేలున్నె, కూరాడ్లో పానముంది పొలిమేర దగ్గర పెద్దపిట్టల బారుంది. రగతమింకిన రాజ్యాన పాలిలేని శవాలు.

యాదికి అంతెక్కడిది, ఎంతెతికినా పాతాళ గరిగెకు పానమె తగుల్తది. బాసింగం గట్టి గీ మట్టికి అర్నవొచ్చినట్టాయె. బుక్కబువ్వకు అయ్య తిరగని మడుగు లేదు. అమ్మపడని బాద లేదు.

ఏడదిరుగుతున్నవురయ్యా, నన్ను గన్న నా అయ్య సన్నచాపల సెంద్రిగా, పచ్చింజేసి గీడేస్తివి గోసాయిల గలిసి అరిగోస తీపిస్తివి. సెట్టుపుట్టకు సెవులున్నయిగాని మందలిచ్చే మడిసే లేదు. వలపూసల పాట ఒక్క పూటా ఇననైతి, సంకనెక్కక ముందే సాలిస్తివా సైదమ్మా ఏడేడు లోకాలకు సేతులెత్తి ఏడిస్తినే అమ్మా అమ్మా అని తాటి పొరకై ఆకిల్ల మీన పెరిగితి, అద్దద్దా అంటే ఎగిరెగిరిదంచితి నా రెక్కలుపంచితి, కాల్ల కడియాలు కండ్లల్ల పెట్టుకొని కాలం నాను నమిలింది, ఇగ నను జూస్తుందిరయ్యా.

మట్టి పూసిన గోడలు మాటపంచుకున్నా ఎట్టిజేసి సేతులు ఏదమీన వాలినా కన్నీళ్ళలోపలి కాలం కనికరించదు. మట్టి ఉడికినోల్లు మాట పెంచుకున్నరు కోటనున్నరు. మట్టిమీని మనకు పొయిరాల్ల పీడ. వొత్తు కాలదు. బత్తి ఎలగదు కడపకో కడుపును కట్టుకుంది కరువు కాల్లు జేతులు వనుకుతున్నె కడుపులో బుగులైతుంది.

మాట వొనుకుతుంది. సిగంవూగినట్టే వుంది, బాయి తాగు బిడ్డా బాయి. కానీ బిడ్డా కానీ కరువు కడుపుల బడ్డది. సొరగుంజుతుంది. కాష్టం దాకా కష్టం దప్పదు ఇదుపున నేలకు జీవి ముదుపున ముట్టుది, అయినా ఆపాసనె, ఎట్టగానుంది అట్టనే అయిద్ది.

ఎవరికి పుట్టిన దేవుడు ఎక్కడోడు, దీపం బెడితే పాపమైంది. దూప దూప అంటే దూరంగా జరిగిండు, నీడ పట్టునున్నోల్ల నీడనే జేరిండు. తోడెల్ల మంద తోలిండు. ఎర్రిగొర్రెల్నిజేసి ఏడిపిచ్చిండు. కొండంత ఆకలికి కొంగున మెరిగలు కట్టిందాడు. కరువుకు కయాల్ దప్పలేదు బిడ్డా! మగనికి మంద కొట్టుకున్న ముండను ఎవలున్నరు జెప్పు సెప్పుకోను, పుట్టెడు దుఃఖం పురిటిపేగు నువుదప్ప.

*ఆదివారం వార్త, 25, ఆగస్ట్, 2002*

# పాలపిట్ట

● అన్వర్

మనిషి ప్రాణాలే పోతానయ్
నీళ్ళులేక
తాగి బతకలేక
పిట్టదేముంది

ఆకాశం మీద ఎగిరితిరిగి అలిసి
నేల మీద వాలిందా
పిట్ట పిట్టోత్కే వుంటదా

బుక్కెడు బువ్వకు
చారెడు నేలకు
ఆసపడ్డందుకు అడిగినందుకు
పిడికిలి బిగించి గొంతెత్తినందుకు
నేల నేలంతా నెత్తురు
పిట్టకు నేలమీద నూకలు దొరికినయా?

వలస పిట్టల కాలమిది!

బాస నేర్సిన పిట్ట మాటనేర్సిన పిట్ట
భూజాలమీద ఎగిరే పిట్ట
ఉత్తరాల్ని మోసేపిట్ట రాయబారాలు చేసే పిట్ట
పంజరాల్ల పిట్ట పంచరంగుల పిట్ట
బగ్గబలిసి కిచకిమంటున్న పిట్ట

మనూరి పిట్టేనా?

మనూరి పిట్ట గడీలల్లనే సచ్చింది

కోట గోడలల్లనే కూలింది
తీరుని బతుకు తీరుగ
పిట్టగుడ్లే మైనయో?

ఈ సుట్టు పక్కల పాలపిట్టుంటే సెప్పుండ్రీ
సూడక సానొద్దులైంది

పిట్టుంటే సెట్టున్నట్టే
సెట్టుంటే నేలున్నట్టే
నేలుంటే బతుకున్నట్టే

*తెలంగాణ సోయి, జూలై-సెప్టెంబర్, 2002*

# తకిలీపులు

● శ్రీదాస్యం లక్ష్మయ్య

నా నడిమిట్ల కెల్లి
నదులు పారుతానయి గని
మడికట్లల్ల నీల్లు నిలుత్తలేవు
భూములెండి పోతానయి
నేల పలిగిపోతాంది
కడుపుల నుంచి కందసొంటి బొగ్గును తాల్చుకచ్చి
కరెంటును పుట్టితాంౘ్రు గని దీపం కింద చీకటిలెక్క
కరెంటు కోతలు తప్పుడులేదు
మోటార్లు కాలిపోతానయి మీటర్లు మండి పోతానయి
పచ్చగడ్డి పత్తకులేదు - ఎండుగడ్డి మూలకు గాదు
ఆకలి తీరని గొడ్లు దొడ్లల్ల కళ్ళు తేలేత్తున్నయి
ఆలుకబీరుకు తరలిపోతానయి చిన్నపనికి పెద్దపనికి మిషిన్లచ్చి
చేతి నిండ పనులు లేక చేవచచ్చిపోవట్టె
పుర్సతి లేని బతుకయిపాయె బర్కతి లేని బతుకయిపాయె
కడుపులంబలి పొయ్య సల్లటి మాటలే కరువయిపాయె
ఆపతున్నోల్లరుసుకునేటోల్లే లేరు
ఆపతి, సంపతి సూడలేనోల్లకాడ
మానని గాయాల సలపరింతల తోటి
మట్టి మనుషుల మద్దెన, ఎట్టి బతుకులతోటి
ఆటలాడుకుంటాంటె అన్నమెట్ల సయిస్తది నాకు
ఇన్ని తకిలీపుల తోటి
మనసుల మనసెట్ల నిలుత్తది నాకు

*తెలంగాణ సోయి, జూలై-సెప్టెంబర్, 2002*

# అవ్ మాది మగ్గావాలె

• పప్పుల రాజిరెడ్డి

యేండ్లనుంచి యెంత మొత్తుకుంటే యేం ఫాయిదా
ఎల్లన్న గొంగడి యేసిన జాగలనే వున్నట్టు
మన బాధలు యెక్కడియక్కడనే
యాదుండాల్నో గాన్నే వుండవట్టే
మాది మాకు గావాలనీ చెట్టుమీద గుంపుకాకులు వొర్రినట్టు
వొక్క తీర్గ రీకాం లేకుంట వొర్రనే వద్దిమి
గుడిల దేవునికన్న కనికరమొత్తది గని
గాళ్లు మాత్రం చెవులున్న చెవిటోళ్ల తీర్గ
కండ్లున్న గుడ్డోళ్ళ తీర్గ చెయ్యవట్రి
వున్న నీళ్లన్ని మీదిక్కే మల్పుకుంటిరి
యీాడ పుట్టిన కరెంటు - బొగ్గు అటెత్కపోతిరి
పట్నం కెళ్ళి మొదలువెడ్తె ఇందూరు దాకా
లష్కర్‌కెల్లి మొదలువెడ్తె కన్నగురుం దాకా
బంగారం పండే ర్యాగల్లు అగ్గువకే దొబ్బితిరి
కార్ఖానాలు మీయే- కాలేజీలు మీయే
సిన్మాల పేరు జెప్పి ఎకురాలకెకురాలు దొబ్బితిరి
పత్రికలు మియ్యే పలుకుబడి మీదే
మా జాగల్నిదోచుకొని మమ్ముల్నే జీతం బెట్టుకుంటిరి
ఎట్టి శాకిరి మాదాయె
ఎద్దేషం మాదాయె బాంచెన్ బతుకు మాదాయె
కల్లం మీద సావుకారి బతుకు మీదాయె
అల్‌కబీర్ గోజలోలె పులకాశోలె గోసోలెమేం
మాదగ్గర సదువు తక్కువ శాని తక్కువ

సర్కారు మీదే సవాలక్ష అధికారాలు మీవే
పెద్ద కొడుకులు మీరే పెద్ద మనుషులు మీరే
కొండ చిలువలు  మీరే
మాకేం మిగిలె ఎన్గులశిప్ప గొంగడి గోచిరుమాల్ పెల్క
వాళ్లదే పెద్దిర్కం
మనోళ్ళకు సుతి గల్వది పెయ్యిమీది కొచ్చేదాకా
పట్టించుకోకపోతిమి
ముడ్డికిందికి నీళ్ళొచ్చినంక లబదిబలాడవడ్తిమి
అయితాయెగని- యిప్పటికన్న క్యాల్‌తోని మెదుల్దాం
వొట్లకు పుట్టిన నా కొడుకులు ఏరోటికాడ
ఆరోటి పాట పాడ్తరు
పదవిచ్చేసరికి టండా అయిపోతరు
అసుంటోళ్లతోని జాగర్త గుండాలె
తడిబట్టల్తోని గొంతుల్ గోస్తరు
తెలంగాణకు గోతులు దీస్తరు
నక్సలైట్లగడ్డంటరు శాంతి భద్రతల్ లేవంటరు
సంపుదు పంజం మొదలు వెడుతరు
శాన తెల్వితోని కొట్లాడాలె
మోటు కష్టం జేస్కునే మనోళ్లకు సమ్‌జయేటట్టు జెప్పాలె
నంగి నంగి మాటలొద్దు గోడమీది వాటాలొద్దు
దొంగ దొంగ వేషాలొద్దు సాటుసాటు బ్యారాలొద్దు
మాట మీద నిలవడాలె మాటకు పాటుపడాలె
మనం మాటపట్టింపు ఉన్నోళ్లం
మన మనాది పోవాలంటే
మనది మనకు గావాలె
కల్సికట్టుగ పనిజెయ్యాలె
తెలంగాణ సాధించి తీరాలె

*నేటి నిజం, స్వాతంత్ర్య దినోత్సవ ప్రత్యేక సంచిక, ఆగస్ట్, 2002*

# దుఃఖ భాష

• ఒద్దిరాజు ప్రవీణ్‌కుమార్

దుమ్ము రేగిన దారి నిండా తల్లిపేగు తండ్లాట
నెత్తుటి మరకలను మోసుకొచ్చిన
అక్షరం సాక్షిగా / అదెప్పుడూ గుర్తు తెలియని శవమే
ప్రేమసంతకాలు మోసిన
తెలంగాణ గుండెనిండా భయం బుగులు
విషాదం దుఃఖం విస్తరించీ విస్తరించీ
నెగళ్ళై కమ్ముకుంటున్నంతలోనే
గుండె మీదికి విసురుతున్న
వలసవాదపు నెత్తుటి పంజా
సమయం ఏదైనా కావొచ్చు
సందర్భం, సంక్లిష్టత పునరావృతం-
తలాపున నదులున్నా / పొలాల నవ్వులు నగుబాటైన వైనం
సమూహం కలల పంటకు
మసి పూసి ఇంటి దొంగలు
ఉదుకెత్తిన నెత్తుటి పొంగుకు
నెర్రెలు బారిన నేల యిచ్చిన కౌగిలింత
నడిచిన అదుగులను విప్పిచూస్తే
ప్రాణం వదిలిన పచ్చి జ్ఞాపకం
కదలని స్తన్యం శరీరమో, శవమో
భయం గొలిపే చావు దుఃఖం
పిట్టకు పెట్టిన పిండాలను మోస్తున్న
తెలంగాణ పుండు మీద
ఆయుధ కౌగిలి పురిటి వాసన

*ఆదివారం వార్త, 15, సెప్టెంబరు, 2002*

# గోస...గోస....

● కందాళై రాఘవాచార్య

సెరువెండి పాయె
బోరు బోడబోడాయె కరెంటు కాలిపాయె
భూమిలేసిన ఇత్తులు మట్టిలెక్క మారిపాయె
గోస....గోస....
కాయకష్టం సేసే సేతులు తలవట్టుకోని కూసున్నె
నాట్లు లేవు గీట్లు లేవు
బతుకుల కరువు పోట్లు
యాదున్నవే నాగలంటే దున్నుడుకు దూరమై
కొట్టంల కొలువున్నా అంటది
గోస...గోస...గడ్డిలేక గోదలు అమ్ముడాయె
మా ఊర్ల ఇంటింటికి ఇదే సోది
కష్టం మీదచ్చి పడ్డది
లేసుడెట్లా ఇల్లు నడుసుడెట్లా ...గోస....గోస...
లీదర్ల మాటలు మంచినీళ్ళ లెక్క వారుతై
కళ్ల నీళ్ళు ఓళ్లకు ముద్దు
అది మాపైతది ఇది మాపైతది అనేటోల్లే
బత్కుపొద్దు గూకేది మాపైతాది
గోస....గోస....
సెప్పుకుంటే కడుపుల గోస ఆవిరైతది
సెప్పుకుంటే గుండెమీదికచ్చి కుంపటైతది
గోదలమ్ముడు వాయె
ఉన్న భూమి అమ్ముడుపోతది
యాడికోవాలె ఇగ / బతుకంత గోస...గోస....

*ఆదివారం, వార్త 10, నవంబర్ 2002*

# అంగడి

• వి. ఆర్. శర్మ

తెలంగాణాలో
అంగట్లో కూచున్న ఈ రైతులకు
అమెరికాలో ఉన్నట్టుగా
పారిశ్రామిక వ్యవసాయిక ఫాంహౌజులు లేవు
దాహం తెలియని నదీతీర ప్రాంతాలూ
కరువుల్లేని డెల్టా భూములు లేవు
నేల తల్లి ఒంటిమీద తగిలిన
గాయాల మచ్చల్లాంటి
చిన్నా చితకా భూమిచెక్కలు తప్ప

వాళ్ళ భూముల్లోకి
నదీ జలాలు ప్రవహించవు
కష్టాలు కన్నీళ్లూ
అప్పులూ తిప్పలూ తప్ప
అవే నీళ్ళ చేలల్లోంచి
ఈ నిగనిగలాడే
రంగురంగుల కూరగాయలుగా
రూపాంతరం చెందుతాయి

ఆదివారం అంగట్లో
బిచ్చగత్తెల చంకన
కనబడే పిల్లల్లానో
బల్లి నోట్ల చిక్కిన పురుగుల్లానో
కనబడతారు వీళ్ళు

ఈ రైతులకు
వ్యాపార సూత్రాలు తెలియవు
ఆకలి తీర్చుకోవడం కోసం
తమవాళ్ళ అవసరాలు తీర్చడం కోసం
బతికి వుండడం కోసం
తమ జీవిత సారాన్ని
రంగుల్నీ కలల్నీ
అమ్మకానికి పెడతారు

తమ కష్టం ఆశలూ అమాయకత్వం నెత్తురూ
కండలూ కాలం తెంపుకొచ్చి
కుప్పలు పోసుకొని
మనకు ఆరోగ్యాన్నిచ్చే రుచినిచ్చే శక్తి నిచ్చే
తాజా కూరల రూపంలో
అమ్ముకుంటారు

మోరీల పక్కనా
తోవల పక్కనా
దుకాణాల ముందూ
అరుగుల పక్కనా తిట్లు తింటూ
బెదిరింపులు భరిస్తూ
భయం భయంగా
ఆశగా నిరాశగా కూర్చుంటారు

తమ కష్టాన్ని అమ్ముకుంటున్నందుకు
టాక్స్ టికెట్లు అంటగట్టే వాళ్లనుంచి
క్షణంలో కూరగాయలను నోట కరచుకుపోయే
దొంగ పశువులనుంచి
తప్పించుకోలేక సతమతమౌతుంటారు

తమ శరీరాల్లో కళ్ళల్లో బట్టల్లో లేని
కళాకాంతులన్నీ కూరగాయల్లో నింపి పీక్కుపోయిన
శరీరాలతో తాము
ఎండిపోయిన మోటబావుల్లాంటి కళ్ళతో కనిపిస్తారు

ఓ చేత్తో తక్కెడజోకుతూ
ఒడిలో పిల్లలకు పాలిస్తున్న తల్లులు
పదీ పదకొండేళ్ళకే బాధ్యతలు మోస్తున్న పిల్లలు
పళ్ళూడిపోయి కళ్ళు మసక బారి
వణికే శరీరాలతో కూరగాయలమ్ముకుంటున్న
వాళ్ళూ ఎందరో కన్పిస్తారిక్కడ

ఆదివారం అంగడి
కొనేవాళ్ళతో అమ్ముకొనే వాళ్ళతో
కిటకిట లాడుతుంది

అదిగో ...అక్కడ
ఓ ఇరవైయ్యేళ్ళకు పైగా
రకరకాల ప్రగతిశీల ఉద్యమాల్లో పనిచేసిన వాడు
మార్క్సునీ క్యాపిటల్‌నీ కోట్ చేసే పెద్ద మనిషి
నెలకు పదీ పన్నెండు వేలు
పొందుతున్న ఉద్యోగి
ఆ గంపదగ్గర
రెండు రూపాయలకు కిలో టమాటలంటే
రూపాయికి తగ్గించి బేరమాడుతున్నాడు

ఇక్కడ
తన బిడ్డకు పాలిస్తున్న ఈ తల్లి దగ్గర
ఓ ఉద్యోగ సంఘ బాధ్యుడు

ప్రభుత్వోద్యోగులకు కరువు బత్తెం పెంచాలని
ప్రతినెలా ప్రభుత్వాన్ని గట్టిగా డిమాండ్ చేసే మేధావి
ఆ తల్లి / పాల కూరకు
సగం ధర కట్టించే ప్రయత్నం చేస్తున్నాడు

ఇంకో చోట ఆకు ఆకునూ కాయకాయనూ
తిప్పి తిప్పి పరీక్షిస్తూ
రైతుల దొంగ బుద్దినీ, దొంగతనాన్నీ
కనిపెడుతూ ఓ చదువుల తల్లి

తన సరదాలకూ దర్జాలకూ
నోట్లు అవలీలగా ఖర్చు చేసేవాళ్ళు
క్లబ్బుల్లో పేకాటల్లో తాగుడులో
వందలూ వేలూ వెదజల్లే వాళ్ళు
ఇక్కడ తమ దగ్గర
ఎందుకింత గీచిగీచి బేరమాడుతారో
ఈ రైతులెప్పుడూ అడుగరు

సాయంత్రం వరకూ
ఎండలో ధూళిలో మురికిలో ఆకలిలో తన్లాడి
ఎంతో కొంత సంపాదించుకొని
ఈ రైతులు ఇళ్లకు మళ్ళుతారు

అంగడి కూడా నిశ్శబ్దంగా
వాళ్ళను వెంబడించి
రాత్రుళ్ళు వాళ్లకలల్లో జొరబడుతుంది
అక్కడ కూడా అందరూ
వాళ్ళ శ్రమకు ధర తగ్గించే బేరమాడుతుంటారు

సూర్యుడు అనేక రంగుల్లో ఉదయిస్తాడు, కవితా సంపుటి, నవంబర్, *2002*

# నా పేరు యాద్గిరి

● జింబో

నేను భాషను ప్రేమిస్తాను
యాసను ప్రేమిస్తాను
భాష నా తల్లి
తల్లిని ప్రేమించని వాడు మనిషే కాదు
కవి అంతకన్నా కాదు ఏ భాషైనా యాసైనా నా కిష్టమే
నా భాషను ఏవడు ఖూనీ చేసినా
వాడిని ఖూనీ చేయాలనేంత కోపం
నా పేరు యాద్గిరి నా పేరు వింటేనే
మీ మొఖాలు వెకిలిస్తాయి నన్నో సర్వర్‌గానో విలన్‌గానో
ద్వంద్వార్థాలో జోకర్‌గానో
మోసగాడిగానో తార్పుడిగాడినో చూపిస్తారు
అవహేళన చేస్తారు.
నా భాషలోలేని అనాకారితనాన్ని
వంకరలని జొప్పించి
నాతో మాట్లాడిస్తారు ద్రౌపదిని వివస్త్ర చేస్తున్న
కురుసోదరుల్లా సంబర పడుతారు
నిజమే!
భార్యని వదినని అవమానించిన
వ్యక్తులు చరిత్రలో వున్నారు
కానీ, తల్లిని మానభంగం చేస్తున్న వ్యక్తులు
ఇప్పుడే తయారవుతున్నారు.

*రెండక్షరాలు కవితా సంపుటి, నవంబర్, 2002*

# గోస

● పరిమళ్

మాకండ్లముంగటి నుంచే
గలగలమంటు నదులు
నీ యింటిముందు వాల్తయి
మా గొంతులు తడవడం
అంత తేలిక గాదు
నేలతల్లి గుండెకి గాయాలు
ఆంధ్రరంగస్థలంలో
నీటిభామ నాట్యం చేస్తుంటది
ఆంధ్ర అంటేనే అన్నం
ఒరే అన్నా!
సముద్రం నీ కండ్లనుంచి
బొట్టుబొట్టుగా రాల్తున్నప్పుడు
మా గుండెలకు
ముండ్లు గుచ్చుకుంటై
దోసెడు గింజలుంటె
పిడికెడు పెడ్తం
ఈడ సినుకు సీకట్ల కల్సె
బతుకు యుద్ధమై మండవట్టె
ఒరే అన్నా! నీ కండ్లు నీళ్లేని బావులై
నీ సేతులు
నీ కడుపుకు తోరణాలు కడ్తుంటే
మేం కన్నీళ్లతాళ్లతో
ఆకలి కొయ్యలకు ఏలాడ్తున్నం

*తెలంగాణ సోయి, అక్టోబర్-డిసెంబర్, 2002*

# బేనామ్ షహర్

● *లోకేశ్వర్*

గండిపడిన గండిపేట తెగిన చెరువు కట్ట ఈసా, మూసీనదుల సంగెం వరద వెల్లువ, వెల్లువలో గడ్డిపోచల్లా కొట్టుకు పోయిన కుతుబ్‌షాహీలు, ఆసఫ్‌జాహీలు. ముక్కచెక్కలయ్యి నిలువునా కుప్పకూలిన పురావైభవ ప్రేమవారధి పురానాపూల్, 'పానీ ఆయా పానీ ఆయా, భాగో భాగో', ఫల్కనామా గుట్టపైకి పాకుతున్న నేలవాసులు, మూలవాసులు, కందకాలలో కూలిన గోల్కొండ కోటగోడలు, ఫసీళ్ళు, నేలకొరిగిన బురుజులు, గుంబజ్‌లు, తలుపు రెక్కలు విరిగిపడిన బారాదరీ దర్వాజాలు. లోలోపలికి ముడుచుకుపోయిన దేవలాల ప్రాంగణాలు కాలగర్భంలో కలిసిపోయిన ఇమారత్‌లు, ఖిల్వత్‌లు, బీబీ కా మక్బరాలు

ఒక నేల రాలిన ఎర్రగులాబి ఒక పగిలిన అత్తరు సీసా ఒక పిగిలిన డోలక్. మరో తీగలు తెగిన సారంగి నేలపై చెల్లాచెదురైన ఘుంఘురూలు వెలిగి మలిగిన షమాలు, మట్టిలో కలిసిన మెహెబూబాలు, రంగు వెలిసిన మెహందీలు ఖబరస్తాన్‌లలో పెనువిశ్రాంతిలో నున్న షర్వానా, దీవానాలు, ఛళ్లున నేల కూలిన షాండీయర్లు, షామియానాలు, బిచ్‌దాహువా చెమన్లు, ఉజ్‌దాహువా బాగేఆంలు.

కనుమరుగై తెరవెనక్కి వెళ్ళిపోయిన సీన్మాటాకీసులు షాన్‌లు అంతరించిన ఇరానీకేఫ్‌లు. మూగ బోయిన గ్రామ్‌ఫోన్‌లు పగిలిపోయిన రికార్డులు. టేబుల్‌పై ఒలికిపోయిన ఏక్‌మే దో దోస్తానాలు కటీఫ్ అయిపోయిన స్నేహాలు.

తెగ్గొట్టబడ్డ నౌబత్‌పహాడ్ శిరస్సు, తల వంచుకున్న 'ఫతే' మైదాన్

నిస్సహాయంగా చేతులెత్తేసిన చార్మినార్. మక్కా మసీదులో రెక్కలు విరిగి నెత్తురు కక్కుకుంటూ నేలకు ఒరిగిన ఒక చిన్న తెల్ల కబూతర్.

నా జానేజిగర్ నగర సుందరి కళ్ళూ, ముక్కూ చెవులూ, చెంపల్ని చెక్కేసి నామరూపాలులేని అనామికను చేస్తున్న హైద్రాబాదు తాలిబన్లు.ఎకరాలుగా, గజాలుగా లెక్కలేస్తున్న నయా వలసపాలకులు

వరద, వరద వెల్లువ, వలస వరద వెల్లువలో పూచిక పుల్లలా కొట్టుకు పోతున్న నా నగరమ్. నా చార్‌సౌ సాల్ పురానా షహర్

నేనిప్పుడు ఈ షహర్‌కు ఒక గుమ్‌నామ్ బాద్‌షాని. స్వదేశంలోనే కాందీశీకుడ్ని. నా ఇంట్లో నేనే పరాయివాడ్ని. అపరిచితుడ్ని దారికాని దారులలో దారికోసం అన్వేషించే ఒంటరి బాటసారిని. గృహోన్ముఖంగా పయనించాలని ప్రయత్నించే ఒక పరదేశీని.

నా చిరునామా, నా పతా, నా అడ్రసు, నా ఐడెంటిటీ, నా ఉనికి ఎక్కడ? ఎక్కడ? ఎక్కడ?

*తెలంగాణ సోయి, అక్టోబర్-డిసెంబర్ 2002*

# తెలంగాణ గో్రగహణం

• *బియ్యాల జనార్ధన్‌రావు*

నా తెలంగాణ! నేడొక కుంతీ మాత!
ప్రజలంతా దగాపడ్డ పాండవులు
సమగ్రత కింద సాగుకాని చెలకను నేను
అన్నీ తీసుకొని ఏమీ మిగల్చని అబద్ధాల కంచెలు మీరు
ఎర్ర విప్లవాలు ! ఎన్నో విప్లవాలు పండిన చోట
తిండిగింజలు దొరకకపోవడం ఈ శతాబ్దపు కుట్ర
నా దేశ దేహాన్ని వంతెనలుగా చేసి కదా నీరందించాను నీకు
నా అవయవాలను రహదారులను చేసి, రైలు మార్గాలను వేసి
నా ఆధారాలన్నీ నీకు ఆహారం చేసి
నా బిడ్డలకు దూరమై మీకు పాలిచ్చి ఆకలి తీర్చి
చిక్కి శల్యమైన ఎముకలగూడుగా మిగిలిన బక్క చిక్కిన తల్లిని నేనిప్పుడు
కన్న బిడ్డల కన్నీళ్ళు తుడవడానికి కష్టపడుతున్న అవ్వను నేను
అన్నీ వుండి అందరికీ అంతా యిచ్చి
ఏమీ లేని పేదరాలును నేనిపుడు-
తలా ఇంత పంచి ఇవ్వాలనే ధర్మంలో, మీరు చేసిన ద్రోహంలో కొట్టుకుపోయి కోల్పోయి
అన్నల ద్రోహాలకు గురి అయిన ఆడబిడ్డను నేను
పడుతూ లేస్తూ తడబడుతూ ప్రవహించే గంభీర గోదావరి కెరటాన్ని నేను
నా యింటికో, ప్రాంతపు పంట పొలాలకో అందక
పరిగెత్తడం మాత్రమే తెలిసిన కృష్ణమ్మను నేను
పాట నా బాటై

మాటకు నిలబడే బుద్దినై
రూటు మార్చిన సన్నాసుల
చేతిలో చిక్కిన సస్యశ్యామల జీవగడ్డను నేను!
నా బిడ్డలందరు అన్నార్తులుకారు అనాథలు కారు
ఆయుధాలు పట్టడం తెలిసిన ధీమంతులు
ఆలోచనల పదనులో అమాంతంగా
లోకాన్నే మార్చాలనుకున్న సాహసులు
ఎందుకంటే వాళ్ళు నా బిడ్డలు
అభిమానానికి మోసాలను ప్రశ్నించలేక
ఇప్పుడువాళ్ళు దుబాయ్‌ల్లోనో, జడ్డాల్లోనో
అడ్డాకూలీలుగా మారిన వాళ్ళు
అమ్మలను వదిలి, అనుబంధాల్ని వదలి
అప్పుడప్పుడు వచ్చి అమ్మ ఒడిలో
వాలే అమెరికా బిడ్డలు కొందరు!
రైలెక్కినా, గాలి మోటారు ఎక్కినా
ఉన్న ఊరికి, కన్నతల్లికి కష్టంగా
దూరమై బిడ్డల బతుకు క్షోభ
ఇప్పుడిక భారమైన తెలంగాణైంది
అన్యాయానికి గురైన పాండవులు అజ్ఞాత కాలమైంది
ఎడ్డి ఏకలవ్యుని బొటన వేలైంది
తెలంగాణ నేడిప్పుడు
"ఈనాడు కురుగణాల క్రూరత్వంలో"
బందీ అయిన కుంతీ మాత!
పాలి పంపకాల ధర్మాలన్నీ, పెద్దమనుషుల
ఒప్పందాలన్నీ వట్టిపోయి
మాయాజూదపు

నయా పొలకుల నాజూకు భాషల్లో
అందమైన హైటెక్కుల్లో
ఉనికిపోయి దిక్కులేని
ఊరు నా తెలంగాణ!
మాయా జూదపు ఫిల్మ్‌సిటీల్లో
"మామ శకుని" పాచికల్లో
అమాయకంగా అన్నీ కోల్పోయిన
పాండవులు నా తెలంగాణ ప్రజలిప్పుడు
సకల సాహసాలు వుండీ
సకల సంపదలు వుండీ
కలసి వున్న ఏ కాలవైపరీత్యానికి
కాలు కదపలేక, తల ఎత్తలేక
వివశులై విరాటుని కొలువులో
అవమానాల కుంపటిలో
ఆహుతవుతున్న నా బిడ్డలు నేడు
కంకు భట్టులు
వంటల వలలులు
బృహన్నలలు
తంత్రిపాలులు
పశువుల్ని పగతో తోలుకుపోయిన కురుగణాలకు
బుద్ధి చెప్పక తప్పదు
న్యాయం పాండవులదేనన్న సత్యం
నష్టమైన, కష్టమైనా , కఠినమైనా
చెప్పక తప్పదు- ఎందుకంటె అది
కొమురెల్లి కొండంత నిజం కనుక
యాదగిరి గుట్టంత నివెద్దం
కిన్నెరసానంత వాస్తవం

కొమురంభీమంత నిలువెత్తు చరిత్ర
హైద్రాబాద్ చార్మినారంత సత్యం
నా బతుకు చిత్రం
వాడికి చలన చిత్రం
నా త్యాగాలను కీర్తించి వాడు
సినిమా హీరో అవుతాడు
నా అమరత్వాన్ని శ్లాఘించి
వాడు అమరేంద్రుడవుతాడు
చస్తే, ఒక స్మారకస్థూపం
కాకుంటే ఒక సంతాపసభ
లేదంటే ఒక సంస్మరణ గానం, ఒక స్మృతి గీతం
నక్సలైట్లే దేశభక్తులని మెచ్చుకొని
నా నవనాడుల్లో నిక్షిప్తమైన
అనుబంధాన్ని వోటు బ్యాంకుగా మార్చి భాగ్యనగరాన్ని
ప్రపంచ బ్యాంకుకు తాకట్టుపెట్టే తన ఖాతాదారుల
వారసులు తెలంగాణ పాలకులు
బందగీ, త్యాగాలన్నీ ఆలేరు వాగుల్లో కలిసినాక
అయిలమ్మలు అందరు పాలకుర్తికే పరిమితమైనాక
దొరలు చచ్చి "దొర బాబులు" హెచ్చాక
నైజాములు పతనమై నయా నవాబులు
ఆంద్రాబాద్‌లో అడ్డ వేశాక
ఈస్ట్‌సిటీ, వెస్ట్ సిటీ మొత్తం
పరాయివాడి సొత్తుగా మారిపోయింది

*మత్తడి, డిసెంబర్, 2002*

# భౌగోళికమా? సైద్ధాంతికమా?

• *గాదె వెంకటేష్*

నల్లతుమ్మ పొట్టులా
నెర్రలు వట్టి నా అమ్మ చేతులు
ఫ్లోరిన్ పోరుకు రాగోలలా
వంకర్లు తిరిగిన నా అయ్యకాళ్ళు
తెలంగాణ ఎట్టికి
మట్టి జీవితాలకు మచ్చుతునకలు

రాజకీయం నా ఓట్లు పీల్చి
బ్యాలెట్ బాక్సులు బరువెక్కించుకొని
అధికారాన్ని అందుకొని
అభివృద్ధి ఎంతో చేశాం అంటున్నా
ఎతికిన కొద్ది దొరికే దరిద్రం సెలమ
నా తెలంగాణా

ఫ్యాక్టరీలలో నాన్ లోకల్ అంటే
పుట్టిన ఊళ్ళనే పూటకు గతిలేక
అణచి వేయబడ్డందుకు ఆవేదనతో...
రగులుతున్న కొలిమి నా తెలంగాణ

నదుల నడకతో నందులతో
నాట్యమాడేటి నాగళ్ళతో
నాటి తెలంగాణ
నెర్రెలు పట్టిన నేలలో
'కర్ల'కు తగుల్తున్న పుర్రెలు
బక్కపలచని బర్లు

పల్లాడుతున్న పల్లెలు
నేటి తెలంగాణ...
విత్తనాలు భూమిలోకి వెళ్ళక
ముందే మొలకెత్తుతున్నాయి
భూమిపై పడక ముందే
పసి ప్రాణాలు అలిసి పోతున్నాయి
పంటకోస్తే
పొట్టల్లోకి కాస్త మట్టి తప్ప మరేముంది?
పురుగుమందొక్కటే నిజాయితీగా వుంది

ఆర్థిక విముక్తైతే
మా బిడ్డగోళ్ళకు ఒరిగేదేముంది
సైద్ధాంతికంగా వస్తే సదురుకోగలమేమో
చేతినిండా పని పొట్టనిండా గంజి

అందుకే....
తెలంగాణ కోసం మట్టిలో కలిసి
స్తూపాలై మొలకెత్తి
సూటిగా హెచ్చరిస్తున్నాయి
తెలంగాణ తెచ్చుకోకుంటే
మీ బ్రతుకులు విచ్చుకోవని
బొక్కలపై కప్పుకున్న
తోలును ఉంచుకోలేరని

*మత్తడి డిసెంబర్ 2002*

# దేవులాట

• దేశపతి శ్రీనివాస్

ఒక చినుకు పడుతుంది
తప్పిపోయిన తొలకరి బంధాల కోసం
పిండి పిండిలా దున్నిన దుక్కై
తపిస్తున్న ఊరు కనుగుడ్లమీద
పండుగ పాశమై కురుస్తుంది

బతుకు తెరువు చూపలేక
పల్లె భంగపడినప్పుడే కదా
ఎండిన డొక్కల్ల నుంచి
వలసరెక్కలు మొలుచుకొచ్చింది

గాలి దుమారానికి
ఎగిరిపోయిన పక్షులన్నిటికీ
గుండె గూడు యాదికొస్తది

ఎదురు చూపుల రావిచెట్లు
మొలుస్తున్న పల్లె మొండిగోడలమీద
పండుగ పాలపిట్టై
గునగునా కూస్తది

బొగ్గుబాయి చీకట్ల
పట్టెదన్నాన్ని తవ్వుకునే
పార చేతులల్ల
ఊరి చెరువు ఊటల
ఆహ్వానాలు చెమరిస్తయి

పొయ్యిఊదీ ఊదీ
పొగచూరిన సంసారం పొరలలోకి
బతుకమ్మాటల గాజుల గలగలల
జలపాతాలు ఉరికొస్తయి

ఆటలాడే అరికాలుకు
పోట్రౌతు తలిగి
వేళ్ళ సందుల కెల్లి
పసితనం మెత్తటి ఇసుకలా జారిపోయి

దినకూలీ రాళ్ళతట్టైన
లేత గుండెల
పాలకంకిని పొడుచుకుతింటున్న
సోపతి పిచ్చుకల సందడే సందడి

ఆనకట్ట కట్టలేని
అనుబంధాల తొందరకు
టిక్కెట్లు కొట్టలేక
కండక్టర్ కలవరమైపోతడు

పైనా లోపలా
కిక్కిరిసిన మానవ సంబంధాలతో
ఊరు పొలిమేరల
బస్సు రెపరెపలాడుతది

ఒక్కొక్క పాయ దిగివస్తుంటె
కాగలిచ్చుకున్న కంటివాగులు వలపోస్తయి

సావాసగాండ్ల తోటి
చెట్టపట్టాలేస్కోని శిల్పక్క పండ్లు తెలతెల్లగ నవ్వుతయి
పేగుబంధాల

పాదస్పర్శతోని
పంటచేన్ల వొరం
పరవశాలు వోతది

కొత్తగా చేరిన టి.వి.
నోరు బందు పెట్టి
ముచ్చట్ల మక్క గారెలు
నములుతూ రాత్రి
ఎంతకూ నిద్రపోదు

పండుగ రోజులల్ల
లైట్లు లేకపోయినా
పల్లె పల్లెంతా గొప్ప వెలుగే
గాలినిండా
గునుగులూ, తంగేళ్ళ గుసగుసలే
జీవితం వన్నెదిద్దుకొని
ఉయ్యాల పాటల అలలమీద తేలే
సద్దుల బతుకమ్మైపోతది
సుద్దుల్నీ సద్దుల్ని
వాయినాలుగా ఇచ్చిపుచ్చుకున్న తృప్తి
చెవికమ్మల మెరుపుల
తళుక్కుమంటది

కుండల పాశం అయిపోయినట్టే
పండుగ అయిపోతది
నాల్గంటలకే సైరన్ కొడుతది
కనిపించని తలుగు
కంఠాలను ఇగ్గుతుంటే
వలస ముగుతాదేసి

కోళ్ళాగ గుంజుకపోతుంటే
కలతపడ్డ ఆవు
కనుగుడ్లైతది పల్లె
గౌరమ్మను సాగనంపినట్టు
గావురంగ సాదిన బిడ్డను పంపలేక
చిట్టి చేతుల టాటాకు
జవాబివ్వలేక
ఆకల్లాడని అడివై బీరిపోతది
బంధాలు, బతుకమ్మలు ఎల్లిపోయిన
ఖాళీ తాంబాలమై ఎలితిపడుతది
"ఒక్కడే మాయన్న ఉయ్యాలో
వచ్చున్నపోడు ఉయ్యాలో"
మల్లొచ్చే ఏటిదాకా
ఒంటరి పాటొకటి
పల్లెగుండెలో
ఊపిరి ఉయ్యాల ఊపుతది

*మత్తడి, డిసెంబర్, 2002*

# కుట్ర

● *యాకూబ్*

ఎవరు ఎవరికి తెలుస్తారు
కనిపించేదంతా వినిపించేదంతా నిజమని
నమ్మించే అబద్ధపు ప్రచారం జరుగుతున్నప్పుడు
ఏక పక్ష నిర్ధారణలే అసత్యాల్ని ప్రచారం చేస్తాయి
ఆకలైనా అన్నం అడగని వాళ్ళని
దాహమైనా నీళ్ళడగని వాళ్ళని
కష్టాలతోనే కాలం వెళ్ళబుచ్చేవాళ్లని
భద్రజీవుల గాటన కట్టేయడం - కుట్ర

1
షేర్వాణి వేసినవాడి లోపల కుర్తాకున్న చిరుగుల్ని
గంభీరమైన మాట వెనుక దాగిన గెహరీ పరేషాన్లని
మెహందీతో నిగనిగలాడే చేతుల వెనుక దాగిన 'గుటన్' ని
సుర్మాలకళ్ళ వెనుక కోసే నిజాల్తో
బురఖాల వెనుక దాగిన 'చెహరా'ల్ని
రెక్కాడితే కాని డొక్కాడని భరోసాలేని పూటల్ని

హోటళ్ళలో, కార్ఖానాల్లో, పంక్చర్ షాపుల్లో
నాలుగు చక్రాల మౌజ్ బండ్లలో, కసాబు గల్లీల్లో, చెత్తలేరుకుంటున్న బస్తాల్లో
అంగళ్ళలో, ఐస్‌క్రీమ్‌లమ్ముతూ ఎండే బాల్యాన్ని బన్నుకూ
గుక్కెడు ఛాయ్‌ల గుప్పెడు 'దాల్‌ఖానా' కు అమ్ముడుపోయే యవ్వనాలను
పారంపర్యంగా సంక్రమించిన నీడనివ్వలేని 'దౌలత్ ఖనా' లను
ఏ చరిత్రలోకి చేరకుండా దాటేయడం అతి పెద్ద కుట్ర

2

ఇన్ని నేరాలమధ్యన కుట్రల మధ్యన
అమానతుగా పెట్టిన జిందగీల్ని
మళ్ళీ తిరిగి ఇవ్వగలరా?
లేక, అయిదుపూటల నమాజు ఫలితాన్ని
అల్లా ఎపుడు ఇస్తాడో అడగమంటారా?
అల్లామీద భారం వేసేసి
'అజా'ల పిలుపులతో గుర్తుచేయాలా
ఉపవాసాల ఉద్యమంతో తలుపులు తట్టాలా

3

కట్రంతా, నవాబులని ముద్రవేయడంలో వుంది
ద్రోహమంతా మతం బురఖా వేసి
'న-ఘర్‌కా న-ఘాట్‌కా గా మార్చిన 'బిసి'
బోసి వాదనల్లో వుంది
ప్రణాళికాకారుల, ధనికవర్గ ముస్లింల పన్నాగాల్లో వుంది
చార్మినార్ చూపించి మా పురావైభవాల్ని పొగిడితేనో
తాజ్‌మహల్‌ని ప్రేమచిహ్నంగా పొగిడి
ప్రేమల్ని లాక్కుంటూనో
లాల్‌ఖిలా, ఫతేపూర్‌సిక్రి, బులంద్ దర్వాజాల, గుమ్మజ్‌ల మినార్‌ల
గొప్పతనాల్తో మా ఆకల్ని మరుస్తూ కాలం వెళ్ళబుచ్చడంలోనే
కఠినమైన కుటిలనీతి వుంది.

4

ఇన్ని నిర్ధారణలు మమ్మల్ని
వంచించడం కోసమే అయినప్పుడు
మా ఆటాపాటా చరిత్ర వేషం భాష
దేశద్రోహం ముద్రల దురుద్దేశాల్లోనే విలవిల్లాడుతూ వుంటాయి

హిందూ ముస్లిం భాయి భాయి అంటూనే
మా ముందు నిలబెడుతున్న 'రజాకారు' శిఖండి
నవాబుని తెలంగాణ ద్రోహిగా చిత్రిస్తూనే
బందగీ మగ్దూంల త్యాగాలను మరిపింపచేయడం
ఈ మట్టిని పూజించి సేవించిన వేనవేల ముస్లిం వీరుల్ని
తలచకపోవడం - కుట్ర

ఊర్లను గడీలుగా మార్చిన
వెలమ రెడ్డి కరణం పటేల్ మునసబు దేశ్‌ముఖ్‌ల
వంచనల్ని ద్రోహాల్ని దోపిడిని

'నిజాం పిశాచం' దుర్మార్గం
పేరుతో మాఫీ చేసుకోవడం - కుట్ర

పీరీల పండుగల్లో కన్పించని మతం
జెండాలెత్తే 'ఈద్' ల్లో కల్సిపోయే మతం
దర్గాల దయల మొక్కుబడుల్లో లెక్కకురాని మతం
అకృత్యాల సరిహద్దుల మీదనే
లిఖించడం - కుట్ర

ఊరిపెత్తనాన్ని రాజకీయ పెత్తనంగా
తబాదిలా చేసుకున్నది మా పురావైభవమా
మీ లోపల దాగిన ఊసరివెల్లి కుట్రలోని గుణమా!

5

ఎవరు ఎవరికి తెలుస్తారు
కనిపించేదంతా వినిపించేదంతా
నిరూపణల్లేని అబద్ధమే అయినప్పుడు
అదే నిజమైన నిజమని
నమ్మకపు భ్రమ కల్గిస్తున్నప్పుడు



6

తెలంగాణ సాయిబు మూతికి సిబ్బికట్టి
దోచుకున్నదాన్తో దొరతనాలు చేసిందెవరు?
కరణీకాల 'జీ హుజూర్' లు పలికి
మాన్యాలు మేసిందెవరు?
కులపోడు రాజ్యంజేస్తే కులమంతా నవాబుగిరీయేనా?
కమ్మ, రెడ్డి, బ్రాహ్మణులు రాజ్యం చేస్తే
ఆ కులమంతా రాజభోగం అనుభవిస్తుందా?
ఉర్దూ నేర్చుకున్న దొరలు
నిజామును ఊదరగొట్టలేదా?
'అస్సలామా లేకుం' లతో 'ఆదాబర్స్'లతో
భుజం కలపలేదా!

బజార్లల్లో 'చా' కొట్లలో, పంక్చర్ షాపుల్లో
మగ్గుతున్న తెలంగాణ సాయిబుల పోరడు
ఏ నిజాం వారసుడు
ఏ రజాకారు కుటుంబీకుడు?!
అట్టడుగువాడు సాయిబైనా,చాకలైనా ఒకటే-

మిత్రులారా!
కుట్రలు చేసే ఎత్తుగడల్తో
మా సాయిబు గొంతుల్ని నులిమివేయకండి
పెత్తనాల విత్తనాలు చల్లి

సాయిబుల రక్తపు ఎరువును చల్లకండి
తెలంగాణ ఆర్తనాదంతో పీలగా విన్పిస్తున్న గొంతు
మా సాయిబులదే-
ఆలకించండి!

*మత్తడి, డిసెంబర్ 2002*

# ఇగ అడగయి

• రేడియం

తెలంగాణ వొయ్యిదెర్వు ఒక్కొక్క పాన్దిప్పి సదువు
నిజాం కోటలు గట్టినావు. దొరల గడిలు గట్టినావు. సేట్ల బిల్డింగులు గట్టినావు
ఆయాల ఈయాల గుడిసే నీకు గతయ్యింది
ఎట్టిజేసి నలిగిపోతివి
ఉన్న మంచి సేను కుద్వబెట్టితే మందు మాకేసి గడ్డి మొల్వకుండా జేసింద్రు
ఈయాల నీ బతుకు వొట్టి పోయిన ఆవయింది
బాంచనంటివి కాల్మొక్తనంటివి పొట్టగడవదంటివి
గింజగింజకు దేవులాడితివి
నీ గోదు అడివి గాసిన యెన్నెలాయె
వన్నె యిడ్సిన బట్టాయె డ్యాం నీకాడ నీళ్ళు మరోకాడ
సదువుమరోకాడ ఉజ్జోగం నీకాడ
యాడ జాగదొర్కె ఆడ వాళ్ళ జోటాయె
నీకు జాగా లేకుండా జేసిరి
నీ పోరగాడికి నౌకరి లేకుండా జేసిరి
పాము సీమల పుట్టలాకున్నట్లు జేసింద్రు
మన ద్యావర్ల, జాతర్లు జూసి మనపెండ్లి పేరంటాలు జూసి
గేలి సేసి నవ్వింద్రు మన ఆచారాలకు నిప్పు పెట్టింద్రు
ఇంకా నీకు సమజుకు రాకపోతే
ఇంకా నీకు తెలివికుదరక పోతే గుడ్డోడి బతుగైతది
తెలంగాణ పులిబిడ్డవు
తిరగబడ్డావా కొత్త వెలుగు జిమ్ముతది కొత్త జెండ ఎగురుతది

*మత్తడి, డిసెంబర్, 2002*

# ఇగురెయ్యని మోదు!

● వేణు సంకోజు

పరిష్కారం మాట మాటోల్నె మిగిలిపోతున్నా
నిర్ణయాలకొస్తనే వుంటరు వాల్లు
బలెమురుస్తుంటరు
కరువు మీద బరువు. మనిషై మబ్బు
వివక్షతను కుండపోతగ కురుస్తనేవుంటది
ఇసం గుమ్మరిస్తనే వుంటది
వాసన సుతా మిగలదుగదా
గాలికి వురేసుకుంటాపోతది
నిరాశలు - దుఃఖాలే నిరంతరం ఇగురేస్తుంటాయి
అంతస్తుల మీద అంతస్తులై లేశిన అన్యాయాలు
కూల్చినా కూలవు - రాల్చినా రాలవు
మానవ సంపదంతా వలస సరుకై
రెక్కలు మొలిపించుకుంటది
అవమానాలందినుకుంట గడిపిన అస్థిత్వాలు
దేహాల్లేని అంగీలుగ మాత్రమే తిరుగుతుంటై
సదువులకు రోశి శాకిరి గుదిబండైనకాడ
నౌకరికొందరికి - నడుమంత్రపు సావు కొందరికి
శెట్లు నరికి కొమ్మలు నాటుతుంటరు వాల్లు
పునాదులు పెకిలిచ్చి బవంతులను కాపాడుతున్నమంటరు వాళ్ళు
బరోస మీద బరోస ఇస్తుంటరు వాల్లు
శిర్కలైన కలలను ఎక్కడని ఏరుకోవాలె?
దేనితోని అతికించుకోవాలి?
నిషేధించిన అవకాశాలను వేటితోని కొనితెచ్చుకోవాలి
ఇంటినించి ఎల్లగొట్టి పావురం వొలకబోస్తరువాల్లు

తడారిపోతున్న గొంతు నులిపి తియ్యగ పలకరిస్తరువాళ్లు
అప్పగింతలు జెప్పుకునే సైమాలే
దోసిట్లల్ల నిండుతై
బతుకంత యింకొక రుడాలి పాటై ఆకిట్ల నిలుస్తది
నాపరాల్లు - నాపరాల్లోతిగ మన్సంత
ఇరిగి తున్కలు తున్కలై పోతావుంటది
మాయేవొచ్చి కూసున్నంక అసలు పరాయిగాదు?
కండ్లుండీ తనుకులాట
నోరుండి మూగోనితీరు
బతికుండి సచ్చినోనితీరు
కన్నతల్లికీ - కన్నకడుపుకూ ఎడబాసి
నేనొక గొౖద్రాలుగా మిగుల్తనేవున్న
బాధాగాని బాధను-
వొర్తమానపు గాధనై మిగుల్తనే వున్న
నీదేకరువైన గూడుగ-
ఎంతకూ ఇగురెయ్యని మోదుగ
మార్తనేవున్న- పొగసూర్తనే వున్న

*మత్తడి, డిసెంబర్, 2002*

# కరువు కన్నీళ్ళు

• దార్ల రామచంద్ర

పరిశ్రమల కాలుష్యపు కనికట్టు
మా భూముల్లో రాలిపడనీయదు వానబొట్టు
కరువుకోరల్లో చిక్కిన నా పల్లెలు
భూమినంతా గుట్టలు - గుట్టలుగా తొవ్వినా?
గుక్కెడు నీళ్ళు ఊరటం లేదు! సుమా?
నీటికి కూటికివసించే బుక్కెడు బతుకులు
ఎప్పుడు బుస్సుమంటయో బిడ్డా?
అడుగంటుతున్నాయి భూగర్భజలాలు
ఎండిపోతున్నాయి చేలు - పొలాలు
ఎలుకల పరిపాలనకు పిల్లిని కాపల పెట్టినట్లు
నాడు మా అడవులన్నీ నేడు
మైదానాలు - ఏడారులు
నీరు జీవాధార జీవికోటికి ప్రాణధార!
ఉన్న నీళ్లనేకాసింత చెయ్యాలనట పొదుపు
పొదుపు గడ్డిపూస ఆదారపు పట్టు
కరువులేని కొండ ఎక్కాలట నీమీదొట్టు!
నదులు నగరాలకు మంచినీళ్ళు
పల్లెలకు మాత్రం కన్నీళ్ళే మిగిలినయ్
నీటి కష్టాల లోతులని రాజకీయ రంగులోంచి
తమాష 'సో' చూస్తున్న ప్రభువులు
బోరింగ్ నీళ్ళలో ఫ్లోరిన్ నిప్పుపుట్ట!
మా బతుకులని వికలాంగులుగా మిగిల్చిన చిట్టా!
ధనబలం కాదు- ఇప్పుడు జలబలమే జనబలం
నీళ్ళ నిశ్శబ్దయుద్ధాలని ఆపాలిప్పుడు

*తెలంగాణ సోయి, జనవరి, 2003*

# వలపోత

● కె. అంజయ్య

మట్టి నా కన్నతల్లి
తల్లి నీడలో ఇన్నాళ్ళు బతికిన
మట్టిని ప్రేమించిన
చినుకు చినుక్కు మట్టి వాసన
కడుపు నిండా పీల్చిన
భూమి తడిస్తే నాగలైన
మబ్బుల గూడు జారుతుందని విత్తానాలేసిన
మొలకలొస్తే మొఖం మతాబై వెలిగింది
గింజలు పండిస్తాయి రెండాకుల చేతులు
నిలదొక్కుకుంటే మొలకలు
పరువు దక్కుతది
పతార పుడ్తుంది
చూపు ఆకాశానికేసి గడిపిన
కప్పల పెళ్లి చేసిన
గుళ్లె ఘటాభిషేకం చేసిన
కన్పించిన మబ్బు చినుకు కాలేదు
కదిలొచ్చిన మబ్బు కాలువ కట్టలేదు
గట్టిగా వినబడని సూరు ధారలు
వాడల్లో కదలని కాగితపు పడవలు
పెండ కల్పని సొన్నులు
ఫలితమివ్వని మబ్బుతునకలు
కురిసిన రాజకీయ వర్షానికి
ముడుచుకుపోయిన మొలకలు

నాలుక తడారిపోతుంటే
తనేం తక్కువ తినలేనంది ఎండ
అవిసి పోతున్న మొక్కల గుండెలపై
గంతులేస్తున్న ఉచిత గారడీలు
తడిలేక ఊపిర్లు ఉరోసుకుంటే
అప్పుల పాతరపై మారటోరియం పేరడీలు
తెలంగాణ బోర్ల రంధ్రాల గూడైంది
పాడుబడ్డ పెంకుటిల్లయ్యింది
ఆకలి కారుమబ్బై రోగాలు కురిపించింది
బతుకు కరువులో వాంతయింది
మట్టి తల్లి పేగు తెగ్గోసుకుంటే
కడుపులో దేవింది
నీరింకిన కళ్ళు కోసిన ఆపిళ్ళయ్యాయి
తెగిన పేగుబంధం
అప్పుల కుంపటిని చల్లబర్సింది...చల్లార్చలేదు
కాయకష్టం చేసిన పెయ్యి కరిగి కరిగి
మోడై మిగిలింది ఆశలుడిగి ఉడిగి
ఆకలి గూడుకు బూజుపట్టింది
కుండలో నీళ్ళు కడుపులో కాళ్ళతో సంసారం
వీడని ఆత్మాభిమానంతో సంచారం
ఆశలుడిగిన దీపం ఆత్మహత్య చేసుకుంది
వైరాగ్యం కమ్మిన చెట్టు
పచ్చని బట్టలు పరిత్యజించింది
మొండితనంపక్షి వలస పోయింది
గుండెల్లో ఎన్నీలనౌతానన్న రాజకీయం
ఓట్ల గోతాలు నిండగానే
దండల(గ) పండుగలు చేసుకుంటున్నది

*తెలంగాణ సోయి, 2003*

# ముంతగూడు

• జూనా పోశెట్టి

ఉండ ఇల్లిస్తె పండ మంచమడిగినట్లు
సుట్టమంటు మా ఇంటికి సుగ్గికచ్చి
మా పచ్చనొసటి బాసింగాన్ని
మా ముంతగూడులోని నల్లమణులను
మా తాతముత్తాతల కళారూపాలను
గంగతొనుకులపై మీగడపలోనికి దాటిస్తున్నరు
మీ చాలుతనంతో...
దుడ్డె బొక్కల తీరు మమ్ముల్ని గుంజలగ్గట్టేసి
మా అవ్వ ఎదపొదుగులోని అమృతాన్నంత
పిండుకపోతున్నారు
మా పక్క బొక్కలను మీపల్లకీలు జేసుకొని
మా నుంచి గంధాన్ని అత్తరుగ జల్లుకొని
సోకు జాతర జేస్తుంటె
నెమళ్లమై మీ ముందు గుస్సాడి ఆట ఆడినదానికే కదా!
మా యాసను బాసను గేలిచేస్తున్నరు
పొదలో పెరిగిన పువ్వులాంటి
మా గూడెం బొడ్డెమ్మ బొందిని
ఏట తుపాకి గుండ్లతో జల్లెడ జేస్తున్నారు
మా ఒనారంను ఒర్రెలో పాతరేసి
మా బొందల పై మీ బత్కులకు సదాకులేసుకుంటున్నారు
ఒకసారి మాకేయి సూదుంర్డి
మీ మోసపు ఎలగడలో...
పానంతో తగలబడిపోతున్న మా బతుకు గుడిసెలు
పగిలిన మట్టిపెంకల తీరు....

అల్లారుతు మొగులును సూస్తుంది మా నేలవ్వ
తెగిపోయిన తనుగులు
పారేసిన గోజబొక్కలు
మా గూడెం దర్వాజకు ఆరేసిన ఆకలి పేగులై
అంబా...అని అరుస్తున్నవి అనాద ల్యాగలు
రోహిణి ఎండలు రోకండ్ల అడదెబ్బలై తాకంగ
రేగడి దుబ్బలా అరికాళ్ళు తైతక్క లాడంగ
చినిగిన చీర నెత్తిన కట్టెలమోపుతో
ఎండిన గుండెను ఆశల కొంగుకు ముడేసుకొని
అడుగడుగులో చెమట ఇత్తులు నాటుతు
అద్దతునుకి కట్టెకోసం అడివినంత దాటుకుంటూ
పట్నపు దారులవెంట పిసదానిలా తిరుగుతున్నది
హైమన్‌డార్ఫ్ ఆత్మీయురాలు
మా అడివితల్లి జంగూబాయి
ఇంకా గిట్లనె మీ అధికార పగ్గాలతో
మా ఆకలి కడుపులను ఆడేసి పిండుతే?
రాలిపడుతున్న ఒక్కొక్క మా చెమటబొట్టు
కొమురమ్ భీమ్ ఒడిసెలోని అక్షరాల పలుగురాళ్లై
రజాకర్ కట్కె గుండెను పల్గొట్టినట్లు
పరిగె పిట్టలవలె మిమ్ములన్
మా గూడెం పొలిమెర దాటేదాక
తరిమి తరిమి కొడుతామ్!!

*తెలంగాణ సోయి, 2003*

# పైలం కొడ్కో

● కారం శంకర్

బర్ల గొర్ల గాసుకుంట
గాలికి తిర్గెటోడివి
సదద్దంటే ఇన్లేవు
నువ్వు పుట్టిన ఆర్నెల్లకే తండ్రి కాలంజేసే
నా రెక్కల కష్టంమీద నిన్ను సదిపిచ్చిన
చెడ్డిల్దొడ్కొని ఇస్కూల్‌కు వోయేటోడివి
లాగు లేయవట్టివి లగ్గం లేకపాయె
కోడలస్తే నా కష్టాలు తీర్తయనుకున్నా
బుక్కెడు బువ్వకు ఆసరైతదనుకున్న
పిల్లా జెల్లాల్తోని ఇల్లు కలకల్లాడ్తదనుకున్న
సదుసంకల మంటి బుర్ద మోకాలమంటి అన్నట్లు
సర్కార్ నౌక్రి రాకపాయే లగ్గం గాకపాయే
'అవ్వా' అని నోర్నిండ పిల్సెటోడివి
అమ్మా అనవట్టివి
కొడ్కా కుతినిండ్తలేద్రా...

కొడ్కా
లగ్గం చేసుకునే ఈడు దాటి పోవట్టె
నీ తోటోళ్ళకు లగ్గమయి పిల్లలైరి
నా పాణం కలకలగావట్టె
నీకు పిల్లను సూస్తనంటే నౌక్రి
దొర్కినంక సూదుమంటవ్
యేండ్లు గడవవట్టె

కొడ్కా
నువ్వెంత బిత్తిరోడివిరా
ఇప్పుడన్నా కండ్లు తెరు
యాడికెళ్లినో అచ్చినోడు పక్కనే మసులుతుండు
ఆడు సాప సంకల సుట్టేదాక
నీకు సర్కార్ నౌక్రి రాదు
లగ్గం గాదు
నాల్గు దినాలైతే
ఈ శేను, శెట్టూ భూమి, జాగ, నాదంటడు

కొడ్కా జర పైలం
దుష్మన్ మీద నిగ్రాని వెట్టు
నీ బాన పైలం ... నీ యాస పైలం

*తెలంగాణ సోయి - త్రైమాసిక సాహిత్య సంచిక 2003*

# మా ఊరు

● పంజాల జగన్నాథం

పొల్మెర్ల... దూరాన
మెలికలు తిరిగిన
నల్లతాచు పాములా రాదారి
అటూ, ఇటూ చిట్టడవులు, గుట్టలు
గుట్టల్ని ఒరుసుకుంటూ
వాగు, పొర్లే ఒర్రెలు
పిల్ల కాలువలు, చెరువు గాలాలతో
తోపెల్లతోటి చేపలుపట్టెటోళ్లు
చెర్ల బొర్లాడే బర్లు, కాలువల్ల
గోకలు, బరిబాత
తానమాడే పొలగాండ్లు
గుడి మైకుల సుందర కాండ..
పచ్చని పొలాలు, తాటి వనాలు
ఈత గుంపులు..నడుమనుంచి
ఎర్రటి కంకర రోడ్డు
రోడ్డు పక్కన ఎల్లమ్మగుడి
గుడి పక్కన రాతికట్టడం, చేదబాయి
గుడి ముంగట ఊడలు దిగిన
పెద్దమర్రి చెట్టు
చెట్టు మీద ఎన్నో పిట్టలు - కిచకిచలు
ఊరి మొదట దొర బాయి ...ఈతలు
సూర్లు గొట్టుడు
మోట చిమ్ముల నుంచి
ముక్కు మూసుకొని దుంకుడు

ముందుకు సాగితే గ్రామపంచాయితి ఆఫీసు
దానిముందే పెద్ద రావిచెట్టు
చుట్టుతా సిమెంట్ గద్దె
గక్కన్నే ఊరి పంచాయితీలు
ఊళ్ళ నాలుగు తొవ్వలకాడ బొడ్రాయి
దినంల ఒక్కసారే వచ్చి పోయ్యె ఎర్రబస్సు
బస్సుటాప్‌ల సుత మంది
బుదారం సంత
అమ్మేటోళ్ళు కొనేటోళ్ళు
డాక్టరుండని దవాఖానా
కసురుకునే కాంపౌండరు
చెట్ల కిందనే బడి
చెప్రాసి తోటే నడుస్తుంది
పగలు రెండింటికి దిన పత్రిక
రాత్రి పంచాయితి రేడియల
మీరు కోరిన పాటలు
లో ఓల్టేజి లైట్లు మూడు ఇంటర్వెల్లు ఇచ్చే
సినిమా హాల్లు

*తెలంగాణ సోయి, 2003*

# పయిలం

● *సిద్దెంకి యాదగిరి*

"పోతున్నవ్ గని పయిలం
పొయినకాడ మంచిగుండు
నీదేందో నువ్ జదువుకో లేకపోతే
నీ బతుకే నవ్వుట్ల బతుకైతది
ఎవ్వని తెరువుకువోకు
ఎవడేమన్నంటే నన్ను గాదనుకో
బజాట్ల కుక్కలు మస్తుగ మొరుగుతయ్
అన్నిటిని కొడుతమా?
బతికినన్ని రోజులు మంచిగ బతుకాలి - నాయిన బోధ

"బిడ్డా! యాల్లకు దిను,
తిండి కాడ సిగ్గు పడకు
కండ్లు పెద్దగ జేసి
కడుపు సిన్నగ జేసుకో
పోయినంక పోచయ్యి
సారు యింటికి ఫోను
చెయ్యి" - అవ్వబాధ

"ముగ్గురున్నకాడ ముచ్చట వెట్టకు
నలుగురున్నకాడ నవ్వకు
ఒగొల్లు తాగిపిస్తె తాగకు
తినిపిస్తె తినకు
అయ్యకు పని ఆసర అవుతవేమో
అనుకుంటే పట్నం పోవడితివి
పోతె పోతివిగని ఓ నౌకరి దొరికిచ్చుకో
పయిలం బిడ్డా మంచిగ సదువు" - నాయినమ్మ

“ఉట్టిగనే సెప్తుతలేను
జరుగవోయేదే సెప్తుతున్న మంచిగ యిను
ఆడోళ్ళ జోలికి వోకు
మెడకు ఉరి వెడ్తరు
ఎఱ్రగ బుఱ్రగ వున్నవని
ఎదురొస్తరు నమ్మకు నమ్మకు
ఈ సదువు కాంగనే నాలుగిత్తులేస్తగని
నమ్మకు ఒగొనికి చెయి చాపక బతుకు
బసులు కార్లు పట్నంల
బాగుంటయట రాంగపోంగ పయిలం
పోయినట్లు కాదు పలానోని
మనుమడివని పేరుదేవోయ్” - తాత

నా గురించి ఏమి ఫికర్ చేయ్యద్దు
నేను మంచిగనే ఉంట
అవ్వా నా కడుపు గురించి రంది పెట్టుకోకు,
నా గురించి ఏడ్వకు
నాయిన! మంచిగ సదివి
బతికినన్ని రోజులు నీకు పేరు దెస్త
అమ్మా! ఒగరికి ఆసపడిన బతుకు బతుకనే...

ఒగరు నాకాసపడెటట్లు బతుకుతనే

తాత! నువ్వుజెప్పినట్లు నేనున్నన్ని రోజులు
నీకు మంచి పేరు దెస్తా...
ఇగవోతున్న...ఇంటికాడ
పయిలం అందరు పయిలం.

*ఆదివారం, ఆంధ్రజ్యోతి, 8, జూన్, 2003*

# ఒక జననం ఒక మరణం

• *గుడిహాళం రఘునాథం*

పునరపి జననమేమోగాని
మరణం మాత్రం ఖాయం...

ఈలోగానే బతకాలి గాలులై హోరెత్తాలి
వానలై కురవాలి ఎండలై మండి ఠారెత్తించాలి
తుఫానులై గింగుర్లెత్తించాలి

అప్పుడప్పుడు మౌనులమై మనలోకి మనం ప్రయాణించాలి
చిక్కుల్లో చిక్కాలి ఉక్కుముక్కల్లా నిలబడాలి

చెట్లలా పచ్చబడాలి మాటతో మాట్లాడాలి
లోకాన్ని పరిహసించాలి

ఎప్పుడో ఒకప్పుడు
శవాలం కావలసిందే మనుగడలో మాత్రం
మానవులమై పరిమళించాలి
వీరులం కావాలి, తప్పదు కానీ యుద్ధాన్ని పరిహసించాలి

గద్దలం గంగిరెద్దులం కావొద్దు
మనుషులం కావాలి

రాత్రులం కావాలి
కానీ చుక్కలమై వెలగాలి
ఎప్పుడో ఒకప్పుడు 'బుగ్గమీసాల పత్తేదారు' వస్తాడు
'హాండ్సప్' అంటాడు రిక్తహస్తాలతో వచ్చాం
రిక్తహస్తాలతోనే వెళ్లిపోవాలి

*ఆదివారం, ఆంధ్రజ్యోతి, 15, జూన్, 2003*

## బువ్వలొల్లి

● వడ్డెబోయిన శ్రీనివాస్

నికురం జేసి
బత్కుపాడె మీద
బల్మీటికి బండబెట్టిన
వొగ మొసదీస్కుంటున్న శవం

వొలపటదాపట జినిగిన
పేల్కల పేల్కల ఆకుపచ్చ సీరె నా తెలంగాణ
నొగలిర్గి నొసలుపల్గి కుంటిదైన
ఎడ్లబండి
తెలంగాణ పల్లెకు
సర్కారికి
వొగ బ్యారంగుదరని యాపారం

వొయిసుదనం బత్కు
పొలిజల్లిన పొలంలో
లొట్టపిట్ట అడుగులు
మన్సుల్లో తడారి
మబ్బుల్లో ఎడారి
మీరెసాబు ఇగరాడాయె అగరాడాయెని
పడిగాపులు బడ్తున్న భూం

మా అవ్వ ఉప్పలమ్మను
'ఓవ్వా! గింత బువ్వెయ్యరాదంటె
ఎఱ్రటెండల్ల బుడ్లెకల్లు బొంగిన తరీఖ
బూరు సెక్కలు బఱ్రునంటుకున్న తరీఖ

భగ్గున మండుకుంట మిర్గులు రాల్చుకుంట
మా నాయ్న కొంరయ్య కోప్పడ్డడు
"బువ్వేందిర బువ్వ' అన్నమెయ్యమ్మ అన్మ'ని
అర్గీజ్ లొల్లిబెట్టి
'సదువుకున్నోనోల్గె మాట్లాడమ'న్నాడు

గింతైనోల్గె జుమ్ల మొత్తం బువ్వలొల్లిల
గీ తెలంగాణ ముసలోల్లు వొయిసోళ్ళు బుడ్డపోరలు
వొక్క పాలికండ్లబడ్డరు
కుర్దుగ జూద్దు గదా-

గీ మట్టిల
గీ మన్సుల్ల
గీ మతుల్ల
గీ సదువుల్ల
ఇసం ఒండుబారి అట్టలు గట్టింది
ఎవ్వలకి
తెలంగాణ కాళ్ళులేవ్
సేతుల్లెవ్
బాసలేదు
బత్కులేదు

మారె
తౌటం బెట్టాలె
పాయదీసి
పాదుల్దీసి
తెలంగాణ ఏర్లల్లకు
ఏరువాకోల్గె జొ(రబడాలె

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, జూలై, 21, 2003*

# దెశెపో

• ఆర్. రత్నాకర్‌రెడ్డి

ముందట మోసుదు
ఎనక ఎత్తి పోసుదు
బోకెత్తులోనేషాలు నాకు గిట్టె
ఏం జెప్పినా ముఖం మీన్నే
ఏం జెప్పినా ముక్కు సూటే
ఎప్పుడన్నా-
మన బతుకు వయ్యిలచ్చిందా?
మన తీరు తెలివిల వద్దదా?
మన పని పనికచ్చిందా
మన చెమట పనికి కొలబద్దయ్యిందా
భూం బుక్కుల్లారం, బట్ట బంగారం
రంగురం, సైలెక్క
..కందమ్మ గుడ్డలు రానువోనడుగులు
మన ఆటా పాటా ఆటైందా పాటైందా?
మన మాటన్నా భాషైందా?
గుమ్మి, గంగాళం, పంటెకొక్కులు
బాడుజోల్లు...
మన ఇసిరె ఇసిరైందా
మనిసిరె పేరుకచ్చిందా
రాలె
రావద్దు గూడా
అత్తె
ఆది కవుల అగ్రతాంబూలాల చరిత్రతోటి
మొస్సదమ్ము లేకుంట కలవడపోదుమా

వాడు లచ్చుబొంబై రంగాలు జెప్పనీ
ఎత్తుకెత్తు దూగకుండా ఎన్కకు
మర్లత్తమా-
నివద్దిగనె....
మన పెయ్యిల నివాల్ నివాల్
రక్తం పారుతలే
అమ్మను మమ్మనకపోతే సంబ్రమైతలే
తింటున్న బువ్వను రైస్ అనక పోతే
అరుగుతలే
అయినదానికీ కానిదానికీ 'సారీ' జెప్పకపోతే అడుగు సాగుతలే

సోయి కచ్చేకొద్దీ
మంటపుట్టుకత్తంది
ఎక్కల్లేని రేషం తన్నుకత్తుంది
ఇప్పుడు కిందపడ్డా....
'దెశెపో' అనే అంటా!

*పాలపిట్ట కవితాసంకలనం జూలై, 2003*

# నీళ్లతో కాళ్ళు కడిగి

● హనీఫ్

గరీబోళ్లం
మెట్ట పొలాలు ఆస్తులున్నోళ్లం
గోదావరి గలమలోనే పారుతుంటది
చేతులు పైకెత్తి ఆకాశానికి అంటగట్టారు
ఆకాశవాయి పొలాలున్నోళ్లం
మా బిడ్డలు తిండిలేక
పైర్లు నీళ్లులేక
ముదుత రోగం వట్టి
సావుకల నుదుట అద్దబడ్డోల్లం
తల్లి రెక్కల దాపుకు రానీయకుండా
నిధుల పిల్లల్ని తన్నుకుపోతున్న
రాబందుల రాష్ట్రం
జర గొంతు నీళ్ళు జారనీయండి
నా బిడ్డల నాలుకమీద అచ్చరం
(అన్నం) ముద్దరేయండ్లి
కోకిలోలిగ పాడి సూపిస్తదు
నా భూమిల ఇంత నీరు పారీయి
దూది పూల కొండల్ని పేరుస్తం
రెక్కల కష్టం దాసుకొనేటోళ్ళం కాదు
పాలమూరోళ్ళ చెమట భూమంతా
ఇంకే వుంది.

అవ్వ
పారాలు బట్టీపట్టి
వప్పజెప్పేటోళ్ళని కాదు
బతుకు పారాలు నేర్పే
గౌతమబుద్ధుల్ని కన్నది
ఈడొచ్చిన పోరగాండ్లు
అనాధశవాల గుట్టల్లా పడున్నప్పుడు
కుమిలి కుమిలి ఏడ్వలే
మోదుగ పూలోదిగ కండ్లెర్రజేసి జులూస్
ఎత్తింది
నా అవ్వ తెలంగాణే
అవ్వ రుణం తీర్చుకోవాలె
నీళ్ళతో కాళ్ళు కడిగి
నెత్తిన జల్లుకోవాలె.

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 1 సెప్టెంబర్, 2003*

# గిది తెలంగాణ

• నూటెంకి రవీంద్ర

అవ్వతోడు గిది తెలంగాణా
గిక్కడ
బత్కుమీది కన్నా
మనిషి మీది కన్నా
మట్టిమీన్నే పావురం

గీమట్టి పరాయిదైనందుగ్గాదా
'బండెనుక బండి గట్టి పదారు బండ్లు గట్టి'
నిజాం సర్కారోనికి గోరి గట్టింది
గీమట్టి కిరాయిదైనందుగ్గాదా
పొద్దుగూకని రాజ్యానికి పొద్దుపొడుపు లేకుండా జేసింది
గీమట్టి గడీల గుత్తసొత్తైనందుగ్గాదా
రగల్ జెండాలై మొలిచి రైతుల అండ నిలిచింది

• • •

పిప్పరమెంటిచ్చి పిలగాన్ని బుదురకిచ్చినట్టు
అద్దద్దంటున్నా 'ఇశాలాంధ్ర' కు తలనుజేత్తె
కలిసుంటే కలదు సుకమనుకొని ముర్సిన

బతుక నేర్సినోనివి బాటసారోలె వత్తె
బతుకుదెరువు జూపి సుట్టాన్ని జేసుకున్న
మరి నువ్వేం జేసినవ్
పెద్ద మనుషులొప్పందాన్ని పెద్దల్ల గలిపినవ్
మా కంట్లె కారంగొట్టి మా నౌకర్లు కాజేసినవ్
మా నోట్లె మన్ను గొట్టి మామట్టి నోళ్ళుగొట్టి

మా జీవనదుల్ని నీ జలనిధుల్ని జేసుకున్నవ్
పోనీలే మనోడే అనుకున్నా
గియ్యాల గాకపోతె రేపన్నా నాయం జరక్కపోద్దాని
పచ్చోలె ఎదుర్జూసిన
నీ బాస నేర్సిన నీ యేసం గట్టిన
గియ్యాల
గా మట్టె వల్లకాడై పోతంది
మా బత్కులే ఏడారై పోతున్నై
ఇగెట్లూకుంట

పెండ్లైన నెల్లాలకే కట్టుకున్న దాన్నిడ్సిపెట్టి
బొంబైవోయిన మా భీమని మీదొట్టు
ఆడదాని 'తాడు'నీ వున్నొక్క శెల్కనీ అమ్ముకొని
దుబాయివోయిన మా దుర్గని మీదొట్టు
కూడుగ్గతిలేని శెయ్యిబిగించిన ఎఱ్ఱని పిడికిళ్లై
అడివిల అన్నాలమై పోయిన మా రాజన్న మీదొట్టు
గడ్డీగాసం లేక దేశదేశాల నోళ్ళలో
మాంసం ముద్దలైతున్న మా గొడ్డుగోద మీదొట్టు

మట్టి మీన్నే మమకారం బెంచుకున్నోన్ని
గీ మట్టిల్నే పాణాలు బెట్టుకున్నోన్ని
గీ మట్టికోసం పోరాదుడు నాకు కొత్తకాదు.

*జాద కవితా సంకలనం, నవంబర్, 2003*

# ఊర్లల్ల ఆనలు

● టి. కృష్ణమూర్తి యాదవ్

ఊర్లల్లకు ఆనలత్తన్నయంటే
సెట్లన్ని పోషమ్మ గుడికాడ ఊగే
శివసత్తులెక్క ఊగుతాయి
ఊర్లల్ల అచ్చె ఆనసినుకులు
రేకుల ఇండ్లమీద పడితె
గరీబోని పెండ్లికి పెట్టిన
సప్పులెక్కుంటయి
గూనపెంకు ఇండ్లమీద పడే
ఆన సినుకులు
ఎంకన్న పండుగకు పడే
ఉండ్రాల్ల సప్పుల్ల లెక్కుంటయి
ఆరు బయట తడిసిన సెట్లన్ని
బాసరల, భద్రాచలముల
పుస్కరతానాలు సేసి
నెత్తులారబోసుకొని నిలబడ్డ
అమ్మలక్కల్లెకుంటయి
ఆనలు కుర్వడం సెయ్యవట్టి
దొరగడి సుట్టు గడ్డి మొలిసి
శేన్ల దున్న పోతు పడ్డట్టు కన్పిత్తది
కోమటి సెన్నయ్య మిద్దె మీద
కంచుడు పెట్టి ప్యాలాలేంచినట్లు
ఆనసినకులు సిటపటలు సెయ్యవట్టె
మొగులంత నల్లనిగుడ్డెలుగయింది

ఆనలు కుర్వడం ఆగెటట్టు లేదు
కోళ్ళు గంపల కిందున్నయి
ఎడ్లు కొట్టంల ఉన్నయి
మన్సులు ఇండ్లల్ల ఉన్నరు
ఆనముసురు
ఊరంత మూసుకచ్చింది
ఎవ్వని ఇల్లు ఎక్కడుందో
తెల్తలేదు
తడిసిన గొల్ల బుచ్చమ్మ
గుడిసె సూర్ల కెల్లి
పొయ్యి రాజేసిన పొగలు
సూరంటుకున్నట్లు కన్పిత్తయి
వాడవాడల లీళ్లు
బుస బుస పొంగుకుంట
కాల్వలు కాల్వలయి పాములెక్క
భూమ్మీద తిర్గవట్టె
ఆనలు ఆగినంక సూత్తె
పనిపిల్ల ఉతికి ఆరేసిన
చీరయింది మొగులు
మబ్బులల్ల సూరీడు కన్పియవట్టె
అప్పుడే జజ్జికాన్ల పుట్టిన
ముద్ద మొఖం ఎఱ్ఱపోరని లెక్కుందు

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 8, మార్చి 2004*

# ఆఖరి వేర్లు

● *వి.బి.ఎన్.శ్రీను*

ఈ రోజు
పొలాల్లో ఎవరూ లేరు
మనుష్యుల్లేరు
మొక్కల్లేవు
నీళ్ళూలేవ్
బతుకు పరిగె
ఏరుకు తింటానికి
ఒక పక్షీలేదు

ఆ భూమ్మీద
ఎన్నికలల పెట్టుబడి
ఎన్ని ఆశలవాములు
పచ్చదనాలు పంచ ప్రాణాలు
మట్టే
మహా జీవన శిల్పి

వొరి గొల్సులా ఒదిగిపోయి
ఎన్నిరాత్రులు మోశాడో
ఎన్ని పగల్లు ప్రవహించాడో
వొక ఎండగాదు
వొక వానకాదు
పజ్జొన్నకర్రలా నిలబడి
ఎంత కాలాన్ని
కంది చేనుల చేతుల్ల

పబ్బతిబట్టాడో
బతుకుపొదుల్లో
అప్పుల కంతులుకడ్తున్న
వేరుశనగ చేనులానే నవ్వేవాడు

వసంతానికి వన్నెలద్ది
వొర్రెలో గొర్రెలా తిరిగేవాడు
అమాయకంగా
ఆకలివేర్లు పెకిలించబోతే
ఆఖరివేర్లూ తెగాయి
కొన్ని గింజమోసం చేసింది
ఏసిన ఎరువు ఎదలబొడిసింది
పురుగు మందు పుర్రె గొట్టింది
బోరు బోరిగె బలగ్గొట్టింది
కాలం కడుపుగొట్టింది
కరువు కలల మింగింది
ఉత్పత్తి ఖర్చుల ఉప్పెనలో
వెన్నెముక
బతుకు మునిగింది
జీవితం తాలైయ్యింది
రాలని మబ్బురాళ్ళచెట్టు ఆకాశం
వలసల కొండచిలువ వికాసం
పీడాత
అల్లుకుంటున్న
నాగలికాళ్ళు విరిగిన చప్పుడు
నెత్తుటి కల్లం
మృత్యువు పళ్లెం

ఈ రోజు
జీవితం కమిల్న పొలాల్లో
ఎవరూ లేరు
వొదిలేసిన తపోదీక్ష వొరంమీద
ఎవ్వరిదో
ఎండిన వొక అడుగు
చెమ్మగిల్లని కాల్వకంట్లో
పెరికేసిన కలల మదుగు
బంగారు వన్నెలో
కాదు మంటల వలయం
పంట పొలమొక
పద్మవ్యూహం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, జూలై 19, 2004*

# చిక్కనవుతున్న దుఃఖం

• సతీశ్

నిన్నటి రాత్రి సాక్షిగా
ఊరిని ఒంటరి చేసి ఆకలి ప్రయాణం
తీరాల ఎదురు చూపుల్లో
నెర్రెలు బారిన కళ్ళు
అవిచ్ఛిన్నమైన దుఃఖ వారసత్వం
ఇక్కడ నదులు, కన్నీళ్ళు
సమాంతర ప్రవాహాలు
బ్రతుకు కాన్వాసుపై
నవ్వుల పసరికలు మాడిపోయి
జీవితం పడావు పడింది
ఇంకుడు గుంతల్లో నీళ్ళెతుక్కుంటున్నజనం
నదుల్లో టూరిజం ఈతలు కొడుతోంది
ఎత్తుపల్లాలను ఎరుగని వలసప్రవాహం
కరువు కర్కశ కరచాలనాల మధ్య
కలలింకిన దృశ్యం
దిగులు గుమ్మానికి ఒంటరి గుడ్డి దీపంలా ముసలి అవ్వ

*పాలమూరు గోస సంకలనం, జూలై, 2004*

# పాలమూరు కరువు దృశ్యం

• కమలేకర్ శ్యామ్‌ప్రసాద్‌రావు

పాలమూరు పల్లెలో ఇప్పుడు
"బాగుండావా బిడ్డా" అని
పలకరించే పిలుపులు కరువైనై
పల్లెదారివెంట సేదతీర్చె
కానుగ చెట్లు కనవడకుంటైనై
పల్లె పల్లెంతా చీడబట్టి సోలిపోయిన
జొన్న కంకులలెక్క వుంది
తల్లిలాంటి పల్లె తల్లడిల్లుతోంది
పెద్దబాలశిక్ష అటకెక్కింది
కాన్వెంట్ చదువులు అందలమెక్కినై
పాశ్చాత్యపు మోజు,
సాలెగూడై పల్లెను చుట్టేసింది
సాంప్రదాయపు ఛాయలు
కనుమరుగవుతున్నై

దిగుడుబాయి ఎండిపోయి
నీళ్ళు రాని బోరుబాయి బోరుమంటున్నది
రచ్చబండ మీద కుసునే
మనిషి జాడ కనుమరుగైంది
పేరుకుపోయిన పెంటకుప్పలు
వూరి కష్టాల ఊసులు చెబుతున్నట్టే వుంది
కనికరించని మేఘాలు వట్టిపోయి
నీళ్ళింకిన చెఱువులు నోళ్ళు తెరిచి

భూమిలనుంచి చేతులు పైకెత్తని మొలకలు
రైతు గుండెలో గునపాలు దింపినట్టుంది
పక్కన కృష్ణవేణమ్మ పారుతున్నా
పాలమూరుకు నీళ్ళ ఫలము దక్కలేదు
పల్లెల పాలదనం కండ్లల్ల మెరుస్తలేదు
వానజల్లు కురవని నేలపై
హామీల జల్లులు కుండపోతగా కురుస్తున్నయి
గాయపడిన నేలపై
శంఖుస్థాపనల ఫలకాలు మొలుస్తున్నయి
కరువు రక్కసి పాదాల కింద చితికిన
నా తెలంగాణ కోటి బీటల బీడు
నా పాలమూరు వలసపక్షుల గూడు

*పాలమూరు గోస కవితా సంకలనం జూలై, 2004*

# మనుసులో గోడలు

● ఎస్వీ సత్యనారాయణ

ఆ గోడల్ని కూలగొట్టకండి
అక్కడి ప్రతీ ఇటుకకూ
నా జ్ఞాపకాల స్పర్శ ఉంది
ప్రతి మట్టి రేణువులో
నా రక్త కణాల ప్రతిధ్వనులున్నాయి

అది పాత నగరంలోని
అతి పురాతనమైన పెంకుటిల్లే కావచ్చు
నాకు జన్మనిచ్చిన కన్న తల్లి
మాటలు నేర్పిన మమతల కల్పవల్లి
వేలు పట్టుకని నడిపించిన ఊత కర్ర
నడతను తీర్చిదిద్దిన తొలి గురువు-

రోజంతా గౌలీపురా గల్లీల్లో
గిల్లీ దాండూల్ ఆడి అలసినప్పుడు విసనకర్ర
బాలాగంజ్ వీధుల్లో
గోలీకాయలు ఆడుతుంటే నోటికందిన ఐస్‌గోలా
మొరంబాయిలో మీరాలం చెరువులో
ఈతగొట్టి తడిసి ముద్దయిన
నా తలను తుడిచిన తువ్వాలు అదే కాదా!
వీధి భాగోతంలో చిన్న కృష్ణుని వేషం వేసి
చిందులేస్తుంటే దిష్టి దీసిన అమృత హృదయ
పీర్ల పండుగనాడు దూలా ఆడుతుంటే
పులకించిపోయిన పిచ్చితల్లి
క్రిస్‌మస్ ఉత్సవాల్లో బాలక్రీస్తునయితే

నిండు మనసుతో దీవించిన మరియమ్మ
బోనాల పండుగ ఉత్సవాల్లో
కోయనృత్యం చేస్తుంటే మురిసిపోయిన అమాయకురాలు
తోటి పిల్లల్తో కొట్లాడి
తలదాచుకోడానికొస్తే రెక్కల్లో దాచుకున్న తల్లికోడి...

షంషీర్ గంజ్ చింతకాయలు తెంపుకొస్తే
ఉప్పు,కారం అందించిదెవ్వరో తెలుసా?
ఫలక్‌నుమా గుట్టలోంచి మామిడికాయ కోసుకొస్తే
ముక్కలు కోసి నోట్లో పెట్టిందెవరో చెప్పండి?!
నాటకం ప్రాక్టీసులో మైసయ్య బీడీలు తాగొస్తే
నోట్లో వాసన చూసి మందలించిన యశోదమ్మ
దాగుడు మూతలాటల్లో కోతివేషాలు వేస్తుంటే
చెవిని మెలేసిన పంతులమ్మ

భక్త మార్కండేయ నాటకంలో నాయకపాత్రను ధరిస్తే
ఓంకార నాదమై ప్రతిధ్వనించింది
భజన గీతాల్లో వైరాగ్యం ప్రదర్శిస్తుంటే
ఇప్పుడే ఎందుకురా? అని వారించింది-
బాబన్న, సుదర్శన్, కుమార్‌లతో కలిసి
ఎన్ని పిచ్చుక గూళ్ళు కట్టుకున్నం?

ఉషస్సు రచయితల సంఘం
ఊపిరి పోసుకుందెక్కడనుకుంటున్నారు?
తెలంగాణపై నా తొలి కవితలు ఇక్కడే చిగురించాయి
సునెహెరే గీతాల బాణీల్లోంచి
కొత్త పాటలు పుట్టుకొచ్చిందెక్కడో తెలుసా?-

పిల్లవాడు పనికొస్తాడని పుల్లన్న నన్ను పట్టుకున్నదిక్కడే
బంగ్లాదేశ్ విముక్తి పోరాటానికి
కవితల నీరాజనాలందించిందిక్కడే
అలియాబాద్ చౌరస్తాలో 'జీవజ్వాల' లు రగిలించాం

లాల్ దర్వాజా గోడలపై పోస్టర్లమై ప్రకాశించాం
టెంపర్సన్ హాల్ లిఖిత పుస్తకాలు రూపొందిన ప్రయోగశీల
భారత గుణవర్ధక సదస్సులకు రిహార్సల్ గది ఇదే-
వైదిక ధర్మ ప్రకాశిక విద్యాలయం ప్రాంగణంలో
అభ్యుదయ రచయితల సభ జరగడం ఊహించగలరా?
ప్రతి పాతనగర కవీ
ఒక చేత్తో కలం మరో చేత్తో లారీ పట్టిన
కార్యకర్తగా రాటుదేలింది ఇక్కడే
గుర్తుందా లోకేశ్వర్?

మహెబూబ్ నారాయణ ఇంట్లో
ముస్లిం స్త్రీలకు రక్షణ కల్పించడానికి
కర్రలందించిందెవ్వరో తెలుసా?
సారా రౌడీలనూ, మతోన్మాది గూండాలనూ
తరిమి కొట్టిన కార్యక్షేత్రమిదే
ఇక్కడే కదా సామాజిక ఉద్యమాలకు ఓనమాలు దిద్దుకున్నది
ఒకవైపు సాంఘిక ప్రతిఘటనలు
మరోవైపు సాహితీ సృష్టి
ఎంత విచిత్రమైన పరిణామం?!

ఇక్కడే - ఈ గోడల మధ్యనే
గోర్కీ 'అమ్మ' ను చదువుతూ పిడికిళ్ళు బిగించాను
తెన్నేటి సూరి 'చెంఘీజ్‌ఖాన్' నవలలోని టెమూజిన్‌ను ప్రేమించాను
శ్రీశ్రీ పద్యాల హోరులో కొట్టుకుపోయాను
చలం దుమారంలో చలించిపోయాను
శరత్ నవలల్లో కరిగి కన్నీరయ్యాను
మహోపన్యాసకుల ప్రసంగాల్లో తడిసిపోయాను
సాహితీ హృదయుల స్నేహ స్పర్శతో పులకించిపోయాను
అరుణపతాకం రెపరెపల్లో ఉత్తేజం పొందాను

ఊరేగింపుల్లో నినాదమై ధ్వనించాను
గోడల మీద రాతై ద్రవించాను-

మూఢ విశ్వాసాల జనవాసాల నడుమ
హేతువాదిగా రాటు దేలాను
మట్టినీ, మట్టి మనుషుల్నీ ప్రేమించడం నేర్చుకున్నాను
ప్రజా ఉద్యమాల్లో పాటై ప్రవహించాను
అధికారపక్షం వైఫల్యాలపై అధిక్షేప కావ్యాన్నై వర్షించాను
కులం ఆత్మ న్యూనతను ఛేదిస్తూ
కులం నిర్మూలన కేతనమై ఎగిరాను
కులాంతర వివాహాలకు దిక్సూచినయ్యాను

ఇదొక నిరంతర ఆలోచనధార
బాల్యాన్ని పట్టిచ్చే భావ జలధార
ఇంతకూ
అవి కేవలం గోడలేనా?
నా జ్ఞాపకాల జాడలు
నా మూలాల మేడలు

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 9, ఆగస్టు, 2004*

# మనిషే నా ఎజెండా

• జీగురు అయిలయ్య

నా గుండె
ఇప్పుడు చెరువు కాదు
తెగిన మత్తడి
రావలిసిన ఉసిల్లు రాలె
తేనె తుట్టెలో మంట బెట్టిందెవరో?!
నమ్మిన నీడ మూడో పాదమై మొలుస్తుంది
కాలం ఉట్టిమీది పెరుగూ కాదు
ఉప్పెన్ల జల తరంగం
కళ్లు / కాళ్లు చేతులు / మెదడు
అన్నీ 'ఎర' వేయబడ్డయ్
కాటు వేయబడ్డ కాలం
కార్జాలు పెకిలిస్తున్న ఎదుగుదల
ఊరడింపుల విస్ఫోటనం
ఇప్పుడు
చాట్లో తవుడు పోయకుండానే
మనుషుల్ని ఎగేత్తంర్రు
ఒక విశ్వాసం ధ్వంసమైన చోట
మరో విశ్వాసాన్ని నాటుకుంటున్న వాన్ని
బతుకు పెనుగులాటలో
మెతుకు జరుగుబాటులో
మనిషే నా ఎజెండా?
మట్టి వాసన్లే నా ఊపిరి

*ప్రజాతంత్ర సెప్టెంబర్ 12-18, 2004*

## తెలంగాణా వ్యాకరణం

• అన్నవరం దేవేందర్

చరిత్ర పొదుగునా చమర్చిన కన్నీళ్ళ గాయమై
పెయ్యి నుంచి కారుతున్న నెత్తురు
ఏండ్లకు ఏండ్లుగా సుడిపడుతున్న జీవితం
అయినా ఎక్కడా నా పేరు ఎక్కలేదు
పేజీ పేజీల్లోనూ నేను గాయబ్
జనం నొట్లెకెల్లి ఊడిపడ్డ పదం
నిఘంటువుల పదఘట్టనలో నలిగి పోయింది
ఏ పదబంధ ప్రబంధంలోనూ నా యాసలేదు బాసలేదు
వాక్యం నా పలుకు వల్లించదు
అక్షరాల్లో నా నుడికారపు శబ్దం లేదు
నా భాషనే అంబుక్క పెట్టిన నీవు
జీవశ్వాసను బందిస్తున్నట్లే
లెక్కల్లోనూ అన్నీ పొక్కలే
భాగ ఫలం సమభాగం కాలే
విభాజ్యం వివక్షకు విభాగినీ వంత పాడింది
సర్వేల సారం నిండా నా మూగ స్వరమే
ఆటమాట పాట కాటగలిసి
తెలంగాణ సంస్కృతి తెర్లయింది
నేనుగా మొలకెత్తిన నేను
నేనుగా ఎదిగి నేనుగానే జీవించాలి
పద పదంలోనూ నా నాదం విన్పించాలి
ఈ కాంచి నేను కొత్త వ్యాకరణంతో వాక్యం రాసి
కొత్త గుణకారంతో లెక్కలు తీస్తా

*ప్రజాతంత్ర, డిసెంబర్, 5-11 2004*

# పాండవ తెలంగాణా విజయాన్ని సాధిస్తానమ్మా

● జనజ్వాల

అమ్మా ఒంటిలో రక్తం బొట్టు బొట్టుగా...
భూమ్యాకాశమంతా మరకలు రక్తపు మరకలు
అందుకేనేమో ఆకాశం కూడా రక్తపు కన్నీళ్ళతో సూర్యుణ్ని కన్నదేమో
అవును తెలంగాణా భూమ్యాకాశమంతా
మరకలు రక్తపు కన్నీళ్ళు
అవును మళ్ళీ చెబుతున్నాను రక్తపు కన్నీళ్ళలోంచి
సూర్యుడు పుట్టింది ఇక్కడే
సూర్యుని వారసులుగా ప్రతిజ్ఞ పూనిన
వీరులు పుట్టిందీ ఇక్కడే-
ఆశయ సిద్ధిలో అరచేతికి మేకు దిగబడ్డా
చేయి నరుకున్నది...రక్త సముద్ర ఒంటిచేతి
అలల గుర్రపు స్వారీ చేసిన వీరుడు పుట్టిందీ,
వీరులు పుట్టిందీ ఇక్కడే-
తెలంగాణా నా తల్లికి చరిత్ర ఉంది
రాబందుల చిలక మర్మాలు మోసాలు కుట్రలు
ఒకటేమిటి చేదు అనుభవాలు ఎన్నో ఎన్నెన్నో
ఇసుక రాళ్ళ మధ్య పారుతున్న కన్నీటి అలలు
గుండెల గులక రాళ్ళ మధ్య రేగుతున్న సుడిగుండాలు అగ్నిలావాలు
అమ్మ చరిత్ర వడిలో అలసి రాలిన రక్తపు పుష్పాలు
అమ్మ ఎప్పుడో చిన్నప్పుడు నాటిన చెట్టుకు
"కాలు మొక్కుతా నీ బాంచను' కాయలు కాసి వుండవచ్చు
అభిమానం ఆత్మీయం పొరలో కాపు కాసిన కాయలన్నీ
చిలకల రూపంలో వున్న కాకులు తింటే తినవచ్చు

కానీ....అమ్మ చావుకోసం, చావు పిండాలకోసం
గుడ్లగూబల చూపులతో కాచుకున్న చిలకపలుకుల కాకుల్ని
నక్కల్ని, అమ్మకొడుకులుగా
మేమెంత కాలం చూస్తుండాలి,
ప్రశ్న కపాలాన్ని తొలచి వేస్తుంది.
ప్రశ్న ఒంటిపై చర్నాకోలై బాదుతుంది
అమ్మకోసం ఏదైనా చేయాలి జన్మనిచ్చిన మట్టికోసం
నన్ను కౌగిలించుకొని ముద్దాడి పెంచిన గాలికోసం-
అవును ఇప్పుడు నా తల్లిని బతికించుకోవాలి
రేపైనా నా తల్లిని కాకుల నక్కల మృగాల తోడేళ్ళ
బారిన పడకుండా కాపాడుకోవాలి
అమ్మకు మాటిస్తున్నాను
అమ్మా ! నన్ను కన్నందుకు
నిన్నే కాదు నా తర్వాత తరం వాళ్ళను కూడా
ఆంధ్రసీమ 'తెలంగాణ' రాజకీయ మృగాల కౌరవుల కుట్రల
నుంచి రక్షించుకుంటాను
అమ్మా నువ్వెప్పుడో చిన్నప్పుడు నాటిన
'కాల్మొక్తా బాంచను' కాయలు కాసే చెట్టు కాదని,
అది అమ్మనాటిన ఆయుధాలు భద్రపరిచే
'జమ్మిచెట్టని నిరూపిస్తాను!
కృష్ణుణ్ణి, అర్జునుణ్ణి నేనై
పాండవ తెలంగాణా విజయాన్ని సాధిస్తానమ్మా
జై అక్షర జెండాక్రింద
యుద్ధభూమిలోకి ప్రవేశిస్తున్నాను
అమ్మా ఆశీర్వదించమంటున్నాను.

*జనం పిలుపు పక్షపత్రిక, ఫిబ్రవరి. 2005*

# ఆయుధం నీడన

• యెన్నం ఉపేందర్

ఇపుడు-
స్వరం సగం తప్పించినట్లుగా ఉంది
కలిసి నడుద్దామన్నావు
మూల మలుపు వరకు వచ్చావు
పట్టు కారుతో ఎదురు తిరిగావు
పిల్లి పులిగా ఎందుకయ్యింది?
ఆట మొదట్లో తొండి
ఆకాశానికి ఎదిగిన వ్యక్తిత్వం
అపనమ్మకంతో కొట్టుకపోయింది
జనారణ్యంలోకి చిరుత
మచ్చిక చేయలేకపోవడం బలహీనత
'నొ' ఆర్ 'నెవర్'
అధికారం ఓ నల్లమందు
ఓ మందుగుండు ఓ అవకాశం కూడా
చేయందిస్తే తెలంగాణ నిద్రబోతుంది
లేదంటే స్వరం తెగిన తెల్లమేకైతుంది
ఏడ్చే పాపాయికి పాలు కావాలి
దున్నే వాడికి భూమి కావాలి
విప్లవకారుడికి వర్గ సమాజం పోవాలి
కలిసి మాట్లాడుకుందామా కామ్రేడ్

*ఆదివారం వార్త, 6, ఫిబ్రవరి, 2005*

# బహిరంగ కవిత

• జూకంటి జగన్నాథం

అధ్యక్షా!
ఏ నియమం కింది
ఏ నిబంధన కింద
విషయం ప్రస్తావించాలో తెలియదు.

మీరు గిట్ల ఇప్పుడు
నాకు అనుమతి ఇవ్వకుంటే
ఇక ఎప్పుడు మాట్లాడలేకపోవచ్చు
ఇక ఎన్నడూ మారుమ్రోగలేకపోవచ్చు

అయ్యా!
మాటలతోని
మంది కొంపలు ముంచెటోన్ని కాదు
అరిచేతిలో
వైకుంఠం చూపిచ్చెటోన్ని కాదు

నాయినా!
ఒడిసిపోయిన కత గురించి
శోకం పెట్టుకోదల్చుకోలేదు
జరుగబోయే బతుకుల
ఉసురుబోసుకోకుంద్రని మొత్తుకుంటున్న

నీళ్ళులేని నేలదుఃఖం కన్నీళ్ళు కరువైన కాపు ఎత
వినబడదు కనబడదు
మీ కళ్లల్ల కనబడకుండా రూపాయల జిల్లేళ్ళు మొలిచినయ్

మీ చెవుల్ల ఇనబడకుండా
హైవే సీసం పోసింద్రు

అధ్యక్షా! మీ ముందు కూసున్నోల్లంతా
అగో తెచ్చేనన్నరు ఇగో వచ్చేనన్నరు
అప్పు తెచ్చి కొప్పులు ముదుత్తమన్నరు
అంతా అతలాకుతలం చేసింద్రు
అంతా ఇప్పట్ల తొవ్వకు రాకుంట
సెలిపి ఇడిసి పెట్టిన్రు

బాపూ! కోపానికి రాకుంద్రి
ఎంత మందిని శవాలు చేసి
సవాలు చేయకుంట చేత్తిరి
ఎంతమంది పీనుగుల మీంచి
నడ్సుకుంట వచ్చి గీ కుర్చీలు ఎక్కితిరి-

నాకు తెలువక ఒకటి అడుగుత
సవ్వాసూటిగా జవాబు చెప్పుంద్రి

మీరు ఎక్కడ సెమట వడ్సితిరి
మీరు ఎప్పుడు నాగలి పట్టితిరి
మీరు ఏ పొలానికి నీళ్లు పెడితిరి
మీరు ఏ పంటను కుప్ప కొడితిరి

ఇయ్యాల్ల ఏదో ఒకటి
పురాగా తెల్లగోలు కావాలె
మీరు ఏ కుల కశ్చి చేత్తిరి
ఏమి దందా నడిపిత్తిరి
ఎన్నడు మీ అరిచేయిలకు
పొక్కులచ్చి కాయలు కాసె

ఎప్పుడు మీ అరికాళ్ళకు ముండ్లిరిగి ఆనెలు పడె
ఏమి చేత్తే గింతగనం సంపాయించిన్రు
ఏమి కాత్తే గింత ధనం కమాయించిన్రు
ఏడ్డోల్లను చూసి అడ్డగోలుగా బలిత్తిరి
ఎరుకలేనోల్లను చేసి
గెట్లకు గెట్లు గెరాయించి కలుపుకుంటిరి

మస్తుగా మాట్లాడొచ్చు
మతలబుతో కత రోజులకు రోజులు
చెప్పుకుపోవచ్చు-

అధ్యక్షా!
జెర సైసుంఙ్రి
ఇసుంటి పుల్లెందల
మనోనికే కాదు పగోనికి రావద్దు
దొంగ కంపిన్లు దొంగ ఇత్తనాలు
మంది నెత్తిమీద చేతులు పెట్టే పొత్తులు
దొంగ ఎరువులు దొంగ అరుపులు
బోకెత్తులు నక్కజిత్తులు
చీకటి దొంగ సోపతైనట్టు
అడవిల దోసుకోవాలన్న
పట్టపగలు ఊళ్లె గజదొంగలు పడవట్టిరి

అయ్యా! లోకంల ఆవును నమ్మిన పులి వుంది
పులికిచ్చిన మాట నిలబెట్టుకున్న ఆవు వుంది
గని ఆవుతోలు కప్పుకుని
పచ్చి నెత్తురు తాగే పులులతోనే
దునియా పరేషానవుతుంది
రైతు బతుకలేక చచ్చిపోతాడు

నేత కార్మికుడు పనిలేక మరణిస్తాడు
నష్టపరిహారం చావుల్ని ఆపలేవు
సబ్సిడీ జీవితాల్ని ఆదుకోలేదు

ఊముతడి కండ్లకు పెట్టుకుని
వగల ఏడ్పులు- ఆగమైపోయిన ఎవుసం
ధీము అనుకున్న ఇల్లును
ఇసిరిసిరి కొడుతున్న వడగాడ్పులు-

అధ్యక్షా!
పట్నాలు ఎందుకు పెరిగిపోతున్నయ్
ఊళ్ళకూళ్ళు ఎందుకు తాళాలు పడుతున్నయ్
ఎటు సూత్తే అటు మొత్తుకునే నీళ్లు
పత్తా లేకుంట ఎటు పోయినయ్
పచ్చటి పట్టు పరుపు భూమి
గుండె పట్టిన ఎందుకు నెర్రలై పలిగింది-

అయ్యా! మైక్ బందు పెట్టకుండ్రి
ఇక ఒకే ఒక్కమాట తమరి ద్వారా అడుగుతున్న
గీ నలభై ఎనిమిదేండ్ల పొత్తుల
నా తల్లి తెలంగాణ దిక్కులేని పక్షి ఎందుకు అయ్యింది
నా తల్లి తెలంగాణ కండ్లపొంటి
ఎందుకు నెత్తురు వడుపుతుంది
చెప్పుండ్రి! చెప్పుండ్రి!!
అన్యాలం ఆపలేకుంటే ఇస్నా కోసం
ఇవతలికి వచ్చిన 'తష్వా'
చెయ్యిల చెయ్యి కలుపుండ్రి! కలుపుండ్రి!!

*ఆదివారం వార్త, 13, మార్చి, 2005*

# గిట్లయితదనుకోలేదు

• చిత్తలూరి సత్యనారాయణ

ఆశల గాజు కుప్పె పగిలి
గుండె గోడల మీద సీసపెంకులు
పర్చుకుంటయనుకోలేదు
గుడిగోపురం కూలిపోను
దేవుడు రాశులై విచ్చుకోవాల్సిన పంటకళ్లం
కరువు కన్నీటి చారలతో
విలవిల్లాడుతుందనుకోలేదు
రైతు దేహమ్మీద మొలకెత్తాల్సిన
ఆశలగింజల్ని
నెర్రెలు జార్చేసుకుంటయనుకోలేదు
పచ్చ తివాచీ పర్చుకోవాల్సిన పల్లెలు
నెత్తుటి చారలయి ప్రవహిస్తయనుకోలేదు.
పట్టువస్త్రాలై కప్పుకోవాల్సిన పత్తి చేలు
నైలాను ఉరితాళ్లయి
రైతు గొంతుకోస్తయనుకోలేదు
జీవితం
గిట్లయితదనుకోలేదు.

*ఆదివారం వార్త, 20 మార్చి, 2005*

# నిర్వాసిత

● మల్లావఝ్ఝుల సదాశివుడు

కుహనా సభ్యతల నుంచి
యాంత్రిక జీవికల నుంచి
ఆత్మీయతా, ఆర్ద్రతలు పూయని
సిమెంటు వనాల నుంచి
తప్పుకొని
ఆఘమేఘాలమీద వచ్చివాలితే
ఏం మిగిలిందిక్కడ?
తల్లిమీదా, పల్లెతల్లిమీదా
అయినవాళ్ళమీదా అలిగివెళ్ళిన
ఇరవైయేళ్ళ నా అజ్ఞాతవాసం
ఇంతశిక్ష వేస్తుందని కల్లో కూడా అనుకోలేదు

వాగూవంకా, చేనూ చెలకో
పొలమూపుట్రా ఇళ్ళూ గూళ్ళూ
కోళ్ళూ గొర్లు, గొడ్లూ బర్లూ
రైతూరంగం, పనీపాట
పచ్చని దృశ్యం వెచ్చని ప్రేమా
నావి లేకుండా... నాకు కాకుండా పోతాయని
ఎందుకనుకుంటాను!

ఒక స్వచ్ఛమైన ఉచ్ఛ్వాసం కోసం వచ్చాను,
ఒక చల్లని ఆశ్వాసం కోసం వచ్చాను
అడివి గువ్వలా స్వేచ్ఛగా
ఎగరాలనివచ్చాను

సైకత హృదయాన్ని ఏమాత్రం దాచుకోని
పల్లెవాగుపిల్ల వొయ్యారపు పరుగుల్లో
మువ్వల సడి వినాలని
ముచ్చటపడి వచ్చాను

మమతలూరే చెలిమెలోని మంచినీటికోసం
అమ్మచూపులోని అమృతశిఖరాల
కోసం వచ్చాను
ఆవురావురంటూ వచ్చి చూస్తే
నాకంటూ, నాదంటూ ఏమ్మిగిలిందిక్కడ?
నా స్వరం మాయమైంది!
నా మార్గం మూతపడింది!
నా రాక నవ్వులపాలైంది!
నా బతుక్కీ భవితకీ
నే రాకముందే తెరదిగింది!

పేదరాశి పెద్దమ్మ బాలవద్దిరాజూ లేరు!
మాయల మరాఠీ ఎత్తుకుపోయిన
బాలనాగమ్మ రాదు!
ఒక కమనీయ జానపద నాటకం
అర్ధాంతరంగా ముగిసింది
కథ కంచికి చేరింది!

ప్రగతి చక్రాల కింది నుగ్గైన నా పల్లె
వెలుగుపంట దిగుబడి పెంచేందుకు
పెంటగా మారిన నా పల్లె
ఫ్యాక్టరీ పునాదుల కింద
ప్రహరీ గోడలకింద

కాలనీ భవనాల కింద
సమాధి అయిన నా పల్లె
వీధిస్తంభం మీది బల్బు గొంతులో
ఒక విషాద నిశ్శబ్దకాంతి సంగీతమై
పునరుద్ధానం చెందింది!

నవ్వాలో ఏడవాలో తెలియక
నా వాళ్ళకోసం వెతుకుతున్న నాకు
ఉపాధి కోరుతూ సమ్మెకట్టిన
ఉడుకు రక్తంలో
పిడికిలెత్తిన నా తమ్ముల
గ్రూపు కన్పించింది
మన్నుమీది మమకారం చంపుకోలేక
కన్నుమూసిన వాళ్ళ వివరాల్లో
అమ్మపేరు మాత్రం వినిపించడంలేదు
జాతికోసం సాగిన కాంతి ప్రస్థానంలో
పాదముద్రలు సాలువోసిన నాతల్లి
వో అదృశ్య నిర్వాసిత

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 28 మార్చి, 2005*

# ఆదిలాబాద్ రంజన్లు

• మునిమడుగుల రాజారావు

కుమ్మరింట కుండే లేనట్టు
వడ్రంగింట తెడ్డే లేనట్టు
బాసర తల్లున్నా
ఆదిలాబాద్ గుడిసెల్లో
అక్షరం ముక్క లేదు

మీ అందరికీ
చెప్పుకోవడానికి
ఒక్క 'ఆదిలాబాద్ రంజన్లు' తప్ప

వెన్నెల పాయసాన్ని
ఎత్తుల మీంచి ఏరుల్లా పారిస్తూ
ప్రకృతి రమణీయత
పరమాద్భుత రహస్యాలను
అడవి గర్భాన దాచిన
కుంతాల జలపాతం సొగసుల్ని
నింపుకున్న కుండలు

మానవ మూలాలైన
అడువుల్లోని
ఆదివాసి సంస్కృతిని
పులిమిన కుండలు

ఎదులాపురంలోని
ఎద్దులా కష్టించే

అమాయక మట్టి జీవాల
స్పర్శను తాకిన కుండలు

తడారిన గొంతులను
చల్లగా తాకేందుకు
మట్టి తడాత్మను
మనకోసం ఆత్మార్పణ గావించి
ఎర్రెర్రని మంటల్లో
వొళ్లంతా కాల్చుకున్న
మానవీయత నిండిన
మమతలకుండలు
చల్లని మనసున్న వేసవి కుండలు

***ఆదివారం వార్త, 29 మే, 2005***

# గంజి

• తుమ్మల దేవరావ్

మేము ఒగళ్ళ గాదెల
యిసాబులడుగుతలేం
మా మట్టి శేతులు కట్టె చరుస్తుంటే
కల్లంలో గింజల్ని
పాళ్ళు ఎయ్యమంటున్నాం
దుక్కి దున్నిన చేతుల్లో
పిడికెడు ముద్దపడాలంటున్నాం

పానాదులెంట కోపులు తవ్వి రోడ్లెసినా
మా బతుకులో రంపపు కోతలే మిగలవట్టె
పొక్కులచ్చినదాక పనిజేసిన పానాలకు
వీశమెత్తు గువ్వం లేకుండాపాయే
మా రకతం, మా శెమట
ఆవిరై పీనుగులెక్క ఐతే
మా బువ్వను ఎవదు
గుంజుకున్నాడో తేల్చాలంటున్నాం

ఆమ్దాని మీద ఆమ్దాని
పెంచుకుంటు గద్దెలెక్కుతుంటే?
నిక్క సూదలేని పాదుముఖాల
పాపిష్టి సూపులనుకున్నాం
అద్దాల అంతరాల మిద్దెలు
కొలిమిలై ఎలుగుతుంటె
మేం కొఱ్ఱాయిలెక్క కాలి బూడిదైతున్నాం
గువ్వం లేని పెయ్యి
కణెల్ కణెల్ మంటుంటే

మా శెమటతో పండిన గింజలకు
రెక్కలెట్లచ్చెనని అడుగుతున్నాం...

మీరు తెల్లబట్టలేసుకుని ఊర్లేగుతుంటే
మేము బీడులల్లో మన్ను బెడ్డలైతున్నాం
మీ పిల్లలు ఖానిగి బడులల్లో
పెద్ద పెద్ద సదులకుపోతే
మా పిల్లలు పంటపొలాల్లో
పరిగెలేరుతున్నరు.
బతుకు మాయజేసినోడె పంట గుంజుకుంటే
మెతుక్కోసం వాటాగావాలనె బెదురు పెడ్తున్నం
ఒగళ్ల ఉసురు మాకొద్దు నియ్యతిలేని బతుకులొద్దు
పని చెయ్యని మలమల మాడుతుంటే
గంజిపోయ్యని సర్కార్లకు ఉసురు తలుగుతది
మేము యిమాందరితనమే జిందగనుకుంటున్నం

*తెలంగాణ సోయి, మే, 2005*

# మాకు సోయి ఉంది

• ఎస్. వేణుశ్రీ

మా వోళ్ళకు సోయి లేక గాదు
సోపతి కోసం పాణం మిచ్చెటోళ్ళం
పక్క పక్కనే ఉండి పాణం తీసేటొళ్ళం
కాదు
మోసం చేసేటోళ్ళను... దోపిడి చేసేటోళ్లను
సైతం తప్పైందంటె జాలి సూపి వదిలి
పెట్టేటోళ్ళం
గందుకె మమ్ముల్ని అన్నిట్లో
వెనుకబడ్డోళ్ళని బాస రానోళ్ళని
పేర్నాల పెడ్తున్నరు
ఈ గడ్డ తల్లి ఒడిలో
ఎక్కడెక్కడ నుండో పొట్ట సేతబట్టుకొని
పోగు వోసి బలిసి
ఈడి జనాల బతుకులను బండలు జేస్తుంద్రు
నీళ్లు లేక సెలకలు సేన్లు
పోలాలు నెర్రెలు వెట్టినయి
ఒర్రెలు చెర్లు వాగులు కుంటలు
ఇసుక దిబ్బలై తుమ్మలు మొల్సినై
గీడ పోరగాండ్లకు బతుకు తెరువు లేక
దుబాయి మస్కట్టుకు పోయి
రోగాల పుట్టలై వస్తుంద్రు
గుండుకు గుండున్నోడు కట్టపెల్తై
గుట్కు మనవట్టే
పెళ్ళాం పోరగాండ్లు దిక్కులేనోళ్ళు గావట్రి

గిదేమి పట్టనోళ్ళు తప్పుదన్నట్టు
పైసలు సంపాయించ సాగనంపవట్రి
మల్ల గిలగిల తండ్లాడ వట్రి ఎమైతడో కొడుకని

మూలసుక్క గోరుకోయలు సూసే
రైతన్నలు మూలకు వడవట్రి చెదలుపట్టిన నాగలిలెక్క
ఇత్తనాలు గూడ ఇసమయి పోవట్టె భూమి లోతుల్లోకి పోలేక
బహురూపుల ఇదేసి వ్యాపారము
మీ కోసమేనంటు
ఇగిలించ వట్రి– ముప్పుతిప్పులు పెద్దు
ఈ నేలను బంగారం జేస్తున్నామని భ్రమలముంచవట్టె
ఇగసాలించుండ్రి మా తెలంగానోల్లు గుడ్లురిమి చూస్తె
మీ కళ్ళు తెల్ల గుడ్లు పడుతయి
మీ పాడెలకు కంకబోంగులు
దొరక కుండా పోతాయి

*మన తెలంగాణ, జూన్, 2005*

# యిప్పుడొక పాట కావాలి

• కలేకూరి ప్రసాద్

మూడో పెగ్గులోనో నాలుగో పెగ్గులోనో
గుండెలు కలుక్కుమని
పదే పదే నువ్వే గురుతుకొస్తున్నావు

కనురెప్పల మీంచి ఆకాశంలోకి
ఒక నల్ల సీతాకోకచిలుకల దండు
గోసిగాళ్ళ గొంగడి జెండాలాగా ఎగురుతోంది

ఏడేడు రంగుల సింగిడీ తీగెల పూల సజ్జలు
పాదాలకు అల్లుకొని
జజ్జనకరి జనారే జాతరే జాతర

మొగ్గ తొడిగిన ఒక ధిక్కార గీతం
నేల నేలంతా పరుచుకున్న పుచ్చపువ్వుల తీగె
నా పూర్వీకుడు ఆలపించిన ఒక పురాగానం
గుండెల్ని దుఃఖాగ్రహంతో అలుముకొంటోంది

నా దేముడా తండ్రీ నా తల్లీ
'సింహాలు తమ చరిత్రను తాము చెప్పుకోకపోతే
వేటగాళ్ళు చెప్పే పిట్టకతలూ కట్టుకతలే చరిత్రగా చలామణీ అవుతాయి
యిప్పుడు నీ గొంతుక నుంచి ఒక కొత్తపాట కావాలి
దేహాన్ని దున్నీ దున్నీ గుండెలను చిలికీ చిలికీ
పదాల గింజల్ని పండించి
పావురాలుగా ఎగరేసినట్లు
నీ మట్టి పుట్టుక నుంచి

నీ అగ్నిగొంతుక నుంచి
ఒక పాటకావాలి
దేశం కనురెప్పల కింద పేరుకొంటున్న
చిక్కటి కొత్త కలలాంటి పాటకావాలి

యింకా మాట్లాడలేను చాతనైత లేదు
నీ వెన్నులో దిగబడిన తూటా రంగు
మగత నిద్రలాగా కళ్ళలోకి పొదుచుకొస్తోంది
యింక నిద్రపోవాలి
ని...ద్దు...ర పో...వా...లి
పొద్దున్నే లేవడానికి
ఒక కొత్త సూరీడ్ని చూడడానికి
పగటి వెలుతురులో నిన్ను పలుకరించడానికి
నీ మువ్వల పాదాలపైన ముద్దు పెట్టడానికి

*ఆదివారం ఆంధ్రజ్యోతి 10, జూలై 2005*

# తెలంగాణ కవిత్వ పాదం

• జూలూరు గౌరీశంకర్

ఈ మట్టి యుద్ధాన్ని నేర్పింది
ఈ నేల బతుకెందుకో చెప్పింది
ఇది నెత్తురుతో గడ్డకట్టిన నేల
ఈ నేలను యాదనుంచి దున్నినా
పౌరుషం పొగలై లేస్తది

నమ్మితే ప్రాణాలిచ్చి నిలుస్తం
ద్రోహాన్ని ఎంటాడి తెగుస్తం
తెగతెంపుల మాటొచ్చినంక
ఇంగ ఎనక్కి పోయేది లేదు

కుచ్చితం ఎవరిదో తేలాలె
నా మాటన్నేను దొంగతనంగా సూసుకొనుడేంది?
నా నేలపై నన్ను గేలి చేసికోస్తే
నా యాసతోనే నరుక్కొస్తా
ఇది నేల పాడే పాట

జండా తలలకు
పార్టీల ముఖాలకు
జీవకళనిచ్చిన ఈ నేల
ఒక్కసారి అడుగుతోంది
తన జండాకు అండగా నిలబడమంటోంది

2

మూగ బాధలు భద్ర పరిచినం
కదిల్తే ఈ భూమి నెర్రలు బాస్తది

మళ్ళీ ఇక్కడ లొల్లి
ఒక జగడం
ఒక పంతం
ఒక కదలిక ఒక మలుపు
ఈడ కరువు నేలపై జనం అలలు
బీడు భూములపై జలం కలలు
ఎవడు మండిన కడుపుతో ఏ బాధల వొత్తికి నిప్పుపెడ్తడో
ఈ పోరాటం చనిపోద్ది, బతుకుద్ది,
మళ్ళీ భగ్గుమంటది

ఇగో మళ్ళీ చెప్తున్నా
దేశం మొత్తం తిరిగే జండాలూ వినండి
మా అపూర్వ సహోదరుల జగడాలు సూడండి
అంటగట్టిన పెళ్ళి ఈ విశాలాంధ్ర ఇదే విషాదాంధ్ర
గడ్డి పరకలకు పోరాట కత్తులిచ్చిన చేతులా!
నా నేలను నా నించి కొడవళ్ళే నరుకుతున్నె
కాంతిలేని నక్షత్రాలు
గింజల్లేని కంకులు
కర్రలూడిన సుత్తులు
ఐక్యతనే చూస్తాయ్ గాని
దోపిడిని ఎట్లా గుర్తిస్తాయ్?
నా మూతికి, నా చేతికి మధ్య అడ్డు ఎవరు?

3

ఈ నేలను ఎంత నెత్తురు చేసినా
ఒంటిని తుపాకి మడిమల ముద్దను చేసినా
ఏ పూట ఏ వూర్ని ఎన్‌కౌంటర్ చేసినా
తన నేలకోసం జనం ముసురు తప్పదు

గుప్పెడు శాంతికోసం దోసెడు నెత్తురా!
స్వేచ్ఛ గొంతును వలస హస్తాలతో సంపలేరు

పైపై కరచాలనాలు వద్దు
మనసులొకటి బయటికొకటి
నన్ను కోసినా కనపడదు
మంది కన్నీళ్ళు మేమే అని సెప్పెటోళ్ళు
ఈ జండాపై రాళ్ళెందుకేస్తారు సెప్పుండి

మళ్ళీ జనం దండ్లు మొదలైనై
దంచుడాట గురించి మాటలెందుగ్గాని
పగిలిన గుండెలు చాలు మందుపాతరలు

ఇక్కడ సావు కొత్తకాదు
ఈడ ఉద్యమానికి ఊపిరి పోయటమే జన్మ

పాలస్తీనాలై నడిసొచ్చెటోళ్ళకు
ఎర్రసెలకల దండాలు

నేను తెలంగాణ జాతీయ పక్షిని
ఈ జాతికి జవాబుదారీని
పొక్కిలైన ఈ నేల కవిత్వ పాదాన్ని
రేపటి నినాదాన్ని

*ఆదివారం వార్త, 31 జూలై, 2005*

## మా వూరెళ్తున్నం

● *బెల్లి యాదయ్య*

ఏరు దాటనిస్తలేదట
చెరువులు కుంటలు అలుగుపోస్తున్నయట
బావుల్ల నీళ్ళూరుతున్నయట
అమ్మా నాన్నా అనుకుంటున్నరు
చెల్లీ! మనం మన ఊరెళ్తున్నం
మళ్ళీ మనం బడిలో వుంటాం
మేఘాలకు కృతజ్ఞతలు

ఇల్లాకిలొదిలి ఈ కాని తావున తనుకులాడుడేంది
గొడ్డు గోదనెడబాసి
ఈ ఇనుపగుట్టలల్ల పాచినాకుడేంది
అమ్మ నాన్నా అనుకుంటున్నరు
చెల్లీ! మనం మన ఊరెళ్తున్నం
పొలాలు పొట్టకొస్తాయి
మళ్లీ మనం వెన్నెల్లో ఆడుకుంటాం
రుతుపవనాలకు ధన్యవాదాలు...

మంచీచెడూ అర్సుకోలేని
మాటామంతీ పంచుకోలేని సిమెంటు మనుషులు
ఈ చేత యిచ్చి ఆ చేత గుంజుకునే మాయబజార్లు
నేరాలు పూసే భవంతులు ప్రాణాలు జుర్రే రోడ్లు
అమ్మా నాన్నా అనుకుంటున్నరు
చెల్లీ! మనం మన ఊరెళ్తున్నం
పంటలు అక్కరొస్తాయి
మళ్ళీ మనం దీపావళి చేసుకుంటాం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, ఆగష్టు, 2005*

# శిథిల దృశ్యం

● ఎం. రాజు

తెలంగాణ ఇప్పుడు రణరంగం
రాత్రీ పగలు ఒక్క తీరుగ
పడగ నీడలో పల్లె బతుకు
తుపాకీ మోతలు పోలీసు కవాతులు
గడ్డిపోచ సైతం గాలి పీల్చుకుంది
హాహాకారాలు, ఆకలి రోదనల
నడుమ ఊళ్లనిడిసి, గూళ్ళ విడిచి
వలసపోతున్న పల్లె వాసులు
కాకులు, రాబందులు కబ్జా చేసుకున్న గూళ్ళు
పచ్చదనం మచ్చుకైనా లేదు
అంతా నెత్తుటి మరక బ్యాలెట్ బాక్సుల్లో ఓట్లు చల్లిన
పాపానికి బుల్లెట్ల పంట పండింది
పల్లెకు పల్లె మొత్తం సిలువ వేయబడింది
చిరిగిన బ్రతుకు చిత్రాన్ని రక్తం రుచి మరిగిన పులులు
బాయ్‌నెట్‌తో గుచ్చి గుచ్చి గాయాల్ని కెలికి
చావుని నిర్ధారించుకుంటాయి ఇక శతృశేషం లేదనుకుని
చంక లెగరేస్తాయి తూరుపు కొండల్లోంచి
రక్తం ముద్దల్ని మింగిన సూరీడు
ఎర్రని పెదాలను తుడుచుకుంటూ
యుద్ధరంగం మీదకొస్తాడు
పోరాటానికి సంసిద్ధుడై భుజాన
సహస్ర కిరణ విల్లంబులతో.......

*ప్రజాతంత్ర, అక్టోబర్ 2-8, 2005*

# గరుడుడి ఆన

● పి.వేణుగోపాలస్వామి

శ్వేతాశ్వానికి నల్లతోక!
మోసంతోనే మొదలయిన బంధనం
బంధుత్వం ఒక మేలిముసుగు
అది రెండు నాలుకల నైజం

బానిసత్వ విముక్తికి ఎన్ని మెలికలు
అమృతభాండమే కావాలట!
మా అణువణువు విస్ఫోటం చేస్తాం
అర అంగుళమైనా రాజీపడతామా!

అమ్మా
వీరమాతా!

ఎంతకాలమీ బానిస బతుకు
ఎంత కాలమని ఈ విషనాగులను
వీపున మోయడం

సర్పయాగం సాగించయినా
సంకెళ్ళు తెంచుతాం
నువ్వు స్వేచ్ఛాగానం చేస్తుంటే
మేం ఆకాశంలో చక్కర్లు కొడతాం

*ఆదివారం వార్త, 11 డిసెంబర్, 2005*

# నీడల గారడి

• బుర్ర తిరుపతి

అతడు!
ఊహల్ని చిత్తు కాగితాల్లో చిదిమేసుకొని
బంగారు స్వప్నంగా మలచుకోవాలనుకొంటాడు
కాళ్ల కింది మట్టి కనుమరుగైపోతున్నా కూడా
నిభాయించుకొని పక్క వారిని నిలువునా ముంచగలడు
గోసి గొంగడిగాడిని, గొర్ల గాసినోడిని
పచ్చని పల్లెల్లో నుంచి మట్టివాసనతో వచ్చినోడ్ని, అంటూ
ప్రపంచీకరణ నేర్పిన పదాలన్నింటిని చేర్చి
పల్లెను వల్లకాడుగా మార్చే సమర్థుడతడు
ఊపిరి పోస్తానంటూనే ఊపిరాడకుండా చేయగలడు
అందమైన పదాల అల్లికతో...
అచ్చమైన తెలుగు కవిత్వం రాస్తూ...
పరమపదసోపాన పటంలోని
సర్పాకృతి పుణికి తెచ్చుకొంటాడు
నీతి నీళ్ళ పాలు... నిజాయితీ రాళ్ళ పాలు...
ఏకబిగిన ఏగిన తెలంగాణ ఏకు నాదం మోతను
వేళ్ళు పీకి ఎల్లెలుకల పడగొట్టగల సమర్థుడు
ప్రామిసరీ నోట్లలో పద చిత్రాలను పదిల పరుచుకొంటాడు
వలసవాదులను ద్వేషిస్తూనే
ప్రాంతీయులను పాతర పెట్టగలడు
కాళోజి కమ్మని కవిత్వాన్ని కడుపార సేవిస్తూనే...
కన్నుల్లో వేళ్ళు పొడచి కలం పోటు పొడవగలడు

కలలు ఎప్పుడూ నిజం కావు కదా?
మాటలు ఎప్పుడూ తూటాలు కావు కదా?
గొప్పవాడిగా మలిచేదే సాహిత్యం కాని,
గొప్ప వాడిననుకొని సాహిత్యం సృష్టిస్తే ఎట్లా...!
ఇక్కడ మనసు విప్పి మాట్లాడుకోవడమంటే
మాటలతో గారడీ చేయడమే
బురిడీలు కొట్టించడమే
నీడను చూసే నిలువెత్తు విగ్రహం
అనుకొంటాం, నీరసం తప్ప వీరరసం
ఏమీ ఉండదు, గాయాలు
తప్ప గాఢత ఏమీ ఉండదు
భాష తప్ప భావాలు ఏమీ ఉండవు
ఉల్లికి పొరలున్నట్లే ఊసర వెల్లికి
రంగులున్నట్లే
కలానికి రంగులూ అనేకం
అందమైన నెమలిని చంపీ....
ఆసక్తితో నెమలి కన్ను భద్రపరుచుకొన్నట్లు
ఆలింగనం మాటున అవహేళన చేస్తున్నట్లు
అతడు ఒక్కడే వాని నీడలు అనేకం

*ఆదివారం,, ఆంధ్రజ్యోతి, 12, మార్చి 2006*

# ఒక తెలంగాణ ఎడారి ప్రతీక

• ఎండ్లూరి సుధాకర్

ఆదికవి ఊళ్ళో రైలెక్కాను
బమ్మెర పట్టణంలో బండి దిగాలి
మనసులో అలారం కూడా పెట్టుకున్నాను
గోదావరి కొత్తవంతెన దాటుతూ
రెప్పల గొలుసులతో
కళ్ళ పెట్టెలకు
నిదుర తాళాలు వేసి
చలి దేహాన్ని శాలువాతో సత్కరించాను
మందారమకరంద కవికి నమస్కరించి
రాత్రంతా రామదాసు జైలుగీతమై
'ఛండాలుదుండేటి తరిభూమి ఒక్కటే' అనుకుంటూ
ముసుగుతన్ని పడుకున్నాను
దిగవలసిన రైలు
నన్ను లేపకుండానే వెళ్ళిపోయింది
తెల్లారి ఎక్కడో పొగమంచులో
బురద బాతులాగా బండాగింది
మా గౌండ్ల రాజయ్య
తాటిచెట్టు దిగినంత వేగంగా జప్పున రైలుదిగాను.

ఎదురుగుండా భువనగిరి
కళ్ళని కవిత్వంలో నింపే కవన ఝరి
ఆత్మీయంగా తాకిన పవనలహరి
తెలిసిన ఊరే అయిన
ఏదో తెలియని బెదురు
తోవ తప్పిన తొట్రుపాటు

ముఖం కడుక్కోవడానికి స్టేషనులో నీళ్ళు లేవు
'త్రాగుటకు చల్లని మంచినీరు' దొరికే
స్టేషనొకటి తెలంగాణలో చూపిస్తారా?
ఛాయి తాగటానికి బయటికి వచ్చాను
పసిడి కళ్ళాపి జల్లినట్టు
బాట పొడుగునా
బంగరుపూలు
గురువు గుర్తుకొచ్చాడు
గుండె తంగెడు పువ్వయింది
ఊరు మారలేదు
ఉనికి మారలేదు
ఇది నా చిన్నప్పటి యాపచెట్టేనా?
అది నేనెక్కిన యాదగిరి సామి గుట్టేనా?
కొత్త ముఖాలైనా
అన్నీ పాతగానే కనబడుతున్నాయి
పాతగోడల గొంతుల్లోంచి
కొత్త నినాదాలు కలవరపెడుతున్నాయి
"తెలంగాణా తేక కాదు
వద్దించే వాళ్ళు మనోళ్ళు కాదు"
ఆకుల ఆంజనేయుల కేకలు వింటున్నాను.
"త్యాగాల పునాదుల మీదే
తెలంగాణా సాధిస్తాం"
నాగారం అంజయ్య లెక్కల బాగారం గమనించాను
నెత్తుటి తెలంగాణా వద్దు
ఆకుపచ్చ తెలంగాణా ముద్దు
వేడి తెలంగాణా వీణ మీద
తెగిన తంత్రులు కూడా
తెగించి నినదిస్తున్నట్టే ఉంది

ఎవరు తెలంగాణా ద్రోహులో
ఎవరు తెలంగాణ స్నేహులో
అంతా గోల్‌మాల్గా ఉంది
ఊరు చూస్తున్నాను
ఎండిన కళ్ళ పడియల్లో కన్నీరు చూస్తున్నాను
వలసపోయిన నాలోకి నేను చూస్తున్నాను
వలసపక్షుల 'కిచకిచల్లో
నా ఒంటరి కంఠం
ఎవరు గురుతుపడతారు?
నా వలస ముఖంలో
ఏ ప్రాంతం?
ఏ ముద్రవేసుకోను?
వీధినరుణ్ణి కాలేనివాణ్ణి
విశ్వమానవుణ్ణి కాగలనా?
దోసెడు నీళ్ళకోసం
దోషిలా నిలబడ్డ చరిత్ర నాది
నేనే భగీరథుణ్ణయితే
ఒక్క తెలంగాణా కోసమే కాదు
ప్రపంచ తెలంగాణాల కోసం
గంగావతారమెత్తుతాను
అంటులేని నీళ్ళకోసం
అంతులేని పోరాటం చేస్తాను
అంతవరకూ
తెలంగాణా ఎడారిలో
నేనొక ఒంటెకు ప్రతీకను..

*ఆదివారం, వార్త, ఏప్రిల్ 2, 2006*

# పాకాల అభయారణ్యం మరియు మేము ఏడుగురం

● యం.డి.యాకుబ్ పాషా

మేము ఆ అడవిలో
పసివాండ్లమైపోతాము
పసిరిఛాయల కతలమవుతాము
తీరొక్క ముచ్చట్ల తీగలమై మెరిసిపోతాము
పాటలల్లుతాము, పగలబడి నవ్వుతాము
మా నవ్వుల్లో, కతల్లో ఎంత కవిత్వమో కదా?

మేము ఆ అడివివాగులో
జెల్ల'పిల్ల'లమవుతాము
సాకల్లమవుతాము, సారంగులమవుతాము
నీటి తరగలపై ఏటిపాట కొత్తగా పాడుతాము
మా అల్లరిలో
మా అలజడిలో ఎంత కవిత్వమో కదా!

ఆ అడవి తూముపై
ప్రతాపరుద్రుడి నాగలికి చెవులానిస్తాము
ఆ ఇనుపనాగలి మాటలు ఇష్టంగా వింటాము
ఆ నాగలి దర్పంలో
కాకతీయుల కదనోత్సాహపు కతల్లో ఎంత కవిత్వమో కదా!

ఆ అడవి తాడిచెట్టు ఇండ్లల్లో కాపురముండే
ఎర్రముక్కు చిలకలను పనిబడా పలకరిస్తాము
అవి మాకు పాలకంకులు ఇస్తాయి
పాలపిట్టల వన్నెలు చూపుతాయి

పాలకంకుల పసిడి కాంతుల్లో
పాలపిట్టల మెడవంపుల్లో ఎంత కవిత్వమో కదా!

ఆ అడవిలో
వంకలతో జింకలతో స్నేహం చేస్తాం
వందల సంవత్సరాల చెట్లతో పరాచకాలాడతాము
పొగమంచు తెరలను తుంచే ఎండపొడ గూటిలో
గువ్వలమై ఒదిగిపోతాము
మా పచ్చని స్నేహంలో వెచ్చని ఎండపొడలో ఎంత కవిత్వమో కదా!

ఆ అడవిలో
చిదుగులేరుతాము నిప్పులు రాజేస్తాము, వంటవాళ్ళమవుతాము,
'కట్టెంట పోయేదాన కర్రెమొఖపు దాన' పాటలమవుతాము
ఆ వంటనిప్పుల్లో
మా వొంటిపాటల్లో ఎంత కవిత్వమో కదా!

ఆ అడవి రాత్రవుతుంది
చలి దగ్గరికొస్తుంది వెన్నెల చేతికందుతుంది
మా పాటలతో చలిని పరిగెత్తిస్తాం
మా 'ధూలా' ఆటలతో వెన్నెలను వెలిగిస్తాము
మా పాటల్లో, ఆటల్లో ఎంత కవిత్వమో కదా!

ఆ అడవిలో
ఒకరెనుక ఒకరం ఏడుగురం
వాగు ఒడ్డున పిల్లగాలితో నడిచొస్తుంటే
దెక్కలివాడి కిన్నెరరాగం వినిపిస్తుంది
ఆ రాగానికి మేము పదాలమవుతాము
మళ్ళా మళ్ళా పాడుకునే తేనెచినుకుల పాటలమవుతాము

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 8, మే, 2006*

# బేత తొక్కుడే

● హరగోపాల్

నివ్వొద్దే నువ్వన్నదే నిజం!
ఈడ బతకుడు శానా కష్టం
ఈడ భూములున్నయ్, శెట్లున్నయ్, గుట్టలున్నయి
నీళ్ళే అందయి
తొవ్వి తొవ్వి వూర్లన్ని పొక్కలు బొర్రెలయినయి
నీళ్ళు తోడి తోడి మనుషుల రెక్కల బొక్కలుసెడ్డయి
కండ్లుగూడ యేడ్చి యేడ్చి బాయిబొందలైనయి
బాయిలల్ల నీల్లున్నా యెన్నడొస్తదో
మాయదారి గవర్నమెంటు కరెంటు

ఈడ సక్కదనాల బూములున్నయి
సల్లదనాల నదులున్నయి
కందలుకోస్కుని కష్టంజేసే
దండిగుండెల మనుషులున్నరు
ఈడ పండించిందానికి ధర తక్కువ
రైతు సెమటకు ఖదర్ తక్కువ
నాదాన్ బత్కయింది రైతు జీవితం
ఈడ గొడ్లగోస ఆసామిగోస ఒక్కటే
గొడ్లను కటికోల్లు రైతుల్ని మార్కెటోల్లు
ఒక్క తీరుగనె సఫాజేస్తుండ్రు

ఈడ వూర్లకూర్లు యెండిపోయిన బీల్లే
ఈడ బత్కాలంటేనే బుగులు, బుగులు
బతకొచ్చినోల్లు బలిసిపోతుంటే
ఈడ పుట్టినోల్లు పుచ్చిబుర్రలైతుండ్రు
ఈడి జనాలు మొండి మొదలారుతుంటే

వున్నయి లేనియి అమ్ముకుని పోతుంటే
రాల్లు కొనెటోల్లు, ఇస్కు కొన్కపోయేటోల్లు
జాగలు కబ్జాలు జేసేటోల్లు
ఈదున్నోల్లను ఈడ్చితన్నెటోల్లు
వాలాయించి తెలంగాణను బొంతకు బొమిడీకం జేసెటోల్లు
ఉసిల్లలెక్క పెర్గవట్టిరి, జులుం సాగించవట్టిరి

నివ్వొద్దె నువ్వన్నది నిజమేనే
ఈడ ఎగిలివారుతుందంటేనే
పల్లెల పానాలు జల్లుమంటయి
ఎవలి తుపాకులకెవలి ఉసురు తగుల్తదో
గా సంగతులడుగకు దండం పెడ్తగని
గది తెల్సంటె సంపుతరు, తెలవదన్నా సంపుతరు

నివ్వొద్దె నువ్ జెప్పింది నిజం ఈడ బతుకులు నిమ్మలంగ లేవు
ఈడ సావులు సాపుగరావు ఈదంతా అడివిల లగ్గిబడ్డట్టె
దినాలు గడ్వయి, వారాలు నడ్వయి
ఇంకెన్నొద్దులీ గోసపడాల్నో
ఇంకెన్నొద్దులిట్ల మోసబోవాల్నో

నివ్వొద్దె నవ్వన్నదే సై
ఇంగ మనవల్లగాదు ఇసుమంటిబాదలు
ఈడి మనుషుల్ని మర్సినోల్లను
ఇంగ నిలబెట్టి అడుగాలె మనహిస్సా కోసం ఏడికైన పర్వాలేదు

నివ్వొద్దె నువ్వన్నది నికాలస్ మాటే
మనబత్కుల్ని ఎవ్వరికి గిర్వి పెట్టమింగ
మనబత్కుల్ని ఎవ్వరికి సాకలు పొయ్యం
మనమే మనకష్టం తీర్సుకుంటం
మనమే మన జెండాల్ని పట్టుకుంటం
మనమే మనవూరేగింపుల ముంగలుంటం

*మూలకం కవిత్వ సంపుటి మే 2006*

## ఏది జాతి!

● అంబటి శ్రీనివాసరాజు

ఒద్దునాకీ బంధిఖానా...!
భాషతో జాతిని సృష్టించకు
సంస్కృతుల మధ్య అంతరాన్ని
నీ ఉలూఖ నేత్రంతో మూసివేయకు

అసలు జాతి అనే పదానికి
సరైన అర్థం వుందా నీ కాడ
ఓసారి భాషే జాతంటావు
తీరా నా భాషలో యాసచూసి
నన్ను అనాగరికుడంటావ్
నా భాషను
నీ సినిమాలో విలన్ను చేసి
నీ హీరోతోని తన్నిస్తావ్

ఇక పండుగల
పోలికను జాతంటావు
నా చెల్లి బతుకమ్మను చేసి
పాటపాడి
నీట్లో విడిస్తే
నాది జానపద సంస్కృతని
నీ పేపర్లో రాస్తావ్!
నీ పెరట్లో
కొబ్బరి చెట్టు నాటి ఇదే
మన సంస్కృతంటావ్

నా పెరట్లో మొలిచేవి
తుమ్మచెట్లే మరి!
అమెరికా వారు ఇంగ్లీష్ మాట్లాడి
అమెరికన్ అయ్యాడు
అదే ఇంగ్లీష్ మాట్లాడి మరోడు
ఆస్ట్రేలియన్ అయ్యాడు
భాష ఒక్కటే.
కానిక్కడ జాతిమారింది
ఒకడు హిందీ మాట్లాడి
రాజస్థానీయుడైతే
అదే హిందీ మాట్లాడి
మరోడు బీహారి ఐపోయాడు
మరి ఒకే భాష మాట్లాడినంత మాత్రాన
నేను ఆంధ్రుణ్నెట్లయిన
కాబట్టే నేను తెలంగాణోన్ని
తెలంగాణ జాతీయున్ని

*మన తెలంగాణ, జూన్ 2006*

# దరువుల కొలువు

● *పసుపులేటి గీత*

నట్ట నడిజామున
నా నిదుర గూటి నిట్టాడిని
నిట్ట నిలువునా చీల్చిన
మెలుకువ పిడుగు
ఉరుముల ఉప్పెనకు చుక్కాని

గుండె క్షణంపాటు ఆగిన
ఉలికి పాటు పోటు
నాకేనేమిటి ఊర్మిళకైనా తప్పని నిద్రాభంగం

తెలంగానోత్సవంలోకి మేలుకున్న
యుగాల జోలపాటల యోగనిద్ర
నాలుగురోడ్ల దోసిట్లో
పొంగే బోనాల కెరటం

అదాటున అద్దె ఇంట్లో
బద్దకపు ఒద్దిక మీద
తొలివేకువ తుడుందెబ్బ
ఉన్న ఫళాన రజాయి కింద
చలిముళ్ళ తుఫానుకు
నిప్పుల తుళ్ళింత
నిద్రచెడిన జనవరి జ్వరంలో
మే మాసపు మండుటెండ
పలవరింత

విశ్వవాద్య ఘోషల్లోకి
అనాది నాదవనం లోకి చొచ్చుకొచ్చే
కుర్ర తుమ్మెదల ఝుంఝుమారుతం

గల్లీగల్లీలో బతుకు కామందుల ముందు
చిందు అలాయి బలాయి
అనురాగపు, అగరుపొగరు

పత్రీ, పీర్ల సమాగమం
బతుకమ్మ పాటల కమతం
జాదగణేష్ చేతిలో ఉండ్రాయి
భాగ్యనగరానికి పోతరాజు
కాలిగజ్జెల తురాయి

మిట్టమధ్యాహ్నపు వీధుల్ని
ముట్టడించే కరిమబ్బుల
'సదరు'కు దరువుల దర్వాజా

చిన్నా పెద్దా ముసలీముతకా. ఆడామగా
ఎల్లలు మరిచి ఎలుగెత్తిన
జనతరంగం
లక్షపాదల రేకులు విచ్చి
నేల వేల మువ్వల పువ్వై
వికసించే నిత్యవసంతం
పారాడే గడ్డి మీద పట్టుంపు అల
గాలికోకిల మీద గాజుల వల
'రంగం' శిరసున రవ్వల పోసం
మహంకాళి సైతం పైమరిచే పులకరం

సోమార్, ఏక్‌మార్, దోమార్,
తీన్మార్, తీన్మార్, తీన్మార్ వైపు
నిప్పుల జంజీర్
లష్కర్‌కి పూల పూనకం తీన్మార్
గోల్కొండ గుండెదప్పు తీన్మార్
చార్మినార్ ముషాయిరా తీన్మార్
ఖైరతాబాద్ నగారా తీన్మార్
ప్చ్, ఇల్లు మారుతున్నాం
చెవినిల్లు కట్టుకున్న ఢంకాపిట్ట
ఎగిరెళ్ళి పోతూ, పోతూ...చివరిగా
నిశ్శబ్దంగా పాడుబడే నాలోకి
దిగ్గరంటూ ఓపాట ఊదను
గుచ్చి పోరాదా తియ్యగా...

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 17 జూలై, 2006*

# 'ఫ్రీ జోన్'

• వరవరరావు

రాత్రి మూడో జాము
ఆత్మీయ రహస్య స్పర్శతో పులకించవలసిన వేళ
గాలి కాలుష్య నగరం తరిమితే
గాబరాగా వచ్చి గుండెలను కుదిపి లేపింది

నగరంలో గాలికెక్కడా స్వేచ్ఛ లేదు
గార్డెన్‌లో కాలూనుదామంటే గార్డు
పార్కులో ప్రవేశిద్దామంటే టికెటు
మూసీలో గుడిసెలను కూల్చగలవే కానీ
బుల్‌డోజర్లు పూలు పూయించలేవు గదా

ఏ వంతెనలూ లేని నాడు
ఇదే వేళ
ప్రేమ ఎదురీదిన వరద ఈ ఊరు
ఎనిమిదికాళ్ళ రంగుల సరీసృపం
పరిష్వంగంలో బందీ అయింది

బాగమతి సిగలోని పూవు
వేలంపాటలో విజేత కైవసమయింది
బాగే ఆమ్ చట్టాలు చేసే పాలకుల
బాతఖానీ క్లబ్బు లేదా
వాకవుట్ల రబ్బు
కూలీల శరీరాలు కొనుక్కునే
మేస్త్రీల డబ్బు
నిషేధాజ్ఞలు విధించి కానీ
సభ అక్కడ కొలువు తీరదు

గాలి ఎక్కడికి పోవాలి
ఎక్కడికన్నా తలదాచుకోవడానికి
పోవడానికన్నా ముందు
రోడ్లమీద వాహనాలన్నీ ముక్కుమూసుకొని
పొడకుల్ని సీట్లకు కట్టేసి
లేదా హెల్మెట్లలో శిరస్సులు కప్పేసి
పరుగెత్తుతుంటాయి
ఇళ్ళన్నీ తలుపులూ కిటికీలు మూసుకుంటాయి

ఎవరి ఊపిరితిత్తుల్లోనూ
శుభ్రమైన గాలికింత చోటులేదు

ఏ పోలీసులూ అరెస్టు చేయకుండానే
ఏ మెజిస్ట్రేటు ముందూ హాజరుపరచకుండానే
ఏ జెయిలుగేటూ తెరుచుకోకుండానే

'ఫ్రీజోన్' తరిమేసిన ముల్కీవలె
ఇరవై నాలుగు గంటల న్యాయసహాయం వల్ల
ఇదిగో ఈ రాత్రి
గాలి నా వెంత
జైల్లో స్వేచ్ఛగా ఊపిరి పీల్చింది

*అంతస్సూత్రం కవితా సంపుటి, జూన్, 2006*

# గీ దినం

• భీంపల్లి శ్రీకాంత్

గీదినం
నేను మాట్లాడితే
మాటలు రావు
కన్నీళ్లు వస్తవి
ఎన్ని దినాలసందని
నేను ఓపికబట్టాలే
ఎన్ని ఏండ్ల సందని
నేను మూలకుబడాలె
ఎదుగుతున్నోన్ని
జర ఎదగనీయాలె
కానీ - వాడు
నాకే మంటబెడ్తడని
నన్ను దూరముంచిండు
వాడి పప్పులుడ్కనింకనే
నన్ను పక్కకు బెట్టిండు
వాడు మఱ్ఱి సెట్టు
దేన్నీ మొల్వనివ్వడు
నేను
మొలకెత్తుతున్న మొల్కను
నిలువునా తెగ్గొస్తడు
ఎన్ని రోజులని
ఎదురు సూడాలే
వాడు - మారడు
నన్నూ - మారనీయడు

మనోదనే జర సంధిస్తే
నా ఎదమీదమే ఎక్కుతున్నడు
వాడిది నక్క సోపతే
ఎన్ని ఎత్తులేస్తున్నడో
మనల్ని ముంచనీకే
ఎన్ని కుట్రలు పన్నుతున్నడో
మనల్ని తొక్కనీకే
టైమ్
వాడకీ - కాదు మనకు వచ్చింది-
తరిమి తరిమి కొట్టానీకే
తెలంగాణ వీణ మీటనీకే

*మన తెలంగాణ జూలై - సెప్టెంబర్, 2006*

# సరిహద్దు

• కందుకూరి దుర్గాప్రసాద్

నువు చదునుచేసిన చరిత్రమీద
బాసలు బాటలు పట్టుకొనే నడుస్తయ్
కాని బతుకులే కాట గలుస్తయ్
వాక్కులు స్వతంత్రమే... భాషనే నిషిద్ధం !!

నా భాషను నువ్వు..
నీ భాషను నేను... అర్ధం చేసుకోలేనపుడు
సారూప్యాలకోసం సనగడం దేనికి!
ప్రతిదానికీ... తేనె పూయడం తెల్సిన నీకు.
భాషకు...మాధ్యుర్యపు మాసికేసుకోవడం ఎంత సేపు

నీ భాష శాసనాలమీద ఓటెయ్యగలదు ..
నీటి మీద మాటలతో దాటెయ్యగలదు...
కరిగిపోని కరువును రాసివ్వగలదు ..
సరె....మాధుర్యం మీదే
గుండెచాటు గద్గదాల మార్ధవ్యమే మాది!

ఇన్నాళ్ళు నువ్వు...భాషతో హద్దులేసుకున్నావ్
మేము... బాధలతో సరిహద్దులు గీయబోతున్నమ్

ముసుగులో గుద్దులాటెందుకు
గీత దాటితే...
గురిచూడక తప్పదు!
సరిహద్దు అన్నాక
అప్పుడప్పుడు...
యుద్ధభాషనూ మాట్లాడాలి!

*తడినవ్వు కవితా సంకలనం, అక్టోబర్, 2006*

## కుతకుత...కుత...కుత...

● పొట్లపల్లి శ్రీనివాసరావు

కన్నీటిగాధ
మా నీటి బాధ
గొల గొల ఏడ్సుకుంట సెప్తిమి
కడుపుల్ల తలకాయ బెట్టి
పావురంగ సోపతి సేసినందుకు
తొవ్వ నాశనం సేస్తిరి
ఎన్నుపోట్లు ఎన్నిపోట్లు పొడుస్తరు
చేతులకు జెట్ట తగిలిందా
చేతులబడ్డ పులిబిడ్డలను
కసిదీర రెచ్చగొట్టి రచ్చకీడిస్తిరి
అడవుల్ల తిరుగొద్దని
అవురావురు మందలమీద పడొద్దని
మంచితనంగ పంచన చేరినందుకు
ఎంత వంచన సేస్తిరి
మెజారిటీ లేనప్పుడు
విధాన మండలి బిల్లెట్లాయె
గులాంగిరి చేసేటోళ్ళకు
ప్రత్యేకమెందుకని ప్రశ్నలాయె.....?
ఏందన్నో...ఎట్లనో కూస్తాందు సూడు
దున్నరాని మనకు అడ్లేయడం తర్ఫీదిచ్చిందట
మనకిన్నిఒంట్లు ఓనమాలు దిద్దించిందట
అవు! నివద్దే బిడ్డా
ఏ మాటకు ఆ మాటే సెప్పుకోవాలె
మోటగొట్టి నాటేసిన మనుషులమాయే

దీర్ఘాల్దీసి మాట్లాడ్డం
మన పెయికెంతకూ ఇమడదాయె
శాని మాటలు శానిచదువులు
శాని పనులు రావాయె
దాచుకోవడం దోచుకోవడం తెల్వని
నిశానీల మాయె
ఉన్నదేదో అందుకుని మంచీ చెడ్డా అర్సుకోవడమే
తెలిసినోళ్లం కాని తెలివిమీరినోళ్ళం కాదాయె
అయిందేదో అయింది కాని వాయీ
మన మంచితనం అవతలోని బలం ఐతానప్పుడు
ఎసట్ల ఘటక తరీఖ కుతుకుత ఉడుకుతానప్పుడు
ఇక నీళ్ళ మూట లెందుకు... ?
ఈడి అభివృద్ధికి ఆడి కోట్లెందుకు
మాది మేము చూసుకుంటం..
మా తెర్వుకు రాకుండ్రి
మీ బతుకేందో మీరూ బతుకుండ్రి

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్, 2006*

# లచ్మి బస్సుదిగు

● వద్త్య పంతులు నాయక్

నీడ నిదర పోయింది
వెన్నెల అలసి పోయింది
సూర్యుడు చూడలేక
కండ్లు మూసుకున్నాడు

ఆకాశం ఎర్రగడ్డ..'? నవ్వులు
నవ్వుతుంది ఆర్.టి.సి. బస్సు ఎక్కిన
లంబాడి లచ్మికి సమైక్యపోళ్ళు జరుగులచ్చి
అంటే జరుగుతనే ఉంది
దిగు లచ్చిమి అంటే దిగుతనే ఉంది ఏండ్ల సంది
గమ్యం రాక ముందే దిగాల్సిన చోట దిగకుండా
కూర్చోవాల్సిన సీట్లో కూర్చోనివ్వకుండా
ఇంకా ఎక్కుతూ జరుగుతూ దిగి పోతనే ఉంది
బంజార లచ్మి అద్దం ముందు నిలబడదు
అద్దమె తన నెత్తి మీద (గుగ్టో) అయి నిలబడ్డది
నేను రాజస్థాన్ అజ్మీర్‌గఢ్ రాణిని అప్పుడు
నేను ఇప్పుడు తెలంగాణ ఎండుకట్టెలమోపుని
నన్ను నా పురిటి నొప్పుల్ని
కన్నబిడ్డల్ని, మరిచిపోయేటట్లు చేసిన
ఆంధ్రప్రదేశ్ ఇగ సాగవు నీ దొంగాటలు
నా గతజన్మ రాణి భోగాలకు
మా తెలంగాణ ఏర్పాట్లు సాగాల్సిందే
ఇక తొందరలోనే ఢిల్లీ పార్లమెంట్‌లో
పంపకాల కాగితాల పైన దస్తకద్ చేయాల్సిందే

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్, 2006*

# పగోని పాలన

• బి. వేణుగోపాల్‌రెడ్డి

మూడు తరాలు గిపుడు
తెగిన స్వరాలు
ప్రతి తరం ఉద్యమబాటనే
ఒక కల కోసం తపన...
నిజాం దాష్టీకం నుంచి
తప్పించుకున్న తరం
గిపుడు
రెండింతలు పెర్గిన హింసల నడుమ
కండ్ల ముంగట కొలువు దూరమై
అందివచ్చిన చైతన్యం
రక్తంమడుగైంది
గోస కాలువలై పారుతూనె ఉన్నది
పాలన అంతా పరాయి అయినపుడు
పగ అంతర్లీనమైంది
'వలసోని పాలన'
హింసల రాజ్యమైనపుడు
ప్రతిహింస అనివార్యమవుతుంది
తరం నిరంతర తపన
చెదిరిపోని ఆశయాల వెనక
సాళ్ళు గీస్తున్నది
అస్థిత్వ తపన కోసం
నౌకరి లేని బతుకులు

నరక యాతనలు పడుతున్నది
బరిబాతలైన బతుకులు
నడినెత్తిన సూర్యుడు వంగినా
సెలకల్లో 'పరిగెలేరు'కుంటున్నవి
ఆగమైన బతుకు ఆరాటం
తరాల బ్రతుకు చిత్రం
తడారని శోకం
చుక్కనీటి కోసం పోరాటం
యుద్ధం చేయడమే ఈ నేల స్వభావం
ఉద్యమం ముక్కోటి గొంతుల జాడ
మూడు తరాల ఆశ
మూగబోయిన కోట్ల గొంతుకలనుంచి
ఇప్పుడు విస్ఫోటనం చెందుతున్న భాష
తెలంగాణము తెలంగాణము....

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్ 2006*

# నమ్మక ద్రోహం

• *చింత రమేష్*

కొడకా కొడ్కన్న
ద్రోహాన్ని దోసిళ్ళబట్టిన
దొరలాంటి దొంగోడు
గాని భూజాన చెయ్యేస్తివా?!

మనది దొడ్డు భాషని
గొడ్డు భాషని గొడవబెట్టినోడు గాదు
గాని ముచ్చట్లు నమ్మినవా?!

పచ్చంగోడు, ఎర్రంగోడు
మధ్యన ఆకుపచ్చంగోడు
ఎగదోసుకొని ఎగబడిరి/ఎరకలే - యాల్లకాద్నే
యాపముక్క నోట్లే బెట్టి
యవ్వారం జెయ్యాలే

ముసుగుదన్ని మూలబంటేగాదు
అవసరమొత్తె గుదుపబట్టి / గుంజీలు దీయించాలే
రాళ్ళతో గొట్టినా ....రవ్వల నక్లెస్‌తో గొట్టినా
వొట్టిపోయే పాణం గావొద్దు
నీళ్ళను - నిప్పుల్ని
ఉన్నపళంగా ఊద్చుకోబోయినోడు
ఉత్తుత్తి ముచ్చట్లకు ఉరకదు
ఉడుం పట్టు పట్టాలే ఊరి చివరి దాక తర్మాలే

ద్రోహం - నమ్మకద్రోహం
ఒకటా...రెండా....? / ఇగ నా వల్లగాదు కొడుకా కొడ్కన్న
పోరుజెయ్యి - నీ అవ్వకోసం పోరు జెయ్యి

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్ 2006*

# ఇక పోరాటమే

● వడ్ల శంకర్

కరిమబ్బులు ఆవరించిన చోట
మౌనం
ఒక మరణం

మోసం
జడలు విప్పింది
మిత్రమా
జూలు విదుల్చు

అభివృద్ధి మంత్రమా
చాలించు
గూబ వాచిపోతుంది
నీది
నయవంచక ఓర్పు
నాది తలవంచని తీర్పు
మనకు పొత్తేమిటి?
ఆత్మవంచన స్వార్ధచింతన
భక్తిపారవశ్యంలో భజన బృందాలు
ఇంకేం?
నీకు విశాలంధ్ర నాకు విషాదాంధ్ర
ఇది -
చీకటి గుహల్లోంచి విముక్తికి
కాంతిబాట
దాయాదుల కుతంత్రాల పంజరాల్లోంచి
రెక్కలు తొడుక్కునే పోరాటం

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్ 2006*

# ఏడుపాయల జాతర

• యం.డి. అహ్మద్

మంజీరా తన అఖండ దేహాన్ని
ఏడుపాయలుగా చీల్చుకొని తన
పాద ముద్రలు నాటుకున్న కాడ
మునిపుంగవుల తపస్సుల "మునిపట్టులు"
జనమేజయుని సర్పయాగ గుండాలు
మంజీరా నీ పరీవాహపు అడుగు జాడలు
దాశరథి గొంతెత్తి కీర్తించిన
హృదయ స్పందన రవళివే మంజీర
తెలంగాణ సంస్కృతి మొలకెత్తిన
జాతర ఏడుపాయల జాతర
పసుపు కుంకుమ జాజు పెట్టెలతో
పల్లె సింగారించుకున్న తెలంగాణ జాతర
బోనమెత్తిన తల్లి వరాల మాటలు
శిరమెత్తిన శివసత్తుల దప్పులాటలు
జక్కుల పందాలోళ్ల జముకుల జమిడీల నాదాలు
లష్కరోళ్ళ ఏడు దొంతరల బోనాలు
గండం గడిచినోళ్ళ గండదీపాల వెలుగులు
చేత చెర్నకోల పట్టిన పోతలింగని వీరంగం
గుమ్మటాల బండ్ల గుభాళింపులు
నా తెలంగాణ జాతర ఏడు పాయల జాతర
"టేకుల వొడ్డై" కమాను కాడ
కుంకుమ బొట్టు గల్ గల్ చప్పుళ్ల గాజులు
అద్దాల షోకేజులో అమరిన మిఠాయిదుకాండ్లు
లొట్టలేసే పిల్లపెద్దల బేరసారాలు

కీసు కీసు మంటూ పీకలూదుడు
రంగు రంగుల బుగ్గలు లాయిలప్పులు కొట్టుడు
బత్తీసబిల్లల బంగారు మెరుపులు
రంగులరాట్నాల ఎగిసిపడే జూలాలు
వయస్సు రంజింపచేసే మత్తయిన పాటల పలకరింపులు
ముచ్చటైన ముత్యాల పూసల పేర్లు
కళ్ళు జిగేల్‌మనే గోల్డ్ గోల్డ్ తళకులు
బండెడ్లసాటున బావామరదల్ల సయ్యాటల సంతోషాలు
జాతర ఏడుపాయల జాతర నా తెలంగాణ జాతర
మేకపోతుల, కోడిపుంజుల పసందైన విందులు
కిక్కిచ్చే కల్తీకల్లు మత్తెక్కించే చీపులిక్కరు.
తాగి నోడి తందానాఆటలు పాడేటోని పల్లె సుద్దులు
సాధు - సన్యాసుల గంజాయి దమ్ములు
తంబూర మీటిన తత్వాలు
ఈతిబాధలు బాపుకోను "యమకోడెం" ఈడులాటలు
"మోహీన్‌సాబ్" దర్గా కాడ
కూలీజనాల ఊదుబెల్లం చదివింపులు
ఫకీరుసాబుల నెమలి కట్టల దీవెనెలు
మాయమర్మము లేని జాతర నా తెలంగాణ జాతర
ఎడ్లబండ్ల సాల్లు నా తల్లి తెలంగాణ ఆనవాళ్ళు
మంచి చెడుల కలయిక మనస్సు బరువుదించె జాతర
దిన దినగండం బతకులకు ఊరటనిచ్చే ఊటల బాట
ప్రకృతి ఒడిలో సామూహిక సంస్కృతి సాకారమొందే
జాతర నా తెలంగాణ జాతర
ఏడుపాయల జాతర

*తెలంగాణ సోయి, అక్టోబరు - డిసెంబర్ 2006*

# గోదావరి నదీలోయలో

• పిట్టల రవీందర్

ఇప్పుడు ఏం మిగిలిందిక్కడ?
నల్లబంగారం జాడలేదు
టబ్బుల నుండి బంకర్‌లోకి
బంకర్‌లోనుండి లారీల్లోకి..ఆపై
రైలు వ్యాగిన్లకు బల్లర బల్లర బొగ్గు పెల్లలరొద
విందామన్నాలేదు

వంగుతట్ట మోసినప్పుడు, సెమ్మాసెత్తి పోసినప్పుడు
గుండె గొంతులై పాడిన పాటలేవీ, ఆ పాటల్లో ప్రాణమేదీ
డాంబర్ రోడ్డుమీద జారిన ఆరుగీరెల లారీలు
కర్ణభేరిని చీల్చుకుని మెదడు నరాల్లోకి ఇంకిపోతున్నట్టు
దూరమవుతున్న మాల్‌గాడీల సప్పుడు

చీమల బారుల్లాగా గణగణ గంటలు మోగిస్తూ
వడివడిగా రువ్వడిగా సైకిల్ సవ్వారీలు
చినిగిపోతున్న సాక్సులు చీకిపోతున్న కంపెని బూట్లు
మాసిపోయిన నెక్కరు మసిబారిన బనీను
నెత్తిన టోపి పెట్టుకుని తట్టాచెమ్మాసు పట్టుకుని
నడుముకు బాట్రీ చేతికి లైటు
మైసమ్మను మనసున తలచి, నేలమ్మను కండ్లకద్దుకుని
భూమి పొరల సొరంగ మార్గం
అప్పుడదే భూతల స్వర్గం. .
బార్డరులోనేకాదు, భూగర్భంలోనూ సైనికులున్నారు
కలగాపులగమైన పడమటి పొద్దులో

తట్టా, సెమ్మాసుల కవాతు సాగిపోతున్నది

టన్నులకొద్దీ నా తండ్రులు తవ్వితీసిన పెల్లలు
పెల్లపెల్లకు నీ ప్రాణమెంత తండ్లాడిందో
బొగ్గుకాలుతున్న వింతవాసన
కార్మిక వాడలను కమ్ముకున్న విఆర్ఎస్ మేఘాలు
నువు తీసిన రాకాసి బొగ్గు...నీకు కాదు
ప్రాంతేతరునికే నల్ల 'బంగారం'
గని సంపదను దోచుకెల్లడం, మోసుకెళ్ళడమే
ఆధునిక రాజ్యాధికారంలో అసలైన అభివృద్ధి

గోదావరి నదీలోయలో
యంత్రభూతాలు మరోసారి తలఎత్తిన జాడ
కోరలకింద నలిగిపోతున్న నల్లకలువలు
గుండెకింద తడివున్న వీరుల రాకకోసం ఎదురుచూపులు

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 24, డిసెంబర్, 2006*

# చెప్పురా

● మాళవత్ బాలాజీ నాయక్

ఆఖరినై నేను
తగాదాతోనే తలపడతాను
అగంతకరూపం దాల్చె నేను
కలతల ఆచూకినౌతాను దేవతలా, శవమైన నేను
దయ్యమై అవతరిస్తాను
మనిషిలోని మనిషి మేల్కొనే వరకు
బహిరంగం వెనుక రహస్యం కొరకు
మరో కొత్త దారినై అన్వేషిస్తాను.

★ ★ ★

యాభై ఏళ్ళ అనంతరం స్వజాతి రావణుల వెనుక
అడుగులు తడబడుతున్నాయి
కనుచూపు మేరలో
ఉందనుకున్నది ఏదీ కనిపించడం లేదు,
అగాధమైన గొంతునుండి
విధ్వంస పాటలే వినబడతాయి
మృత్యువు బ్రతుకుల నడుమ
ఆకలి ఉరికంబం చివరి అంచున
ఆదర్శాలు చిట్లుతున్నాయి.
వెన్నెముక విరిగిన జిందగీని ఈడ్చి ఈడ్చి
మలినాన్ని తుడిచి తుడిచి ఇన్నాళ్ళకు
కవిత్వము కత్తిలా దొరికింది ఆయుధమైంది నా చేతికి
సందిగ్ధమైంది ఈ వ్యవస్థకి

*ఊరేగింపు, తెలంగాణ సంగతులు, డిసెంబర్ 2006*

# రెండు కన్నీళ్ళు

● కందేపి రాణీప్రసాద్

అన్నం పెట్టిన నేల
బీడుబడి బిత్తరపోతుంటే
పంట భూములన్నీ
ప్లాట్లయి దర్శనమిస్తున్నాయి
రాజనాలు పండిన భూమి
రాళ్ళూ రప్పలుతేలి దీనంగా చూస్తుంటే
చల్లిన విత్తనాలన్నీ నాసిరకానివై
తడవకముందే తనువు చాలిస్తున్నాయి

దున్ని విత్తనాలేసినపుడు
కనిపించని వరుణుడు
పంట చేతికొచ్చే టైముకు
రంచనుగా వాలి విజృభించి
పంటను నాశనం చేసి
రైతును నట్టేటముంచుతున్నాడు

భూమికి దూరమై
సాగునీరు కరువై
సేద్యం చేసే రైతన్న
అసహాయతను చూసి
చావొక్కటే పలకరించి
అక్కున చేర్చుకుంటోంది
పురుగును చంపలేని మందు
రైతును చంపుతోంది
అరిచి అలమటించిన నాడు

ఆదరించని చెయ్యి
మరణించాక పలకరిస్తోంది
చేరదీసి సాయం చెయ్యని చెయ్యి
ఎక్స్‌గ్రేషియా రూపంలో
మరణాన్ని గేలిచేస్తోంది

సంతాపాలు కన్నీళ్ళు కాదు
రైతన్నకిపుడు
వెన్నుతట్టే ధైర్యం కావాలి
ఓదార్పులు ఊరడింపులు కాదు
సతత హరితాన్ని
కలలుగనే స్వేచ్ఛ కావాలి
ఒక ఆలంబన ...ఒక భరోసా
ఒక స్ఫూర్తి కావాలి
అచ్చంగా నీళ్ళు కావాలి

*ఆదివారం ఆంధ్రభూమి 13, ఏప్రిల్ 2007*

## శవానికి 'జల సంస్కారం'

● వెలపాటి రామరెడ్డి

ఔను! ఉన్న ఒక్క కొడుకూ
ఎలాగూ రాలేదని తేలిపోయింది
విదేశాల్లో ఉన్నోళ్లకు వీసాలు గీసాలని యెన్నో ఆటంకాలు
పీనుగ మురిగిపోకముందే
మనమే యేదో చేయాలి
ఒరే కొమురయా! నీవు డ్రామాల్లో వాని
కొడుకు వేషాలేశావుగా
కొరివి పెట్టడానికి తయారుగా,
నీ తల్లిదండ్రులెప్పుడో పోయింద్రు గదరా!
కట్టయా! నువు కట్టె తయారు జెయ్!
దమ్మయా! నువు 'దప్పుల' సంగతి చూడు!!
సరేగాని, ఎక్కడ దహనం చేసేది?
తెలంగాణల ఎవరిభూముల వారిని కాల్చడమే ఆచారం
పెరళ్ళూ అమ్ముకున్నడు
చెలుకలు చేజారినై పొలాలు బ్యారమైనై
ఆంధ్రోళ్ళు పెట్టిన ఆశలకు ఎకరాలకెకరాలు
వలస గుంటలనే ఇంకిపోయినగదా
తాతముత్తాతలు కట్టించిన ఇండ్లుసుత చేతులు మారినై
ఇప్పుడు తెలంగాణల శవాన్ని కాల్చడానికి జాగ లేకుంటైయ్యింది
అయినా, మనమే ఏదో చేయాలి. స్నేహితులం కదా!
పారే నదిలో 'పారేద్దాం' శవాన్ని - సగౌరవంగా'!

*వెలుగు నీడలు, ఏప్రిల్ 2007*

# నేలమీది చందమామలు

• కాసుల లింగారెడ్డి

ఆశ్వయుజమాస అమావాస్య
లోకం తెలిమబ్బుల చిరు చీకట్లని ఆలింగనం చేసుకుంటున్నవేళ
తెలంగాణ నేలమీద వెలిసిన లక్ష చందమామలు
ఆడబిడ్డల కండ్లల్ల మొలిచిన కోటి స్వప్నాలు

ఎంగిలిపూల అమాస
పునాస ఆనందాలతో నిండిన గరిసెలు
ఆరుగాలం శ్రమకు దొరికిన ఆటవిడుపు
అత్తవారింటి నుంచి తోలుకొచ్చి నడింట్ల అలంకరించిన
నిండు గౌరమ్మలు నా అక్కచెల్లెల్లు
బతుకమ్మ - ఒక సహజ అనుబంధాల ఊరేగింపు

శిశిర వసంతాలు చెట్టాపట్టాలేసుకున్న
ప్రభాత లే ఎండల్లో
తలారబోసుకుంటున్న గునుగుపువ్వు
నిశిరాత్రి శశికాంతుల మత్తిల్లి
మంచుపూల దేహాన్ని విరుసుకుంటున్న తంగేడు పువ్వు
నీలాకాశం నేలమీద తారాడుతున్నట్లు కట్లపువ్వు
చేతిస్పర్శకోసం ఒళ్ళంతా నరాల వేణువులు పొదుముకున్న రుద్రాక్షలు
కటాక్ష వీక్షణాల జలతారు తన్ను తాకదేమోనని
పెరటి పందిరెక్కి కిటికిలోకి తొంగిచూస్తున్న బీరపువ్వు
యవ్వనోద్రేకాల ఉన్మత్త అధరాలు సాచిన
ఇంతుల ముద్ద బంతులు-
బతుకమ్మ - తెలంగాణ నేల పూల కవాతు

అలికి ముగ్గులు పెట్టిన లోగిళ్ళు
సింగారించుకున్న చెల్లెల్ల చేతి నైపుణ్యం
వెలిసిన పూల పిరమిడ్ల ఇంద్ర ధనువులు
పీతాంబరాల ప్రేమైక పలకరింపులు
బాల్యపు స్వప్న సువాసనల పలవరింతలు
ఉల్లాసాల బాధల భావాల వాయినాలు
మత్తడి వద్ద సంబురం ఆట - సామూహిక పాదాల ఉద్విగ్నత
పాట - పోటెత్తి ప్రవహించిన చారిత్రక ధార
రాత్రి బీరిపోయి కదలడం మరిచిపోయింది-
చుక్కలు నేలకు దిగి తమ్ముళ్ళ చేతి బర్మాలయినై-
సద్దుల బతుకమ్మ సంబరాలవేళ
ఆకాశంలో సగంకాదు నా తోబుట్టువులు
సంపూర్ణాకాశాలు -
బతుకమ్మ - చెరువుల పులకరింపచేసిన ముద్దుగుమ్మ

మరణం అనివార్యం చేయబడ్డప్పుడు
బతుకు పోరాటాన్ని జయించిన బతుకమ్మ
రజాకారు రాకాసి మూకలు బరిబాతల ఆడించినప్పుడు
నిజాం నిరంకుశాన్ని సాయుధమై నిలువరించిన బతుకమ్మ
గడీల గోడలు కూల్చి
భూస్వామ్యాన్ని భూస్థాపితం చేసిన బతుకమ్మ
సమస్త సాంస్కృతిక ఆధిపత్యాల మీద
ఒక సరికొత్త ఆయుధం-
బతుకమ్మ - ఒక పోరాట వారసత్వం
ఒక అస్తిత్వపోరాటం

*ఎన్నాద్రి సంకలనం, విశాఖ సమాచారమ్, 19, మే, 2007*

# ఆరు నూర్ల పది

• ఏనుగు నరసింహారెడ్డి

పెద్దన్నలూ!
మీ పేరే రాష్ట్రానికి తగిలించినందుకు
దర్పం ఉండొచ్చు కాని ధర్మంలేదు
610 జీవోపట్ల ఆగ్రహం ఉండొచ్చుకాని
జీవోలో అధర్మం లేదు మలుపుకున్న కాల్వలవల్ల వచ్చిన
పంటల పచ్చదనం ఉండొచ్చు కాని
కన్నీటి వెచ్చదనం తెల్వదు అంతంత పెద్దమనుష్యులు
కౌరవుల్లా నూర్గురు
పార్టీలకు అతీతంగా తీరం పేరు మీద ఒక్కటై
గిర్గ్లానీ మేధస్సును ఎంత ఐకమత్యంగా అవహేళన చేస్తారు?
రాష్ట్రపతి ఉత్తర్వుల్ని ఎలా రచ్చకెక్కిన ఇల్లాల్ని చేస్తారు?
భాగ్యనగరిలో రైతు బాంధవుడు సరికొత్తగా
ఆశ్చర్యాన్ని ప్రకటిస్తుంటే మీరంతా పీఠభూమి ఆశల మీద
ఎంత ఒడుపుతో నీరొంపుతారు!
పాండవుల్లా ఐదుగురున్న దక్కనువాదంతో ఏమి కాదని
ఢిల్లీ పునరావాస రాజకీయాలుండగా ఏ భయమూ లేదని
స్వంత జోన్ల బదిలీ నడక నత్తను బహు తెలివిగా నిలపేయమంటారు!

మీకు తెలియదు అన్నలారా,
610 ఐదూళ్ళ పెట్టు
కురుక్షేత్రాన్ని తాత్కాలికంగా వాయిదా వేయదానికి
ఇన్నాళ్ళూ చక్రం తిప్పిన సెక్రటేరియెట్ల కుట్రలు మరవడానికి
'ఆరవ జోన్'ను 'ఫ్రీ' గా ఏంజాయ్ చేసిన దగా
ఆరు సూత్రాల పథకాన్ని అంగట్లో పెట్టిన ఆగం

ముల్కీ నిబంధనల్ని నట్టేట ముంచిన బాధ.
అక్రమ డిప్యుటేషన్లు, అంతులేని చొరబాట్లు
సృష్టించిన విషవలయం విషయం మరవడానికి
610 ఐదూళ్ళ పెట్టు
సముద్రపుటన్నలూ,
మీ తీరరాజకీయాలు / విశాలోద్యమ వాదాలు
పోలీసు సంఘాల హెచ్చరికలు
మరిన్ని కొత్త ప్రశ్నలు రేకెత్తిస్తె,
ఉత్త చెత్త ఉద్యోగాలన్నీ / గజిటెడ్ స్థాయికి పెంచింది
రాష్ట్రవ్యాప్తం చేసి మీరు పంచుకుందామని కాదా?
15 శాతం జనరల్ కేటగిరీని
నాన్‌లోకల్‌గా పరిగణించింది
మీరు మిడుతల దండుగా బారుకట్టేందుకు కాదా?
ఒక్కరొక్కరుగా అడ్డా బిఠాయించింది
మా జీవితపు అర్థం మీద సవారీ చేయడానికి కాదా?
ఇంత చేసినా మీరు గిలికిన లెక్కతో తేలిన
మా ముష్టి ఉద్యోగాల వాట అడిగాము కాని
మేమేమన్న ధవళేశ్వరాలడిగామా?
ప్రకాశం బారేజీలడిగామా?
కొసకు మా నేల మీద కట్టిన
నాగార్జునసాగరం నీరైనా నిలదీసి అడిగామా?
కేవలం పొట్ట తిప్పలకు
జీతపు తాటికంకలడిగాం
అన్నలూ జాగర్త!
ఈ ఐదూళ్ళనూ మీరెంత తాత్సారం చేస్తే
కురుక్షేత్రం అంత తొందరగా వస్తది

*ఆదివారం వార్త, 20, మే, 2007*

# నా ఊరు

• కట్టా భగవంతరెడ్డి

ఏందో ఏమోగాని.
ప్రపంచీకరణో. పాలోని మనో
ఏలోటోనింట్ల పీనుగెల్లా.
వాని చేతుల్ల సెల్లుల్ ఫోన్లు
దోసెటాని కండ్లల్ల దోసెడు
జల్లేడు పాలుగొట్టు
తొండి మాటల
మందరగాళ్ళు ముందమొద్యా
లేనోళ్ళ ఉసురు తగిలి
వాళ్ళ పిచ్చం పీక్కపోనూ

ఆడివి అందాలతో సింగారించుకున్న
నా ఊరు
వాగులు వంకలతో వొంపుసొంపుల
నా ఊరు
నిండిన చెర్వుకుంటలతో కలకలలాడే
నా ఊరు
వచ్చిపోయే వసంతాలతో సిగ్గులొలికే
నా ఊరు
ఐర్ల గొర్లమందలతో సందడిగుండె
నా ఊరు
మోటనాటు పాటలతో సంగీత క్షేత్రమైన
నా ఊరు
పాడిపంటల పసిడి కాంతులినే
నా ఊరు

నేడు బిక్కపోయింది, బీరిపోయింది
నా ఊరు
మండే గుండెలతో ఎండిపోతుంది
బొందల గడ్డమీద
బాధల గుండాల మధ్య
ముక్కుచెవులు మూసి
బొందబెట్టినట్లుంది
ఆకలిచావుల శవాలజాతరలా వుంది
చెదిరిపోయిన ఊరపిచ్చుక
గూడులా వుంది
ముడ్డికాడ చిరిగిన జల్లెడు చిల్లుల
ఎట్టిపోరని పాత చెడ్డీలా వుంది
ఎండిపోయి నెర్రెలుబాసిన
రేగడి ఒర్రెల్లా వుంది
వేటగాని ఉచ్చులో చిక్కిన
కౌజుపిట్టలా వుంది
పులి నోటికి చిక్కిన
లేడిపిల్లలా వుంది
నీళ్లులేక నీడలేక ఎండలో
ఒగిరించే దున్నలా వుంది
పాడుపడి దుమ్మురేగి
పాతపీర్లకొట్టంలా వుంది
తెలంగాణ నడిబొడ్డున నాటుకున్న
నా ఊరు
జంగ్ సైరనూదుతుంది,
జనంతోవ నడుస్తున్నది

*మన తెలంగాణ, జూలై - సెప్టెంబర్, 2007*

# అవును నేను ఆదిలాబాదోన్నే

• అప్పాల చక్రధారి

అవును నేను ఆదిలాబాదోన్నే
అమాయకున్ని గావచ్చు
నువ్వు నన్ను అనాగరికుడన్నవ్
నివద్దిగా సత్యప్రమాణంగా జెప్తున్న
నీకు ఇజ్జతు లేదు
నీకు ఇత్కారం లేదు
నీకు జేబుల పైసలెక్కయినై
నీ కీసల సీసలచ్చినై

మేం పొద్దంత ఫుర్సత్ లేకుండ పన్జేసి
దూపైతే నీళ్ళు దాగుతం
కడుపుల గాల్తే బువ్వదింటం
నీ మెరంగ ఓళ్ళ జోలికి వోమ్!
నీ తిర్గోల ఓళ్ల గోస పుచ్చుకోం
లగ్గమైతె ఉండి తీస్కోం
ఉత్తుత్తగా పార్కతులియ్యం
ఇదుపుగాయితం రాసుకోం
సాటుకొక్క మాట నేటికొక్కమాట లేదు
ఒక్లెక్కం జెప్పం - ఫాల్తు మాటలు మాట్లాడం
లొక్కిడాడం లొల్లిజెయ్యం

మాయి కైకిల్ కమాయ్ నియ్యత్ పైసల్
మొగలాయి జమానోళ్ళం కాపాయం మనుషులం
ఉసూల్ తోని వోతం ఫూజూల్ పనుల్జెయ్యం
ఉరుకుడు దుంకుడు లేదు

ఉద్దె బద్దె జెయ్యం ఉన్నదమ్ముకోం
బర్బాద్ గాం బజార్ల కెక్కం
అగడుమల్లోల్లం గాం అగావ్ ఖర్సు వెట్టం
గుమ్మిల్లున్నయ్ గుమ్మరిచ్చుకోం
ఎక్సాలున్నయని ఎక్కిపోం
తోడెమున్నయని తొక్కులాడం, ఫికర్జెయ్యమ్
తిప్పల్వద్దంగని
ఖదర్తోని బత్కుతం
ఆగమాగంగామ్ అడుక్కుతినం గట్లని
ఉపాసం తపాసం ఉండం, గాసం దెచ్చుకుంటమ్
మాలాస దావతులు జేస్కుంటం
పాశమందుకొంటం
పండుగలు జేసుకుంటాం

అవ్వను అవ్వంట
బువ్వను బువ్వంట
అయ్యను అయ్యంట
పెయ్యను పెయ్యంట
నెయ్యిని నెయ్యంట

ఇంగిలిపీసులు ఎంగిలి పీసులు రావు
అవును నేను ఆదిలాబాద్ వాడినే
అమాయకుడిని కావచ్చు
కాని అనాగరికుడిని కాదు, అనామకుడిని కాదు
అజ్ఞానిని కాదు
అంధుడిని కాదు
అవును అవును అవును నేను ఎదులాపురపోన్నే

*అవును నేను ఆదిలాబాదోన్నే కవిత్వ సంపుటి, సెప్టెంబర్ 2007*

## శిల

● కొల్లాపురం విమల

చెలికాని గూడి
సొగసులు వోయే
కృష్ణమ్మని
దప్పిక దీర్చే
అమృత జలాలు
యాచించేటందుకు
జతకత్తెలేవరూ లేకనే
వోయి. .

పూసిన మోదుగు పూల
అగ్గి సెగలో
మోహపుకొలిమి రగిలి
మనసు విరిసి
మెట్టెలు పారేసిన
వివశను
ఎల్లమ్మను

కరడు గట్టిన
కాలాన్ని సైతం
శిశువుగా
మార్చే
నగ్న సౌందర్యం
నాది

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 22 అక్టోబర్ 2007*

# కుర్చీలు కూలుతయ్

● కోట్ల వెంకటేశ్వరరెడ్డి

చెరువు తూముల్లో
బల్లులు గుడ్లు పెడుతున్నాయి
ఇండ్లల్ల పొయ్యిలో పిల్లులు నిద్రపోతున్నాయి
కొట్టాలు ఖాళీచేసిన పసులు
పెబ్బేరు సంతలో
లారీలెక్కుతున్నాయి
కోయిల్ సాగర్ భూముల
నోళ్ళు విచ్చినయి
సరళ సాగర్ గర్భంలో
తుమ్మలు మొలిచినయి
తాతల్నాటి బావులిక్కడ బొందలయినయి
కృష్ణమ్మకు మందెవరు బెట్టిరో
మంది భూములల్ల జొరపడుతున్నది
ఆడోళ్ళ పుస్తెలు తాకట్టుపడ్డవి
వేసిన ఇత్తు మేసి కూసున్నది భూతల్లి
మబ్బులు కరగవు
వానలు కురువవు
చేసిన అప్పులో దిక్కు
కూటి తిప్పలోదిక్కు
రెండు మూతుల పామై కరుస్తున్నవి
పుట్టినంత సహజంగానే
చావుకూడా రావాలి కదా?
ఇదేంది మధ్యంతర ఎన్నికల్లా

చావు ఎప్పుడు పడితే అప్పుడు వచ్చిపడుతున్నది
నాలుగు కాలాలు బతకాల్సినవాడు
దేశమిడిచి పోతున్నాడు
పోయినోడు పోయినట్లే
దేహమిడిచి పోతున్నాడు
శవమింకా కాలనేలేదు
పత్రికల నిండా
సందేహాల చర్చల కమురువాసన
ఓట్లకోసం రాబంధులు
బొచ్చెలతో బిచ్చాటన, ఋతువు మారింది
మొసలి కన్నీళ్ళకు
శవాలు ఓట్లు పూయవు
కుర్చీలు కూల్చుతయి!

*తెలంగాణ టైమ్స్, సెప్టెంబర్ - అక్టోబర్, 2007*

# టు ద సెకండ్ పర్సన్ నాట్ సింగ్యులర్

• బైరెడ్డి కృష్ణారెడ్డి

కదుపు సేత పట్టుకొస్తివని
పట్టెదన్నం పెట్టిన పాపానికి
కదుపార మెక్కి
తిన్నింటి వాసాలు లెక్కపెట్టే
మర్మమెరక జెప్పితివి

సహనానికి పర్యాయపదం
అమాయకత్వమని
ఇంకా నమ్మిస్తున్నాని
ఆత్మానందంతో
కళ్లు మూసుకుని
చంకలు కొడుతున్న పిల్లివి

చాపకింద నీళ్ళోతిగొస్తివి
చాప నాదేనంటివి
చాప కింద నేలా
నాదేనంటివి

కాళ్ళ కింద నెర్రెలెత్తిన నేల
బుసకొడుతున్న
ప్రకంపనలు వినబడటంలేదా

మట్టి మొగ్గలమై
మొలకెత్తుకొస్తున్నం

అట్లనే చూస్తుండి

కండ్లప్పగించి

మొలకెత్తి
అంతంత వటవృక్షాలైతం

నా నేల నడిబొడ్డున మొలిచిన
బొడ్రాయి సాక్షిగా
నీ వలస కుతికెను తెగనరికే
వధ్యశిల కాడ ధ్వజస్తంభాలైతై
మా వూడలు

నా తల్లిని
నల్దిక్కుల పహారా కాసే
దిగ్గజాల కాళ్ళ కరకు
గజ స్తంభాలైతై
మా వూడలు

ఆనవాళ్ళు దొరక్కుండా
పాతాళమంత పాతరేస్తయ్

పరాయి సొత్తుకు మర్లుగనని
ముంగిట పడితే కడుపుల పావురం
దేవుకొచ్చినట్టై
ఐందేదో ఐపోయిందిలెమ్మని
కన్రెప్పలల్ల
కాపాడుకునేటోల్లం

ఆఖర్సారి జెప్తున్నం
మళ్ళ అటెంక....
నీ యిష్టం.

*ఆర్తి కవితా సంకలనం, నవంబర్, 2007*

# కలిసి ఉంటే కలదు...

● నందిని సిధారెడ్డి

పిట్టలేమైనా కానీ
పిల్లలెట్లన్నా పోనీ
మీరు మేఘాల దిక్కు చూడండి
మేం నదులు తన్నుకుపోతాం
మనం కలిసి ఉందాం

చేను గలగల కానీ
చెరువులో తుమ్మలు మొలవనీ
మీరు చవగ్గా అమ్మండి
మేం భూములు కొంటాం
కలిసొస్తే కాలువలు మలుపుకుంటాం
కాకుంటే రియలెస్టేట్లయినా లేపుతాం
తమ్ముడూ, మనం సరదాగా కలిసుందాం

చుక్కలు కనబడనీ
సొరంగాలు కూలిపడనీ
మీరు బొగ్గు తియ్యండి
పవర్ జనరేట్ చేసి
మేం లాభాలు పంచుకుంటాం
కలిసుందాం తమ్ముడూ కలిసుందాం

పెద్దమనుషుల ఒప్పందం
పేపరూ సంతకాలే కదా
ప్రాంతీయ కమిటీ భ్రాంతిజనకమే గదా
అన్నింటికి మమ్మల్ని నమ్ముకోండి
అన్ని పదవులు మేం పంచుకుంటాం

అదపాదదపా పెదవులు తదుపుతాం
ఆరోవేలు లాంటి పదవి కోసం
అన్నదమ్ముల కలహమా
విశాలాంధ్ర విడిపోవటమా
కుటిల రాజకీయాల కోసం
మహనీయుల మధురస్వప్నం మసి కావలసిందేనా
తెలుగుతల్లి ముక్కలవటమా
లేదు లేదు మనం కలిసి ఉండాలి

తలమీద రెట్టపడనీ
పిడుగులు పడి పిల్లలు చావనీ
చెట్టు కింది చదువులు చట్టుబండలు కానీ
మీ పిల్లలు రోడ్ల మీద ఆవారాగా తిరగనీ
మీ ఉద్యోగాలు మా పిల్లలు చేస్తారు
ముల్కీరూలు ముక్కిపోయిన ముచ్చట
ఆరువందల పది జీవో అందమైన నజరానా
భలేగా మలిచి అలమరలో అలంకరించుదాం
కలిసి ఉందాం సోదరా
కలిసి ఉంటే కలదు సుఖము
మేం ఫాంహౌజులు పెడతాం
మీరు వాచ్‌మెన్లుగా చేరవచ్చు
మేం భారీ కాంట్రాక్టు తెస్తాం
మీరు సబ్ కాంట్రాక్టులు చేసుకోవచ్చు
మేం పెట్టుబడులు పెడతాం
మీరు శ్రమను అమ్ముకోవచ్చు
మేం రకరకాల స్కీములు పెడతాం
మీరు రకరకాల అప్పులు చేయవచ్చు
అప్పుడప్పుడు ఆత్మహత్యలు చేసుకోవచ్చు
మేం టీవీలై పత్రికలై ఆ వార్తలమ్ముతం

ఇంకేం?
ప్రతి చిన్నదానికీ విడిపోవటమేనా?
వెలుగూ చీకటి
ఎంత గాఢంగా కలిసుంటాయి
మనమట్లా కలిసుందాం
కష్టసుఖాలు కలిసి పంచుకుందాం
మీకు కష్టం
మాకు సుఖం
కాదా, సుఖదుఃఖాలు కలిసి పంచుకుందాం
మాకు సుఖం
మీకు దుఃఖం

*నది పుట్టువడి కవితాసంకలనం, నవంబర్, 2007*

# జిలేబి రేసు

• మద్దికుంట లక్ష్మణ్

దారం ఎగురుతనే ఉంటది
తీరం దగ్గరనే కనవడుతది
వేలి కొసల పనితనం
మనసునవడుతునే ఉంటది

అంతా అందినట్టే ఉంటది
అంతా అయిపోయినట్టే అనిపిస్తది
ఆట నడుస్తనే ఉంటది

గమ్యం కనిపిస్తనే ఉంటది
గుర్రం ఉరుకుతనే ఉంటది
మర్మం ఎరుకవుతునే ఉంటది

చెవులకాడ సప్పుడు చేసి ఎదురుంగనే లైను కదుతరు
దొంగ తెలుస్తనే ఉంటడు

ఒకడు వాడని సూపిత్తడు
ఒకరు వీడని నిలవెడతడు
ఇంకొకడు అయ్యనే అంటడు
కాదు అవ్వనే అని మరొకడంటడు
అంతా పెండల బుర్రిగాని ఆట

బైండ్లోల్ల జముకు సప్పుడుకు
ఎల్లవ్వ తల్లి ఎగిరినట్టు ఎగురుతనే ఉన్నం
మీ మంత్రాలు తంత్రాలు
అన్ని బైటవడ్డయి.....
ఎల్లవ్వ తల్లి కండ్లెర్రజేసింది
ఇగ సంచులు సదురుకోండ్రి బిడ్డా

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 19, నవంబర్, 2007*

# తెల్లగోలు కావాలే

● ఓదెల వెంకటేశ్వర్లు

తెలంగాణ ముచ్చట ఇప్పుడు
ప్యాషనైయ్యింది....
మైకు ముందు శివ సత్తులు
ఊగినట్టు ఊగుతాంద్రు
మైకు పక్కకు పోతే
వాడింకో మైకంల ఉంటడు

తెలంగాణ ముచ్చట ఇప్పుడు
నాదానయ్యింది
మాట్లాడతందుకే
తక్కి బిక్కి అయితాంద్రు...
సావుదలకచ్చిన సన్నాసులుగూడా
కచ్చీరు ఏలాన్నని ఖాయిసున్నది...
గందుకనే వాడు
ఎవని మోచేతి నీళ్లైనా తాగుతడు

తెలంగాణ ముచ్చట ఇప్పుడు
పెద్ద రచ్చయ్యింది...
ఉడుకు రక్తంల ఈతకొడుతాన్న ఆలోచనలు
కందిరీగలై ఎగురుతాన్నయ్...
తెలివి కలోల్లు...అందరికి లగు నేర్పుతాంద్రు

తెలంగాణ ఇప్పుడు
బక్కదయ్యింది
నా పొలంలనే.... నా మూతికి బుట్టగట్టి
పంటంతా తిప్పుతాండు

నా కండ్లకు అక్షరాలు గట్టి
అభివృద్ధిని సంకలు గొట్టిత్తడు
నా మాటను
సినిమాల సూపిచ్చి నాటకమాడతరు
నల్లమొకపు గాడ్దుల చూసుకుంట ఎన్నొద్దులు
పిట్టకు ఎదురు చూసినట్టు సూత్తానం
తెలంగాణ ఇప్పుడు ఎండిపోయింది
దేవుడి గుడి గుండంగాను
నా ఆకిట్ల వాననీళ్ళు
ఎవ్వని పొలమో పండిత్తాంది
ఇల్లు అలుకెతందుకు
పిడుసకుసుత నీళ్ళు లేని బతుకయ్యింది

నా బాయిల సిల్లుల వద్ద బొక్కెన
ఎంత సేదినా నీళ్ళు వొడువై. ..భూమి తడువై
నా గుండె పగిలి నెర్రలు వాసింది
మాటలతోటి నెర్రలకు
మందు పూత్తాండ్రు
బతుకు బజాట్ల వద్దది....
పదవి అచ్చే దాకా
ఓ తీరు మాట్లాడుతరు
అచ్చినంక ఇంకో తీరు మాట్లాడుతరు
వాడు ఈ గడ్డమీద పుట్టలేదా?
ఇక్కడి గాలి పీల్వలేదా?
రోషం సచ్చి...
పీనుగులెక్క బతుకుతాండు?
గసోంటోళ్ళు ఉన్నా ఒక్కటే
వొడిసినా ఒక్కటే!
మనం మాత్రం గట్ల ఉండద్దే...
కిందపడ్డ మీద పడ్డ మనమేననాలే...

ఇకమతుల తోటి మనలమాయ
జేయ్యాలనిచూసే దొంగ కొడుకులకు
మంచిగ బుద్ధి చెప్పాలే...
వాడు పబ్బతి పట్టి
మన కాళ్ళ కాడికే అత్తడు...
అప్పుడు మన బలమెంతో సూపాలే...
మనలను బక్కోలమనుకుంటాంద్రు
రవుతం తాగిన దోమలకు
బలుపురాదా?
ఎడమ చేత్తో నలిపి పారెయ్యంద్రి
పీనుగులమై ఉన్న మనల
వాడు ఇంకేం పీకుతడు
వీడేమన్న తెలంగాణను
కుదవ వెట్టుకున్నడా!!
తిన్నింటి వాసాలు లెక్కవెడుతడు
మనమందరం కలిసి చేతులు కలిపితే
దెబ్బకు దెంకపోతడు
వాడుట్టి పిరికి పిత్తులోడు మరి..

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్, 2007*

# సోయి...నుంచి ఎరుకకు

• కొలిపాక శోభారాణి

మంచు అంగీని విడిచి ఎండను
స్వాగతిస్తున్న ప్రకృతి
పంటకు చాలినంత నీటి తడి అందక
నోరు తెరుచుకున్న వరిపైరు
పొట్టకచ్చి పాలు పోసుకుంటున్న ఇత్తులు
ఎండి నెర్రెలు బారుతున్న....
కాసింత ...తడిని దాచి
బొట్టు....బొట్టుగా మొక్కలకు
తాపుతున్న నేల తల్లి
కుతార నీళ్లు తాగుదామన్న ఎదురుచూపు
ఓ అల్లీ సాగర్ ఒక గుత్ప, దేవాదుల నీటి
ప్రాజెక్టుల కొరకు నిరీక్షణ ..
ఇగ ...రావు..అగ రావు
కండ్లు కాయలు కాస్తాన్నయి
కాళ్ళు రివ్వలు బదుతున్నయి...
చేతినిండా పనీ లేక
కనీసం రెండు పూటలైనా
నాలుగువేళ్ళు నోట్లోకి పోయే
దారి లేక ...నెరిబడి...
ఉరిపాలైతున్న నేతన్నలు
ఏ గుంట చిక్కులు తెల్వక
కుడు మంటే పండుగని
సంబుర పడేటోల్లం

మాకు మాట తరీక తెల్వది
పగటి బాగోతుల
పాయిదార్లతనం దెల్వది
ఏదీ దెల్వని మోటోల్లమే మరి!!

కాని మీకిక్కడేం పని
ఇక్కడ మీ అంగడైపోయ్యింది
సంచులు...సదరు కోండ్రి
మర్రి సూద కుంట ఉర్కబుచ్చుకోండ్రి
పెద్ద పులులోలె సూత్తుండ్రు
మా అక్కలు, సమ్మక్కలు సారక్కలు

మాగెట్టు మాకు సూయించుట్ల
బొంకిచ్చి, బోర్లిత్తామనుకుంటే
ఉన్నది గాడ....
ఒరంగల్లు ...రాతి....దర్వాజ
తేడా ...వచ్చిందంటే
చమ్డాలు దీసి దోర్నం.. గడ్డం జాగర్త

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్, 2007*

# ఇంక దంచి గుంజుకునుడే

• *గాజోజు నాగభూషణం*

వేరు పడుదు వేరు పడుదే
ఆస్తిలో అంతరంతో అన్నదమ్ములు
మనసులో గల్వకుంటే ఆలుమగలు
మత్పరిచ్చి మాయ జేత్తుంటే
ఎన్నటికైనా, వేరు పడుదు వేరు పడుదే.

ఇన్ని రోజుల్నుంచీ .
నేను అవ్వంటే- నువ్వు అమ్మంటివి
నేను బువ్వంటే - నువ్వు అన్నమంటివి
నేను చాయ్ - నువ్వు టీ అంటివి
నేను సడక్ అంటే - నువ్వు రోడ్డంటివి
నాకు భాష రాదంటివి నా యాస వేరంటివి
భాషదేముంది - యాస దేముంది
మనసు కలిసుంటే మా కలిసుంటుంటిమి

కానీ....
నదులు పారేవి మా తలాపు నుంచే అయినా
నీళ్ళు పారిచ్చినవన్నీ నీ పొలాలకే అయినాంక
కొలువులున్నవి మా భూమిలో అయినా
కొలువుదీరినోల్లందరు మీ వాళ్ళే అయినాంక
రాజధాని మా గడ్డ మీదున్నా
రాజ్యమంతా మీరే అయి అన్నీ ఆంబుక్క పెట్టినాంక
బంతిలో భోజనంకై అందరం కలిసే కూకున్నా
వడ్డించే వాడు మీవాడె ఆయింత మీకే ఊడ్చేసినాంక

పస్తులుండి పాలిపోయింది మేమే కదా!

గందుకే మళ్ళీ జెపుతున్నా
భాషయాస వేరైనా మా కలిసుండేటోల్లం
ఆస్తిపాస్థులు అభివృద్ధికి మూలమైన
మా నీళ్లు మా నిధులు, ఉద్యోగాలు, ఫ్యాక్టరీలు
లెక్క తీరుగా మనిద్దరం
పంచుకున్న పోనీతీలే అనుకుంటుంటిమీ
కాని గా లెక్కలే తీరుమారు
చేసినందుకే వేరు పడుతమంటున్నం
మాయి మాకు గాకుండా పోతుంటే
ఇంకా కలిసుండేదేంది
వేరు పడుడు వేరు పడుడే
మంచి మాటతోని వినకుంటే
ఇంక దంచి, మాయి మేము గుంజుకునుడే

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్, 2007*

# పొంచి ఉన్న కాలం

● ఆర్. దామెర

ఆ గడియ పొంచి ఉంది
యాభై సంవత్సరాలుగా పురిటి తల్లిలా
నొప్పులు పడుతున్న తెలంగాణ రాష్ట్ర ఆవిర్భావం
ఉదయించే శుభవేళ కాలం అంచుమీద
కాచుకుని పొంచి వుంది

ఎన్నో ఎన్నెన్నో
అవాంతరాలు అడ్డుపుల్లలువేసినా
దమనీతితో కుత్సిత మనసుతో
అభివృద్ధి మంత్రం జపిస్తూనే ఉన్నా

ఆగదు తెలంగాణ రాష్ట్ర నవోదయం
కబంధ హస్తాలు చాచినా
సైంధవ దుర్మార్గానికి వొడిగట్టినా
ఢిల్లీ దర్బారులో
నయవంచనతో కపట నాటకాలు ఆడినా
తప్పుడు కూతలు కూసినా

తెలంగాణ జనానికి వాళ్లు చేసే ద్రోహం
తన బిడ్డలే అని తల్లి చెప్పుకునే స్థాయి నుంచి
కొందరేనాడో దిగజారిపోయినా
ఆ గడియ మరింత సన్నిహితంగా పొంచివుంది
అపుడు ఎవడి తరం కాదు తెలంగాణ శుభోదయం
ఇమానం లేని కృతజ్ఞతాభావం లేని
బర్కతులేని పుడక పుట్టిన దుష్ట దుశ్శాసనుడు
కాలం అంచుమీద ప్రసవ ఘడియలు ఆపాలనీ

విఫల ప్రయత్నం చేసే కుటిల కీటక కర్కోటకుడు
వాడి తాబేదార్లూ జాగ్రత్త!

కాలం నిండు గర్భిణిలా ఉంది
భారత్ భవిష్యత్ చిత్రపటం మీద
అందంగా తన ఎల్లలు గీసుకుని
తలెత్తుకుని సగర్వంగా పదిజిల్లాల పరివ్యాప్తంగా
భాగ్యనగరం నడిబొడ్డున విరాజిల్లేలా
ఏర్పడనున్న తెలంగాణ పసికందురాష్ట్రం
పొత్తిళ్ళలో వొదిగిపోయే మహోదయ వేళ
మందహాసంతో తన సంతా ౧ పడ్డ శ్రమ మరపిస్తూ
గిలిగింతలు పెడుతూ
చరిత్రకారు స్వర్ణాక్షరాల నీరాజనం కోసం
ఆ గడియ కాలం అంచు మీద
పొంచి ఉంది అప్రమత్తంగా...

ఎవడురా వాడు తెలంగాణ చలువతో
పదవులు పొంది తల్లిచేత పరమాన్నం వడ్డించుకుతిని
గతం మరచిపోయి తప్పించుకు తిరుగుతున్నవాడు

ఎన్నటికీ తెలంగాణ ముక్కోటిన్నర ప్రజలు
మీ మీద ఉమ్మేసి కాళ్ళతో తొక్కుతూ పోయి
భారీ బతుకమ్మలతో రంగుల హరివిల్లుల్తో
జరుపుకోబోయే రాష్ట్రోదయ పండుగ
సమ్మక్క సారక్క సాక్షిగా బాస చేసి
చెప్తున్నాం దొంగల్లారా!

మీ అధికారమదాంధ మత్తు వదులగొట్టే రోజు
అత్యంత సమీపంలోనే పొంచి ఉంది
కాలం అంచుమీద సర్వ సన్నద్ధంగా

*తెలంగాణ సోయి, అక్టోబర్ - డిసెంబర్, 2007*

# నీటినిప్పు

• బాణాల శ్రీనివాసరావు

1
పొడిచే పొద్దు ఎరుపులో
పరుగులెత్తే వాగువడి
పగిలిన పలుగురాయిలో
మెరిసే మెరుపుదాడి
వలసపాలకుల చెదల్ని కాల్చే
నీటినిప్పు...తెలంగాణ

2
తెలంగాణ....
శతాబ్దాల చరిత్ర సాక్ష్యంగా
ఆరని మంటల గుండెగోస
పెనవేసుకున్న పేగుబంధం
పోరు ఇంటిపేరయినప్పుడు
కన్ననేల సంకెళ్ళను తెంచే ఆయుధాలమై
తెలంగాణకు మళ్ళీ పురుడుపోద్దాం
ఉద్యమ శిశువుకు ఊపిరౌదాం

3
సంకరమై పోతున్న సజీవ బాసను
ఉగ్గుపాలతో దిద్దుకున్న
ఉక్కు అక్షరాలతో సానబెడదాం
ఆత్మరక్షణ కవచాల్ని ధరించి
ఆత్మ గౌరవ కంఠాల్ని సవరిద్దాం

4

నాటి తెలంగాణ
దగాపడ్డ నెత్తుటినేలే.....
కానీ......
నేటి తెలంగాణ
కొత్త వ్యూహాల పురిటిగడ్డ

*తెలంగాణ కవిత 2007*

# రణమో...వీరమరణమో..

● రామా చంద్రమౌళి

ఎక్కడ పుట్టారన్నది నీ చేతిలో లేదు
ఎక్కడ పెరిగావు, ఎక్కడ ఎదిగావు యివి నీ చేతిలోనే
తెలంగాణలో పుట్టడమే ఇక ఆజన్మ అదృష్టం
యిక్కడి మట్టి, యిక్కడి గాలి, యిక్కడి నదులు.... యిక్కడి అడవులు
యిక్కడి తలెత్తుకుని నిక్కి నిలబడే పర్వత శిఖరాలు
అన్నీ యిక్కడి మనిషిని
ఒక రుద్రున్ని చేసి, వీరభద్రున్ని చేసి, ఒక యోధున్ని చేసి
మనిషి ఆకాశంలో ఒట్టి అమాయకుడై ఏలా గర్జిస్తాడో
మనిషి సముద్రుడై ఎలా విప్లవిస్తాడో
మనిషి ఒక విస్తరించిన అరణ్యమై
వాత్సల్యబాహులతో ఎలా పెనవేసుకు పోతాడో
యిక్కడి నేల చెబుతుంది
యిక్కడి గాలి చెబుతుంది.
యిక్కడి పసిపిల్లల నీలి కళ్లు చెబుతాయి.

సూర్యునికి ఒక ఆకాశం నేపథ్యమైనట్టు
యిక్కడి మనిషికి
మానవాధములెవ్వనికీ లొంగని పోతన ఒక నేపథ్యం
ద్విపదలో సాహిత్య విప్లవాన్ని సృష్టించిన సోమన
యిక్కడి మనిషికి వారసత్వం
ధిక్కార భాస్వరమై జీవితాంతం జ్వలించిన కాళన్న
యిక్కడి ప్రతివ్యక్తికీ ప్రతినిధి
అది ఆంధ్రమహాసభా

తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటమా,
నక్సల్బరి పోరాట పురిటినేలా,
గ్రంథాలయ మహోఖజానా ప్రభంజనమా,
ఏ ఉద్యమానికైనా యిదే పుట్టినిల్లు
వీరులు ఎక్కుపెట్టిన హరుని విల్లు

యిది దక్కన్ పీఠభూమికదా
ప్రకృతి సింహాసనాన్నధిష్టించి ప్రజలను ఆశీర్వదించిన నేల
తుఫానులు, వరదలు, విలయాలు, వికృతాలు
యిక్కడి ఛాయలకే రావు
నిజాయితీయే ప్రాణంగా నింగినంటే యిక్కడి ప్రతి మనిషీ
ఒక నిలువెత్తు ఎగిరేజెండా
మానవత్వానికి శాశ్వత చిరునామా
రణానికీ, వీరమరణానికి విధి రాసిన వీలునామా

*తెలంగాణ కవిత 2007*

# ముంపు

• పి. విద్యాసాగర్

ఇవ్వటమే తప్పు
తీసుకోవటం తెలియని వాడ్ని
ఏకలవ్యుడి వారసుణ్ణి
ఇప్పుడు ఇవ్వటానికి ఏమీ లేని
పుట్టెడు దుఃఖం తప్పు

కళ్ళకు ప్రాజెక్టుల గంతలు కట్టి
దారి తప్పించబడిన జాతినాది

నాదస్వరానికి ఉగ్రూతలూగటం తప్పు
కాటెయ్యడం మూడోపాదం మోపటానికి
తలలేని మొండాన్ని

బతుకంటే
అన్నీ కోల్పోయిన తనమే
పూలై విచ్చుకోలేక
మొగ్గలై రాలి
ఎవరి దాహాలకో
సామూహిక దుఃఖాన్నై ప్రవహిస్తున్నాను

వికసించాల్సిన చోట
ముడుచుకుపోతున్నప్పుడు
లాలించే చేతులకు
శిలువలు తప్ప పూలెలా పూస్తాయి
సృష్టించుకున్న అన్నం మెతుకు మీద

పరాయి పేరు రాయబడి
శిలువ మోస్తున్న శాపగ్రస్తుడ్ని

వలస
వలస కోసం వలస!

అడవులు మైదానాలై
మైదానాలు పులి పంజాలై
వేట బతుకు మాయమై
బతుకు వేట మొదలై
ఇంకా ఇంకా లోపలికి ముడుచుకుని ముడుచుకుని
కొండలు ఎక్కిదిగీ
దిగీ ఎక్కి
ఎక్కడ మొదలయ్యానో మళ్ళీ అక్కడికే!

మొన్న పులుల భయం నిన్న మనుషుల భయం
నేడు ప్రాజెక్టుల భయం

సంతకాలకు భయపడి
గుండెల్లో దాచుకున్న నాలుగు అక్షరం ముక్కల్ని
నాలిక మీదే దహనం చేసుకున్నాను
వేలి ముద్రలకు భయపడి
బొటన వేలును తెగ్గోసుకున్నాను

ప్యాకేజీలు శవపేటికలౌతున్నప్పుడు
పునరావాసం కాందిశీకుల్ని చేస్తున్నప్పుడు
ప్రాజెక్టులు ఆధునిక సమాధులౌతున్నప్పుడు
విల్లులా వంగుతానే తప్ప
సంతకాలకు లొంగను.

*తెలంగాణ కవిత 2007*

# పరశురాముడి కోపం....

• సి.కాశీం

తండ్రిపేరు చెప్పమని
పరుశురాముడు తరిమిన
ఎల్లమ్మలా నా తల్లి తెలంగాణ
మాదిగలొద్దిలో దాక్కుంది.

ప్రియురాలి పెదవులపై
మౌనంగా అల్లిన జానపదమై
భూమి వాసన చూస్తున్న ఎద్దు వీపుపై
ప్రవహించేది

లేగదూడ నాలుకపై
పాలపొదుగు కురిసినట్లు
తుమ్మెద నోరు తెరిస్తే
పువ్వులో తేనె ఊరినట్లు
మేఘంతో వాగు జతకూడిన చోట
నా తెలంగాణ
తంగెడు పువ్వులా పలకరించేది

చంద్రుడు చేతులు సాపితే
వాగు కనురెప్పలపై
విచ్చుకున్న కలువపువ్వు
ఎద్దు మెడల ముద్దులొలికినపుడు
నా తెలంగాణ
పశుల పిలగాని చేతిలో ముల్లుగర్ర

వీరుడు ఉరికొయ్యపై
పద్మవ్యూహాన్ని కలగన్నట్లు

యుద్ధంలో రాలిపడిన బొడ్డుమల్లె
లేతనవ్వులపై పూసిన
సూర్య కిరణం నా తెలంగాణ

ఆకలి మౌనంలో దోసిలి పడితే
పాలుకురిసిన జొన్నకంకి కాళ్ళు మోపితే సెలిమె నిండా
నీళ్ళు సేపిన వాగు అలలపై మెరిసే
సూర్యుడిలా నా తెలంగాణ

కోలాటం కట్టె కన్నుకొడితే
గుడిసెలో నిద్రించే ఏడుపుపై
వెన్నెల మరులు చల్లి బతుకమ్మ ఆడించిన
బంతిపువ్వు నా తెలంగాణ

ఇరిగిన మంచంలా
ఒదిగిన నాగలి శోకం పెడితే
ఒట్టి తునకలు అలిగి ఉట్టెక్కుతే
గురిగిలో ఎసరు నీళ్ళు గుంటూరుపోతే
పొయ్యి మీద సట్టి పగిలిపోయి బూడిదలో పొర్లాడుతుంది

ఆకాశంలో కొయ్యకు
నిద్రిస్తున్న దప్పు ఎదపై
చిర్రా చిటికెన పుల్ల మరికట్లో పొట్లాడుకుంటున్న
కోడెల వలె కొట్లాడుకుంటున్నాయి
నా తల్లి తెలంగాణ

ఎర్రమన్నుతో అలికిన ఇదుపల వాసన చూసి
రచ్చకట్ట బొడ్రాయి దాటి
ఊరి పొలిమేరల్లో పగోడి రహస్యం చెప్పాలని
పరుశురాముడి కోసం ఎదురు చూస్తుంది.

*తెలంగాణ కవిత 2007*

# పొమ్మంటే పోతలే కొడుకా...

• ఆసం శ్రీనివాస్

పొమ్మనకు కొడుకా నీ బాంచెన్ కాల్మొక్త
నువ్వుదప్ప దిక్కులేని దాన్ని బిడ్డా
పొమ్మనకు నాయనా-ముసల్దాన్ని రాయ్యా
కాల్ రెక్కలు మూలకు వడ్డదాన్ని
పొమ్మంటే ఏడికి పోత కొడ్కా

నిన్ను బళ్ళ షరీక్ జెయ్యనీకి
ఇటుకబట్టీల కూలికిపోతి
నీ బడిపీజు కట్టనీకి
నడుమంత పోంగ పెసరగాయలేరబోతి
నీ పెన్నులు, పొస్తకాలు కొననీకి
పుస్తెమెట్టెలమ్మి పసుపుకొమ్ము కట్టుకొంటి
నీకు అంగిలాగు కొననీకి
దొరలింట్ల బాసండ్లు తోమితి
ఎన్ని జేస్తి కొడుకా
ఒక్కటన్న యాదికి లేదా నాయనా

నీ అయ్య గుడుంబాతాగనీకి
నా ఎమ్కలు ముక్కలయ్యేటట్టు కొట్టి
కూలిపైసలన్ని గుంజుకపోతే
నడిమింట్ల గూసొని వలవలవల ఏడిస్తిగనీ
ఆనాడన్న ఏడికి పోయిన కొడుక
ఇప్పుడు పొమ్మంటే ఏడికిపోను బిడ్డా
పొయ్యేటినాడు తప్ప
బొందల గడ్డకాడ తప్ప

నాకింకేడ జాగ దొరుకుతదని
పొమ్మంటవ్ బిడ్డా
నీకు నాయం గాదు నాయనా

అక్క తానకు పోతే, అత్త మంచిదిగాదని
బుక్కెడంత బువ్వపెట్టి మల్లోసారి రాకని
మొగం మీదనే తలుపేసి
గడపలకెల్లే సాగనంపింది గాదుకొడుకా
ఇంకేడికి పోను కొడుకా నువ్వదప్ప దిక్కేడిది
నీ ఇంటికుక్క కేసినట్టు జరంత కూడు పడేస్తే
ఓ మూలకు పడుండే ముసల్ది కొడుకా అమ్మంటే
పనిమనిషి లెక్కనన్నా పానం ఇడుస్తగనీ
పానం బోయినా నిన్ను సూడకుంట బతకలేను నాయనా

ఇంతజెప్పినా నీకు దయరాకపోతే
పొమ్మంటే పోతలే కొడుకా
నా నసీబు మంచిగలేదనుకుంట గంతే!
కూలిదాన్ని గాదు కొడుకా...
పైస ఇయ్యక పోతిననీ..
బేడెత్తు బంగారం ఇయ్యకపోతిననీ....
ఇంత బూమిజాగ ఇయ్యకపోతిననీ...
కోపం బెట్టుకోకు కొడుకా
రాసియ్యనీకి నా తాన ఏమున్నది కొడుకా
పోచమ్మ గుడి కాడ అడుక్కున్న
అటుకుల పలారం
చీరె కొంగుల మూటగట్టుకొచ్చిన....
తీస్కో కొడుకా...నీకడుపు నిండితే
గీ అమ్మ కడుపు సల్లవడతది

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 27, జనవరి 2008*

# నటన

● కాలువ మల్లయ్య

అవు మిత్రమా!
నిన్ను మిత్రుడనాన్నంటె కష్టంగనే ఉంది
ప్రపంచ కార్మికులంత ఒక్కటన్న ధోరణిలో అందామనుకుందాం
నువ్వేం దాఖలాలు చూపలేవు సోదరా. . !
నేను చూపుత వందలకొద్ది దాఖలాలు
నేను తెలంగాణోన్ని...
అందులో పల్లెటూరోన్ని
నీ తీరుగ సంస్కృతీకరణం చెందలేదు
ఏ రోటిపాట ఆ రోడికాడ పాడుదు నానుంచిగాదు .
ముక్కు దూలం పలిగినా మంచిదే
ముక్కుకు సూటిగ పోవుడంటేనే నా కిష్టం
గిది తెలంగాణతనమని నీకెర్కలేదనుకుంట
సరెగని సోదరా...!
నువ్వెన్నడన్న జీవించినవా?
నటించుడే తప్ప!
ఒక్కనాడన్న నువ్వద్ది మాట్లాడినవా?
ఏ రోటి పాటలా రోటికాడ పాడుదు తప్ప
ఎందుకు మిత్రమా ఈ నటన
నాకు జీవించే వాళ్లంటేనే ఇష్టం.
వాస్తవికతంటేనే ప్రాణం
అది జీవితమయినా సాహిత్యమయినా
ముందొకటి మాట్లాడుదు

మొకం అటు తిప్పి మరోటి మాట్లాడుదు
నీకు వెన్నతోపెట్టిన విద్యని అందరికెరుకే
ఏ విషయం మీదనయిన స్పందన కలిగితె
కన్నీరు కట్టలు తెంచుకోవాలె...
హృదయం కళఫెళ మరిగిపోవాలె...
కాని నువ్వు కవితల్లో చూపే కన్నీరు...
గ్లిసరిన్ కన్నీరని నీకు నాకందరికెరికే...
నువ్విప్పటికైనా మారినవా స్నేహితుడా...!
మారలేదనటానికనేక దాఖలాలున్నయి...
పారదర్శకత మాటేమోకాని
కడుపునిండ మాట్లాడుదు కూడ కరువయింది
నీ మాటల్నిండా నటనే అయితే
ఇంకా మాటలకర్ధమేముంది?
ఇప్పటికే ఐదుపదుల జీవితమైపోయింది...
ఇక మిగిలిందెంతని?
ఇప్పటికైనా నటించడం బందుజెయ్యి
జీవితాన్ని జీవించడం అలువాటుచేసుకో
అప్పుడాలోసిత్తాం 'సోపతి' గురించి
నటనే జీవనకళగా మిగల్చుకుంటే
నువ్వు కవి (రచయిత)గ కూడ మిగలవన్నది యాదికుంచుకో
జీవితంలోంచి వచ్చేదే సాహిత్యమన్నదెరికే కదా...
ఆ జీవితమే లేకుంటే సాహిత్యమెట్లస్తది మరి?
ఏ ఆర్ధ్రతా లేని అక్షరాలు తప్ప...

*ఆదివారం ఆంధ్రభూమి 17, ఫిబ్రవరి 2008*

# ఆగమైన తెలంగాణ

• తూర్పు మల్లారెడ్డి

ఉద్యమం ప్రజల ఒడిని వీడి
అధికారం కౌగిల్లో చేరినప్పుడే
తెలంగాణ ఆగమైంది
నమ్మకాన్ని అమ్ముకొని పదవులకు అమ్ముడుపోయే
ప్రజా నాయకుల స్వార్థ చింతనకు
నిలువెల్ల దోపిడి అయ్యింది
మాయతో మళ్ళించుకుపోయిన నీళ్ళు
ఎండిపోయిన పొలాలు ఇంకిపోయిన చెరువులు
వంకర్లు పోయిన ఎముకలు
లోలోపలే దొరక్కుండా పోయిన ఉద్యోగాలు
ఇక్కడి జీవితాలకు ఎక్కడికో వలసదారులను చూపించాయి
అక్కడ వీరు శక్తినంతా అమ్ముకొని
ఇక్కడి పల్లెలకు తిండి పెడుతున్నరు
వలసపోరులో నలిగి శవాలై ఇంటికి జేరుతున్నరు

భాష ఏదైనా భావాన్ని వ్యక్తీకరించేదే
యాస ఏదైనా ప్రాంతీయతను శ్వాసించేదే
వ్యవహారం పేర
నా భావాన్ని కూడా నా భాష ద్వారా రానీయకుంటె
నా యాసలో మీరు మాట్లాడి
విదూషకులమని ప్రచారం చేసిరే ఏమి ఆధిపత్యం మీది
బడ్జెట్ పెరిగినా ఈ ప్రాంతమెప్పుడూ అభివృద్ధి కానే కాదు
అధికారులు మీరే కదా!
ఎక్కడ ఏం లాభం జరుగుతుందో

ముందే తెలుసుకొని దొరికే ఫలితాన్ని కూడా
అందనీయని ఆగామి దోపిడిగాళ్లు మీరు
అభివృద్ధి మంత్రం దోపిడి కుతంత్రం
నేతలారా!
అధికారం రానప్పుడు పదవులు లేనప్పుడు
చిన్న చిన్న స్వార్థ కుంపట్లు రాజేసి
పదవులు రాగానే నినాదాన్ని అమ్ముకొని
కుంపట్లో నీళ్ళు జల్లే నీచులారా!

నేడు తెలంగాణ
ఉనికి తంత్రులు మీటుతున్న
అస్తిత్వ వీణ, దగాపడ్డ తమ్ములారా?
రొమ్ము విరిచి లేచి
తల్లి దాస్యాన్ని విడిపించే
గరత్మంతులు కాలేరా?
ఇది తెగదెంపుల యుద్ధం
తెగించి పోరాడితేనే తెలంగాణ సాధ్యం

*స్పాట్ సిగ్నేచర్స్, ఒ.యు.క్యాంపస్, ఏప్రిల్, 2008*

# నివురు గప్పిన నిప్పు

• బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి

అవ్వా....
సినిగిన బట్టలేసుకుని
సదువుకు బోతె
సోపతోల్లు బనాయించి బాధపెడుతుండ్రే
ఇయ్యాల ఇస్కూలు కోనే
మనూరి శేటు కొడుకు లగ్గంకోతనే
గాద.....

పెండ్లీల పొద్దంత పనిచేస్తే
అన్నం పెట్టి, అరవై రూపాయలిత్తరంట
అంగి లాగు కొనుక్కొని
సదువుకు బోతనే!

అయ్యో!
ఏం జెయ్యాలె కొడకా
ఇంట్ల పెద్ద దిక్కు లేక
బట్ట పొట్టకు బాధపడే కాలమొచ్చె
అయ్య సచ్చిన సంది
అగాధం బతుకులాయె
కెమికల్ ఫ్యాక్టరీ మనూరు కచ్చినంక
ఉన్న ఎకరం భూమిల
'కుసింగాలు' కూడా మొలువక పాయె
సాగునీల్లకు బదులు రంగునీల్లె పారవట్టె
మిట్టపల్లి మెట్ట భూములన్ని
సారం లేని సౌడు భూములాయె

కాయ కష్టం చేసి కాలం గడుపుదమంటె
కరువింట్ల పీనుగెల్ల
కనికరమన్న సూపకపాయె
కంపిని కంపు వాసనకు
కొంపంత ఈగల మోతాయె
కక్కుదుతోని పెయ్యంత గావరగావట్టె
ఊపిరిదీయ లేక ఉబ్బసరోగమొచ్చె
ఏం బిడ్డా!
నువ్వు లగ్గానికోవద్దు
ఎదురుంగోనికి అలుసుకావద్దు బిడ్డా,
సక్కగా సదువుకొని సోయిదెచ్చుకోరా
మన నీళ్ళకోసం, ఉద్యోగాల కోసం
మన తెలంగాణ మనగ్గావాలని
లడాయి జెయరా!

*స్పందన కవిత్వ సంకలనం, మే, 2008*

# గోరు కొయ్యలు

• నాంపల్లి సుజాత

సుక్క పొడిశినప్పుడు పాశపనిజేస్కుని
శెల్కలకు పోవుడే ఎర్క పొద్దు పొడిచి బారెడెక్కేనంక
బెడ్డు కాఫీ అట మేమెందుకు నోసుకున్నం

గిన్నెలింత బువ్వ తొక్కేసుకుని
గల్మల్ల కూసోని మింగితే ఆ పూటకెల్లినట్లే
పలారాలు పంచభక్ష్య పర్మాన్నాలట
కావాలనుకుంటే మాకెట్ల దొర్కుతయ్!

బొడ్లె సంచిల శిల్లర కొత్తలు గల్లుమంటే
గాల్లె తేలిపోయినంత సంబురం
ఎ.టి.యం. కారెట్లు, బ్యాంకు అకౌంట్లు
ఎట్లుంటయో తెల్వకపాయే

సంటిపోరగాల్లని చెట్టుకిందేసి కాయకట్టం జేస్తే కూడుదొరుకుతది
పొద్దు పోక ఆడిపాడే తందుకు సబ్బులు క్లబ్బులట
అవ్వి మాకు శీన్మల ముచ్చట్లు

ఐదేళ్కా నోట్లెకు పోవాల్నంటే ఆరొక్కదినం కష్టపడేటోల్లం
బొక్కలు ఎంచెతట్టు డొక్కెండక పోతది
బొర్రపెరుగుడు తిన్నదరక ఉరుకుడూ
మాక తెల్వది బిడ్డా! అంతా మంచేనాని
మదిలస్తే పాణమిడిసేటోల్లం యవారాలు కువారాలు నేర్సుకోల్లం
రాతపూత తెల్వని బొడ్డుమల్లెపువ్వులం
బొంకిచ్చుడు బోర్లెసుడుకి నోర్లెల్ల బెదతన్నం

*తెలంగాణ సోయి ఆగస్ట్ 2008*

# బతుకమ్మ బతుకు

● పోగుల రాజన్న

నెర్రెలు బారిన నేలను చూసినపుడల్లా
మా అవ్వ గుర్తొస్తుంది
నాట్లేయవోయి కొడవల్లా వంగిపోయిన నడుము గుర్తొస్తుంది
ఎండుపుల్లల్నేరడానికి అవ్వ - పిడకల్నేరడానికి నేను
చెలకల్లో గట్లలో పొద్దంతా తిరిగెటోల్లం
గట్క తిన్న నోరుకు అప్పుడప్పుడు
గంజిపోసిన అన్నం పరమాణ్ణం అయ్యేది
ఆ పూట పండగని తలపించేది
మొక్కజొన్న రొట్టెంబండి గొడ్డుకారం అంచున
అవ్వ జీవితం పెచ్చులు పెచ్చులుగా రాలిపోయింది
బతుకమ్మ పండగొచ్చినప్పుడల్లా అవ్వ
తాను బతికిన బ్రతుక్కి యాదాది పొద్దు పాట గట్టేది
"ఏడేడు పొద్దుల్లో ఉయ్యాలో!! - ఎండుటాకు బతుకాయే ఉయ్యాలో
పలుగు పార పట్టిన చేతులు ఉయ్యాలో!!
పట్టెడన్నం కరువాయే ఉయ్యాలో"
తంగెడు పువ్వులా పచ్చగా ఉండాల్సిన బ్రతుకు
గునుగుపువ్వల్లా తెల్లగా మెరవాల్సిన జీవితాలతో
ఏ గుడ్డినక్క రాజ్యమేలుతుందో!?
గొంతుల్లేని తోడేళ్ళు వంతపాడ్తున్నాయే
వాటికి కాలం చెల్లే రోజులు దగ్గర పడ్డయ్
పిడకల్నేరిన చేతులు పిడికిల్లని బిగిస్తున్నయ్

*సెలవింక కవితా సంకలనం, ఆగస్ట్, 2008*

# అస్తిత్వమే ఆస్తి

• *కోటం చంద్రశేఖర్*

నీడనిచ్చి నిద్రబుచ్చే నీ ఇంటికి నీవే కావలి
మెతుకునిచ్చి బతుకునిచ్చి నీ పొలానికి నీవే కావలి
రాగ ఝురులు అనురాగ సిరుల పల్లెకి నీవే కావలి
యాగ యోగ త్యాగ భోగ సంస్కృతికి నీవే కావలి
కడుపులో కుళ్ళు ముళ్ళు
మాటలో తేనెగుళ్ళు ఎవడికి కావాలి?
అస్తిత్వమే ఆస్తి
చాపకింద నీరై వెన్ను పోటుదారై
దగా చేయు దోస్తితో కుస్తి
గుప్పించిన హామీల్ని నేతలు నిలబెట్టలేరు
కుప్పించిన జనాలు వారిని పడగొట్ట గలరు

*తెలంగాణ సోయి, సెప్టెంబర్, 2008*

# చోరకళాసాధనలో

● నలిమెల భాస్కర్

తీస్కపోండ్రి ! తీస్కపోండ్రి!
యాభై ఏండ్ల కిందటనే
బల్మీటికి మమ్ముల్ని కల్పుకున్నోల్లు
మల్లొకసారి మా నీల్లను
మల్పుక పోండ్రి!మల్పుక పోండ్రి!
మీ ముల్లేంబోయింది
మనది గాకపోతే కాశిదాక దేకచ్చు
గానుగుల్దే గంటెడు
మా గంగవ్వ తల్లిని
గుంజుకపోండ్రి! గుంజుకపోండ్రి
ఎమగొండ రాక్షసుల బాద నయం
మా నల్లగొండ మొత్తం అవిటిదైపోతున్నది
అవ్వతోడు
ఫ్లోరైడ్ అంటె ఏందో
ఇప్పుడర్థమైంది మాకు
నదులల్ల నీల్ల ఫ్లో మీ దిక్కు
రోగాల రైడ్ మా వైపు
మా 'వైపు' బాగ దొరికిచ్చుకున్నరు
దొబ్బుక పోండ్రి! దొబ్బుక పోండ్రి!!
లాబం వస్తుందంటే చాలు
లాగం దొబ్బిండ్రు గద మీరు
ఎన్కట దుశ్శాసనుడు ద్రౌపదిని
సభకు ఈడ్చుకపోయినట్టు

మా సొంటి సన్నాసి లీడర్లు మిమ్ముల్ని ఏమనరు
మా గత గోదావరిని
లాక్కపోండ్రి! లాక్కపోండ్రి!!
దొంగలు దొంగలు కలిసి ఊల్లు పంచుకునుడు
అది నాటి ముచ్చట
దొంగలే దొరల్లెక్క ఏషం గట్టి
మన ఊల్లు ముంచుకుంట
మన నీల్లనే వుంచుకునుడు
గిది నేటి కత, ఎత
కోయజాతి పురాత మునిగితేంది?
కొంపలు మునిగిపోతేంది?
నాయిన్నలూ!
మా పాల ఏమీ వుంచకుంటనే
మీ 'పాలి' వరం కదా
మీ పోలవరం పొందిచ్చుకోండ్రి .
పొందిచ్చుకోండ్రి!!
వద్దన జేసెటోడు మీవోడేనాయె
ఏ బంతిల కూచుంటేంది బాబులూ!
దీపం ఉండంగనే ఇల్లు సగవెట్టుకోవాలె
సమైక్యాంధ్రులనే
మా తెలంగాణ అంతట
నీల్ల రూపంల పారుతున్న మా ఎన్నుబొక్క
తల్లి గోదావరిని
తీస్కపోండ్రి తీస్కపోండ్రి!!
ఏన్గు పంటికి జిల్కర బద్ద. మా శాస్త్రం
ఏనుగు దాహానికి చూరు నీళ్ళా? మీ సామెత
ఏదైతేంది అర్థమెక్కటే తియ్యండ్రి

మీది బకాసురుని తిండి
వంగకుంటనే చిటికెల మటుమాయం చెయ్యిండ్రి!
మీ మీద
పశ్యతోహరులు గూడ పనికిరారు
మా తెలంగాణకే స్తంభమైన, మిట్ట మీద ఉన్న
మా ఖమ్మం మెట్టు
నిండ మున్గినా లెక్కనేలేదు మీకు
బాపులూ!
మీ లెక్క మీకున్నది
మీ కడ్పులు నిండితే దరిద్రం బాసె
ఎత్తిపోతలంటే
ఎత్తుడు, అక్కడపోసుడు
ఇగ బొత్తిగా
ఎగ్గు సిగ్గుల మాటలెందుకు గని
మా గంగను బొత్తిలకు
ఇగ్గుక పోండ్రి! ఇగ్గుక పోండ్రి!!
ఎత్తుక పోండ్రి!! ఎత్తుక పోండ్రి!!

*తెలంగాణ సోయి, సెప్టెంబర్, 2008*

# అనుమానపు చింత

• పొన్నాల చంద్రశేఖర్

పొద్దుగాల్నే మా కడుప దొక్కినవ్ బిడ్డా
నీ కడుపు సల్లంగుండ
ఒక్క ఘడియ మా బత్కుల్ని సూత్తెనే
కండ్లల్ల నీల్లు పెట్టుకుంటివి
అరువైయేండ్ల గోస ఏట్లుంటదో ఎర్కైందా బిడ్డా
కడుపు కాలెటోళ్ల కతలన్ని ఒక్కటే నాయినా
మాది జర్రంత ఎక్కువ బిడ్డా!
వచ్చెటోడు పోయెటోడు
నిక్కినోడు ..నీల్గినోడు
బద్మాష్ బడివెగాండ్లదే రాజ్జెమైపాయె
ఇగురాలు తెల్వంగనే తెల్లారదు బిడ్డా
ఇమానంగ పని చేస్తనని ఒట్టేయాలె
అవమానాలు పరాసికాలకు మా గడ్డ
పతా అయినందుకేమో నాయినా
అనుమానం ఆకిట్ల సింత సెట్టాయె కొడుకా!
నీల్లు లేని బాయిల్ల కండ్లు కశికలాయె
సిరిసిల్లను జూసే సిన్నబుచ్చుకుంటివి
నల్గొండను జూసి తట్టుకుంటవా బిడ్డ?
ఒక్కో జిల్లది ఒక్కో గోస కాదు నాయినా
బొందల గడ్డలయితున్న బొగ్గుబాయిలు
కూలి కైకిలికి చీమల బారోలె
ఎలబారుతున్న పాలమూరు
అటు కాటికి పోక.. ఇటు పేటకు రాక

కానల్ల కానెటోడు లేక
పురుగు పుట్రల కన్న అన్నేలమయితున్న
అడివి బిడ్డలొక దిక్కు
మూతిమీన మీసమొత్తె సాలు
మాయమైతడో..మాయజేత్తరో
ఏ గత్తరకు దేంట్ల తేలుతరోనని
దినాలు లెక్క పెట్టుకుంటున్న అవ్వయ్యలు...
బతుకు ప్లాస్టిక్ పూల బతకమ్మాయె
తంగెల్లకు బదులు జిల్లెళ్లు పూయబట్టె
వానరాక...పానం పోక
చావు బత్కుల మద్య దముకుల మోత
చెప్పుకుంటె మానం పోతది
చెప్పకుంటే పాణం పోతదన్నట్టు
నువ్వన్నట్టే...! ఇజ్జతున్నోళ్ళం బిడ్డా....
కొట్లాడి కొట్లాడి యాష్టొత్తంది కొడుకా....
మేం గౌరవమిచ్చినోనికి పాణమిత్తం బిడ్డా
ఇగనీ ఇట్టం! ఏం జేత్తవో. ఎట్ల జేత్తవో
నియ్యతుంటేనే బర్కతుంటది బిడ్డా
ఇది అరవై యేండ్ల తండ్లాట
సావు బత్కుల అష్టచెమ్మాట
తప్పు చెయ్యకు బిడ్డా
తల్లి నోట శాపనార్థాలు తినకు
ఇమానంగ గీ గడ్డకు మేలు చేస్తె
మా కష్టాలన్నీ తీరుత్తె
నిన్ను కండ్లల్ల పెట్టుకుంటం బిడ్డా
మా తెలంగాణంత పండుగ జేస్కున్న రోజు
దేవునింట్ల నీ బొమ్మ పెట్టుకుంటం కొడుకా లేకుంటె !??

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 13, అక్టోబర్ 2008*

# మా మూసీ ఎక్కడ?

• నిఖిలేశ్వర్

పరవళ్లు తొక్కిన మూసీ పరాయిదైపోయింది
వలస వచ్చిన పల్లెబాట
గొంతు ఎండి పొలమారింది
ప్రవాహాలకే ప్రహారీలు నిర్మించిన నగరం
కబ్జాలు కాటేసినచోట
వొడ్డును దొంగలించిన దౌర్జన్యాల రాజకీయం
కాంక్రీట్ వంతెనలపై బండబారిన బతుకులు
రేకుషెడ్ల గుడిసెలపై నిలిచే బురదనీళ్లే
వీధిదీపాల వెన్నెల
గజిబిజి పట్నవాసాల ఆశ్రయంలో
ఆత్మహత్యలకైతే హుస్సేన్‌సాగర్
దాహం తీరాలంటే ఎండిపోతున్న గండిపేట
మూసీతల్లినే మింగేసిన ఈ మహానగరం
ఇప్పుడు వాననీటికే దారిలేక
స్తంభించే ట్రాఫిక్ నరకాన్ని చూస్తున్నది
పోచంపల్లిదాకా పారిన కాలుష్య జలంలో
మా మూసీ ఎక్కడ? అదీ దేవులాడితే
పురానాపూల్ శ్మశానంలో ఊపిరి పోసుకుంటున్నది!!

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి. 27, అక్టోబర్ 2008*

# ప్రజా తెలంగాణ

● *మంచికంటి*

తెలంగాణ మట్టినీ మనుషుల్నీ చూసినప్పుడల్లా
నీటి ఒడ్డున తచ్చాడుతున్న
సోమాలియాలు గుర్తొస్తాయి
తెలంగాణ భూమి పుత్రుల్ని
కదిలించినప్పుడల్లా
కల్లోలమౌతున్న
లాటిన్ అమెరికా దేశాలు జ్ఞప్తికి వస్తాయి
తెలంగాణ చరిత్ర కళ్ళ ముందు
కదులుతున్నప్పుడు
పోరాట రూపాలెన్నో
పారం చెప్పినట్టుగా ఉంటుంది
పాలమూరు కూలీలను చూసినప్పుడైతే
సైబీరియా వలస పక్షులే గుర్తుకు వొస్తాయి
మనిషి మనిషి నీ పట్టిపట్టి చూసినప్పుడు
ఎన్నెన్నో కళారూపాలు
గజ్జెకట్టి కళ్లముందు ఆడినట్టే ఉంటుంది
కట్టమైసమ్మలూ సమ్మక్క సారక్కలను చూస్తుంటే
గ్రామదేవతలే ఇప్పటికీ
చేయెత్తి ఆశీర్వదిస్తున్నట్టు ఉంటుంది
నా తెలంగాణ మిత్రులు
యాసలో మాట్లాడుతున్నప్పుడు
తాత ముత్తాతల నాటి పరిమళమేదో

నన్ను చుట్టు ముట్టినట్టే ఉంటుంది
ఆ మట్టిలో అడుగు పెట్టినప్పుడల్లా
అడుగడుగునా రక్తం చిందించిన అడివి గుర్తుకొచ్చి
త్యాగాల భూమికి
తల ఆనించి నమస్కరించాలనుంటుంది
తెలంగాణ సోదరులెవరు గళమెత్తినా
సంస్కృతీ సాంప్రదాయాలన్నీ
జరజరా పాకుతూ వొచ్చి
ఆత్మీయంగా అల్లుకున్నట్లే ఉంటుంది
చిత్రకారుల కుంచెల గుండా
ప్రాణం పోసుకున్న చిత్రాలు
కళ్ల ముందు కదిలినప్పుడల్లా
అమ్మో అయ్యో కలలో నుండి నడిసొచ్చి
ఆప్యాయంగా తల నిమురుతున్నట్టే ఉంటుంది
తరతరాల పోరాట చరిత్రలో
తలమునకలైనప్పుడల్లా
రాతిగుండును భుజాలకెత్తుకున్న
హెర్క్యులస్ కళ్లముందుకొస్తాడు
అమ్మలారా అక్కలారా అన్నలారా తమ్ములారా
మీ పోరాట స్ఫూర్తికి వెయివేల దండాలు

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 3 నవంబర్, 2008*

# మరణవాంగ్మూలం

● అరుణ్‌సాగర్

ఆకాశం భూమి కలిసే పూట
శబరీ గోదారీ కలిసేచోట
సంజెరంగుల్లో కమ్ముకున్న
విషాదపు జీర
చరమాంకంలో ఒకానొక గ్రామం
ఆ పక్కన
శిథిలమై కొయ్య పడవ

కన్నతల్లి ముందు మోకరిల్లి
మరణవాంగ్మూలం వింటున్నాను

నది అలలపై ప్రతిబింబం
తలారి ముఖంలోని గాంభీర్యం
దూరాన
టూరింగ్ టాకీస్ నుంచి
ఆఖరి సన్నివేశపు ఆవేదన

ఇచ్చోటనే
కొంచెం ఇప్పసారా
కొద్దిగా కొమ్ముబూరా

ఇచ్చోటనే చలువ పందిళ్ళు పోగాకు బేళ్ళు
ఇచ్చోటనే
గలగల ఘల్లుమన్న
రేలారేలా పరవళ్లు

మరియూ ఇచ్చోటనే · కదా
ఏడేడు తరాలు
ఎనకటెనకటి పాటలు
అనాది రాగాలు
ఆది పురాణాలు
విల్లంబులు ఎద్దుకొమ్ములు
ఉనికి చుట్టి పరిమళాల
గుప్పుగుప్పుగాలి గిరికీలు

తరతరాల పాదముద్రలు
హృదయాలు శిలాజాలు

పాయం బొజ్జిగాడు
లాస్ట్ ఆఫ్ ది కోయాస్
పెరిగి పెద్దయి
అలెక్స్ హేలీ అవుతాడా
ఆనకట్ట వెనుక అశ్రు జలధిలో
సీతమ్మ ముక్కుపుడక
వెతుకుతాడా
లేక అంతర్ధానపు అంచున వేలాడి
రామా పితికన్ వలె
ఆంత్రోపాలజీ పాఠమవుతాడా

పురాతన జనసమానధి
జన సంస్కృతి జల సమాధి

చెరిపేసిన పాటలు
మునిగిపోయిన మానవుని జాడలు
ఊరి మధ్య రావిచెట్లుకు

అమాయకంగా వేలాడుతున్న
కబోధి పక్షులు

చివరకు మిగిలినది
చాతీ మీద చల్లుకున్న
పిడికెడు నల్లరేగడి

రామయ తండ్రి
నీ అరణ్యాన్ని
ఆవాసాన్ని ఆవరణాన్ని
లేడి పిల్లల్నీ అడవి బిడ్డల్ని
నీ పాదాలు ముద్దాడే పాపికొండల్ని
రేపో మాపో
రెవెన్యూ రికార్డుల నుంచి తొలగిస్తారు

రామా
ఇలా రా!
నా పక్కన కూర్చో
నాతో కలిసి
ఈ మట్టి మరణవాంగ్మూలం విను
దమ్మక్క పెడుతున్న శాపనార్థాలు విను
వినరా విను!
సీలేరు ఒడ్డున విరుగుతున్న విల్లు
ఫెట ఫెటేల్ధ్వానాల్ విను
వినరా విను!

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 22, డిసెంబర్, 2008*

# గోండులు

• గోపగాని రవీందర్

అడవిలో నడవడానికి
దిక్కైన అక్కర్లేని వాళ్ళు

అభయారణ్యంలో
కాదు చీకట్లో సైతం
విసిరేసినట్లుగా ఉండే
గుడారాల్లాంటి గూడెల్లోకి
జెప్పజెప్ప వెళ్ళే పరాక్రమం వాళ్ళు!

లక్షల ఎకరాల్లో
పాతుకపోయిన చెట్లు
నింగి నుండి మబ్బులు పడ్డట్లు
ధన దాహానికి పడుతున్నాయి.
అదురుతున్న గుండెలతో వాళ్ళు!
సూర్యకిరణాలు
నేల ఒడిలోకి రాకుండా
పేకాకుల చేతులు అడ్డుకున్న వనం మాయం.

నెమళ్ళ నాట్యం అదృశ్యం
ఆకుల గలగల సవ్వడికి
లేళ్ల పరుగులు హతం
కొండకోనల్లో గర్జించే
పులుల గాండ్రింపులు మటుమాయం
నిండు జాబిలి అందం లాంటి
అరణ్యం రోదనం

ఇప్పుడు
అడవి కుదించుకుపోతున్న నీలినీడ
కరిగిపోతున్న బతుకులతో
కలవరపడుతున్న ఆదివాసులు!
భూమ్మీద నీళ్ళు చిలకరించినట్లుగా
పడుతున్న జల్లులతో మోడువారుతున్న జీవితాలు

కెరిమెరి కొండల్లోని జోడేఘాట్‌లో
హక్కులకై తుడుం మోగడం
వాళ్ల మనుగడ కోసం గోండులు జరిపిన పోరాటానికి
ప్రతీకగా నిలచిన ఇంద్రవెల్లి
నెత్తుటి సంతకం ఇప్పటికీ ఆరలేదు
కోట్లు కుమ్మరించిన వెనుకబాటుతనం
వెక్కిరిస్తూనే ఉంది. పూట కోసం కట్టెలు
అమ్ముకోవల్సిందే నేటికి వాళ్ళు!

ఏజెన్సీ ఒక విచిత్ర ప్రయోగాల క్షేత్రం
పదిరోజులకో పథకం అమలులోని మర్మం
దరిచేరిని సంక్షేమం
ఛిద్రమవుతున్న గోండుల గూడాలు
విడిపడుతున్నవి అసువులు
వేధింపులు ఇక్కడ అతి సహజం
పరజాతి క్రౌర్యం  అర్జీలు ఇచ్చేవాళ్ళు
ఇప్పపూలు రాలినట్లుగా ఉంటారు.

పెర్సాపేన్ పై ఆన
అడవిలో నడవడానికి
కల్సిపోవడానికి
శిక్షణ అక్కర్లేని గోండులు...

*చిగురు కవితా సంకలనం, జనవరి, 2009*

# పులిచావు

• సుంకర రమేశ్

పిల్లన గ్రోవి గొంతులోంచి విషాదం
జలపాతంలా దూకుతోంది
దిగులు పాట విని
కొండల దేహాలు తాబేళ్ళలా ముడుచుకొన్నాయి
చిటారు కొమ్మన పిట్టొకటి భయం భయంగా
తలను రెక్కల్లోకి వంచింది
నీటి పక్షి ముక్కును బుడుంగున
నీళ్ళలోకి దింపింది
పులివాసన పసిగట్టిన గొర్రెల్లో
వణుకు ఊటబావిలా ఉబుకుతోంది

వట్టి పులి కానేకాదు
ఆవు మాస్క్ తగిలించుకొని వస్తోంది
కాపరి కళ్లల్లో కారం కొట్టి
ఎప్పటికీ వెర్రి వెంగలప్పను చేసి
అదును చూసి పంజా విసరటానికి వస్తోంది
నాటు మేకల బొక్కల్ని గాలిగొట్టాల్లా
ఊదేస్తుంది
దీనికి బలిసిన బంగారు మేకలు కావాలి
కొత్తపులి అడువుల్లోంచి రాదు
నగరాల్లోంచే దీని పరుగు
ఇప్పటికే పులి గుప్పిట్లోకి
నేలను, చెట్లను తెచ్చుకొంది
ఇక గొర్రెలపై, మేకలపై
పులి మార్క్ గుద్దుకొంటుంది

సమస్త ప్రకృతిపై పులి కోరలు..
వాడిగా దిగుతున్న వేళ ఇది

తాతల నుంచి గొర్రెతోక పొదవుని
కొలుస్తునే వున్నాడు ఇంకాగంజి నీళ్ళను అమృతంలా
తాగుతూనే వున్నాడు వొళ్ళంతా ఎండలకు ఎండి ఎండి
ఎందు చేపైంది వానకు తడిసి తడిసి పచ్చి కుండైంది
విసిరి కొట్టే చలిగాడ్పులకు
ప్రాణాలు జివ్వుమన్నాయి
కటికనేలపై గడకర్రలా...
చీకటి రాత్రులను దాటిన వాడు
మేకల, గొర్రెల ఉచ్చుల వాసనే
అత్తరు గంధాల్లా పీల్చిన వాడు
గుండెపై పడిన పులిదెబ్బకు విలవిల్లాడుతున్నాడు

ఏనాడు మేకల్ని కాసెరుగని పులిగాడు
మేకల, గొర్రెల ఎరువు ఎత్తిపోయని పులిగాడు
రియల్ ఎస్టేట్లు కడతాడు పులిపెట్టిన పలావులు తిని
బ్యాంక్‌లు, కంపెనీలు వంతపాడుతాయి
పులి అడుగు పడి చిట్లుతున్న వేణువు చప్పుడు
కొండల్లో, కోనల్లో మోగుతోంది
వాగుల్లో, వంకల్లో జల్లుమంది

గొర్రెల్లో, మేకల్లో అలజడలజడి....
అన్ని తోవల నుంచి గుంపులు గుంపులుగా
కదులుతున్నాయి
ఒక మహాశక్తిని కూడదీసుకొని
పులిచావును కలగంటూ వడివడిగా...

*తెలంగాణ కవిత, 2009*

# మేరా హైదరాబాద్

● షాజహానా

నా ఆత్మ ఈ షహర్ చుట్టూ
పిట్టలా గిరికీలు కొడుతుంది
అనుభూతుల్ని ఏరుతుంటుంది
పుల్లాపుల్లా నెలనెలా కట్టి
గూడులో నిశ్చింతగా నిద్రపోతుంది
ఏం పోగొట్టుకుని ఇక్కడికి వచ్చినా
ఏదో ఒకటి దొరికిస్తుందీ అమ్మ!
ఈ షహర్ ఒక షాయర్
రాత్రిని పాన్‌బీడా చేసి
తెల్లవార్లు ఎర్రని ముషాయిరాల్ని పండిస్తుంది
నక్షత్రాల దుపట్టా కప్పుకున్న ఈ షహర్
దుల్హన్‌లా ముస్తాబవుతుంది
మొజాంజాహి బజారు పూలజడై
పేర్చిన పండ్ల పచ్చదనంతోని
ప్రతిరోజూ గుభాళిస్తుందీ నగరం
ఇరానీ ఛాయ్ ఇరుమతాల కమ్మదనపు రుచి
హైదరాబాద్ బిర్యానీ ఘుమఘుమల ధూమాలు
భూమి చుట్టూ సాంబ్రాణీ
పొగలై అలుముకుంటాయి
రాత్రి కూడా పగలై విచ్చుకునే
రాత్రీ పగలూ తేడాలేని కష్టజీవి ఈ నగరం
ఈ చార్‌సౌ సాల్ షహర్ బిడ్డలు
సంపాయించడానికి బతకడం లేదు

ముల్లెలు దాచుకోవడానికి జీవించడంలేదు
భూమిని చాపలా చుట్టి చంక కింద పెట్టుకునే
రియల్ ఎస్టేట్ వ్యాపారులు కాదు వాళ్లు
నగర జీవనానికి నాడీ వాళ్ల
షహర్ వాళ్లకు అమ్మ
నగరానికి నిజమైన వారసులు వాళ్లు
ఆ కళకళ లాడిన నా హైదరాబాద్ ఏదీ?
ఆ సంస్కృతిని నాగరికతను ధ్వంసం చేస్తున్నదెవరు?
ఆక్రమణ చేసిందెవరు?
ఆశల్ని భూజాల మీదేసుకొని వలసొచ్చిందెవరు?
బిల్డింగులు కట్టిందెవరు?
రోడ్లని వాహనాల ప్రవాహం చేస్తూ
కాలుష్యమని గగ్గోలెత్తడమేంటి?
మీ పచ్చదనాల్ని నదీమతల్లుల్నీ
కావ్యగానం చేస్తూ కాపాడుకుంటూనే
బతుకిచ్చిన నగరాన్ని కులట అంటారా?!
పరిశ్రమలంటూ సెజ్‌లంటూ
తల్లినే తార్చాలని చూస్తున్నది మీరే కదా
మా కంచం ముందు మెతుకు మెతుక్కి
మేకులు కొడుతున్నది మీలాంటి వాళ్లే కదా
మిమ్మల్ని పెంచి పోషిస్తున్నందుకే కదా
మీరు అంతంత మాటలంటున్నదీ
బిడ్డల్ని సాదదానికి ఏ పేరును మోసినా సరే
ఆమే మాకు అమ్మే!

కడుపు చేతుల పట్టుకొస్తే
కన్నీరు పెట్టిన నగరం

మీకింత చోటిచ్చింది
ఆకలి తీర్చి అమ్మయింది
గిరి గీసుకొని లేదు పొమ్మని
మీ మొఖాన తలుపెయ్యలేదు చూడు
అలాంటి అమ్మరా హైదరాబాద్ అంటే
మీలాంటి లక్షల కృతఘ్నుల్ని
ఒడిలో మోస్తున్న నా హైదరాబాద్
అల్లావుద్దీన్ చేతిలో
ఎన్నటికీ ఆరని అద్భుత దీపం
మేరా హైదరాబాద్! తుఝే సౌ బార్ సలాం!!

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 12, జనవరి 2009*

# తెలంగాణ విముక్తి....

● కోదం కుమారస్వామి

మా మాటలిని
మీరు నవ్వినంక తెలిసింది
మీ భాష యాసలు వేరని
కరెంటు కోతకు వరిసేను బలై
కరువెట్లా వచ్చిందో....
కాలువ కింది మీ పంటలు చూసినంక
సమజయ్యింది మన పొలమేర్లు వేరని....
అడుగంటిన ఫ్లోరైడు నీళ్ళు తాగి
మా నాయకుల మెదళ్లు వంకరబాయే....
గిది జూసి కలుక్కుమన్నపుడు అనుకుంటి
మా నీళ్లని మల్పుకుంది మీరేనని...
భాగ్యనగరం నడిబొడ్డులో
మా కందనంత అరటాకులలో వడ్డించుకొని
'ఆంధ్రభోజనం' బోర్డు తగిలించినంక ఎర్కైంది
మా మోదుగాకు బతుకు విస్తర్లను
చింపిన కుక్కలు మీరేనని...
తెలంగాణ తల్లి విముక్తికి
మా పల్లెలన్ని ధూం...ధాం ఆడుతున్నయ్
కాలడ్డమేస్తే సీమాంధ్ర నేతల్లారా..ధాం.....ధాం.

*యాదవ ప్రభంజనం మాసపత్రిక జనవరి, 2009*

# రాజకీయ దిష్టిబొమ్మలు

• *జిందం అశోక్*

తెలంగాణ అంటే
అందరికి బతుకమ్మ పాట
బతుకమ్మ ఆటైనది .

ఒకడు పాడిన పాట
మరొకడు పాడడు అనడు
ఒకడు ఆడిన ఆట
ఇంకొకడు ఆడడు నడవడు
ఎవ్వని పాట ఆట వానిదే
ఎవ్వని జెండా ఎజెండా వానిదే
ఎవ్వని రంగు గుర్తు వానిదే
ఎవ్వని దుకానం
ఎవ్వని బతుకుదెరువు వానిదే
అందుకే చూసేటోనికి అలుసైంది
వినేటోనికి చులకనైంది
పాలించేటోనికి పలుచనైంది

నాడు నేడు నీళ్లు నిధులు
ఉద్యోగాలు భూములు
రాజకీయ దిష్టిబొమ్మల సాక్షిగా
'సర్కారు' తుమ్మల్లో కల్సినై, కలుత్తున్నయి

ఓటు!
ఏ వ్యక్తి కెయ్యాలి

ఏ గుర్తు కెయ్యాలి..
తెలంగాణ
వత్తది రాదు? రాదు వత్తది! అంటూ
కల్వరిత్తూ కల్వరిత్తూ మనాది కొద్ది
యాభై యేండ్లన్న నిండని తెలంగాణ బిడ్డ
నిన్ననే సచ్చిండు
ఉన్నవాళ్ళు బతికి సత్తుంద్రు
పార్టీల పొత్తులు ఎత్తులు
పబ్బం గడపడానికి పూటకుళ్ల
రాజకీయాలైనయి
రాజకీయ వృత్తి ప్రవృత్తి కల్గినోళ్లు
తెలంగాణను
వాసనలేని ప్లాస్టిక్ పూలతోట సేతుంద్రు
ఇన్నినాళ్ల వెనుకబాటుతనానికి
కండ్లల్లో ఇసుక పడి ఒత్తిన బాధ
వార్డు మెంబర్ సర్పంచ్
ప్రాదేశిక సభ్యుడు శాసనసభ్యుడు
పార్లమెంట్ ఉభయ సభ్యుడు
ఎవ్వడు పరాయోడు కాదు
ఇన్ని రోజులు
మనమే వాళ్లకు పరాయివాళ్లమైనము

తెలంగాణ తల్లీ!
వాళ్ళను శపించు! శపించు!!
మమ్మల్ని క్షమించు ! క్షమించు!!

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 6, ఏప్రిల్, 2009*

## ఓట్లు కాదు, బూట్లే!

• పద్మ

పాము బాటకెన్నొంకలో
మీ నోటి కన్ని వంకరలు
అవునమ్మా! అవును
మా కన్నీళ్లెప్పుడూ
జాతీయాంశాలు కావు
పోలవరం, పులిచింతల, పోతిరెడ్డిపాడు
మీకు ముఖ్యాంశాలు!

అశ్వత్థామ హతః కుంజరః అన్న
అసత్య 'పంచె' పాండవులంటే
మీకు ఆరో ప్రాణం

సమైక్య గీత దాటకుండా
ముత్యాల మూటలు పంపి
మడమ తిప్పని మలి యోధులంటే
మీకు మరింత ప్రేమ!

యస్.ఆర్.సి. నాటకాన్ని
సన్నాయి బ్యాండు మేళాలతో
ఊరూర ఇరుముడిలా మోస్తున్న
అబద్ధాల ఆ (రో)శయ్య లంటే
మీకు మహా ఇష్టం!

తెలంగాణంటే
బంగారు బాతు గుడ్డని
పిచ్చోడి చేతిలో భగవద్గీతని

గుంటనక్కలు కూసే కూతలన్నీ
మీకు నైవేద్యం లాంటివి!

తల్లీ పిల్లల నెడబాపె వలసలు
ఎముకల గూడులా అల్లుకొని
పాకులాడే ఫ్లోరైడ్ జీవితాలు

పోరాటం, సంక్షోభం,
దుఃఖం, పేదరికం

అవిద్య ఆధిపత్యాలకు విముక్తెప్పుడు?

చావులు తెలంగాణవి
సంపద ఆంధ్రది
రోజుకు రెండు డబ్బాల
మంచి నీళ్ళు కొని తాగే
పరాధీన బతుకెన్నాళ్ళు?

మొన్న మా మనోభావాలను గౌరవించి
నిన్న పార్లమెంటులో ప్రస్తావించి
నేడు జై ఆంధ్రప్రదేశ్ అంటున్న
మీ నోరు బెజవాడ మురికి కాల్వలాంటివి!

కౌరవులంతా కన్నుమూశాకే
గాంధారి గంతలిప్పిందట
రేపు
మీరు అంతే నేమో?

సామ్రాజ్యవాది జార్జి బుష్‌పై
బూట్లు విసిరిన ఆల్‌జైదీ
మాకిప్పుడు ఆదర్శం!

సిక్కుల ఊచకోత
సామూహిక హత్యాకాండ
పాతికేళ్ళ అన్యాయంపై
బూటు విసిరిన జర్నైల్ సింగ్
మరో ఆదర్శం
అస్తిత్వాన్ని వక్రీకరణ చేసి
ఆత్మగౌరవాన్ని అవహేళన చేస్తున్న
ఓ మాయ మాటల మాంత్రీకులారా!
పుట్టెడు దుఃఖంతో
లేస్‌లన్నీ విప్పుతున్నాం
యాభై ఏళ్ళ అన్యాయం అవమానంపై
పులి జూదమాడుతున్న
మీకు మీ బిడ్డలకు రేపు వేసేది
ఓట్లు కాదు బూట్లు

*అక్షరం, సూర్య పత్రిక, 15 ఏప్రిల్, 2009*

# హమారా హైదరాబాద్

• వనపట్ల సుబ్బయ్య

భగీరథుడి నోట
బాలచంద్రుడి పలుకు
సూది మోపినంత భూమియ్యనని
పదవిలోలుడై ఒక్కొక్క విడతలో
ఒక్కొక్కటి సర్వం కోల్పోయిన సుయోధనుడు
చిట్టచివరకు పిరికోడుగ జలస్తంభనం! గుర్తుందా?
రేపు- నువ్వూ అంతే నేమో!
కళ్లలోంచి కరుణరసాన్ని పంచి
కడుపులో ఉన్న కాలకూట విషాన్ని కక్కిన
అత్యంత సహజ నటుడివి!
మరిచావా! ఈ మట్టిలో పాదం మోపినందుకే
ప్రజా ప్రస్థానం అరటిలా పండింది
చెల్లెలు హారతి లేకుండా
నీవు నడుం కట్టి నడిచినవా?
బొబ్బలెక్కిన అరికాళ్లకు
నల్లాలం పసరు పూసింది విదేశీయులా?
మామిడి తోరణాలు కట్టి
తప్పెట్ల తాళాలతో
చీమల దండులా నీ వెంట నడిచి
మోడు వారిన మొండి మానుకు
మోదుగు పూల దండేసి
బసంతం పూసుకున్నప్పుడు
పరాయితనం గుర్తుకు రాలేదా?
అనుబంధాలకే

అర్థాలు మార్చే ఓ విదూషకుడా!
హైదరాబాదంటే ఇదుపులపాయ కాదు
ఒక పురా సమాజం నుంచి
వర్తమాన జీవితానికి నమూనా
ప్రేమ వారధి పురానా పూల్
భిన్నమైన ప్రజల ఉమ్మడి జీవనం
సహనమే సౌశీలంగా
ప్రేమే జీవన విధానంగా
చార్ సౌ సాల్ షహర్
హమారా హైదరాబాద్

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 5, మే, 2009*

# ఆదాబ్ హైద్రాబాద్

• లోచన్

ఎంతైనా నువ్వు గ్రేట్
నీ విజన్ గ్రేట్
హైద్రాబాద్ చుట్టూ అల్లుకున్న నీ అభిమానం గ్రేట్
మరి ఇప్పుడు నీ విదేశీగానంలో ఎన్ని గణాంకాలో
హైద్రాబాద్ ఆదాబ్‌నీ
ఆత్మీయ హస్తాన్నీ అందుకోలేకపోయావ్
ఈ రంగుల గుల్‌దస్తాలో యిమడలేకపోయావ్
బాగె ఆమ్ పూలవనంలో పురుగులు చొరబడ్డాయా?
ఇక్కడి ఆబెహవాలో ఇంత కాలుష్యమెప్పుడూ లేదు
విశ్వాసం నిండిన యిక్కడి గాలిలో
విదేశీ బక్వాస్ నింపకు
అమ్మపాలు అమృతమౌతాయని తెలుసు
విషమై ద్వేషమై కుదరనిరోగమౌతుందని ఎవరికి తెలుసు?
ద్వేషం నాష్తా అయినవాడికి
దోస్తానా రుచి ఏం తెలుసు
ఇక్కడి ఒక్క ఇరానీ చాయ్ చుట్టూ
ఎన్ని స్నేహ సౌరభాలు
ఒక్క బిర్యానీ మనసునిండా
ఎంత బిరాదరీ ఘుమఘుమలు
ఆకాశం గుండెలు తాకే ఖవ్వాలీలు
కమనీయ కవితా సాయంత్రాలూ
షామెగజల్లూ భజనలూ
భాయిచారాలు-
వేదనలు వైరుధ్యాలెన్నున్నా

అనుబంధాల నగరం హైదరాబాద్
రంగుల హరివిల్లు యీ ఇల్లు
మఖ్దూమ్ మల్లెపందిరి కింద
మంట పెట్టేవాడికి
మనసు మమకారాల
మాటేమి తెలుసు?
ఇక్కడి జీవధారలు
తరలించుకు పోయిన పైరేట్లెవ్వరు?
సహజ సంపన్న తెలంగాణ తల్లిని
చింపిరి గుడ్డల్లో నిలిపిన
వంచనా శిల్పులెవరు?
ప్రాణాన్ని మించిన
ఆమె అభిమానాన్ని అవహేళన చేసిందెవ్వరు?
నీవు తిన్నింటి వాసాలు లెక్కపెట్టవు
తగల బెడతావు
ద్వేషమే మాకు విదేశీయం
దోపిడీ యిక్కడ బహిష్కారం
ఇంకా కమర్షియల్ కాంప్లెక్స్‌ల కాళ్ల కింద నలగని
ఈ గరీబ్ గల్లీల్లో గలత్ నడకలు నడవకు....
గందగీ నింపకు
దోస్తానాదారుల్లో వేర్పాటు ముళ్ల కంచెలు నాటకు
మనసున్న నగరమిది
మొహబ్బత్‌కి దునియా యిది
ఇక్కడి చౌరస్తాలో నిలబడి ధృతరాష్ట్రుని చేతులు చాచకు
నువ్వెన్ని గొళ్ళాలు పెట్టినా
ఖులాదిల్ కా దర్వాజ మాది
ఆమ్ ఆద్మీ ఆత్మీయ సౌందర్యం హైద్రాబాద్
వేదనలు వైరుధ్యాలెన్నున్నా

వైవిధ్యాల హరివిల్లు యీ యిల్లు
ఇంత అందమైన ఆత్మీయ నగరంలో
అభివృద్ధికి అందని అన్‌టచెబుల్స్ ఎందరో
ఈ కూడళ్ళు ఆకలి కళ్ల నెగళ్ళు
చాచిన హస్తాలు యిక్కడి రస్తాలు
మూసీనది తీరం బురదలో కూరుకుపోతున్న బతుకులు
రాత్రుళ్ళు యీ నగరం ఫుట్‌పాత్‌ల మీద
ఆకలి ఆరేసిన అస్థి పంజరాలు
బడుగుల ప్రత్యేక బలివితర్దులు ఎన్నెన్నో భోలక్‌పూర్‌లు
బడుగు బతుకుల యీ బడబాగ్ని కడుపులో దాచుకుని
బంజారా గుదిబండను మోస్తున్న అమ్మ హైద్రాబాద్
అందరి ఆషియానా హైద్రాబాద్
అయ్యా! మళ్ళీ చెపుతున్నా
మఖ్దూమ్ చల్లని మల్లె పందిరికింద మంట పెట్టకు
తెలంగాణా తగ్దీర్‌తో ఆడుకోకు
తెలంగాణా కోపాన్ని తట్టి లేపకు
ఈ రతనాల వీణ తీగల తెంచకు
రక్తగీతమై అంతా రాజుకొంటుంది
ఇక్కడ యీ బోనాల వీధుల్లో
ఈద్ ముబారక్ ఇఫ్తార్ విందుల్లో
భోలాల, దిల్‌వాలాల మనసుల్లో
వేరు బంధాల బీజాలు నాటకు
తెలంగాణా తెరువుకు రాకు
ఇక్కడి బతుకుల తెర్లు చేయకు
అన్నీ అమ్ముకొని సొమ్ము చేసుకునే వాడు
అమ్మను కూడా నమ్మడు కదా
అవును- తెలంగాణ తెర్లయింది
దొంగలు పడ్డ యిల్లయింది -
తెలంగాణా వాడు - నీకు దివాణాగాడు

చీల్చడమే తప్ప కూర్చడం రాదు కొందరికి
హైద్రాబాద్ అందమంతా
ఆమ్‌ఆద్మీ ఆత్మీయతలో ఉంది
నీ నవ్వుల షార్ప్ వెపన్‌తో
అనుబంధాల అంతస్సూత్రాలు తెంచకు
హైద్రాబాద్ నీకు అతిపెద్ద ఆర్థిక మండలి కదా!
నీవేమైనా కొనగలవేమో కాని
తెలంగాణాకి వెలకట్టలేవు
అబద్ధాల మీద ఆయుధాల మీద బతికేవాడు
అమెరికా వాడైనా అనంతపురం మనిషైనా
మనిషి రక్తం రుచి మరిగిన వాడే కదా!
విదేశీయం ఆహా!
ఇది ఎన్నికల ఎత్తుగడ అని లైట్‌గా తోసేయకు
నీ మనసు కక్కిన నిజమిది
నీ నరాల్లో పారే నైజమిది
ఆదాబ్ హైద్రాబాద్
అనురాగాల హైద్రాబాద్
వేదనలు వైరుధ్యాలెన్నున్నా
అనుబంధాల నగరం హైద్రాబాద్

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 25, మే, 2009*

# హమారా హైదరాబాద్

● కల్వకుంట రఘునాథాచార్యులు

బాహర్‌వాలోంకో హటావో యహ్ జమీన్ సే
తెలంగాణ వాలోంకో బిరావో తఖ్తపర్ ఈమాన్ సే
ఈ గాలి బుసలు కొడుతున్నది
ఈ నేల కొలిమోలె భగభగ మండుతున్నది
ఈ కడుపులు ఎండుతున్నై
నువు రజాకార్లతో కొట్లాడినోడివి గాదు
నిజాంతో మాట్లాడినోడివి గాదు
చార్మినారు గట్టినోడివి గాదు
సాలార్జంగ్ మ్యూజియం పెట్టినోడివి గాదు
హూస్సేన్ సాగర్ చెఱువుకు బుడ్డపైస ఖర్చుజేసినోడివిగాదు
సొమ్మేమో మాది సోకేమో నీది
బతికించుడు మాదైంది బలుపు నీదైంది
అందాలను దిద్దుకున్న హైద్రాబాద్ అంతా /
మా చెమట - మా రక్తమే నిండుంది
మా ఆరాటం - పోరాటం అంతా తెలంగాణే

యే హమారా హైద్రాబాద్ / యే హమారా తెలంగాణా

కేంద్ర పాలితం కాదు
స్వయం పాలితం కావాలనుకుంటున్నది తెలంగాణ

బిడ్డా! నీది గాని దాంట్ల హిస్సా అడిగితే
మర్లవడుతుది! తెలంగాణ!! జాగ్రత్త జర బచ్‌కే రహెనా

ఇప్పటికైనా ! ఎప్పటికైనా
మాదే ఈ హైద్రాబాద్ మాదే ఈ హైద్రాబాద్

*ప్రాణహిత మాసపత్రిక మే, 2009*

# ఆత్మగౌరవ కిరీటం

• బూర్ల వెంకటేశ్వర్లు

ఒక గుండెకాయను
మరో శరీరంతో కలిపి
కుట్టేసిన అనాలోచిత చర్య
ఒక్క భాష పేరుతో
పరాయి కౌగిట మోసగించబడ్డ విషాద చరిత్ర
కృష్ణాగోదారుల తల్లిరొమ్ములు
రక్తపింజరలు గ్రోలుతున్న బాధా సందర్భం
చేతిలో తీర్థం పెట్టడానికి లక్షన్నొక్క విజ్ఞాపనలు
గుళ్ళెపలారం కోసం వేయిన్నొక్క మొక్కులు
రోజు రోజుకు అంగడవుతున్న బతుకులు
కాకుల గూటిలో జన్మించబడుతున్న కోకిలలు
ఎంత జాలెపోతపోసి అల్లినా
నువ్వు నాపై ఒడుపుగా విసిరిన వల
పెద్ద మనుషుల ఒప్పందం
నువ్వు పచ్చబొట్టు పొడిపించుకోవడానికి
తయారైన ఫార్ములా
ముల్కీ నిబంధన సవరణ
ఒకానొక నీ చతురత్వకళ
ఆరున్నూటపది
నా ఆర్థికమూ, రాజకీయమూ
సామాజికమూ, సాంస్కృతికమూ
నీ గుప్పిట్లోంచి రాలుతున్న ఇసుక

.....

ఇప్పటికీ నా విశ్వాసమొక్కటే!
మనోభూమిలో విత్తనమంటూ పడ్డాక
తాను చిట్లడం నేలను చీల్చడం తప్పుతుందా?

అరవై ఏళ్ళుగా రగులుతున్న నా కోరికాగ్ని
తీరక ఆరుతుందా!

....

నే చెక్కబోతున్న జీవిత శిల్పం
నువ్వు నిర్మించే అంతస్తుల బలుపు కానేకాదు
నా చెదిరిపోయిన గూటిని
నా అలసిన కనుపాపల్ని
నా కనలిన బతుకుల్ని శృతి చేసే వీణను
నేనాశిస్తున్నది
చదరంగంలో పావు పాత్రకానేకాదు
నా ఆత్మగౌరవం కిరీటించుకుని
రాజుగా వెలిగే సంపూర్ణ పాత్ర
నా తెలంగాణ
నా స్వాతంత్ర్యం నా కమ్మని స్వర్గం.

*తెలంగాణ సోయి, అక్టోబర్-జూన్ 2008-2009*

# కదురు

● బెల్లంకొండ సంపత్‌కుమార్

పది జిల్లాల ఎల్లల మీద
చేతులు చాచిన కబందుడు
పగుల్ల భూమి కదురు బిళ్లను వడికి
నాణెం నయాగారా అక్షరం మీద
ప్రాణాల కండెలు చుడుతున్నడు
అక్షాంశాల పొడవునా కలిమిలేముల రుతువులు
కావడి కుండలు మోసి మోసి
ఎడారి మొక్కల్ని మిగిల్చిన
సౌధాల వాకిట్ల సొమ్మసిల్లుతున్నై
రాత్రింబగళ్ళు దిక్కుతోచని అనాథలు
రేఖాంశాల నిడివి కయ్యల్లో అస్థిపంజరాలై
హాహాకారాలు చేస్తున్నై
భూమధ్యరేఖ రియల్ సిరియంత్రంలో
డిజిటలాట ఆడుతున్నది
తలపక్కనే నీళ్ళున్నా
ఇది తీరే దాహం కాదు
సస్యశ్యామలం చూపుచింపులై హిమతుషారంల
చిక్కుకున్నాంక
భూమి సూర్యుని చుట్టని కాదు
సూర్యుడే భూమిని చుట్టాలని
తెలంగాణా కదురు గీతం.

*తెలంగాణ సోయి, అక్టోబర్-జూన్ 2008-2009*

# జాగోరే....జాగో....

● అందెశ్రీ

చీకట్లను చీల్చే కిరణాలు
చిరు దివ్వెలుగా మారి
చమురు చాలక కొండెక్కి
గుండాగినట్లుగా ఉవ్వెత్తున లేచే తెలంగాణా ఉద్యమాలకు
ఊపిరి ఏమన్నా ఆగిపోయిందా ఏమి?
ఇప్పుడు ఉలూకూ లేదు పలుకూ లేదు
ఎవరికి వారే గ్రూపులు కట్టుకుంటెట్లా!
మనమంతా ఒక గుంపుగా మారకపోతే
మన శత్రువులు ముంపుకు గురయ్యేదెప్పుడు?
పదవుల కోసం పైరవీల కోసం పైసల కోసం
మన అస్తిత్వాలను ఆత్మగౌరవాలను అమ్ముకున్నంత కాలం
మన హైద్రాబాదు ఫ్రీజోన్ కాకుంటే! ఇంకేమైతదీ
కొంగలు తొక్కిన నారుమడ్ల తీరుగా
నగర శివార్లన్నీ దొంగలకు పలారమైపోయినవి
ఇప్పుడెవర్ని పలకరించినా చాలు
ఇరవై నాలుగు గంటలూ ఉపన్యాసాలే...
థియరీ ఎప్పుడూ తీరం చేర్చదు మిత్రమా!!
ప్రాక్టికలే కదా ప్రపంచాన్ని నిర్మించింది
వ్యక్తి స్వార్థం ఎప్పుడూ వ్యవస్థీకృత నేరము కాదు
వెన్నుపోట్లతో వెలుగొందుదామనుకోవడమే కదా పెద్ద నేరం
కులాలుగా విడిపోతున్నాం.... మతాలుగా చెదిరిపోతున్నాం
ఇకనైనా చేతన కేతనాలమై
తెలంగాణ చరిత్రకు ఊపిరులూద్దాం...

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి నవంబర్ 14, 2009*

# చిన్నాయి

• సిద్ధార్థ

గడ్డ కట్టడమే తెలుసు అవున్నాకు
కరిగి పోవడం తెలియదు
బుగ్గవాగులా .ప్రవహిస్తూ ఎండిపోవడం
తిరిగి నిండడం పొంగడం
పొర్లడం
భూమిలోపల దుంపలా ఉడకడం
తెల్లని కాగితమై కాగడం
తెలియదు

జ్ఞానమంతా . నీన్నీకు
డబ్బూ దస్కం ఆవిరిధూపం
పైసా...కిస్సా కుర్సీకా

పదాలు మోసం అప్పుడప్పుడు
ధ్వని చీకటి
శబ్దం కరవాలం..
నిలబడని చూపూ ఎగిరే కత్తీ
వొకటొకటే....

అంజాన్ కొట్టే పదం సౌఖ్యం
చీకటి చేయని సడి మౌనం
నిశ్శబ్దం..పావురం నుంచి వాలే ఈక
పట్టించుకోని చూపు
వైతరణి....భవతారిణి.

ఏయ్...ఆగాగు.. .నిన్నే. .
వెళ్ళకు ముఖం తిప్పుకోకు

కిటికీని సగం మాత్రమైనా తెరువ్
బార్లా తెరవడం చావు...అది చివరిదీ
అంతిమంగా అందరమూ బార్లా తెరుచుకుని
అమ్మ భూమిపై
చేతులూ కాళ్ళూ విరుచుకుని/ కూలిపోవాల్సిందే
వీలయితే
కాళ్ళూ కడుపూ ఆయమ్ పట్టూ
గజ్జల కింది కండలూ
నుజ్జు నుజ్జయ్యి తెగిపోవాల్సిందే .
కాలిపోవాల్సిందే...

కొంచెం కొంచెంగానైనా సత్యాన్ని
అటూ...ఇటూగానైనా అమరిస్తే
వాక్యమూ శోకమూ...

లోలోపల నిద్రకాగే వీర్యకణాలు
పిట్టల్లా ఎగిరిపోవాలని కలగంటున్నాయి
ఏ ఆకాశం పిలువగలదో...కలవగలదో
ఇప్పుడు నాకు ఆమె సగమాకాశమే కాదు
పూర్తి గుండ్రటి కాస్మిక్ పువ్వు.

చెప్పనియ్
కొంచెం కొంచెంగానయినా...
వాయిదాల్లోనయినా
చింపిరి చింపిరిగానయినా
ముంగిట్ల సాంపి జల్లినట్టు....పిచ్చి జల్లులాగా
నోముల పండుగనాడు
బంతి పూరేకుల తడిచిన గుమ్మం
నీ కండ్లు
లోపలికి దూకుతూ/ ఎత నెత్తుతూ...

దివిలీ పండగలప్పుడు
గారెల బూరెల మురుకుల వాసనలాగ
ఊపిరిని కొంచెం కొంచెం చిట్లనియ్యి
మా చిన్నాయి పచ్చగాజుల చెయ్యిలాగ
కదులు చిన్నగా/ కొంచెం కొంచెంగా
దీపాలని సంగతించనియ్యి
అవునిప్పుడు
ఎండు చలి...చీకటి ధ్వని . మాట

అయినా/ సగమయినా తెరువు మౌనాన్ని
ప్రమాణ పూర్తిగా ...
పానమసలే బాగా లేదు
చీకటిప్పుడు పెద్ద మాయ
దీపం పెనుమాయ
దేవ దేవతా..
నువ్వేమిటే...

*ఆదివారం వార్త, 22 నవంబర్, 2009*

# సెలవు తల్లీ...

● కాంచనపల్లి

కోడి గుడ్డు నుండి
పుట్టిన
నెలవంకల చలువ కూతల వెన్నెల జల్లులకు
మబ్బుకు రాయి తాకించి
కారే వెన్నెల ధారల్ని ఆబగా తాగించిన
ఆకాశం జడల్లాంటి తాటి వనాలకు
అమ్మశ్వాసను తనలోచేర్చుకుని
ఎండ ఏడారితనం మీద
చల్లగా వర్షించే
వసంతం వలలో
కోయిల గుండెలాంటి
వేపగాలి అలవోక స్పర్శకు
కడుపులో రాళ్ళను రప్పలను
నాచును పీచును దాచుకొని
పసినవ్వుల్ని చిందుతూ
ప్రవహించే వాగు చెలిమికి
సెలవు కదా ఇక సెలవు
ఎండకు వానకు
కంపించిపోయిన కోడిపిల్ల లాంటి
నా బాల్యాన్ని
తన రెక్కల్లో దాచుకొంటూ
కదలని నదిలాగా నిలబడ్డ
పెంకుటిల్లుకూ

తన ఎదమీద గాజుల నృత్యంతో
పేడ అలుకులు ముద్దులు పెడుతుంటే
పులకరించే ఉదయ
సముద్రపు చందమామ లాంటి
భూమి తల్లికి
సెలవు కదా ఇక సెలవు
బతుకు సూదితో ఊరి సిగ్గును
కుట్టిన దర్జీ సత్తన్నకు
అరవిచ్చిన బాల్యం పాటలతో
స్నేహం మెలికల జ్ఞాపకాల వాగులో
ప్రతిబింబించే భిక్షపతి సింగ్‌కి
సెలవు కదా ఇక సెలవు
దిస మొలల జానపద పాటల సుందరులకు
కృత్రిమ నగరం తొడుగులు లేని
నిసర్గమైన ఒక నాటి నాకు
సమస్త జీవన పునాది
పల్లెతల్లి జూలపల్లికి
సెలవు కదా ఇక సెలవు

*ఆదివారం వార్త, 29 నవంబర్, 2009*

# వెలుతురు విడిపోయేకొలది విస్తరిస్తుంది

● *జాంభవ*

రోలు, మద్దెల చందంగా ఉంది
మనిద్దరి సంగతి

జాతీయ జండా ఒక చేత్తో
జాతి జండా మరో చేత్తో
పట్టుకొస్తుంటే
సగభాగం ఇస్తాడనుకుంటి
వట్టి కాగితం చేతిలో బెట్టి
హక్కుల పత్రమన్నాడు
విభజన లేని వద్దనంటాడు
ఉత్తి గిన్నెలో కొత్తదనపు
ప్రతిభ వెదకమంటాడు

అణచిపెడుతున్న
పాదాల కింద మండే
అగ్ని పర్వతాలై
బద్దలైతేనే కదా
పోగొట్టుకొన్న దాన్ని
దక్కించుకునేది?

ఉద్యోగాలన్నీ వాడివి
ఊడిగమంతా మనది
ప్రాజెక్టుల పనితనమంతా మనది
ప్రవాహమంతా వాడికి

ఇంగ్లీషు వాడిలా
లవంగాల దొంగ కాదు
మనవాడు, నోటి కాడి ఎంగిలి గిన్నె లాక్కొనే
ఎంగిలి దొంగ!
నేలమీద పక్షిలా వాలి
పర్వతంలా
రూపాంతరం చెందుతాడు

పొట్ట చేతపట్టుకొచ్చినవాడు
పొగ గొట్టంలా నించుంటాడు
పరిశ్రమలా విస్తరిస్తాడు

రొట్టె మనది, వాడు పిల్లి
పులిలా పౌరుషంగా మాట్లాడుతాడు
పదహారణాల రిజర్వేషన్‌గాడు
పరమ పండితుడిలా
ప్రతిభ గురించి
కొండెక్కి - కూస్తాడు

ఒక దీపాన్ని
ఇంకో దీపంతో వెలిగించడం
విభజన కాదు,
వెలుతురు విడిపోయే కొలది విస్తరిస్తుంది

*అక్షరం, సూర్య సోమవారం 30, నవంబర్ 2009*

# హైదరాబాద్ నా మతం

● *శిలాలోలిత*

బోనాల్లో మైసమ్మ బొట్టులాంటిది
బక్రీదులో నెత్తుటి బొట్టులాంటిది
హిందూ ముస్లిం పార్సీ కాయస్థ సిక్కు ఇసాయి కలనేతలాంటి
హైదరాబాద్ మక్కామసీదులో పావురమై, ఆలయంలో
రెపరెప లాడే జెండాయై
ఒకే రాగంలా, శరీర భాగంలా నిలిచింది
ప్రేమకోసం నిలబడిన ప్రతీక భాగ్యనగరి
పల్లెలన్నీ బోర్లించిన పాత్రల్లా
పట్నం హంగుల్ని రంగుల్ని తొడుక్కుని
మెరిసిపోతున్నా
హైదరాబాద్ 'హమారా షహర్' లా ఎప్పుడూ
నిజమైన పట్నంలా నిలబడింది చిన్నప్పుడు హైదరాబాద్ రోడ్లు
నెత్తురు మరకల్తో నిండిపోయిందని
దిగులు దిగులుగా నడుస్తున్నప్పుడు
అప్పుడు తెలియనే లేదు అవన్నీ ఘుమఘుమ లాడే
పాన్ మరకలని
నెత్తుటి మరకలా తలపించినా
హైదరాబాద్ ఆత్మనిండా ఆత్మీయతనే నింపుకుందని
తర్వాతే తెలిసింది
హైదరాబాద్ నాలుగు వందల ఏళ్ళు దాటిన
నా ముత్తాత తాత-
ఏనుగుల వీరస్వామయ్య యాత్రా చరిత్రలో
లోకేశ్వర్ 'సలాం హైదరాబాద్' బతుకు రస్తాలో

హైదరాబాద్ అందమైన, పిడికిలెత్తిన బతుకు పత్రం
నా బాల్యపు రంగు రంగుల పతంగి, చాదర్‌ఘాట్,
నింబోలిఅడ్డా, ఇసామియా బజార్, చిటికెనవేలి ఆసరా
లాంటి మోతీ మార్కెట్, పూల పరిమళాల మొజంజాహి
మార్కెట్, నా చదువుల పలక సుల్తాన్‌బజార్, పుస్తకాల
పందిరి అబిడ్స్, చప్పట్ల అర్థం చెప్పిన గోల్కొండ, మనిషి
మనిషికి మధ్య మమతల వంతెన లేసిన పురానాపూల్,
నయాపూల్, నాలుగు చేతుల ఆత్మీయహస్త చార్‌మినార్,
చార్‌కమాన్‌ల బతుకుదారులు, దయల దర్గాలూ - వెరసి
నా బాల్యం కనురెప్పల వెనుక నన్ను నడిపించే కల
హైదరాబాద్
నన్నో మందిరాన్ని, మసీదుని, గురుద్వారని, చర్చిని
ఎల్లమ్మగుడిని చేసి మతాతీతంగా మార్చిన హైదరాబాద్
నా ఆధ్యాత్మిక గురువు
ప్రపంచమంతా తిరిగినా, జేబులన్నీ తరిగినా
దొరికని నా హైదరాబాద్ బన్నూ, ఇరానీ చాయ్‌ల రుచి,
పరాటా, షార్వా, బిర్యానీ, షీర్‌కుర్మా, తలావాఘోష్
దాల్‌ఖానా - హైదరాబాద్ నన్నావరించే వంటింటి పరిమళం
ఇప్పుడు నేను హిందువునూ, ముస్లింను కాదు,
మరే మతమూ కాదు
'ఏకత్వపు హైదరాబాద్' నా మతం -

*ఆదివారం వార్త, 27, డిసెంబరు, 2009*

# తీరొక్క పువ్వు

● సొన్నాయిల కృష్ణవేణి

నా తల్లి దుఃఖం
రెండు జీవనదుల ప్రవాహం
చెరబడ్డ వారసత్వం
చెరిగిపోని జాడ
పెంకాసులల్ల మెరిసిన నసీబు
పరిగేరిన పక్షి తండ్లాటయ్యింది
బొందల గడ్డొక్కటే
అకాల మరణాలతో వర్ధిల్లుతున్నది
నరంలేని నాలుకల జూదంలో
నాగండ్లు మాత్రమే బలిపీఠమెక్కుతున్నాయి
తొవ్వల నిండా పల్లెరుముండ్లే
ఎనుగు దునికిన ఆంధ్రాభూతం దెబ్బకు
కడుపులో పేగు కళ్ళముందే దహనం
సబ్బండ బలగపు గసో సదువులమ్మ ఒడి పోరాటపొత్తిళ్లు
మహావృక్షం ఊపిరి పోసిన యాది
ఊళ్ల నిండా ఉయ్యాల పాట
ఒక ఉత్తుంగ తరంగం బోనమెత్తిన పల్లెకు జోదు నిలిచిన దప్పు
సడకు మీద సవాల్ ఇసిరిన కొట్లాట
తీరొక్కపువ్వైన బతుకమ్మా
తరాల చీకటి మీద పెనుమంటై
నిప్పులగుండం సుట్టూ అసయ్‌దూలా ఆడుతున్నది
బతకంటే పోరాటం
పిడికెడు మట్టిలో వేలవీరుల త్యాగం పురుడు పోసుకుంటది

*వరంగల్ వాణి, 19, డిసెంబర్ 2009*

# కొత్త రాతియుగం

• సతీష్ ఉసిరికపల్లి

కిరాయి పరాయి పెత్తనాన్ని
గురిచూసి కొడుతున్నది రాయి
శ్రీనగర్‌స్ట్రీట్...
కైరో చౌరస్తా...
ట్యునిష్ బజార్
ఉస్మానియా క్యాంపస్..
మానుకోట రైల్వేస్టేషన్
రాళ్లవానల రెవల్యూషన్స్
గుండెల్లో ఆవేశం చేతిలోని రాతికి ట్రాన్స్ ఫర్ అయితే
తూటాలకు రాళ్లే సమాధానం
నెత్తురు రుచిమరిగిన పాలక మురాల కాళ్లకింద
శక్తులు నిండిన యువత పుట్టిస్తున్న భూకంపం !
స్టోన్ ఫెల్టింగ్ యూత్
ఫేస్ ద న్యూ ట్రూత్
వేటతో కడుపునింపిన
ఆదిమ ఆయుధం
ఆధునిక యుగంలో
అణిచివేతను ఎదురిస్తున్న వాడి కొత్త అస్త్రం
విరబూసిన ప్రతి మార్పు విముక్తి బాటలో తూర్పు
ఆడేవాడిని కొట్టు...ఆడించేవాడు వణక్కపోతే ఒట్టు
రాళ్లేదిక్కు..రాళ్ళకు మొక్కు

*క్యాంపస్ వాయిస్ మ్యాగజైన్, డిసెంబర్, 2009*

# మొలకెత్తడమంటే...

● ఇక్బాల్

గుమ్మిలో గుట్టుగా వున్నప్పుడు
ఎంత ఊబలాట పడ్డానో...
బయటి ప్రపంచాన్ని చూడాలని

గుమ్మిలోంచి
విత్తనాల బుట్టలోకి మార్చిన అలికిడైనప్పుడు
ఎన్నెన్ని కలలు గన్నానో....
చల్లని గాలి పీల్చాలని -

విత్తనాల బుట్టలోంచి
కూలి తల్లి వళ్ళోకి
వళ్ళోంచి ఆమె వెచ్చని పిడికిట్లోకి మారి
నాగేటి చాళ్ళల్లో కలిసిపోతున్నప్పుడు
నా ఆనందానికి అంతే లేదు
మొలకెత్తే భాగ్యం కోసం
నేను కన్న కలలన్నీ నిజాలౌతున్నాయని

నాలుగు చినుకులు పడి
నా చుట్టూ నేల తేమతో బిగుసుకుపోతున్నప్పుడు తెల్సింది
మొలకెత్తడమంటే సర్దుకుపోవడం కాదు!
సంఘర్షించడమని...!!

అవును తెలంగాణ గావాలంటే
"లాబీ" జేయడం గాదు
'లడాయి" జెయ్యాలె!!

*జాగో జగావో తెలంగాణ ఉద్యమ కవిత్వం, డిసెంబర్, 2009*

# తెలంగాణను అమ్మేస్తుండ్రు

• ఎ. సూర్యప్రకాష్

నివద్దిగ మాట్లాడుతున్న
మనం ఇంకేం అకడాయిస్తం
మన జుట్టు ఆళ్ళ సేతుల్ల పట్టుకుండ్రు
గొర్రెల్లెక్క తలలు అంచుకొని
ఇంకా నీ బాంచెనందామా
మీ కాళ్లు మొక్తమందామా
గప్పుడు మన ఇండ్లల్ల అర్రలనిండా అడ్లుండేవి
తెలంగాణల గిప్పుడు కరువు తాండవమాడుతున్నది
ఒట్టొట్టినే ఆగమాగమైపోతున్నం
బిల్‌కుల్ హిమ్మత్ కోల్పోతున్నం
మన కడ్డు లీడర్లకు ఒర్లుడెక్కువ ఓపిక తక్కువ
ఏక్‌దం అభివృద్ధి జేస్తమంటరు ఎన్నికలప్పుడు
ఎవరు కుర్సీలో ఉంటే ఆళ్ల సంకకెక్కుతరు
ఎన్నికలప్పుడు తెలంగాణా పాట పాడ్తరు
గెలిసినంక పార్టీ మారి
రెండు సేతులా దండుకుంటరు
గెల్సేదాకనే తెలంగాణా
గెల్సినంక ముఖ్యమంత్రికి తానతందాన



గిప్పుడు హైదరాబాద్‌ను ఫ్రీజోన్ అంటుండ్రు
గిది తెలంగాణ విద్రోహం
హైదరాబాద్ ఆత్మను సంపేస్తుండ్రు

హైదరాబాద్ మీ తాత జాగీరు కాదు
మన నాయకులు మజ్జుగాళ్ళు సోయిదప్పినోళ్లు
కుక్కలకు బొక్కలేసినట్లు
కుర్సీలిచ్చి కూర్చుండ బెడ్తే
తెలంగాణ లేదు గిలంగాణలేదు
తెలంగాణ బొప్పలు మంచోళ్ళు గమండితనం లేదు
అలాయి బలాయి జేస్తరు ఒట్టొట్టిగ గుస్సాదరు
మర్లబడి బడితెలు తిరిగేసేదాక సూడొద్దు
సిన్న రాష్ట్రాలిస్తే కేంద్రం కొంపేం మున్గిపోదు
నవ్వేన్నన్న జెప్పు
తెలంగాణ పుణ్యానికి రాదు
అందరూ లగాయించి లాసిగ ఒక్క కంఠంతో
తెలంగాణ కావాలని అరిస్తే అస్తది
ఐశోల్లు నడుం కట్టి రంగంలోకి దిగి
కండ్లెర్ర జేసి రక్తం సుక్కలు ఒడిపి ఉద్యమం జేస్తే అస్తది!

*జాగో జగావో తెలంగాణ ఉద్యమకవిత్వం, డిసెంబర్, 2009*

## జంగ్ -ఏ - ఆజాదీ

• *విప్లవ్‌దత్ శుక్లా*

పిడికెడు మెతుకులే ఆశ
ఆశ ఆకుపచ్చదనం
పచ్చదనం మట్టిలో నీళ్లు
నీళ్లే బతుకు బతుకులు ఆగమయినయ్యి
పటాలున బలిగిన భూమిల
కలలు బీటలు బారినయి
పారే చెమట నొసటి గీతలుగా
మన "కర్మ" బానిసలుగ రాసుకొన్నం
నమ్మితే ప్రాణాలిస్తం!
నాల్క తీపి జూపిన
మనకు విషం సంగతి తెల్వది
తలారి ముసుగేసుకుని
అమాయకుల్ని ఉరిదీస్తుండు
సావో రేవో అన్నప్పుడు
కొట్లాడకపోతే దండగ!
ఈడ కాళ్ళకిందున్న మట్టిగూడా
తిరుగబడితె కండ్లల్ల బడతది
ఇప్పుడు మనసుల లోగుట్టు తెల్వలే-
మనం అధికారం అడగుతలేం
బతికే అధికారం ఇమ్మంటున్నాం
తలాపునున్న నీళ్లు మనయి....
కండ్ల కనపడి చేతికందనప్పుడు
లడాయి జేయాలే-

తల్లిని తిడితే రక్తం సలసల కాగాలే-
నోటికాడి బువ్వను గుంజుకొంటే
చేతులే నరకాలే-
నిలువ నీడలేకుంట జేస్తే
వాడో మనమో తేల్చుకోవాలే!
పోరుగడ్డ మట్టిని జండాగా ఎగరేద్దాం!
వాళ్ళది అధికారం
మనది తిరుగుబాటు
గెలుపు మనది
రేపు మనది చలోరే, చలో....
జంగ్ - ఏ - ఆజాద్!
జంగ్ - ఏ - ఆజాద్

*జాగో జగావో తెలంగాణ, ఉద్యమ కవిత్వం, డిసెంబర్, 2009*

# మరో స్వాతంత్ర్య పోరాటం

• సరికొండ నరసింహరాజు

చిల్లులు పడ్డది ఓజోన్ కేనా...
తెలంగాణ బతుకు జోన్‌కూ...
ఫ్రీజోన్ ముసుగులో ...
అది... ప్రభుత్వం సెక్యూరిటీ జోన్!
అధికారం కుట్రంతా
తెలంగాణను అంధకారం జేసుడే...!
భాగ్యనగరం జోన్ మారినా...
తెలంగాణ 'జీన్స్' మార్తయా?!
దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడితే - మహాత్ములు
మా నేల తల్లి విముక్తికై పోరాడితే దేశ ద్రోహులమా...'?!
తెలంగాణ రైతాంగపోరాటం ప్రపంచ విప్లవ చరిత్రలో ఓ అధ్యాయం
నాలుగొందలేండ్ల నా హైద్రాబాదు...
నా పూర్వీకుల బహుమానం
నా ఇలాకా... నా ఖాందానీ ఇనామ్!
జాన్...జానీ.... జనార్ధన్..అన్నదమ్ములం!
తెలంగాణ తల్లి పాలు తాగి రొమ్ము గుద్దకుండ్రి!
'జాగో' తెలంగాణవాదులారా!
భాగో....కబ్జాదారులారా జన్మభూమి కోసం... జన్మహక్కు కోసం
జన్మనిచ్చిన తల్లికోసం జన్మంతా పోరాటం!
మరో స్వాతంత్ర్య పోరాటం!!
మనకు కూడు తెలంగాణ! మన గూడు తెలంగాణ
జయహో తెలంగాణ జయ జయహో తెలంగాణ!!

*జాగో జగావో తెలంగాణ ఉద్యమ కవిత్వం, డిసెంబర్, 2009*

# అస్తిత్వ చేతనం

● *రూప్‌కుమార్ డబ్బీకార్*

ఒక సాలీడును కలగంటాను
ఎడారి కుప్పల్లో నీటి తెప్పలను కలగంటాను
కలల నెవ్వరాపగలరు
విషాద సముద్రపు అలల నెవ్వరడ్డగలరు
అమాయక దేహాలపై అగ్ని పర్వతాలు బద్ధలవుతుంటే
లావా ప్రవాహాల నెవ్వరు నిలుపగలరు
ఉద్యమాల జ్వాల నా తెలంగాణ
ఉబుకుతున్న నెత్తుటి ఊటబాయి
నా తెలంగాణ

ఆకాంక్ష పురుటి నొప్పులుగా
మూడున్నర కోట్ల అలలు ఎగిసిపడుతుంటే
నెత్తుటి సంద్రాన పడవ ప్రయాణం నా పోరాటం
నా పోరాటం బతికితే నేను బతికినట్లే కదా!!

*తెలంగాణ కవిత, 2009*

# సంకల్పం

• అమ్మంగి వేణుగోపాల్

ఏ సముద్రమూ నదులవెంట పడదు
యువశక్తి 'రాజకీయం' వెంట నడవదు
ముందు చార్మినార్  తనను నిర్మించుకుంటుంది
ఆ తర్వాత చౌరస్తా దానికి సాగిలపడుతుంది
విద్యార్థి వజ్ర సంకల్పం ముందు తలవంచి
రాతిగోడలు విశ్వవిద్యాలయాలవుతాయి
నిన్నటిదాకా ఒక కొలమానంగా సాగిన కాలం
ఎదురీదే యువరక్తంతో ప్రయాణం చేసి
ఒక ప్రమాణమౌతుంది
ఇంత చలిలో హిమాలయాన్నే వణికించే దీక్ష
మంచు అల్లిన మల్లెమాలను మెడలో ధరిస్తుంది
నగ్న ఛాతీలతో అగ్ని గోళాలను ఎదిరించే సాహసం
సామాన్యులను సైన్యంగా తీర్చి కవాతు చేయిస్తుంది
కొదమసింహాల పోరాట రుతుగర్జనతో
జైళ్ళు సంకెళ్లు స్వేచ్ఛతో రగిలిపోతాయి
యాభైయ్యేళ్ళ నాడు ఆకాశాన్నంటిన నినాదం
అమరవీరుల తేజస్సుతో సమరవీరులను చేరుతుంది
'జై తెలంగాణ' సమస్త సముద్రాల ఘోషై
ఝంఝా మారుతాల శ్వాసై
పర్వత పంక్తుల ఉక్కు పిడికిలై
పిడుగై చరిత్ర ముందడుగై
ప్రజల ఆత్మలలో ఆత్మ అవుతుంది.

*ఆదివారం వార్త, 17, జనవరి 2010*

# ధర్మమే గెల్తది

● కూర్మాచలం శంకరస్వామి

గీ తెలంగాణ లొల్లి గిప్పుడ్దా, గప్పుడ్దా
యాభై యేండ్ల సంది గిదే లొల్లి గదే పంచాయితి
సాతవాహనులనాటి సెరిత్రున్న తెలంగాణ
పరాయి ఏలుబడిలో ఎంగిలిస్తర్లమైతిమి
తూరుపు నక్కల తరిమి కొట్టినం
నైజాం కుక్కల ఘోరి కట్టినం
రజాకార్లను రచ్చబండలల్ల పాతినం
భూస్వాములను భూమిల పాతినం
ఇగ మనల్ని మనం బాగుజేసుకుందామంటె
గీ ఆంధ్ర పెట్టుబడిదారులు
గుంటనక్కల్లా పెత్తనం చెలాయించబట్టిరి
ఆంగ్రేజోల్ల లాగే గీల్లు సుత
యాపారం పేరుతో వచ్చి
నెత్తిమీద ఎక్కి తైతక్క లాడ బట్టిరి
ఒక్క దినమా, రెండు దినాలా
యాడాదా, రెండేళ్ళా...
ఏకంగా యాభై యేండ్ల సంది గిదే దోపిడి
మన భూముల్ని మనగ్గాకుంట జేసి
మన నీళ్లను మనం తాగకుండ జేసి
మన కొలువుల్ని మనకు దక్కకుండ జేసి
మనం బానిస బతుకులు బతకవడ్తిమి
నా తెలంగాణ కోటి రత్నాల వీణని
గా దాశరదయ్య సెప్పిన మాటలు

గసోంటి తెలంగాణ గాయాల వీణయింది
శానమంది పోరగాల్ల బతుకులు ఆగమైనయ్
మనల్ని మనం ఏలుకుందామంటె
వొకడేమో పదవుల కాళ్ళడ్డం బెట్టి
వేరొకడేమో పైసల్ని సింతగింజల్లా సల్లవట్టె
ఎలచ్చన్లనేమో అన్ని పార్టీల్లు ఇత్తమిత్తమని
గద్దె నెక్కినంక తెడ్డూజూపిచ్చి నట్టేట ముంచవట్టిరి
తాప తాప గిదేతంతు, పూట పూట గిదే బతుకు
గీయాల్ల అసలు లొల్లి షురూ అయింది
తెలంగాణ వచ్చుడో, సచ్చుడోనని
గా సెంద్రసేకరయ్య దీచ్చగ్గూకునంగనే
తెలంగాణ పది జిల్లాలో సెగరాజుకుని
సదువుకునే పోరలు, కొల్వు జేసేటోల్లు
కార్మికులు, శ్రామికులు, అడుగు బడగు వర్గాలు
నల్లకోటు లాయర్లు, తెల్లకోటు డాట్టర్లు పోరులో దుంకిరి
నిరసనలు దెల్పిరి, నిలదీసి అడిగిరి
గప్పుడు గా ఢిల్లీ తెలంగాణ ఇత్తమని ప్రకటన జేసిరి
గంతలోనే గీ ఆంధ్ర నాయకుల కండ్లల్ల మన్నువడె
వద్దు మొర్రోనన్నా కల్సి ఉందామని లొల్లి జేసి
తినే కంచాన్ని గుంజి నోటికాడి ముద్దను ఎత్తగొట్టిరి
ఇంకా వాల్లాటలను సాగనివ్వొద్దు
మన హక్కులు మనకొచ్చేదాకా
మనం శాంతి పోరు జేత్తనే వుండాలె

*మూసీ మాసపత్రిక, జనవరి, 2010*

# నెలవంకల దండ

● చిత్ర రాజేష్ ఖన్నా

బక్కపాణపోని సొమ్ము
బలిసినోని సేతిల పలారం
దోఖా చేసే కంచెల రాజ్జెం
పానీనకల్ పట్టాకాయితం హతం
అదాలత్, వకీల్
తీర్పులు ఉత్తమాటలు
సైతాన్‌లు మూటల మీద పీట
ఆరీ...రందీబతుకులు
మత్తడిదుంకె శెర్తె
ఇర్సుకపడతున్నయ్
ఈ జిందగీల్ల
కుములుడు ఒక్కనాటి కతగాదు

రచ్చబండ కాడ
ఇజ్జత్తక్వ ఇకమాతులు
బజాట్ల బరిబాత ఏషాలు
రకతంల జొర్రినోడు,
దిమాక్‌ల సరిచేస్తడు
నాయం గుడ్డికొంగ
బొండిగ మీద కత్తుల కోలాటం
ఇది బేకార్‌గాళ్ళ కాలం
పగటేషగాళ్ళ సిల్కల ఫోజులు
నీయవ్వ..కట్టె..ఇరుగొద్దు
పాము సావొద్దు

కుర్సొక్కటీ సల్లగుండాలె
పింజామనే పాణాలకు
దోఖా ఒక్కటే ఇనామ్
నెత్తురు సుక్కెల్లది...
సుత్తాంటే జీవొదుల్తది
ఖూనీకోర్ల పరాయి ఇలాకాల
పాయిదార్లోందే పెత్తనం
పాయిరాల గుండెల్ల పిడుగువడ్డది
ఇగ నాలుగు బాటల కాద పంచాయ్తేద్దాం
దొంగలెవలో దొరలెవలో,
బైయిటికిగుంజుదాం......
కల్లం గింజెల తాలు
గాలికి కొట్టుక పోవాలె!
మటమటాన
మాయమైనోల్ల స్థూపాల మీద
నెలవంకల దండలేద్దాం

*దండోరా మాసపత్రిక, జనవరి, 2010*

# ఉద్యమం వర్సెస్ రాజకీయం

● *ఎన్.గోపి*

ఎప్పుడైనా
ఉద్యమాన్ని ఉరితీయడానికి
రాజకీయం తాడు పేనుతుంది
నేల రాలిన శవంలోంచి
మరో ఊపిరి
ఊపిరిని మట్టిలో నాటితే
పోరాట వృక్షం మొలుచుకొస్తుంది
ఆకులు హరిత తరంగాలౌతాయి
ఆకాశం ముక్కు మూసుకొని
సముద్రంలో దూకుతుంది చరిత్ర ఎప్పుడూ ఉద్యమం వైపే
రాజకీయాలే చీలిన పేలికలౌతాయి

ఉద్యమం గడ్డిపోచల ఆకాంక్ష
రాజకీయం తుపాకుల ఆంక్ష
ఉద్యమం పాట రాజకీయం రెండు నాల్కల మాట
ఉద్యమం అగ్నిపునీత
రాజకీయం రంగులు మార్చే నేత

చావుకు తెగిస్తే ఉద్యమం
వేడుక చూసేది రాజకీయం
చచ్చినా పరవాలేదనుకునే
ఆ ఒక్క క్షణం ఉద్యమం
చావుల సంఖ్యను లెక్కించేది రాజకీయం
ఆత్మార్పణం ఉద్యమం

రక్తతర్పణం ఉద్యమం
బిత్తర పోయేది రాజకీయం
ఉద్యమంలో విషబిందువులు రాల్చేది రాజకీయం
వాటిని అరిగించుకునేది ఉద్యమం
రాజకీయం రణగొణ
ఉద్యమం ఒక మహాఉప్పెన

ఉద్యమం ఎక్కడి నుంచైనా రావొచ్చు
మట్టిలోంచి
చెట్టులోంచి
తెగిన ఊపిరిలోంచి
ఉదారంగు ఆకాశంలోంచి

ఉద్యమం ఒక ఉద్వేగం
రాజకీయం ఆగమాగం
ఉద్యమం పిడికిలి
రాజకీయం అలికిడి

ఉద్యమం ఒక బలిదానం
రాజకీయం తలా ఒక గానం
ఉద్యమం రేపటి తూర్పు
రాజకీయం మునిమాపు

ఉద్యమం జనస్వామ్యం
రాజకీయం ధనస్వామ్యం
ప్రజాస్వామ్యం పగుళ్ళువారితే
ఉద్యమంపై మళ్లీ మరో ఉద్యమం
నిరంతరంలోంచి చిరంతనపద్యం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 25 జనవరి, 2010*

# రాజమకుటం

• కోయి కోటేశ్వరరావు

భూమి గుండెలదిరేలా
ధూమ్‌ధాముల్లో చిందేసే
ఆది నర్తకులెవ్వరు..?

నింగి చెవులు మారుమ్రోగ
పోరు పాటల్లో రాగాలైన
పరమ గాయకులెవ్వరు...?

అగ్నిజ్వాల కంపించగ
ఆత్మాహుతికి తనువులిచ్చే
అమర మూర్తులెవ్వరు...?

నీటి చెలమలై ఉరికి
ఉద్యమ దాహంతీర్చే
జీవధారలెవ్వరు..?

గాలి హోరు నెదిరించి
వైతాళిక పతాకలై గర్జించే
ధీరయోధులెవ్వరు...?

పంచ భూతాల్ని
పిడికిట్లో బిగించి
కాలాన్ని నిలదీసి ప్రశ్నించే
అసమాన వీరు లెవ్వరు..?

వారిదేలే తెలంగాణం
వారిదేలే రాజమకుటం

బహుజన కెరటాలు, జనవరి - ఫిబ్రవరి 2010

# బిడ్డలాలా!

• నారాయణస్వామి

మీ అవ్వను
చేతులు జోడిస్తున్న

నా తోడే
మిమ్మల్ని మీరు చంపుకోకుండ్రి

ఏడ్సెతందుకు నీల్లు లేవు నా కంట్లె
మొత్తుకునెతందుకు సత్తువలేదు నా ఒంట్ల

బరిసెలు గావల్సినోల్లు
నా కండ్ల ముందె కట్టెలవుతుంటె
వశపడుత లేదు

నిప్పులసుంటి కొడుకులు
నట్టింట్ల బూడిదైతుంటే
పానమాగుతలేదు

ఎండిన రొమ్ములకెల్లి
జీవం పిండి పోసిన
సేతికందకుంటనే ఎల్లిపోతర

బాంచెననిపించుకున్నోన్ని
బందకు కొట్టందే బతుకు సాలిస్తర

బిడ్డలాల మీరెందుకు సావాలె
బతికెటందుకు హక్కు లేనోల్లు
బాజాప్త తిరుగుతుంటె

లేత మోదుగాకులసుంటోల్లు
మీరెందుకు ఎండిపోవాలె
పచ్చని మామిడిపిందెలసుంటోల్లు
మీరెందుకు రాలిపోవాలె
నీల్ల మీద వెలుగసుంటోల్లు
మీరెందుకు మాయమవాలె

బిడ్డలాల ఆశ విడవొద్దు
బతుకు మీద భరోస ఇడువొద్దు
నేల మీద కాల్లు గట్టిగుండాలె

నా పెయ్యి మీద తేలిన నరాలు చూడుండ్రి
ఉబ్బిన నరాలల్ల పొంగిన పోరాటం చూడుండ్రి
గన్నుల తోటి కొట్లాడి గెల్చిన
మనోల్ల రేషం చూడుండ్రి

మీరెందుకు బిడ్డా
కోడెలాగసుంటి మీ వయసుని
పానంలేని కట్టెను జేస్తరు.
ఎర్రటి కొలిమసుంటి మీ కోపంమీద
సావునీల్లు జల్లుతరు

బిడ్డలాలా తాల్లు పేనింది
మీ కుతికెల కేసుకునెటందుకు గాదు
మనని తొక్కే మదపుటేన్గుల్ని
కట్టి నేలకొట్టేతందుకు

గాసునూనె దబ్బాలు మీ మీద పోసుకుని
నిండు పానం తీసుకునెటందుకు గాదు
మనకున్నదంతా ఊడ్సుకున్న

బడాచోర్లను నడి బజార్ల
నిలబెట్టి భగ్గుమనిపిచ్చేటందుకు

రాంధ్రీ బిడ్డలాల
ఒక్కటవుదాం ఒక్కటిగుందాం
చేతులొక్కటి చేసి చప్పట్లు కొడదాం
'జీవితం జిందాబాదని'

మాటలొక్కటి జేసి
మంటిని మింటిని ఒక్కటి చేద్దాం
'చరిత్ర మనదేనని'

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 1, ఫిబ్రవరి 2010*

# జర మద్దతు పలుకరాదేయన్న?!

● ఎన్. లోహిత్ వెంకటస్వామి

సోదరా! సోదరా!
బహుజన అడుగులు అభ్యుదయ
అంచుల్లోకి పయనించాలంటే
వంచన పొంచివుందన్న
నీ ఆవేదన, ఆలోచనల్ని
అవగతం జేసుకుంటిని గానీ,
విభజన జరిగిననూ జీవన ప్రమాణం పెరగదన్న
నీ మాట తగలగానే
పంటిలో రాయిలా, కంట్లో నలుసులా
కాలికి ముల్లులాగా ఏకంగా మనసులోనే ముల్లు
దశాబ్ధాలుగా దుఃఖ్ఖేరువై
దశ దిశలా విన్పిస్తున్న
నాలుగున్నర కోట్ల ప్రజల
ఆకలి కేకలు, ఆత్మ ఘోషలు
నీవెందుకు ఆలకించలేదన్నా?
తెలంగాణ ప్రజాస్వామిక డిమాండని
అది మా ప్రజల గుండె చప్పుడని
ఏల నీకు ఏరుకలేదన్న?

మా గడ్డ పోరాట ఆరాటలన్నీ
నిస్సందేహంగా ప్రజలవే!
అటో ఇటో తేల్చుకోలేని
గోడమీద పిల్లి పార్టీలు
పంచెలు తడుపుకుంటున్నాయి

ఐక్యత లేకనే ఒరిగింది గతం
ఆత్మవిమర్శలోనే అనైక్యత ఖతం
ఇది నమ్మిన పోరాట శక్తులు
కొత్త పంథాలో... సరికొత్త సారథ్యంతో

దళిత బిడ్డకు దొరతనంగా
బానిస జీవితాలకు విముక్తిగా
'ఉరిసిల్ల' తిరిగి సిరిసిల్లగా
బొగ్గుబాయిల నల్ల బతుకుల్ని
శాశ్వత సూర్యోదయంగా దగాబడ్డ మట్టితల్లి మేనిపై
కృష్ణా గోదారమ్మల జలాభిషేకంగా
అస్తిత్వం లేని మా అనాథ సంస్కృతి
ఆకాశాన్ని ఎత్తి చూసే తలగా
హక్కు స్వేచ్ఛలు నూరు శాతం
అనుభవించే అవకాశంగా సర్వం సువర్ణ తెలంగాణ
రూపు దిద్దుకోవాలని తపనపడే
పట్టువిడువటమెరుగని
మా ఉద్యమ శక్తి కదు ప్రజ్వరిల్లాలని
ముందుగా కోరుకోవాలే యన్నా!
ప్రత్యేకమై విడివడితే హక్కులాసాంతం సొంతమైతే
ప్రతి బడుగు వడిగా ఎదుగుతరన్నా!
దుఃఖాన్ని దున్ని పోసుకుంటూనే
ప్రత్యేకోద్యమాన్ని నెత్తికెత్తుకున్న
మా జిందగీల్లో రోష్నీ కోరే
చందమామ లాంటి అన్నా!
జర మద్దతు పలకరాదే!
తెలంగాణ మొస్తే నీకు సలాములు జేస్తాం
నీ గుండె గులాములమవుతాం

*అక్షరం, సూర్య, సోమవారం, 1 ఫిబ్రవరి, 2010*

# తెలంగాణ నాటకం -2

● వంశీకృష్ణ

దృశ్యం 1
కేంద్ర హోమ్ శాఖ
అను తెలంగాణ నిర్ణాయక నాటక సమాజం
రాష్ట్ర మిచ్చినట్టు భ్రమింపజేయును
అఖిల పక్ష సమావేశము
అసెంబ్లీ తీర్మానము
విరమించిన నిరాహార దీక్ష
అభినందన సభకై ప్రతీక్ష
మనసంతా సముద్రమంత ఉద్వేగం
సోనియా తోవ ఎక్కడ

దృశ్యం 2
భ్రమ కాదు ప్రకటన నిజంగా వెలువడును
అస్తిత్వ రాజకీయాలు
నా తెలంగాణా నా కివ్వండి
సమైక్యవాద ప్రకంపనలు
హైదరాబాద్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీలెవ్వరు?
ఫిల్మ్‌సిటీ వెలుగులకు పెట్టుబడులెవ్వరివి?
ఒక్క రాజీనామాతో
విధేయతల బదలాయింపు
22 అంగుళాల బుల్లితెరమీద
పడిలేచి, లేచి పడే రంగు రంగుల గోడలు
గెలుపు గుర్రం నాదేనని బుకాయింపు
గాయపడిన చీకటి ప్రసరించే వెలుతురెక్కడ?
"తమసోమా..తెలంగాణ హతమయినదయా

దృశ్యం 3

కేంద్ర హోమ్ శాఖ రద్దు కోరుతూ
ఒక పిటీషన్ దాఖలయ్యింది
ప్రకటనలని నిషేధిస్తూ ప్రజలంతా తీర్మానించారు
అస్తిత్వమూ..అధికారమూ
రెండు కళ్లుగా సాగే ఒకానొక ప్రహసనంలో
అధికారానికే మా ఓటు

దృశ్యం 4

ఆత్మహత్యల కన్నీటి యజ్ఞం మొదలయ్యింది
"నేయి వోయ భగ్గున దరికొన్న భీషణ హుతాశన కీలయనంగ
విద్యార్థులు సమిధలయ్యారు
చంద్రశేఖర సోమయాజికి
ప్రజలు చెప్పని పాఠాలు రెండు
చరిత్ర రాయని వీలునామాలు రెండు
మూడు కోతుల కథ ఒకటి మూడు చేపల కథ ఒకటి

దృశ్యం 5

రంగ స్థలం మీద గార్ధభాండం పగిలింది
ప్రేక్షకులు అంధులయ్యారు
పాత్రదారులు సూత్రదారిని మింగేశారు
నాందీవాచకం పలకకుండానే భరత వాక్యం చెప్పేశారు
యవనిక భగా భగా మండుతోంది
నాటకం అర్ధాంతరంగా ముగిసింది

దృశ్యం 6

కొన్నాళ్ల తర్వాత, మరో రూపంలో
మరో సీక్వెల్ మొదలవుతుంది.

*( ఈ నాటకం మొదటి భాగం 1969 నాటి తెలుగు దినపత్రికలలో చదువుకోగలరు)*

*వివిధ, సోమవారం ఆంధ్రజ్యోతి, 8 ఫిబ్రవరి, 2010*

## ప్రశ్న

• కృష్ణుడు

నీ పాదాల క్రింద మట్టి
చెప్పింది నీ ఉనికి
గాలి నిన్ను తాకింది మృదువుగా
నీవు నాతో ఉన్నావని

నీరు తీర్చింది నీ దాహం
నన్ను యాద్ చేసుకోమని

నిన్ను చూసింది ప్రతి చూపు
నాలో చూపు కలపమని

కరస్పర్శలో తేలింది
నెత్తుటి వేడిమికి కారణం
నడుస్తున్న రహదారి అంతా
నెగళ్ళతో చిటపట మంటోంది

కళ్లలో ప్రశ్న కరచాలనంలో ప్రశ్న
నీటిలో ప్రశ్న గాలిలో ప్రశ్న
రహదారిలో ప్రశ్న

ప్రశ్నార్థకమైన దేహంతో
ఇంట్లో అడుగు పెడితే
మరణ శయ్యపై ఉన్న
అవ్వ అడిగింది బిడ్డా ఇస్తరా ...లేదా....

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 15 ఫిబ్రవరి, 2010*

# అంతా తెలంగాణ పుణ్యం

• చందనం శ్రీకాంత్

మా నేతల్ని సూద్దమన్నా దొరికేటోల్లు కాదు
వాల్లకు మేమసలు యాదికొచ్చేటోల్లమే కాదు
మా పని ఓటేసుదుమందమే
మేం గెలిపిచ్చినోల్ల ముంగట
నిన్నమొన్నటి దాక
ఎందుకూ పనికిరానోళ్లమే
ఆల్ల గలమల నిలసునేతందుకు సుత
అక్కరికి రానోల్లం

గిప్పుడు జూడు అంతా తెలంగాణ పుణ్యం
రాష్ట్రం ఎప్పుడత్తదో గాని
మావోల్లంతా ఒక్కటైంద్రు
ఆల్ల గలమల నిలుసునెతందుకు బయపడుదు గాదు
ఆల్లను గలమలకెల్లి బయటకు గుంజతుంద్రు
రాకుంటె మంచిగుండదని
అట్లే వచ్చెటట్టు జేయవట్టింద్రు

అయింత శేతుల్లకెల్లి జారిపోగిట్టని
కదర్ కరాబుగాదిక్కనని
ఆల్లు మాతోని వచ్చి మాటగలపవట్టింద్రు
కలిసే కష్టాలు తీర్చుకుందమని నచ్చజెప్పవట్టింద్రు
ఉద్యోగాలొత్తయ్ నీల్లు గూడ వత్తయని
సల్లనిమాట జెప్పవట్టింద్రు
అంతా తెలంగాణ పుణ్యం

ఏమైతె అదైంది ఇప్పటిదాకా
అన్యాయమైతె ఐంది గాక
మాకిప్పుడైతె మస్తు కుష్
గంజి బట్టలేసుకుని కార్లల్ల తిరిగినోల్లంత
గిప్పుడు నడెండలో మా తొవ్వవట్టింద్రు
మేమేడుంటె ఆడ సడక్‌మీదనే కూసుండవట్టింద్రు
మా కోసం గంటె బువ్వండి మాతో కుసోని తినవట్టింద్రు
అంతా తెలంగాణ పుణ్యం

ఊరూర్ల జరిగే లొల్లికి
మా పోరల్ని ముందుంచవట్టింద్రు
ఎవలన్న సచ్చిపోతె వచ్చి కన్నీల్లు కార్చవట్టింద్రు
ఆల్లు వోతే నేను లేనా
అని ఓదార్చవట్టింద్రు జై తెలంగాణ అనుకుంట
మా గొంతుల గొంతు కలుపవట్టింద్రు

గిప్పుడిగ మడి ముట్టుడు లేదు
గా కులం గీకులమని అనుడు లేదు
చిన్నోల్లు, పెద్దోల్లని వేరు జేసుడు లేదు
బట్టలు నల్లగున్నయని దూరం బెట్టుడు లేదు
అందరం ఒక్కటైనం
మా నేతలంత శెయిల శెయిలు కలుపుతుంద్రు
అన్నదమ్ములమని అలుముకుంటుంద్రు
ఇగ ఇట్లనేఉండాలె
ఎప్పటికి కలిసే ఉండాలె
అంత తెలంగాణ పుణ్యం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 22, ఫిబ్రవరి, 2010*

# బిగ్ బ్యాంగ్

• *చింతం ప్రవీణ్*

ఒక్కసారి చరిత్రను పొక్కిలి చేద్దాం
మా నెత్తురును
ముడి సరుకుగా
యంత్ర భూతాలకు ఎరవేసి
నీ తరతరాలకు తరగని ఆస్తిని
పోగేసినవ్

మా వృత్తులకు
ఉరితాళ్ళు పేని
ఏండ్లకేండ్లు వెట్టి చేయించి
టన్నుల కొద్ది శ్రమ దోపిడి చేసినవ్

మా చెమటని ఎరువుగా మార్చి
మీ పంటపొలల్లో పారించి
పచ్చని నోట్లను పండించుకున్నరు
మా కన్నీటిని
ఆవిరి చేసి మీ వెకిలి నవ్వులతో హింసించి
పైశాచిక ఆనందం పొందిండ్రు
అయినా మీ ఇండ్లకి దర్వాజలైనోళ్ళం
మీ పంటలకి కంచెలయినోళ్ళం
మీ విందులకు కంచాలైనోళ్ళం
మీ కుట్రలకు సమాధులైనోళ్ళం
ఏండ్లకేండ్లు మా రక్తపుకూడు తిని
మా చెమటను తాగిండ్లు
గిప్పుడు సామాజికం
అనంగనే సంగం సచ్చిపోతున్నవేంది దొర

మీకు బానిసలుగానే ఉంటమని
మాతో కలిసి మా భావితరాలను
బాండు పేపర్ రాసిమ్మంటరా!
మాకు స్వేచ్ఛ రాజ్యాధికారం కావాలంటే
మీ రాజరికం పోతదని రంది తలిగిందా?

బాంచెన్ అన్న ఒక్కోక్షణమే
మా ఎరుక మేం చేసుకుంటున్నం
నీ గురించి కూడా తెలుసుకుంటున్నం
ఏం బుగులైతుందా? అవును మల్లా!
నోటికి ముంతా ముడ్డికి తాటాకు సిద్ధాంతం
మీ మీద అమలు
చేసే అద్భుతకాలం ఇప్పుడే కండ్లు తెరుస్తోంది

ప్రజాకళ.ఓఆర్జి. మార్చి, 2010

# షాయరీ

● స్కైబాబ

కవిత్వం
పొందిచ్చిన వాక్యాల విచ్ఛిత్తి
పేర్చిన పదాల మధ్య అలజడి
ఎగిసే అక్షరాల ఆందోళన
కవిత్వం - ఉద్యమం పర్యాయపదాలు

కవిత్వం - జొన్నరొట్టెల రుచి
నోట్లో ఊరే పచ్చి చేపల పులుసు
బీద బతుకుల ఆసరా
అంబలి - సంగటీ - గట్క
జీవ గంజీ హైదరాబాదీ బిర్యానీ

కవిత్వం- బోనం ఎత్తుకున్నది
బోనం మట్కీల
మధ్య శిగమూగుతున్నది
రంగు రంగుల
పూలన్నిటిన్నీ ఒక్కటిచేసి
బతుకమ్మ ఆడుతున్నది

అస్సోయ్‌దులా పాడుతూ
నిప్పుల గుండం తొక్కుతున్నది
రోడ్డుమీదే సహపంక్తి
భోజనమయ్యింది
కవిత్వం - గోడమీద
నిలువెత్తు కచ్చా స్లోగన్
దండుబాట మీద సబ్బండ

జాతుల కోలాటం
వాగ్గేయకారుడి
నాలుక చివరి వాయువేగం
కణకణ మండే
డప్పు సూర్యుడి మీద
చిందేసే చిర్రా చిటికెన పుల్ల
ఉద్యమకారుడి కంటి ఎరుపు -
లేచిన పిడికిలి
జవాన్ల కరకట్టల్ని
ఛేదించే జన ప్రళయం
ఉద్యమ ఉత్ప్రేరకమైన
చదువుల బడి
ఎగుస్తున్న విద్యార్థులే జెండాలు
కాలబడుతున్న ఒంటిలోంచి
సానబట్టిన కత్తిలా
దూసుకొస్తున్న నినాదం
మనసున్న కన్నులోంచి
దూకుతున్న అశ్రుకణం
అవును
కవిత్వం ఇవాళ తెలంగాణ

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 22, మార్చి 2010*

# ఏ ఉగాదికి పాడలేని కోకిలలు

• మసన చెన్నప్ప

ఉగాది అనగానే
వసంతం అనగానే
మామిడి చిగుళ్లూ
కోకిలలూ గుర్తుకొచ్చాయి
గొంతు జీరవోయి కోకిలల్ని
తలుచుకుంటే కన్నీళ్లొచ్చాయి
కాకులతో ఎదురైన కష్టాలకు
కోకిలలు దిమ్మెరపోయాయి
ఆత్మగౌరవం కోసం
ఆరాటపడే కోకిలలు
ఆత్మహత్యలకు పాల్పడుతున్నాయి
ఆ కాకులు ఐదు దశాబ్దాల కంటే ముందు
గోడవతలే ఉన్నవి
అన్య జాతి పక్షులతో
అవి కలిసి వున్నా
అడపా దడపా అరస్తూనే ఉన్నవి
అరిచి అరిచి చివరికి వేర్పడ్డాయి కూడా
అంతటితో ఆగావా?
అసలు కథ ఇక్కడే మొదలైంది
గోడివతలకి దూకాలని విశ్వ ప్రయత్నం చేశాయి
తామున్న చెట్టు సముద్రానికి దగ్గర్లో ఉంది
పెద్దగాలి వీచినా, తుఫానువచ్చినా
గూళ్ళు చెదిరిపోతాయని వాటి భయం
కనుకనే ఇవతలి చెట్టు మీద

వాటి కన్ను పడింది
అక్కడ కోకిలలు
వందల యేళ్ళుగా కష్టాలు పడుతున్నాయి
వగరు చిగురులునేస్తూ
గళాలను పాట కనకూలంగా మార్చుకున్నది
కాని ఏ వసంతమూ పాడనిస్తేనా?
అవతలి చెట్లు ఎప్పటికప్పుడు
చిగురిస్తూ పుష్పిస్తూ ఫలాలిస్తుంటే
కాకులకడుపు తరుక్కుపోయింది
తెల్ల కాకులతో
దోస్తీ వల్ల దోచుకునే తెలివితేట లొచ్చాయేమొ!
ప్రతిదాన్ని వ్యాపారంగా మార్చే ప్రతిభ వాటిది
కాకులు గ్రద్ద దగ్గరికి వెళ్లాయి
కావు కావుమని గోల చేశాయి
కాకుల గూళ్ళల్లో కోకిలలు
గుడ్లు పెడుతాయని సామెత?
కాని సామెత మారిపోయింది
కోయిల గూళ్ళలో కాకుల గుడ్లు
యాసలో తేడాలున్న భాస ఒకటేనని అబద్ధాలాడాయి.
గొడవలు లేకుండా గోడ కూల్చేసి
ఇవతలి చెట్టుమీద గూళ్ళు కట్టుకునే అవకాశమిస్తే
అందరం చాలా అభివృద్ధి
చెందుతామని ఊదరగొట్టాయి
కాకుల లాబీ ఫలించింది
గద్ద వద్దనలేక పోయింది తనకున్న అధికారంతో
అప్పుడే స్వేచ్ఛా జగత్తులో అడుగుపెట్టిన
కోకిలల్ని పిలిచింది
మీ ఇద్దరి భాష ఒకేలా ఉంది

కలిసి ఉంటే కలదు సుఖం అంది
నాలుగైదు ముసలి కోకిలలమీద
మత్తుమందు చల్లింది తెలివైన గద్ద
ఒప్పందం మీద సంతకాలు చేయించిందాక
నిద్రపోలేదు అవతలి కాకులు
ఏలాగైతేనేం
కాకుల కోరిక నెరవేరింది
క్రమంగా ఇవతలి చెట్టుమీదికి
వలసలు మొదలయ్యాయి
ఇష్టం లేకపోతే విడిపోవచ్చుని
గద్ద ఒక పత్రం కూడా రాసిపెట్టింది
ఒప్పందాలు జరిగాయి
ఒప్పందాలు తుంగలో తొక్కి
గంగలో మునగడం కాకులకలవాటైంది
నీడనిస్తే చాలన్న కాకులు
పూలను చిదిమేశాయి
కాయలు తుంచేశాయి
అంతటా అధికారం చెలాయించాయి
'కూహూ' అంటే గద్దకు చెప్పి
కోకిలల నోరు మూయించాయి
ఇప్పుడు ఇవతలి చెట్టు కాకుల వశమైంది
అవి పెట్టిన భోజనశాలల్లో
కోకిలలు తినాల్సిన దుర్గతి పట్టింది
అన్ని రంగాల్లో వాటి ఆధిపత్యమే
సచివాలయం కల్పతరువనుకొంటే
సచ్చినా అక్కడొక కోకిల కనిపించదు
సర్వీస్ కమీషన్ పారిజాతమనుకొంటే
అక్కడా ఒక్క కోకిలా కూయదు

శిల్పారామాన్ని అల్పారామంగా మార్చినవి కాకులే
ఆకాశవాణిలో అన్ని టీవి ఛానళ్లలో
అవే కాకులు
బ్రతక లేని కోకిలలు
గద్ద చెప్పినట్లు విడిపోదామంటే
గద్దిస్తున్నాయి కాకులు
అసెంబ్లీ వేపచెట్టు మీద వాలిన
కాకుల సంఖ్య ఎక్కువే
నిజం మాట్లాడితే కోకిలలమీద
రెట్టవేస్తున్నయ్ కాకులు
ఇక్కడి కోకిలలకు
కడుపు కోతే మిగిలింది
కళ్లెండిపోయి
కనురెప్పలు బరువయ్యాయి
చెరువులెండిపోయి
కప్పలే కరువయ్యాయి
మా చెట్టు మాకు కావాలని
ఎత బ్రతిమిలాడిన కాకులు కాదంటున్నవి
ఇన్నాళ్ళు కలిసున్నాం కనుక
ఈ చెట్టు మాదే అంటున్నాయి
ఆశ్రయమిచ్చిన చెట్టుకు
కృతజ్ఞత చూపని కాకులు
చెట్టునే వెక్కిరిస్తున్నాయి
కోకిల మధ్య తగాదాలు పెట్టి
పబ్బం గడపాలని చూస్తున్నాయి
ఎన్ని ఉగాదులొచ్చినా
ఇక్కడి కోకిలలు తియ్యగా పాడడం లేదు
ప్రాణలకు తెగించి పోరాటం మొదలెట్టాయి

ఊరు వాడా అంతటా ఉద్యమించాయి
సత్యమే గెలుస్తుందని ఆశతో ఉన్నాయి
ఇంతలో కేంద్రంలో గద్ద వారసులు
విడిపోవడం తప్పదని
ఇవతలి చెట్టు కోకిలదేనని ప్రకటనచేశాయి
అర్ధరాత్రి వచ్చిన ప్రకటనకు
ఒకటే కాకిగోల
కాకుల ప్రసారమాధ్యాలు
బాకాలూదాయి
నిన్నటి దాకా మీకు భాషే రాదన్న కాకులు
ఇవ్వాళ మనదొకటే బాసని బుకాయిస్తున్నాయి
మన జాతి ఒకటే అని కూస్తున్నాయ్
అవతల ఇవతల
అంతటా తామే అధికారంలో ఉండాలనేది
కాకుల పన్నాగం
మొదట రాసుకున్నట్లు
ఎప్పుడంటే అప్పుడు విడిపోవడం
న్యాయం కాదంటున్నాయి
ఇంతకాలం కోకిలల్ని దోచుకొని
బలిసిన నాల్గెదు కాకులవల్లనే చిక్కొచ్చింది
అస్తిత్వం కోసం, ఆత్మ గౌరవం కోసం
ఆరాటపడుతున్న కోకిలలు
ఆత్మహత్యలుకు స్వస్తి పలకాలి
యుద్ధంలో శత్రువుల్ని
ఎదిరించే నీతిని అనుసరించాలి
తమ చెట్టు తమకు దక్కేదాకా
పోరాటం సాగించాలి

*నేటినిజం, ఏప్రిల్ 2010*

# బాల్యమిత్రుడి ఫోన్ కాల్
# (వరంగల్ నుండి)

● కోడూరి విజయకుమార్

గీనడుమ నువ్ వొచ్చుంటే
మన వరంగల్ సూశి పరేషాన్ అయ్యేటోనివి
1969 సంగతి గంత లొల్లులు లేవని
పెద్దోల్లందరు అంటున్నరు
బట్టలు గుట్టె మేరోల్లు, బుట్టలల్లె మేదరోల్లు
మాదిగోల్లు, మాలోల్లు
కోమట్లు, బాపనోళ్ళు, తుర్కోల్లు
అందరికందరు రోడ్లమీదకొచ్చి ఊరేగింపులు దీస్తున్నరు

పోచమ్మ మైదాన్, హన్మకొండ చౌరస్తా,
వరంగల్ చౌరస్తా, నక్కలగుట్ట, ఎక్కడ సూడు
రోడ్లమీదనే బతుకమ్మలు ఆడుతున్నరు
పోలీసోల్లకు గూడ ఏం జేయాల్నో సమజైత లేదు.

టీచర్లు, డాక్టర్లు, ఇంజినీర్లు, లాయర్లు,
సదువుకున్నోల్లు, సదువు లేనోల్లు
అన్ని రంగుల పార్టీలోళ్ళు
అందరు ఒక్కటైన్రురా నాయినా...!

ఎవ్వలినెవ్వలు బలవంతం జెయ్యలే
గదువలు బట్టుకుని బతిమిలాడలె
యియ్యాల యిక్కడ యిది అందరి తండ్లాట

యిన్నేళ్ళ సంది కలిసుంటె
మన పొలాలల్ల మన్ను బోసిరి

మన మాటల బట్టుకొని బనాయించరి
యిగనన్న మన జాగల మనం బతుకుదామంటే
వాళ్ళ కండ్లల్ల నిప్పులు బోసుకోబడితిరి
'యిది మీదెట్లయితది'.....'అది మీదెట్లయితది'
అని నఖరాలు జేయబడితిరి...
మేమే గరీబోల్లమై పోయినం' అని
ఉల్టాచోర్ మాటలు జెప్పబట్టిరి
నువ్వే జెప్పు..గవర్మెంటు ఆఫీసులల్ల
అటెండరు నుండి ఆఫీసర్ దాక మనోల్లెందరు?

యియ్యాల యిక్కడ లడాయి షురువయిందిరా నాయినా
యిగ యిది అడిగేది గాదు... ఆపెడిదిగాదు
గద్దెల మీదకొచ్చిన సమ్మక్క సారలమ్మలు
యిగ ఇప్పుడప్పుడే అడవిలకు పోయేటిది లేదు

***ఆదివారం వార్త, ఏప్రిల్ 2010***

# దొంగాటకం..

• వఝుల శివకుమార్

కలయికలన్నీ కలయికలుకావు
రెండు భిన్న ధృవాలమధ్య కలయికకు
సంకీర్ణరాగం సాధనంకాదు
పొంతనలేని పోహళింపులో
పదమూబతకదు పలూకూబతకదు
అసంబద్ధ పదాలకూర్పు
ఓ వైరి సమాసం

సఖ్యతలేని చరణాలతో
"పాలకుల పల్లవి" కోసం కూర్చిన పాట
ప్రణవంగా ఎలా బతుకుతుంది?
పదాలు పదాలే
అవి తోటలో పూలలా
గుండెగొంతుకలకు పూస్తాయి
జన్మసాఫల్యం కోసమే ఊపిరిపోసుకుంటాయి
అవకాశవాదాలే పదాల్ని స్థానభ్రంశం చేసి
వక్రభాష్యాలకు తెరలెత్తుతాయి
పలికే నోటినిబట్టి
పదాలు పూలౌతాయి ముళ్ళౌతాయి
తలపుల్లో విషాన్ని తలల్లోకెక్కించడానికి
పదాలు వాహకాలౌతాయి

అన్ని దీక్షలు 'ఆమరణాలు' కానేరవు
రాత్రికిరాత్రి లగెత్తుకు పారిపోయే 'దీక్ష'
ఉద్యమంపేర ఉల్లెక్కాల ఆటౌతుంది

బతుకు మరణంకంటే దుర్భరమౌతున్న చోట
ప్రాణాలు పాచికలౌతాయి
ద్రోహంనించి విడివడి
స్వతంత్రంగా బతకాలనుకునే ఆకాంక్షలకు
గర్భశోకాలుమిగులుస్తూ
పాలకపక్షం 'వ్యూహాత్మక మౌనమౌతుంది'....

చరిత్రకు తెలుసు
నెత్తురంటిన పుటలవెనక
రాత్రికిరాత్రి తలెత్తిన
కుహనావాదం కుట్రౌతుందని
నినాదాలు అలవోకగా పుట్టవు
అవి కనలినపేగుల్లోంచి పెల్లుబుకుతాయి

ఒకసారి ఆశ్రయమైనందుకే
జనం పాట అనాథైంది
జనం బాట ముళ్ళదారైంది
రెక్కకీ డొక్కకీ మధ్య నోట్లపరదాకట్టి
దురద తీర్చుకుంటున్న ఒక వర్గం
శవాలమీంచి దాటిపోతూ
జీవచ్ఛవాలకు
సమైక్య స్వర్గాల
ఎండమావుల్ని బహుకరిస్తుంది

నగ్న సత్యాల్ని అర్ధసత్యాలుగా
చూపిస్తున్న దొంగాటకం
ఆశయాల్ని అణచి వేసే
భాషకోసం వెతుకుతుంది

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 2, మే, 2010*

# యోధుడు మరణించరాదు

● సంగెవేని రవీంద్ర

గమ్యం స్పష్టమైనపుడూ
ఉద్యమించక తప్పనప్పుడు
ముద్దాడాల్సింది మృత్యువుని కాదు
తీసుకోవాల్సింది ఊపిరినీ కాదు...
ఈ యుద్ధభూమిలో నువ్ పోరాడేది
ఆయుధాలతో కాదు సందిగ్ధాలతో...
శ్వాసకు శిలు వేసుకుంటే
మా ఆశల పల్లకినీ మోసేదెవరూ...
దగా పడ్డ వెలుగులకు కాంతినిచ్చే నీ కళ్లు
లక్ష్యసిద్ధిలో రక్షణ కవచాలవ్వాలి కానీ
రేపటి స్వేచ్ఛను కప్పివేసే మట్టికుప్పలవ్వొద్దు...
జారిపోయిన ప్రతి ప్రాణం.
రాలిపోయిన ఒక కిరణమే...
సూర్యున్ని వెలివేసిన ఊరిలో
ఉరికంబాల్ని పెంచకు...
దేహదేహాలుగా ముక్కలైన స్వాభిమాన
వేదికల్ని మాకు మిగిలించకు
నెత్తురు చెమట కలిసిన కన్నీళ్ల పొలాల్లో
మొలకెత్తిన యోధుడివి...
నువ్ లేని ఉషోదయం
మాకు విషాదమే...
మాకు తెలుసు నువ్

స్ఫూర్తి పొందిన బాణాల పందిరివి...
నీకు తెలుసా నువ్
మా చేతికందిన అన్నం ముద్దవని...
ఉద్యమమంటే ఆత్మార్పణ కాదు...
అది జీవన వేదం ...
మనుగడ పోరాటంలో మునిగిపోయిన నువ్వు
మమతల గుడారాల్లో ఎడారుల్ని మొలిపించకు
నువ్వు బతకాలి...
రాత్రి అంచుల్నుండి తొంగిచూస్తున్న
కాంతి పుంజాల్ని సాధించాలి
ఎర్రజీరల నీ కళ్ల నీడలు
కోటి మెదళ్ళను కదిలించాలి
నువ్వు బతకాలి....
నువ్వు మోగించని రతనాల వీణ
నీ రాగాలు పలుకుతుంది గనక...

*వార్త ఆదివారం 2, మే 2010*

# నేను లేబరోన్నే...

● లింగకారి మహేష్

పాలమూరు లేబరోన్ని
నీవు ఎచ్చిడి జేసినా ఆ మాట నిజమే
నేను లేబరోన్నే పాలమూరు లేబరోన్ని పాలసొంటి
మనసు గలోన్ని గొడ్డులాగ పన్జేయడం తప్ప
గొంతెత్తడం తెల్వనోన్ని
మీ కాల్వల్ల పారే నీల్ల కన్న ముందు
నా సెమట సుక్కలు నింపినోన్ని
మీ బిల్డింగులకు, మీ ప్రాజెక్టులకు రెక్కలిర్గెటట్లు
రాళ్ళు మోసినోన్ని కాయకష్టం జేసి కడుపు నింపుకోవడం తప్ప
మంది కడుపుకొట్టే మోసబుద్ధి నేర్వనోన్ని
నేను పాలమూరు లేబరోన్ని
భూదేవంత ఓపిక గలోన్ని...అందుకే నీవు
మా కొల్వులకు మా పొరగాండ్లను దూరం జేసినా
పోనీలే అంతా మనోల్లే గదా అనుకుంటి
మా నీళ్ళు గుంజుకుని కన్నీళ్లు మిగిల్చినా
మన కర్మమింతేలే అని ఊకుంటి
మమ్ముల ఎచ్చిడి జేస్తున్నా.. మా బత్కులు ఆగం జేస్తున్నా..
ఎప్పటికైనా నీవు మార్తవని ఓపికతోని ఎదురు జూస్తి
యాభయ్యేండ్లుదాటె గాని నీలో మార్పు రాకపాయే
భూదేవి ఓపికెగ్గూడ హద్దుంటది
నా పలుగు నీ గుండెల్ల దిగుతది
నా పార నీకు బొంద తవ్వుతది

*ఆదివారం, ఆంధ్రజ్యోతి, మహబూబ్‌నగర్, 9 మే, 2010*

# సింహ గర్జన

• ఎన్.నరసింహశర్మ

తెలంగాణ వీరులారా
ఉక్కుపిడికిళ్ళై మొలవండి
చింతనిప్పుల్లా భగభగమండే
కళ్ల నుంచి ఉద్యమాల
గుళ్ళు కురిపించండి
కల్లోలంగా తల్లడిల్లుతున్న
తెలంగాణతల్లి గుండెల్లో
గునపాలు గుచ్చిన కిరాతకుల
ఆటలకు చరమగీతం పాడాల్సిన సమయమొచ్చింది
ఊళ్ళను బీళ్ళుగ మార్చిన వలస ఊసరవెల్లులను
తరమాల్సిన క్షణం ఇదే
గుళ్ళలో దేవుళ్లను మేల్కొల్పండి
గోడ మీది పిల్లుల్లాంటి
తెలంగాణ ద్రోహుల
పిరికితనానికి ఆత్మగౌరవమనే
విరుగుడు మందు పోయండి
తడారిపోయి ఎడారిగా
మారుతున్న తెలంగాణ
మాగాణాన్ని గోదారి కృష్ణమ్మ
నురగల తరగలతో
ధాన్యాల గాదెలను నింపండి.

*ఆదివారం, ఆంధ్రజ్యోతి, మహబూబ్‌నగర్, 9 మే, 2010*

# హైదరాబాద్ మేరీ జాన్

● ఆశారాజు

నా ఇల్లును కూల్చి
మాల్స్ కట్టిందెవరు?
నా వాకిట్లో
స్టూడియోలు నిర్మించింది ఎవరు?
నా గల్లీలను మాయం చేసి
కాలనీలు పెంచుకొన్నదెవరు?
దీన్ని కబ్జా అంటారా?
దౌర్జన్యమంటారా!

నా భాషను
బఫూన్లతో మాట్లాడించి
పరిహాసం చేసిందెవరు?
కళాఖండం లాంటి
నా హైద్రాబాదును
పచారు కొట్టులాంటి
బెజవాడను చేసిందెవరు?
దీన్ని కుట్ర అంటారా!
కుటిలమంటరా!

మేరే ప్యారే దోస్తో!
నాది అస్లీ హైద్రాబాద్
నవ్వు తీన్ పాంచ్ చెయ్యకు
తల్లిలాంటి నా గండిపేట నీళ్ళకు
అవమానం జరుగుతుంది
జెరా బచ్కే రహెనా?

సలాం కరేతో గులాం నహీ సమజ్ నా!

నా కాలి మీద
నీ కాలుపెట్టి తొక్కితే
నయాపూల్ నిద్రలేస్తుంది
ఆగే పీచే దేఖ్‌ఖే చల్ నా!
ఈ మోదే ఖతర్నాక్ మోదు!

బంతిపూల తోటలో
కంక్రీస్ పాయింట్లు పెట్టి
ఖూబ్‌సూరత్‌ను
కచ్‌రా చేసావు
నీ అచార్ పచార్ కో
మారోగోలి
నా బిర్యానీ తిని
దునియా ఖుషీ అవుతుంది
చార్మినార్ మీద
చుక్కలు దిగుతాయి
బస్సు బుకింగుల కౌంటర్లు తెరిచి
వెన్నెలను అమ్మేయకు
ఇది అత్తర్ నగరం
కంపు రాజకీయాలతో
బీమార్ పెంచకు!
దోస్తీ చేసినవాళ్లను
దోకా చెయ్యకు
ఇక్కడి జనాలది
బోళా గుణం
నా గిన్నెలనే తిని
నీ ఎంగిలి నీళ్ళను

నా ముఖం మీద కొట్టకు!
కరచాలనం చేసిన చేతిని
కపటంతో నరుకకు

చిర్నవ్వు లాంటి
ఇరానీ హోటళ్ళను లేపేసి
క్లబ్బులూ పబ్బులూ పెట్టావు
మలాయి చాయినీ
మాస్కా బన్నునీ
టిఫిన్ సెంటర్ల కింద తొక్కేశావు
షామియానాను పడగొట్టి
సంగీతాన్ని నిలిపేసావు

నన్ను నెట్టివేస్తూ నెట్టివేస్తూ
నేను నిలుచున్న నీడను లాక్కున్నావు
జరుగుతూ జరుగుతూ
చివరిమెట్టు దాకా జారాను
ఇప్పుడు ఉల్టా తిరుగకపోతే
నాకు బతుకు తెరువు లేదు
నా మ్యూజియంని
రవిక గుడ్డముక్కలమ్ముకొనే
మ్యాచింగ్ సెంటర్ చేసిందెవరు?
కాశ్మీరు బులాఖీలాంటి
నా ట్యాంకుబండును
పాపడ్లు కాల్చే
గాజుగుడిసెలుగా మార్చిందెవరు?
సంగీత కచేరి జరిగేచోట
రికార్డు డాన్సుల
సంస్కృతి ఎక్కడిది!

నా భాగ్యనగరం
తెలంగాణ కిరీటం కోహినూర్ వజ్రంలాగా
కొల్లగొట్టాలని చూస్తున్నదెవరు?
నా దివాన్‌ఖానాలో కూర్చుండి
నన్ను బయట నిలుచోబెట్టిందెవరు?
నా గోడమీది అద్దంలో
నీ ముఖం కనిపించడం మంచిది కాదు!

నా హైద్రాబాద్
సీతాకోకచిలుక
దాని రెక్కలకు కత్తులు కట్టి
కోడిపందాలు ఆడకండి
రాత్రి ముషాయిరా జరిగే వేళ
నీ బోరియా బిస్తర్
నా ఫలంగ్ మీద కనిపించొద్దు
అలాయి బలాయిని అర్థం చేసుకుంటే
గోలకొండ ఖుదాఫీజ్ చెపుతుంది
దయచేసి నా హైద్రాబాద్‌ను
సజీవ శిల్పంగానే వుండనివ్వండి
ప్రైవేటు సర్వీసుల
'అడ్డా'ను చేయకండి

నా జాగాలో నేను
షాయరీ రాసుకొంటాను
నీ జాగాలో నువ్వు
సినిమా బొమ్మలమ్ముకో!
నా హైద్రాబాద్‌ను
హైద్రాబాదుగానే వుండనివ్వండి

*పాగల్ షాయర్ కవితా సంకలనం, మే, 2010*

# అస్సోయిదూలాతో ఆడే నా రోజెన్నడో

● జూపాక సుభద్ర

ఓ పెద్దమనిషన్నట్టు
నేను కోటి రతనాల వీణ' నేమోగాని
కోటిగాయాల గడ్డను అనేది నిజం
యింకా సబ్బండ సమ్మక్క సారక్కలకు అడ్డానని
పోరాటాల సాల్లు బోసిన
పోషమ్మ మైసమ్మ వుప్పలమ్మ వూరడమ్మల
బిడ్డనని మాత్రమే తెలుసు
నా ఆడిబిడ్డెలు ఎండ కన్నెరగనోల్లు గాదు
ఏడు మట్టెల్ల కాలం పిల్లాది మారకాంచి
పోరుల పొర్లాడుతున్నోల్లు
గానాడెన్నడో సాయుధ పోరాటం
తుపాకులు బట్టి తూటాలు తొడుక్కొని
గడీలల్ల బరిబాతల బత్కమ్మ లాడిచ్చిన
దొరల కోరల్ని వొలిచినోల్లు
మిలట్రీ మిడతల దండు కండ్లల కారం ఫిరంగులు జల్లి
వూరావలికి వురికిచ్చినోల్లు
గియ్యాల పొట్ట తట్టల వెట్టుకొని బోతుంద్రు
రోడ్లకు కంకెరై బవంతులకు సిమిటై యిటికై
యిండ్లల పాసి పనై
బిడ్డలకు బుక్కెడు బువ్వ బెట్టలేక
అడ్డాల్నాడే అమ్ముకుంటుంద్రు
అడ్డాల మీద కుప్పబోసిన కూలి సరుకైతుంద్రు
బతికే సావైన కాడ అక్షరాల మెతుకులకు యాడికి బోదును
యెన్నెలై పారిన నా యేటి యెదలు సీకటి డొక్కలైనయి

సింగిడై పొంగిన నా గొలుసుకట్టు కలలు
సెద పురుగులు దిన్నయి
నా పల్లె సెట్టుకు ఆకు అంటుతలేదు
సిన్నబోయి కూకుండనీకి సిరిమల్లె పందిర్లు పాడైనయి
అదేందో నా పుట్కే మంచిది గాదు బేకార్ పుట్క
నన్నెవరు బుట్టించిండ్రో ఏమోగాని
ఏనాడు కడుపు నిండా దిని కండ్లార కునుకు దీయలే
నా గద్ద మీదికొచ్చినోడు సచ్చినా బోడెందుకో
యేడ లేని బెల్లంగడ్డలు నా తాన్నే వున్నయా
అగెపాయె బత్కనియ్యంటే
నన్నే అంగట్ల అమ్ముతుండ్రు తక్కెట్ల జోకుతుండ్రు
నా రూపురేకల్ని నామ రూపాలు లేకుంట నమిలి మింగుతుండ్రు
నా మట్టిల బతికి బట్టగట్టి కోట్లకు కోటలు గడుతుండ్రు
నా జాగ నాగ్గావాలంటె
'ఛత్' నీ యయ్య విడదీస్తున్నరు అని
సమైక్య రాగాలు రాజేస్తుండ్రు
గీల్లందర్ని మోసి మోసి మాదంతా కాయగాసిందిరా బిడ్డా
నా కడుపు నిండ నీళ్ళున్నయి
నా గుండె నిండా గనుల గరిశెలున్నయి
అయినా నా వూర్లన్ని వుపాసాలై వుంటన్నయి
గా పెద్ద మనుసులు సావ వాల్ల నెత్క కట్కపోను
బలిమీటికి బాసింగం గట్టి అడివిల ఆగం జేసిండ్రు
'కలిసుంటే కలదు సుకమని' నన్ను కల్లోలం జేసిండ్రు
నా బిడ్డెలు పిడికెడు బువ్వకు అడివిల అన్నలైతుండ్రు
మస్కట్ తొవ్వల్ల మరిగిపోతుండ్రు
గా పొద్దు నీ సెరని యిడిపించనీకి కొట్లాడిన నా పోరగాండ్లని
పిట్టలోలె కాల్చి సంపితే
గీనాడు కనిపించని కుట్రలు పెట్రోలై హత్యలు జేస్తూ

నన్ను సావుల రేవు జేస్తున్నరు
ఎన్నేండ్లున్నా వేరు దప్పది...ఎప్పటికైనా వలస పక్కల బల్లెమై
మేలుకొనే వుంట
వాడెన్ని సార్ల ధోక జేసిన సల్లారని బూడిదిని
వానికి నాలుగు గాదు నలభై తల్కాయలుండొచ్చు
నేను వూరూరికి నినాదమై వురుముతూ
ధూంధాంతో దిక్కుల్ని దుక్కు దున్నినా
వాని కమిటీ తంత్రాల తాయత్తుల్ల కాటగల్సిన
సూరుకు సెక్కిన సుట్టాకునైన పులి నోట్లె జిక్కిన పాలపిట్టనైన
నేను నేనుగ నిలబడందే
ఎల్లి ఎల్లమ్మ నర్సిగాడు నర్సయ్యలు కారురా బిడ్డలారా
నా పీడలకు పాడెగట్టి నాగడ్డ మీద నాకు
బొట్టువెట్టి బోనమండి అస్సోయిదూలాతో
దప్పుసప్పుల్లతో దండోరేసే నా రోజెన్నడో..

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 24 మే, 2010*

# తెగించి కొట్లాడుడే

• *తిరునగరి దేవకిదేవి*

ఆదినుండి అవమానలతో అణిచివేయబడ్డ అతివను నేను
నాదెప్పుడూ ఎడతెగని ప్రయాణమే
నా ఎడారి ప్రయాణంలో ఒయాసిస్సుల జాడ మృగ్యం
నిజాం కాలంలో అడబాషగా సర్వహక్కులూ కోల్పోయి
శ్రమతో పాటు శరీరాన్ని పరాయికరణ చేయబడినదాన్ని
ఆరు కాలాలు ఆరాటపడ్డ పట్టెడన్నానికి దూరమైనదాన్ని
పోరాడక పోయినా జీవచ్ఛవాన్నవుతున్నందుకు
అచ్చమాంబనై ఆయుధం పట్టినదాన్ని
పోరాటమే ఊపిరిగా వడిసెలతో
శత్రువును ఉక్కిరి బిక్కిరి చేసినదాన్ని
కారం ముంతలతో
కావరమెక్కిన శత్రువుల కాళ్ళకు బుద్ధి చెప్పించినదాన్ని
సంఘం కోసం పంటలక్కగా మంత్రసానిగా చాకలిగా
చలివేంద్రంగా సత్రంగా సమస్తమై శ్రమించిన దాన్ని
కానీ సోకాల్డ్ విమోచనానంతరం
దూరంగా విసిరి వేయబడ్డ యూస్ అండ్ త్రోని
కొత్త సీసాలో పాత సారాయిలా
నిజాం నిరంకుశ పాలనిపుడు కొత్త రూపాన్ని సంతరించుకుంది
పాలకులంతా వలసవాదులే
వాళ్ళ గంగిరెద్దులో ఎవరైతేనేం
ఎప్పుడూ నాకు మొండి చెయ్యే
పుస్తెకట్టినోడు తోడుగా సందట్లో సడేమియగా
పాలకుడూ నా యిల్లింటపు మొగుడే

నా ఆస్తి యావత్తూ వాడి పుట్టింటికే తరలింపు
నీళ్ళు లేక నిధుల్లేక అప్పులందక నా రైతన్న ఆత్మహత్యకు
ఎక్స్‌గ్రేషియా ఎగ్గొట్టివేతలగ్గానూ
నేనిపుడు అక్రమ సంబంధం అంటగట్టబడినదాన్ని
కోట్లకు పడగెత్తిన సీమాంధ్ర కుబేరులకు
బంజారాది గుట్టలను కట్టబెట్టి
మూసీనది మురికి కాల్వపక్కన
నా ఆరోగ్యాన్ని సమాధి చేసుకున్నదాన్ని
వలస కూలీల కబ్జా పెత్తందారీతనంలో
మాతృత్వమే ఫణంగా అంగట్లో కన్నపిల్లల నమ్ముకొంటున్న దాన్ని
కాకుంటే శరీరమే పెట్టుబడిగా
వ్యాపారం కొనసాగిస్తున్న దాన్ని
ఆంధ్రుల దురాక్రమణలో అడవి మాయంకాగా
కాగితబ్బుతుకమ్మై ప్రవేశించిన
కోస్తాంధ్ర భాషా యాసా సంస్కృతులే
అసలు సిసలైనవని భ్రమింప చేయబడినదాన్ని
అభద్రతకు లోనైన నా పిల్లల ఆత్మాహుతులతో కడుపుకోత
శిశుపాలుడి తప్పులనధిగమించి
నీ దుర్మార్గాలు తారాస్థాయిలో అనుభవిస్తున్నదాన్ని
ఇంకానా ఇకపై చెల్లవు
అపర కాళికనై తెగించి కొట్లాడుడే తెలంగాణ వచ్చేదాక

*గాయాలే...గేయాలై! మే 2010*

# పల్లె తల్లి గుండె సప్పుడు

● హిమజ

పిల్లగాండ్లు మీరు కండ్లల్ల కనపడ్తున్నరు
ఒక్కసారి మనదేశం రాంఢ్రిరా కొడుకా
ఈడికస్తె ఆళ్ళకు ఆడున్న సౌలతులుండయి
సయిమాటే గని, పట్నంలనన్న వుండవచ్చు మీరు
పదేండ్ల కింది మీరచ్చినప్పటి లెక్క లేదు
మన పట్నమిప్పుడు

మన పల్లెకు రోడ్డు పడక పోతేంది
పట్నం రోడ్లమీద రోడ్లచ్చినయిప్పుడు
వూర్లె కరెంటు ఇస్తేంది ఇయ్యకుంటేంది
ఈడ రోడ్లనిండ లైట్లే యాలాడుతున్నయి

మనూర్లె మనింట్ల బాయిలన్ని ఎండుక బోయినయి
పట్నంలనైతే పోంటెన్లు ఒక్క తీర్గ సిమ్మిచ్చిపోస్తయి

అయినా వూర్లల్ల వుండనీకి
పట్నం సుట్టు మన పల్లెలు యాడున్నయిప్పుడు

ఫిలిమిసిటీలట రింగు రోడ్డులంట
హైటెక్కులట ఏంటేంటియో గిరివి బెట్టి
మీ దేశం దిక్కునుంచె
మస్తు పైసల్దెచ్చిన్రట మిత్తికి
రాన్రాను గదేందో సింగపూర్లెక్క
జేస్తరట మన పట్నాన్ని

పైసపెడ్తె దునియ గనపడ్తుందిర కొడుకా
కడుపుల ఎత దించుకుందమంటె
సాయం బట్టెటోళ్ళు కనపడ్తలేరు-
నా జీవునమున్నంతల
ఒక్కసారి అచ్చిపోంఢ్రిరా
ఈడనే మన మూలాలున్నయి
ముచ్చట్లున్నయి
బోనాలున్నయి
బతకమ్మలున్నయి

ఇప్పుడు పల్లెతల్లి
అన్ని దిక్కుల కొట్టుకుంటున్న గుండెకాయ
తల్లి పేగు మిమ్ముల తర్లిరమ్మని
తండ్లాడుతున్న తలపోత!
పిల్లలు కోడలు నువ్వు
పయిలంగుండుంఢ్రి బిడ్డా

*గాయాలే...గేయాలై! మే 2010*

# తెలంగాణ తల్లి ఎత

• అదువాల సుజాత

తల్లడిల్లుతుంది
తల్లి తెలంగాణ ఎతతో
తెలంగాణ
కోటి రతనాల వీణ అప్పుడు
ఇప్పుడైతే...
తీగ తెగిన వీణ
ఈ తల్లి ఎద కోత

ఇసం కువ్వారం లేనోళ్ళు
ప్రేమకు ప్రాణమిచ్చేటోళ్ళు
అమాయకులు
ఇటిటు రమ్మంటే-
ఇల్లంతా నాదని
మాది మాకు గాకుండా జేస్తుంద్రు
నీళ్ళు లేకపాయే-
నిలువ భూమి లేకపాయే
నౌకర్లు లేకపాయే
చాకిరీ మా పాలాయే
మాట నచ్చక పాయే
భాష యాసాయే
తెలంగాణ తెలుగంటే...
'గుండాల మాట' నుకున్నరా?
కాదు...
ఇంపు సొంపుల గుర్గి

సింగారాల బుడ్డి
తెలంగాణ తెలుగు
ఎద మెత్తని తనం-
కల్తీలేని కన్నతల్లి ప్రేమసొంటిది!
మా భాషనూ...
మా మంచితనాన్నీ...
మా అమాయకత్వాన్ని....
ఆసరా చేసుకొని అణిచేసింండ్రు
ఇప్పుడు...
మా ఎదలలో
నిప్పుల కుంపటి
రాజుకుంది, రగులుకుంది!
ఈ మంటలలో
మా నెత్తురు మసులుతుంది!
తెలంగాణ పొద్దుపొడుపు
వచ్చేదాకా పోరాడుతం
ఎదురు తిరిగినోన్ని
ఎమలోకానికి పంపుతం!
ఒక్క మూటి
ఒక్క మాట మీదుంటం!
తెలంగాణా గడ్డ మీది
పులి బిడ్డలం మేం!
తెలంగాణా తల్లి ఎత
తీరే దాకా పోరాడుతం!

*గాయాలే...గేయాలై!*, మే, 2010

# బుక్కెడు బువ్వ - గుక్కెడు నీళ్ళ కోసం

• తాయమ్మ కరుణ

తెలంగాణ రావాలి,
తెలంగాణ ఏరువడాలె
ఏంది బిడ్డా అట్ల చూస్తున్నవ్
ఈ ముసిల్దేంది ఇట్లంటుంది అనుకుంటున్నవా?
దీనికేం తెలుసనుకుంటున్నవా?

బిడ్డా
గీ వూళ్ళే పుట్టిన
గీ వూళ్లే పెరిగిన
గిక్కన్నే చస్తా...
బిడ్డా
నా కళ్లముందల
బావుల్ల నీళ్లెండిపాయె
భూమి ఫక్కున పగిలె
గింజ రాలదాయె
బిడ్డా
నా కండ్ల ముందర
నా కడుపున పుట్టిన బిడ్డలు
సెట్టుకోదు పుట్టకోదు ఆయె
ఎవనింటికి పోతే
ఎవడు కూడు వెద్తడు
ఆనికే లేదు నాకేం బెద్తడు
ఇది కడుపాయె- అది ఆకలాయె

కల్లో గంజో తాగితి,
కని ఎంతకాలమిట్ల?

బిడ్డా
చదివించిన ఒక్క కొడుకు
నౌకరీలేక తిరిగి తిరిగి
ఇల్లిడిసి పాయె
ఆడు దొంగాయెనో లంగాయెనో
ఏది తెల్వకపాయె
సచ్చిన్నాడు తెలిసింది ఆడు నక్సలైటయ్యిండని,
బిడ్డా
సదూకున్నోనికి నౌకరీ లేకపోయె
సదూకోనోనికి నీళ్ళు లేకపోయె
గందుకే బిడ్డ తెలంగాణా రావాలె!
నాకూ
నా బిడ్డలకు
బుక్కెడు బువ్వ దొరకాలె!

*గాయాలే...గేయాలై!, మే, 2010*

# కాల జ్ఞానం

• గోగు శ్యామల

వెలుపల అవ్వల గట్టి వావున పోతును గట్టి
వాగుల మన్నపోతే త్రైవలే పండినట్లు
వింటివ తెలంగాణ! ఢిల్లీ తీరెట్లుందో
కంటివ బతుకమ్మో వలసాంధ్ర తీరును
మనుసుపెట్టి వింటారా తెలంగాణ కథను

దూపై పిండ్ల సమైక్య పాలనల అందిన కాడికి మింగిండ్రు
భూములను మింగిండ్రు.
భూగర్భంలోని సంపదనూ మింగిండ్రు
సముద్రలను మింగిండ్రు
కొలువులను మింగిండ్రు
అడవులను ఆకులను పత్రహరితాన్ని మింగిండ్రు.
మింగుడు యుద్ధాలను ఆగకుండ చేస్తున్నరు.

నా సేనూ సెల్క వాగు తవారి వివాదైనవి
యుద్ధ సెగలకు తాలలేక కడుప సేత పట్టుకొని
దేశ సరిహద్దులు దాటిన సేంబంధం అల్లాడుతున్నది
యువతరం అగ్ని గోళాలై మండుతున్నరు.
పాతాళంలకు తొక్కిన జీవజాలలను కాగడకెత్తుతున్నరు
హైటెక్ ఆవిష్కృతితో డ్రైనేజి గుంతల్ల ముంచిన
దైనాన్ని ఈసడించి కాకరించి ఉంచుతున్నరు
వలస పోయిన బిడ్డకోసం తల్లి గోసపడుతున్నది
సంసారాన్ని యుదవాటిన వలస పాలన మాకొద్దని
తేగేసి చెప్తున్నది తెలంగాణ కోడలిపిల్ల
కడుపు కాల్చిన సమైకాంధ్ర పాలనపై పడిశెలెత్తింది

తెలంగాణ ఆడబిడ్డ
చాకలి ఐలమ్మ తెగింపు
యాదవ సంగం లక్ష్మీబాయి నీతి
మాదిగ సదాలక్ష్మి నాయకత్వం
మాల ఈశ్వరీబాయి పౌరుషం
తెలంగాణ తరుణికి మెండుగ దండిగ ఉన్నయి
పోరుతూనే ఉన్నమూ, సూస్తూనే ఉన్నము
ఓపిక పడుతూనే ఉన్నము. ఇంకా అక్కరలేదు
నీ పాపాలను రాసి పెట్టిన భూతల్లి
బద్దలై నిను పాతిపెడ్తది
ప్రళయమైన గంగ నిన్ను ముంచేస్తది
కబడ్దార్ సమైక్య సంపన్న మనువులారా

*గాయాలే...గేయాలై!, మే, 2010*

# గత్యంతరం లేదు

• ఎన్. అరుణ

కన్నీళ్ళు అంతటా ఉంటాయి గాని
ఇవి ఎండిన పొలం బీటల్లోంచి ఉబికే ఆవిరి భాష్పాలు
చిరునవ్వులు అంతటా ఉంటాయిగాని
ఇవి నవ్వలేక ఏడ్చే దుఃఖంలోంచి రాలిపడే
నిస్తేజ చంద్రవంకలు స్త్రీలు అంతటా ఉంటారు గాని
తరతరాల మానవ యాతనను ఖాళీ కుండల్లా మోసే
అతి దీన హీన మానవ కళేబరాలు

నీళ్లు అంతటా ఉంటాయి గాని
విషం కలిసిన ఫ్లోరోసిన్ జలధారలు
ఇక్కడ ప్రాణాలు తీస్తాయి
గోదావరి అంతటా ఉంటుంది గాని
ఇక్కడ కిందికి దూకి చనిపోవడానికే పనికొస్తుంది
దక్కను పీఠభూమిపై కురిసే వర్షంతో
కృష్ణమ్మ కూడా దాహం తీర్చుకుంటుంది గానీ
వెనక్కి రావటానికి తటపటాయింపెందుకో?
రాజకీయాలు అంతటా ఉంటాయి గానీ
ఫ్యాడలిజంతో తడిసిన రెక్కలు
ఎగరటానికి తపతపలాడుతున్నాయి

అవును ఇదొక సుదీర్ఘకాల
మానవ సంవేదన
ఇప్పుడీ గొంతులు కొత్తగా, మెత్తగా మోగుతున్నాయి
ఇప్పుడిక తరాలనాటి కపట నిశ్శబ్దం పగిలిపోక తప్పదు

*గామాలే...గేమాలై! మే 2010*

# హిల్టన్ కేఫ్ యాదిలో...

• రత్నశ్రీ

పాతబస్తీకి చార్మినార్
సికింద్రాబాద్‌కి క్లాక్‌టవర్
ఉస్మానియా క్యాంపస్‌కి హిల్టన్ కేఫ్
మనసు చెమ్మగిల్లినప్పుడో
లైబ్రరీలో మేనేజ్‌మెంటు కోర్సులు రొద చేస్తున్నప్పుడో
బుర్రలో గ్రూప్ సిలబస్ బుసలు కొడుతున్నప్పుడో
ఆంత్రోపాలజీ అంతుపట్టకుండా పోయినప్పుడో
హిల్టన్ కేఫ్ గుర్తొస్తుంది
తెలుగుని తురకంలో మాట్లాడిన పోరగాడు గుర్తొస్తాడు
జలీల్‌భాయ్ పాన్‌షాప్ గుర్తొస్తుంది
పొగలుగక్కె ఇరానీ చాయ్
వేళ్ళమధ్య గోల్డ్‌ఫ్లేక్ కింగ్ సైజ్
కట్ చేయకుండానే ఇప్పుడా కలల బెంచీల మీద
కాఫీ డే మొలిచింది
ఇంపోర్టెడ్ ప్యాకింగ్‌తో
గ్లాస్ విత్ కేర్
వోన్లీ పర్ లవర్స్
గాల్లో తేలినట్టుంది. గుండె జారినట్టుంది
నేనొక దిక్కుమాలిన కాఫీషాప్ కడ నిల్చి
చివాలున అటువేపు చూస్తే
తలుపులు మూసుకుపోయాయి
మూర్ఛనలు పోతూ అడిగితే
ఏంటదీ? అదేదో కల్చరన్నారు
ఏలాట్ కెన్ హాపెన్ ఓవర్ కాఫీ అన్నారు

హితుడా
నా మనసింకా గూడు దొరకని పిట్టలా
అక్కడే తిరగాడుతోంది
పోరగాడి కేక కోసమో
వాడి పిలుపుతో చిక్కబడే చాయ్ కోసమో
సమోసాలో పచ్చి మిరపకాయ కోసమో
ఇంకా దేనికోసమో - దేనికోసమో
నా మనసింకా అక్కడే పెనుగులాడుతోంది
మిత్రులారా దయచేసి ఇటువైపు ఎవరూ రాకండి
వస్తే మనసుని కుదిపి కుదిపి మాట్లాడుకోవాల్సి వస్తుంది
వొరే తమ్మీ నీకే చెప్పేటిది
వస్తే సెప్టిక్కయిన పుండుపై
ఇనుపకచ్చడం గుద్దినట్టుంటుంది
కుట్టు తెగిన గాయంపై
కారప్పొడి చల్లినట్టుంటుంది
రక్తం ఉడికిపోతుంది
కడుపు మసిలిపోతుంది
గుండె మండిపోతుంది
ఏంటీ, క్లోజ్డ్ కల్చరా!
ఎవ్వడా కూత కూసింది...

*రత్నశ్రీ బ్లాగ్‌స్పాట్.కామ్ డిసెంబర్, 2010*

## వైరి సమాసం

● *పరమాత్మ*

ఒకానొక నేనూ...ఒకానొక అతనూ...
ఒకే కాలనీలో ఉంటాం. ఒకే రోడ్డులోనే ఉంటాం
మా దర్వాజాలు ఎదురెదురే
అయినా ఏదీ మాట్లాడుకోం!
రోజూ కలుస్తూనే ఉంటాం
ఒకే బస్సులో ఆఫీసుకు వెళ్తుంటాం
పక్కపక్కనే కూచుంటాం
అయినా ఏదీ మాట్లాడుకోం!
కలిసే ఫైళ్లన్నీ చూస్తాం కలిసే లంచ్ చేస్తాం
కలిసే సెక్రటేరియట్ అంతా తిరుగుతాం
అయినా ఏదీ మాట్లాడుకోం!
కాలనీ మీటింగుల్లో కలుస్తాం
రోడ్డు మరమ్మత్తులను చేయిస్తాం
అయినా ఏదీ మాట్లాడుకోం! మౌనంగా ఉంటామనీ కాదూ..
అట్లా అనీ, మూగవాళ్ళం అంతకంటే కామూ

గోడలకు చెవులుండీ మాట్లాడనీయవు
మనసుకు చూపులుండి విననీయవు
మా చూపులు కలిసినప్పుడల్లా
అబద్ధాల్ని అరువు తెచ్చుకుంటాం
మా మాటలు కలిసినప్పుడల్లా
మొహమాటాల్ని నగిషీలుగా చెక్కుకుంటాం

నా కష్టం అతని కంటికి తెలుసు
నా యిష్టం అతని మనసుకు తెలుసు
నిలువెల్లా పాదరసమై పోయినవాడు
మనసంతా సానుభూతై కురిసినవాడు
తన ఉద్యోగం తనది కాదన్నవాడు
తన ఇల్లూ తనది కాదన్న వాడు
తన వలస వడ్డించిన విస్తరన్నవాడు
తన ఒనరు సమకూర్చిన బోనసన్నవాడు

అతను అనర్గళంగా మాట్లాడేవాడు
అతను అవిశ్రాంతంగా పోట్లాడేవాడు
అతను సమన్యాయం సంకేతమయ్యేవాడు
అతను సౌశీల్యం తొలి సోపానమయ్యే వాడు

అతని బుద్ధికి తెలుసు
కలిసుంటానికే విడిపోదామన్నవాడు
అతని మనసుకు తెలుసు
విడిపోతేనే కలిసుంటమన్నవాడు
నా నుంచి వీడ్కోలు పొందాలని
అతనికి బాగా తెలిసుండేది
నా గురించి మాట్లాడాలనీ
అతనికి ఇంకా ఇంకా బాగా అర్థమయ్యేది

అతనంటే మహాయిష్టంగా ఉండేది
అతని మాటంటే మహా ఆయుధంగా ఉండేది
అతని చేష్టలు సుఖాలనిచ్చే తలదిండ్లయ్యేవి
అతని నిజాయితీ
నా నేల నన్ను ముద్దాడినట్టుండేది

అప్పట్లో అతన్ని మనస్సుతోనే అభినందించేవాన్ని
అప్పట్లో అతన్ని మాటలతోనే ఆనందపరిచేవాన్ని
అప్పట్లో అతను కూడా చేతలతో చైతన్య పరిచేవాడు
అప్పట్లో అతను కూడా
ఊట చెలిమై ఉపన్యసించేవాడు
కానీ అప్పట్లా అతనిప్పుడు లేడు
పాత్ర మారిపోయి పరిహాసం పులుముకున్నాడు
అతనిప్పుడు రెండు తలల శిఖండి
నేనిప్పుడు నిషిద్ధ భాషా ఛందస్సుని

మొన్నటి రామాయణంలో విభీషణుడు కాదు
నిన్నటి మహాభారతంలో శకుని పగాపంతం కాదు
రాత్రి వేసిన నాటకంలో
సత్యహరిశ్చంద్రుడు అంతకంటే కాదు

అతనిప్పుడు యడాగమ సంధి
అతనిప్పుడు ప్రకృతిలోని వికృతి
అతనిప్పుడు నాకు వైరి సమాసం
అతనిప్పుడు నాకు నీచాతినీచోపమానం.

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 7, జూన్, 2010*

# చెరువు బోర్‌మంది

• ఐతా చంద్రయ్య

మా ఊరి చెరువు మనసు పొరల్ల దొర్లింది
నా గుండెకాయ చెరువై పోయింది
జ్ఞాపకాల గుప్పిట్లో ఆనాడు
నిండా నీళ్ళతో నిండుగర్భిణిలాగుండేది
అట్టడుగు తడి కరువై నేడు
అమాంతం 'బోరు' మంది

తెలంగాణ కడుపు చీల్చి కృష్ణా గోదా గోవుల్ని
చెవులుబట్టి గుంజుకపోయి
పంటలు పిండుకుంటుండ్రు

తొండలు గుడ్లుపెట్టని అక్కడి భూములల్ల
ప్రాజెక్టులు ప్రాణం పోసుకున్నయి
ధాన్యలక్ష్మి తాండవ మాడింది
బక్క రైతుల చెమటను ఇక్కడ
బోర్లల్లదోసి బొక్కబోర్లపడిరి
పంట కోతలక్కడ గుండెకోతలిక్కడ

విధులిటు - నిధులటు ముక్కోటి రతనాల వీణ
నక్కజిత్తుల్ని నమ్మి డొక్క చీల్చుకుంది
పిరికి మంచమ్మీద పగటి కలలు కంటుంటే
శాంతి పావురంగూడా పామై మింగేస్తుంది
నైజాం పాలన నడ్డి విరిచిన పౌరుషం
రాజీ నాగుంబాము నోట్లె కప్పైపోయిందా?

*ప్రజాతంత్ర జూన్ 13-19, 2010*

# మరణమే చరిత్ర

• రేణుక అయోల

ఒక ఒంటరి దేహం
సంకల్పంతో మరణించి
తనకు తానే కొత్తగా స్ఫూర్తిగా నిలబడింది

మంచి చెడు పాపం పుణ్యం
ఏవి పట్టనట్టు ఒంటరితనంతో
కన్న పేగు కన్నీళ్లు గుర్తించే సమూహమైంది

ఒక మరణం తెచ్చిన తుఫానులోంచి
ఒక మరణం తెచ్చిన సంక్షోభంలోంచి
నగరం తన ప్రతిబింబాన్ని కొత్తగా చూసుకుంది

నలిగిన ముఖం ముక్కలైన భాష
భాష ముందు మూగగా
తనకు తానే ఆశ్చర్యంగా చూసుకుంది

గుంపులు గుంపులుగా మాట్లాడే భాష
ఎలుగెత్తి నినాదంగా మారే రూపం ఉద్యమం!
నినాదాలు నిట్టూర్పులు ఆవేదనలు
అంతా ఒక భాషలోనే
ప్రవాహంలో సుడులు తిరుగుతున్న భాష
ఒకరి నుంచి ఒకరు అందుకునే ఇసుక గమేళలా
మాట మారి నినాదమై కొత్త కట్టడంలా మారింది
అంగుళం కదలకుండా
జడంగా మారి మనల్ని
మనమే సరికొత్తగా చూసుకుంటున్నాం

మరణం ఊరేగింపుగా మారడం చూస్తున్నాం
మరణం రక్తసిక్త రణంగా మారడం చూస్తున్నాం
ఈ చూపు ఎంత పాతబడిపోయిందంటే
చూపు తప్పించి ఇంకేమి మిగలనంత
మనకి మనమే వింత, మన భాషే మనకు కొత్త

పొట్ట చేత పట్టుకుని ఊళ్లు వదిలిన వాళ్లు
అపరిచితులుగా ఇక్కడ చౌరస్తాలో నిలబడిపోయాం
ఇప్పుడు దారులకు గమ్యం తెలియదు
చెట్లకింద నేర్చుకున్న విద్య ఒంట పట్టించుకున్న చదువు
గుండెలో నింపుకున్న అక్షరాలు
పరాయిగా మారి అ ఆలు వేర్వేరు గుంపులై పోతున్నాయి
పచ్చటి ఆకులు నేలకు రాలుతూ
వాటికి అంటుకున్న నెత్తురు మంచుబిందువులతో కలసి
భూమ్మీదకి ఒరుగుతూ
త్యాగాల నినాదాల్ని లిఖిస్తోంది

మరణం తరువాత నిశ్శబ్దం
గంభీరంగా అలుముకున్న ప్రశాంతత
ఆ నిశ్శబ్ధ ప్రశాంత మరణమే ఊరేగింపుగా మారి
నినాదమే పయనించడం చరిత్రగా రూపొందడమే
మార్పు ఏ రూపంలో వచ్చినా
ఈ మరణం మాత్రం చరిత్ర పుటల్లో ఆరంభ వాక్యం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 28, జూన్ 2010*

# బువ్వ కుండ

● తుర్లపాటి లక్ష్మి

అరె!
పిసలేసిందా? ఏంది?!
పోరగాండ్లందరూ
పుసుకు పుసుకుమనుకుంటా
ఆత్మహత్యలు చేసుకుంటున్నరు
ఏంది?!
మనం గంత
కమ్ దిమాగ్గాండ్లమా?!
పరేషాన్లబడితే
పానాలు తీసుకునుడేనా?
మనం ఏంది?
మన పుట్టువడి ఏంది?
మనఎనకటి కతలేంది??
పోరగాండ్లకెల్లి మొదలుపెడితె
మూలకున్న ముసలోల్ల దాక
పెద్దపెద్ద పోరాటాలు చేయలేదా?
రాక్షసులైన రజాకార్ల
కండ్లల్ల కారం జల్లుకుంట
ఎల్లగొట్టలేదా?!
గీ లొల్లులు, గీ కతలు
మనకు కొత్తగాదే,
కారం ముద్దలు, మక్కగట్క
తినుకుంట
దేంట్ల మనం ఎనుకకు కాలే

అవు తమ్మి
గీ తెలంగాణ కావాలనెటోళ్ళం
మనలచ్చులలచ్చుల ఇలువగల
పానాలు తీసుకుంటున్నం
గాని
గాడ
ఆంధ్రుల ఓడన్నా సచ్చిండా
గదే ఆడి ఇఖ్మత్
గిదింకా మనకు సమజైతలేదు
గదే బోలబాలతనం
అరే!
గిప్పట్నుంచి మీపానాలు
మీయి గావు మాయి
మీరు
ప్రజలకంకితమై
పోరాటంల ముందువర్సల
మీరే వుండాల
సావకుంద్రి బేటా
సావకుంద్రి
జర ఆలస్యమయితే ఏం బాయే!
మన బువ్వకుండ మనది కాకుండా వోదు!?

*పిలుపు, ఆగస్ట్, 2011*

# ఏది నా తెలంగాణ?!

● తమ్మెర రాధిక

న్యాల తల్లి చింపుల బోరాలను కప్పుకుంది,
చిన్న పోరగాల్ల కడుపులు నింపలేక,
సన్న మెతుకు బువ్వ
ఎన్నాల్లయిందో తిని మా అవ్వ!
ఒడ్ల గుమ్మిలు వలసలు బోతున్నయి.
కురాటి కుండలు చిట్లిపోయి మూలకువడి మూలుగుతున్నయ్
అరిగిపోయిన యిసుర్రవుతులు,
కూలిపోయిన దొరల గడీలల్ల దిష్టి బొమ్మలైనయి
ఎండిపోయిన శాదబాయిలల్ల
ఎన్కబడ్డతనపు గుది బండలు దింపుతున్రు,
బాటెంబడి నడుస్తావుంటే
పెల్లలూడిన గోడలు
సెత్త మొల్సిన బాద్వలు సుత
కర్వుకు కున్కబట్టినయి
మా యింట్ల
దొడ్డి దర్వాజ తీస్తె
తెల్ల కొండలు కూసున్నట్టు ఆవులెడ్లు!
కనుదిప్పి సూస్తె చాలు
రాసులు పోసినొడ్లు!
ఎయ్యి ఇప్పుడయ్యి? ఒగప్పుడు
ములుగర్ర ముడ్డెంబడి పంజేసే జీతగాళ్ళు. .
సద్ది బువ్వకే సవుదేసి ఉతికిన సాకలి బానలు,

తల పాగలు సుట్టుకోని గల్మముందు సిందేసినవాళ్ళు
మా దొర గడీల..
రోసి పోయిన బానిసత్వం
తిర్గబడిన దొరతనమ్మీద
చెట్లు సయితం జుట్లు యిరబోసుకొని
ఉరికినయి బురుజు గోడల మీదికి
సవురు దీపం కొంపలు
రాదారి సెడిన డొంకలు
నోళ్ళిచ్చిన రేగళ్ళు
పాలి పగలకు బలయిన తెలంగాన చెల్కలు
రంకెలేసి బొంకినా,
ప్రవాహం మల్లిపోయిన నీల్లు
పాడి పంటల్ని పచ్చంగ చేయవు
నేల మల్ల పచ్చంగ మొలకెత్తాలంటే
తెలంగాణ దిగూట్ల స్వేచ్ఛ దీపమెలగాలే

*ఆదివారం, విశాలాంధ్ర, జూన్, 2010*

# తెలంగాణ రోడ్లు

● శేషం సుప్రసన్నాచార్యులు

ఇరువైపులా చెట్లతో వచ్చిపోయే వాహనాల రోదలతో
ప్రమాదాల రక్త కన్నీటితో క్షణం తీరికలేని రహదారి
నేడు ఉద్యమాన్ని ఆభరణంగా చేసుకొని
శోభాయమానంగా విరాజిల్లుతుంది!
జై తెలంగాణా! నినాదాల హోరుతో
కర్ణపేయాన్ని కలిగిస్తుంది
ఉద్యమ వంటావార్పు కోసం రసాలూరే వంటశాలగా మారింది
సహపంక్తి భోజనాలకు విస్తర్లు పరిచింది?
ఇప్పుడు కర్ణకఠోరాల వాహనాల రణగొణ ధ్వనులు
మాయమయ్యాయి!
గంటెల సవ్వడి, గిన్నెల ధ్వని, పరిమళాల పలకరింపులతో
తెలంగాణా ప్రజల పులకరింపుకు చేయూతనిచ్చింది రోడ్
తెలంగాణా ఆడబిడ్డల బతుకమ్మ ఆటకు తన హృదయాన్ని
విశాలమైన చెరువుకట్టలా మార్చింది తొవ్వ
లయబద్ధంగా బతుకమ్మ పాట పాడుతుంటే ఆ రహదారి
లయాత్మకంగా జోలపాట పాడినట్టు నిశ్శబ్ధంగా నిద్రపోయింది
ఆదిలాబాద్ నుంచి అలంపూర్ వరకు
అతిపెద్ద మానవహారానికి తానే పూలతోటగా మారి తెలంగాణాజడతో
ఉద్యమహారానికి పల్లె పడుచయింది
క్రీడా ప్రాంగణమైంది, తరగతి గదిగా మారి తన
పిల్లలచే పరీక్షలు కూడా రాయించింది!
గర్జనలు, రణభేరులు, పొలికేకలతో ఒక దట్టమైన
అడవిగా మారి జనారణ్యాన్ని పోషించిన అడవితల్లిలా
అక్కున చేర్చుకుంది తెలంగాణా రహదారి!

*వల్లుబంద కవితా సంకలనం జూలై, 2010*

## తెలంగాణ

• దూదం మనోహర్

ఆయింటి పెరట్ల మొలిసి
ఈ యింటి పందిరికి
పానమోలె అల్లుకున్న
పచ్చని సిక్కుడు సెట్టోలే
ఆత్మగల్ల మనిషి

అలుకు పూత పూసి
కడుపగడిగి
ముగ్గేసి
కురాడు పుదిచ్చినంత
నియ్యతిగల మనసు

కాల్లు బురదల్నె వున్నా
పెయ్యినిండ యిరగకాసి
గొలకలేసిన
వరిశేను ఊగినట్లు
కువ్వారం లేని మాట

గాయి గాయి
చేసె మనుమనికి
'కొత్తలు' చేతులవెట్టి
బుదురకిచ్చె
అమ్మమ్మ 'బొడ్లె సంచి' లెక్క
యాష్టపడని గావురం

ఇసిరె తీసుకున్నా
ఇరుసు గుంజుకున్నా
ఇటేటు రమ్మనకున్న
ఇల్లంత దోచుకున్నా
ఉగ్గవట్టుకున్న పాణం
బిత్తిరిదని
బీరిపోయిందని
ఎకసెక్కాలాడితె
బోకెత్తులేషాలేస్తె
కార్యాలవిశిపోయిన జీవునం.

కని
పబ్బుతివట్టి
జబ్బుల ఇరికిచ్చుకుని
కలిసుండే ముసుగుల
బొండిగె పిసికేతనానికి
ఇగ
అద్దెం మద్దెం అవ్వనితనం
అరికీజ్ లొంగనితనం.

తెలంగాణ
ఇవ్వాళ్ళ
నడింట్ల నిలవడ్డ
నిలువెత్తు ఆత్మగౌరవ మొగురం
తనను తాను
సానబెట్టుకుంటున్న ఇగురం

*వల్లుబంద కవితా సంకలనం, జూలై, 2010*

# తెలంగాణ తల్లి విముక్తికోసం

• ఆదెపు లక్ష్మణ్

పగిలిన నేల పర్రెలోంచి
వెలుతురు పిట్టయి ఎగిరిన
నినాదం
బతుకులోంచి లేచిన
దిగులు గోడ
తెలంగాణ కంచుకోట
ఉద్యమం లేచిన జాగాలోంచి
చేతిలో ఆయుధం
గుండెలో ధైర్యం ఉంటుందే గానీ
ఆత్మహత్యలకు తావెక్కడుంటుంది
మిత్రమా....
అంబాడే పసికూన
రేపటి యువతరానికి
మార్గదర్శకం
ఆయుధమే కావచ్చు
శాంతి సామరస్యాపూరిత
యుద్ధాన్ని ప్రకటించవచ్చు
ఇప్పుడూ
నవంబర్ -1 తెలంగాణ
విద్రోహదినం సాక్షిగా
ఉసికొట్టుకుపోయిన పల్లెదేహాల్లోంచి,
తుపాకీ భుజాన మోసి మోసీ
నేల కొరిగిన ఓ ఆక్రందనలోంచి
వచ్చేనినాదం

పిడికిలెత్తి ప్రశ్నిస్తుంది
60 సం.రాల దారిద్ర్యరేఖ మీద నిలబడి
పోరు సలుపుతున్న ఫలితమే ప్రత్యేక రాష్ట్ర నినాదమని
ఇవ్వాళ్ళ మనం
తుపాకి చిందించిన రక్తపు తూటాల మీది
గాయాల్ని మననం చేసుకుందాం
కొమురం భీం, సాకలి అయిలమ్మలను
తెలంగాణ సాయుధ పోరాట బిడ్డల్ని
స్మరించుకుందాం
రాజ్యం గుర్తించని మన సాంస్కృతిక
తత్వాన్ని ఆలాపించుకుందాం
గాయపడిన గేయాల్లోంచి
పోరాటాల ఉద్విగ్నతలోంచి
రక్తం చిందిన మట్టిలోంచి
ఈ నేలతల్లి విముక్తి కోసం
ప్రతి ఒక్కరం
ఒక్కో ఆయుధమై
పోరుబాట పయనిద్దాం
ఈ ఎరుపెక్కిన నేలమీద
ఉద్యమాల విత్తనాలు చల్లుదాం

*మానేరు టైమ్స్, జూలై, 2010*

# పరాన్న భుక్కులు

• *దేవి యాదగిరి*

పొలంలోని వరి కంకులను కొరికి
బొరియల్లో నిలువ పెట్టుకొని
ఆసామికి తీరని నష్టం కలిగించి
గుమ్మికి రంధ్రాలు చేసి
ధ్యానమంతా బుక్కి
సమైక్యంగా వుందామంటున్నాయి ఎలుకలు
నా వాటా నేను తిన్నాను
అని బీరాలు పోతోంది పందికొక్కు
గ్రేటర్ భూములన్ని కబ్జా చేసి
ఇది నా స్వార్జితం
ఇందులో నాకూ వాటా వుంది
అని వీరంగమాడుతోంది ఎలుగుబంటి
చీమలు పెట్టిన పట్టణంలో దూరి
దీన్ని నేను అభివృద్ధి
చేశానంటోంది కుకిడి పాము
చాప కింద నీళ్లలా కలుగులు తవ్వుకొని
తెలంగాణలో బలగం పెంచుకొని
ససేమిరా కదలనంటోంది చుంచెలుక
దొంగచాటుగా కంకులన్నీ కంకి
ఆ చేనంతా ఇప్పుడు తనదేనని
అదే పనిగా ఊళ పెడుతోంది గుంటనక్క
పాపమని దయతలచి
పంచపొంటి జాగా ఇస్తే
వెచ్చగా మడుచుకొని పండి

దీనిపై నాకూ హక్కు సంక్రమించింది
అని తోకాడిస్తోంది బజారు కుక్క
ఊర్కున్నన్ని రోజులు రంగులు మార్చి
ఇక కట్టిపెట్టు నీ పగటి భాగోతం అంటే
వేషాలు వేయడమే నా అసలు రంగు
అని దీర్ఘాలు పోతోంది ఊసరవెల్లి
ఎవరి భాగం వాళ్ళు పంచుకొని
అన్న దమ్ముల్లా వేరు పడుదామంటే
నిట్టాడును కరిచి పట్టుకొని
దీన్ని మాత్రం విడువనంటున్నాడు తిక్కలోడు
కాలికంటుకొని కంపుకొడుతుందని
కడుక్కొందామని ప్రయత్నిస్తే
రేగడి మట్టిలా పట్టుకొని
వదలనంటే వదలనంటోంది ఈ జిడ్డు బురద.

*ఆకాశిక్, జూలై, 2010*

# మా లొల్లి

• ఎ.మోహన్‌రాజ్

తెలంగాణోళ్లతో పెట్టుకోకుంండ్రి తగవులు మాని వెళ్లిపోండ్రి
సాగవు మీ ఆటలంటుంటే సమైక్యాంధ్రంటూ సంకలెగిరేసుడెందుకు?
మా నేలను మేమే పాలించుకుంటామంటుంటే
మంకుపట్టినోళ్ల తీరుగ కర్ర పెత్తనం చేస్తుండ్రేంది?
యాడినుంచో అచ్చినోళ్ళు మీరు ఎలిగి పోవడ్తిరి
ఈడనే పుట్టినోళ్ళం మేము చీకట్ల నలిగిపోవడ్తిమి
సదువులను సదివనా మా వోళ్ళు సచ్చి బతుకుతుండ్రు
ఆఫీసర్లు మీరైతే అటెండర్లం మేమౌతున్నాం
అధికారం మీ చేతికిచ్చి అంధకారంలో మేముంటున్నాం
మా భూములు జాగలు కొలువులు మీకు కావాలేగాని
మా కట్టుబొట్టు ఆచారాలు మీకు అవుసరం లేదు
మా బతుకమ్మ ఆదరుగాని మా బతుకులతోని ఆటాడుకుంటుండ్రు
మా భాషను చూసి నవ్వేటోళ్లు మా జాగలల్ల ఉండుడెందుకు?
మా పండుగ పబ్బాలను చేయనోళ్ళు ఈడ పంటలెందుకు పండిస్తరు?
ఇన్నేండ్లయిన మాతో కలిసి పోని మీరు ఈడ బతుకుడెందుకు?
పక్కనే గోదావరి పారుతున్నా మా గొంతులు తడవవు
క్రిష్ణమ్మ నీళ్లకోసం కిరికిరిలు ఎక్కువైపాయె
ప్రాజెక్టులు మీకు పాడి ఆవులైతే మాకు పస్తులుంచి పుస్తెలు తెంపుతున్నయ్

అయిందేదో అయింది ఇగ ఆగం కాదల్చుకోలేదు
ఆలస్యం చేయకుండ్రి ఆగమంటుంది మా జనం
మా బతుకుల్ని మేమే సక్కబెట్టుకుంటాం అంటున్నాం
మా రాతల్ని తిరగరాసి మెరుగులు దిద్దాలనుకుంటున్నాం

*'ఒకటే మాట తెలంగాణ' కవితా సంకలనం జూలై, 2010*

# జయహో ఉస్మానియా

● ఎనిశెట్టి శంకర్

ఆర్ట్స్ కాలేజి దగ్గర
విద్యార్థుల ప్రభంజనం
మనకు సముద్రం లేదన్న
వెలితి లేకుండా చేసింది
వాఘా సరిహద్దు ఆర్ట్స్ కాలేజి దగ్గరే వుందన్నట్లు
పోలీసుల మోహరింపు
తెలంగాణా ఉద్యమానికి
దిశానిర్దేశం విద్యార్థుల గర్జన
చైనాలో కావచ్చు రష్యాలో కావచ్చు
మొన్న ఫ్రాన్స్ లో కావచ్చు
విద్యార్థుల నాయకత్వం
నేడు తెలంగాణకు అపురూపమైంది
రాజకీయాలు జిమ్మిక్కులు చేస్తున్న నేపథ్యంలో
విద్యార్థుల నాయకత్వం అత్యవసరమైంది
నిస్వార్థానికి మారు పేరు
నిజాయితీ మరోపేరు చిత్తశుద్ధికి చిరునామా
తెలంగాణ గుండె ఘోష
ఉస్మానియా గర్జన
మీ త్యాగానికి సెల్యూట్
మీ ఉద్యమానికి రెడ్ సాల్యూట్

*న్యూస్ టైమ్, జూలై, 2010*

# తస్మాత్ జాగ్రత్త

• సిరిసిల్లా గఫూర్ శిక్షక్

నీ అకృత్యాల జాడ
వెలుగు చూడలేదేమో
కమ్మిన నల్లటి
చీకటినడుగు
పచ్చని కాగితాలపై
నువుచేసిన సంతకాల
రాతలు
అద్దంలో ప్రతిబింబమై
నిలిచిన
ముఖాలపై నువు
పూసిన రంగు
అంధకారమై గుండెల స్పందన
ఏ చెవులూ వినలేదేమో
తోడును వీడలేక
సల సల మరిగిన ఎర్రని
రుధిర ప్రవాహ సవ్వడినడుగు
కణకణంలో ఆరని ఆశలు
ఆవిరినడుగు
త్యాగాల రెప్పలు తెరిచిన
చూపుల కాంతినడుగు
పొట్టలో నువుపేల్చిన గుండు
ఎన్నెన్ని వంకలు తిరిగిందో
బయట పడ్డ పేగులను
సవరించిన చేతివేళ్ళ

ప్రయత్నాన్నడుగు
ప్రాణాలను మోసుకెళ్లిన
గాలి తేమ తెరలనడుగు
దశ దిశల వ్యాప్తమై
నువు నడిచిన దారులన్నీ
నీవైపే నడుస్తున్నాయి
నువు పోసిన
మోసపు కలుషిత నీరుకి
ఏపుగా పెరిగిన
తీగలన్నీ
అదిగదిగో...
నిను చుట్టు ముట్టి
నీ ఉనికినే ప్రశ్నిస్తున్నాయి
తస్మాత్ జాగ్రత్త

*నేటి నిజం, 12, ఆగస్ట్, 2010*

# నువ్వుండాల్సిన వాడివి!

• దర్భశయనం శ్రీనివాసాచార్య

నీ పేరేదైతేనేం
వెంకటో, శ్రీకాంతాచారో, వేణుగోపాలరెడ్డో
అకస్మాత్తుగా అర్ధాంతరంగా హడావుడిగా
ఇక్కడొక శూన్యస్థలిని మిగుల్చుతూ
వెళ్లిపోయావన్నదే-
ఎట్లా దిగమింగుకునేది

అప్పుడే లేచి చిగురేసి
ఒకట్రెండు పూలు పూసిన చెట్టు
ఉన్నట్టుండి మాయమైపోతే
మిగిలే శూన్యంలాంటి శూన్యం
ఎట్లా తట్టుకునేది

మొదలవడం
మొదలవడంలోనే
తుదితీరం దాకా
వ్యాపించేంత
గొప్ప నమ్మకాన్నిచ్చావ్
ఎక్కడో వున్న ఆకాశాన్ని
గొంతులోకి
తెచ్చుకుని ఒక ఉరుము ఉరిమావ్
మెరుపై చటుక్కున
మాయమవుతావని
అనుకోలేదు సుమా
ఎట్లా నమ్మాలి

హక్కును ప్రకటించడంతో మొదలై
అక్కడే నువ్వు అంతమవడం
ఎంత విషాదం అనేక విషాదాల్ని అడ్డుకోవడానికే కదా
ఏ పోరైనా!
నీ నిష్క్రమణ మహా విషాదాన్ని మిగిల్చింది
ఎట్లా అధిగమించేది

నిష్క్రమణను నిరసన ప్రకటనగా
సంభావించే కాలమా ఇది
ఒకడెందుకు స్వచ్ఛందంగా నిష్క్రమించాడని
తడిగా యెదతో యోచిస్తున్న వాళ్లెందరు?
ఎవడి వ్యూహంలో వారు మునకలేస్తున్నాడు తప్ప!
మాటలు తప్ప మరే జీవన యోధత్వమూ
లేని వాళ్ల సందడికేం!
నిన్నో మాట, ఇవాళొకటి రేపు మరోటి
ఎల్లుండి ఇంకొకటి - అవసరమైతే
మాటల్ని కొన్నాళ్ళు మానేసి కూడా!
నిజమైన మాటగా పెకిలిన వాడివి
నిష్క్రమణతో ఇంత నిశ్శబ్దాన్ని ఇక్కడ .....
ఏమాట ప్రతిష్ఠిద్దామనుకున్నావు
ఈ నేలెపుడూ నిష్క్రమించమనదు
ఆ ఆకాశమూ ఆనదు చుట్టూ వున్న గాలి కూడా
మన వెనకాల ఎన్నెన్ని పోరాటాలు ఎంతెంత నడక!
దుఃఖాల మీద దుఃఖాల మీద దుఃఖాల మీద
దుఃఖాలు పొల్లుకొచ్చినా తెగించి
బతకడమే!
బతుకుతూ బతుకు హక్కు కోసం
అలుపెరగక గొంతెత్తడమే
మన చరిత్ర అదే కదా!

పల్లె నుంచి వచ్చావు కదా
ఎన్ని యాతనలున్నా అదెలా బతుకుతున్నదో
ఎందర్ని బతికిస్తుందో నీకు తెలియనిదా
మోసం ఋతువు చేసినా మనిషి చేసినా
ఉన్నపళంగా పొలాలు నిష్క్రమించలేదుకదా
ఎట్లా నిష్క్రమించావు నువ్వు
దుఃఖపు ముద్ద అయ్యింది నేనొక్కణ్ణేనా
శూన్యాన్ని మోస్తున్నది నీ ఇల్లూ వూరేనా
పొలాల్లో దుక్కి దుక్కైన ఈ నేల నేలంతా
చిత్తడి చిత్తడై పోయింది కన్నీటితో....
ఎట్లా ఓదార్చేది

నువ్వు వుండాల్సిన వాడివి!
ఉండకూడదని వాళ్ళు ఈ నేలను
పెత్తనాల్లో తొక్కుతున్న
దుర్భర సందర్భంలో నువ్వుండక పోతే ఎలా
ఒక్కసారి నువ్వు యోచించి వుంటే
ఎంత బాగుండేది నువ్వుండేవాడివి
ఒక గొంతుండేది ఒక పిడికిలి వుండేది
నేలకు మరింత చేవ వుండేది
మరీ ముఖ్యంగా నేల లాంటి ఒక కన్నతల్లికి
కడుపుకోత మిగలేది కాదు

ఇవాళ నీ మరణాన్ని కీర్తించి
నీ దుఃఖాన్ని మలిన పరచలేను
నీ ఉద్దేశాన్ని ఉరిమే గొంతునూ
హత్తుకుంటాను కానీ తమ్ముడూ
నీ నిష్క్రమణను ఎప్పటికీ ఆమోదించలేను! ఎప్పటికీ!

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 16 ఆగస్ట్ 2010*

# బతుకమ్మ

● పి. లక్ష్మీనారాయణ

నాటి అయ్యాబాంచెన్ చెరనెదిరించి
మానభంగాల మృత్యువును ప్రతిఘటించి పూచే
గడ్డిపూల బొమ్మలు
తెలంగాణ బతుకమ్మలు
అందాల నగరం హైదరాబాద్‌ను నిర్మించి
సుందరమైన సికిందరాబాదుకై శ్రమించి
తలపై బోనాలు ధరించి తాండవమాడే
భద్రకాళీ రుద్రమ్మలు
తెలంగాణ బతుకమ్మలు
పోకబంతీ పొన్నపూలు
అడవిమల్లె గునుగుపూలు
మేడారం గుడిలో వెలసిన
సాహసాల శౌర్యాల అక్కచెల్లెల్లు
సమ్మక్క సారమ్మలు
తెలంగాణ బతుకమ్మలు
ఫిరంగులు మోగిన ఒరంగల్లులో ఆడేది బతుకమ్మ
త్యాగాలకోట సూర్యాపేటలో పాడేది బతుకమ్మ
ఉద్యమాల జెండా నల్లగొండలో వెలసింది బతుకమ్మ
తెలంగాణ మట్టి గడ్డలు తెలుగు తల్లి ఆడబిడ్డలు
మైసమ్మ మారెమ్మ పోచమ్మలు
కరువు కాటకాలలో కాపాడే కాలశక్తి బతుకమ్మ
నీటిలో తేలియాడే పూలదేవత - ప్రాణశక్తి - బతుకమ్మ

*వీర తెలంగాణ, ఆగస్టు, 2010*

# దండోరా ధూం..ధాం...

• కృపాకర్ మాదిగ

పసులు గాసి
చెప్పులు కుట్టెటోల్లకి
సుదువులెందుకు
'ఎబిసిడిలు' వొద్దంటాడు ఒకడు

బాంచేగిరిలుండి
గాయిది పని చేసేటోల్లకి
గణతంత్రమెందుకు
'హోకురూలు' కూడదంటాడు ఇంకొకడు

యాభైతొమ్మిది గుంపులకీ
రాయితీల మెతుకులు పంచొద్దు
అంతా మేమే బొక్కుతాం
ఇదే సామాజిక న్యాయం
అంబేద్కరు మా తాత అంటూ
గుంపులన్నింటినీ జాబితా ముద్ద చేసి
అవకాశాలన్నింటినీ 'ఐక్యం' గా జుర్రుకుంటూ
గూడెం గోచీలను దొంగలించి
లంగోటీలుగా చుట్టుకుంటుండు ఒకడు

సొరాజ్జం అడగొద్దు
తెలుగు తంత్రంతో కొల్లగొడతాం
ఇదే సమైక్యవాదం
తెలుగుతల్లి మాయమ్మే అంటూ
తెలంగాణకి తెడ్డు చూపి
నీళ్ళు నిధులు ఉద్యోగాలు

'సమైక్యం'గా దొబ్బుకుపోతూ
మెరక దుక్కాల్ని ఏటి నిండా దోచుకుని
నీటి గింజలు నింపుకుపోతుండు ఇంకొకడు

యాందిరా అంటే
'కులాలన్నింటికీ కుండ ఒక్కటే
దళితుల్ని విడదీస్తారా అని వాడు
'ప్రాంతాలన్నింటికీ పాలనొక్కటే
రాష్ట్రాన్ని ముక్కలు చేస్తారా' అని వీడు
గడుసు కబ్జాలకి దిగుతున్నారు.

ధూ....
సీ....యింటి దొంగలకు నా చెప్పుగొట్ట
నీ కో...వలస దొమ్మీలపై ధూం ధాం చెయ్యి

*కావడి కుండలు, సీమాంధ్ర కవుల తెలంగానం, ఆగస్ట్, 2010*

# ఇక్కడో పల్లె వుండాలి...!

• *సతీష్‌చందర్*

నీళ్లులేని కళ్ళుంటాయని నాకు తెలుసు కాని,
నీళ్ళులేని ఊళ్ళుంటాయని
నాకు చాలా కాలం తెలీదు
కదిలితే నీళ్ళు కాళ్ళ సందుల్లో నీళ్ళు
కేరింతలకు నీళ్ళు కౌగిలింతలకు నీళ్ళు
ఎక్కడో నాసికాత్ర్యంబకం నుంచి
పరుగు మొదలుపెట్టి..
మొక్కేవాళ్లు మొక్కగా...
మునిగే వాళ్ళు మునగ్గా...
తన దారిన తాను వచ్చి అలిసి
సొలసి సముద్రపు వొడిలో
సేదతీరే చోట పుట్టుకొచ్చిన వాణ్ణి
నీళ్లు లేనితనం నాకెలా తెలుస్తుంది చెప్పండి?
అమ్మతోడు ఒక రహస్యం మాత్రం తెలుసు
ప్రతీ అన్నం మెతుకూ అంతకు
ముందటి జన్మలో నీటి బొట్టని
నీరింకిన చోట....ఊరు ఊరే
పరారవుతుందని మాత్రం తెలీదు
ఇక్కడొక రావి చెట్టు వుండాలీ-అని చెప్పినట్లుగా
ఇక్కడొక పల్లె వుండాలీ
అని ఎవరన్నా అంటే మనసులో
ఎక్కడో కలుక్కుమంటుంది
ఎక్కడి లోగిళ్ళను అక్కడే వదిలేసి
ఎక్కడి నాగళ్ళను అక్కడే విసిరేసి

ఎక్కడి కుక్కిమంచాల్ని అక్కడే వుంచేసి
పల్లె వెళ్ళిపోయింది కానీ
ఖర్చులేకుండా సత్వర మరణాలను ప్రసాదించే
ఏ పట్టణానికో వలసపోయింది
ఒక్కొక్క కుక్కి మంచం మీద
ఒకొక్క గాజు కళ్ళ ముసలి అవ్వ
'ఎందుకవ్వా ..నువ్వింకా ఇక్కడ"?
కాటికో..కూటికో..
చెప్పే ఓపికే వుంటే తన చావు తాను చచ్చేది
ఈ అవ్వ పేరు తెలంగాణ...!

*కావడి కుండలు, సీమాంధ్ర కవుల తెలంగాణం, ఆగస్ట్, 2010*

# మీ బాటలోనే మాదీగోళ్లూను...

• దార్ల వెంకటేశ్వరరావు

మీలాగే మేమూ మాకు రావాల్సినయన్నీ మాకియ్యమని
మా సోదరుల్తో పోరాడుతున్నోల్లమే నండి
బతుకు తెరువెతుక్కొంటూ
కడపుకి కూసింత గెంజి కోసం వచ్చినోల్లమే నండి
మేమేమీ వోమనుదు లాంటోల్లం కాదులెండి
మీయధికారాన్ని గుంజుకోవడానికో రియలెస్టేట్ యాపారం సేత్తూ
మీ భూములన్నీ లాక్కోడానికో వచ్చినోల్లం అసలే కాదండి
అందర్లా మీరూ మమ్మల్ని అనుమానంతో సూసినా
అప్పుడపుడూ మీరే సెప్పుతుంటార్లే మీ సెత్రుత్వం మాతోకాదని
మొన్నటిదాకా మనదంతా ఒకటే బాసంటే
అచ్చరాల నిజమేననుకున్నామండి
మొన్నటి దాకా మిమ్మల్ని మాట్టాడించినప్పుడల్లా
మాకెందుకో నవ్వొచ్చేసేదండీ అయ్ నిజ్జంగానండీ
రౌడీలు, దొంగలూ, బఫూన్లతోనే మీ బాసలో మాట్టాడిత్తున్నారని
నిజ్జంగా మాకప్పుడు తెలీదండీ ..ఆయ్
యీమద్దె మమ్మల్నీ అలాగే మాట్లాడిత్తుంటే
మాకు తెలిసిందండి మా బాసనేదో అబాసుపాల్జేత్తున్నారని
మా బాసతోనే మమ్మల్ని యేలనజ్జేత్తున్నారని
మా బాసతోనే మమ్మల్ని సంతలో అమ్మేత్తున్నారని.!

❊❊❊

మీకూ మాకూ సేలా యిసయాల్లో పోలికలున్నాయండి
నిజ్జానికి మనద్దరిదీ 'ఉమ్మడి' తెచ్చిన గొడవేనండి
మనిద్దరమిప్పుడు 'జాతీయని' బందంలోని శిక్కుకుపోయామండి
రాజ్జెమైనా, రాజ్జాంగామైనా, పెజల గోసినాల గందా

మాకులపెద్దోల్లే నయమేమో
కాత్త కల్లోసారో తాగేసి అటో యిటో తగువు తేల్చేత్తారండి
యీాల్లేంటండీ. .మా వూల్లో అమ్మోర్లా అన్నీ సెప్పినా అర్ధం కానట్టు
పెద్ద పెద్ద కల్లేసుకొని మిడిగుడ్డుల్తో సూడ్డమే తప్ప
పెదాల్నిప్పట్లేదేంటండీ?

❋❋❋

బాసాపెత్తనం గానో ఉమ్మడి సెద్యాలు గానో
గారడీ వోల్లు, ఎవో విద్దెల్తో మాయల్నే సేత్తున్నారు సుమండీ!
యెవల్లొకో యెప్పుడో యిచ్చిన వరాలే మాకిప్పుడొరకత్తులవుతాయ?
మేమెప్పుడూ అనుకోలేదండి
ఆయ్....ఆ కత్తులకోత నిజ్జంగా మాకిప్పుడే తెలుత్తోందండీ
మీకూ మాకూ అన్నేయం జరుగుతుందని
మాకూ ఇప్పుడిప్పుడే నిజ్జంగా తెలిసొత్తందండి
ఆయ్...యింకా సెప్పాలండీ మాదీ గోదారి జిల్లానే నండీ
గోదారోల్లంతా గోదాల్లా బొజ్జలు పెంచుకున్నోల్లే కాదండోయ్
మమ్మల్లందర్నీ చేరదీసి కిరస్తానీ వోల్లు
సదుపూ సంస్కారం నేర్పారంటారే ఆ దలితులనే మమ్మల్నీ పిలుతుంటారైండీ
సెప్పేదేముందండి చెప్పులు కుట్టుకుంటూ యే రోడ్డు మూల్లోనో తప్ప
సదువుకుని సర్కారు కొలువులోవున్న
మా మాదిగోల్లెక్కడున్నారో మా కొక్కడూ కనబడ్డండీ!

❋❋❋

ఇసాలాంధ్ర ఇసాల భావాలెక్కడున్నాయని
మీరెతుకుతున్నట్లే మాల మాదిగోల్లంతా యెక్కడొక్కడో
యిల్లల్లోనో పెల్లిల్లోలోనో సివరికి సొశానెంలోనైనా
యెక్కడైనా ఒక్కటై కనిపిత్తరేమోనని యెతుకుతున్నామండి
మీక్కనిపించినట్టే
మాకూ నేతిబీరకాయలో నెయ్యేదొరుకేత్తందండి!

*కావడి కుండలు, సీమాంధ్ర కవుల తెలంగానం, ఆగస్ట్, 2010*

# కూడికలు-తీసివేతలు

• ధేనువకొండ శ్రీరామమూర్తి

మౌనంగా వుందామనుకున్నపుడే మాట్లాడాల్సి వస్తోంది
నదిని చూసినేర్చుకో నాయనా!
ఇక్కడ రెండు నదులు కలుస్తున్నాయి
అక్కడ నది పాయలు పాయలుగా చీలి ప్రవహిస్తుంది
నీటికి నిజం చాలా తెలుసు

నదిని చూసి నిజం నేర్చుకోనాయనా!
తెంచుకున్నా తెగని బంధం
స్వార్థపు చట్రంలో ఇరుక్కుపోయావు
ఇరుకు ప్రమిదలో వెలుగుతున్న వెలుగు
చిల్లుల కుండలోంచి విచ్చుకవస్తోంది
అర్థం కానిది మనిషి మరగుజ్జు తనం
ఈతరాని సమీపగతం తెలీదు
నాజీలు
నిజాలు
కాన్‌సన్‌ట్రేషన్ కాంపులు
కాశింరజ్వీ అరాచకాలు
ప్రత్యక్ష పరోక్ష హింసల మయం
ఏదో కథ చెబుతుంటారు
అందరూ 'ఊ' కొడుతుంటారు
నిన్ను నీవు మరుగుపరుచకోవద్దు
మనిషికి తెలిసింది
ఒక్కటే!
వినమ్ర విస్ఫోటనం
వాడిది మర్మ సంభాషణ

రహస్యమేదో తనకే తెలిసినట్లు వాక్చాలనం
మనం
తగిన సమయంలోనే మాట్లాడుకుంటున్నాం
ఒక్క నిముషం ఆగి ఆలోచించు
గర్జించు రష్యా గాండ్రించు రష్యా
ఏది ఈ రోజు
జర్మనీ గుండెను చీల్చి కట్టిన
బెర్లిన్ గోడ
బద్ధలయిందికదా!!
అది అనివార్యం
ఇది ఆహ్వానీయం
కలసివుంటే సుఖం లేనప్పుడు
కడగా వుంటే కానిదేముంది??

*కావడి కుండలు, సీమాంధ్ర కవుల తెలంగానం, ఆగస్ట్, 2010*

# పుష్య 'మిత్రులు'

• చల్లపల్లి స్వరూపరాణి

ఏ జెండా పట్టినా
మన ఎజెండా ఒక్కటేనన్నావు
ఎంత ముద్దొస్తున్నావురా అన్నీ!
తెలంగాణా మన పరగణా
తెలుగు వాళ్లంతా మన పాలేర్లు
బడుగులు మన బోయీలు
పిడికిట్లో దొరతనం
చేతివేళ్ల సందుల్లోంచి జారిపోతున్నట్టుంది
తాతల నాటి కర్రపెత్తనం
నడ్డివిరిగి పోయేటట్టుంది
ఒక్కొక్కడు కళ్లు తెంచుకుపోతున్నాడు
వాడి పెడరెక్కలు విరిచి
సమైక్య వావిడి గుంజకు కట్టేయ్
హక్కుల వూసెత్తిన వాడిని
ఐకమత్యం తాడుతో వురికేయి
జనం గుండెలు పగుల్తున్నా పర్వాలేదు
ఈ రాష్ట్రం ముక్కలు కానివ్వకు

*నాదీ వంతు, సీమాంధ్ర కవుల తెలంగాణం, ఆగస్ట్, 2010*

# నీ వెంటే... నీతోనే....

● జుగాష్ విలి

తెలంగాణ ఒక ఓటు
తెలంగాణ ఒక సాకు
తెలంగాణ ఒక ఆటవస్తువు
తెలంగాణ
పార్లమెంటరీ పార్టీల చేతిలో ఓ తురుపు ముక్క
ఎత్తులూ, పొత్తులూ పొత్తి కడుపులో పిడిగుద్దులూ...
బంగారు సింహాసనాల మీద జెండాలు మారడం
ఎన్ని దశాబ్ధాలుగా చూస్తున్నాం

నందిగ్రాం నుంచి ముదిగొండదాకా
సింగూరు నుంచి పోలేపల్లి దాకా
పాలకుల అసలు రూపాల్ని విప్పి చూపుతున్నాయ్

డిసెంబర్ తొమ్మిది రెండు వేల తొమ్మిది ఎంత మంచి రోజు
ఎందరెందరివో
పెట్టుడు ముఖాల పెచ్చులూడి
చిదంబర రహస్యం బట్టబయలైంది

రాత్రికి రాత్రే గోడమీద పిల్లులు కొన్ని
మద్దతు మాస్కుతో ఛానళ్ళనిండా కనువిందు చేశాయి
శ్రీకృష్ణ కమిటితో అవన్నీ తెరవెనక్కి చప్పున జారుకున్నాయ్
పెట్టుబడి
ఎక్కడైనా, ఎప్పుడైనా
పార్టీలకు, కులాలకు, ప్రాంతాలకు
అతీతంగా ఒక్కటవుతుందని
కల్పిత ఉద్యమాలు మనకు తెలిసిన దాన్నే మళ్ళీ చెప్పాయి

తెలంగాణ తెలంగాణ
రాజ్యం కౌటిల్యం గురించీ క్రౌర్యం గురించి నీకు అనాదిగా తెలుసు
దాన్ని నిబ్బరించి నిలవడమెలాగో
నీకు తెలిసినంతగా మరెవరికి తెలుసు?

నీ ఆకాశం కింద, నీ నేల మీద
నీ వానలో నువుతడిసి
రెక్కలు విప్పుకొని నాట్యమాడాలి
స్వేచ్ఛలోని అందమూ ఆనందమూ గురించి
పోరాటమూ దానిలోని అటుపోటుల గురించి
ఇప్పుడు నీకెవ్వరూ కొత్తగా చెప్పక్కర్లేదు
మీ మరో పేరు పోరుగడ్డని చిన్నప్పుడే చదువుకున్నాను.

ఇవాళ
మా అలిశమ్మ అయిలమ్మతో చేయికలిపింది
మా కంచికచెర్ల కోటేశు కొమురయ్య బాట పట్టాడు
పాట చిక్కనై పదునెక్కి నీతోనే నడుస్తుంది
వెంటాడే కలాలు, నీతోనే, నీవెంటే వుంటాయి ఎప్పుడూ

రేపటి తెలంగాణ
దళిత బహుజన ఉద్యమాల విజయకేతనం

*కావడి కుండలు, సీమాంధ్ర కవులు తెలంగాణం, ఆగస్ట్, 2010*

# నిరసనాలంకారం

● తైదల అంజయ్య

అతడు కొన్ని నెలల తరబడి
జేబుకు- ఇంకా చెప్పాలంటే గుండె మీద
నల్ల రిబ్బను ధరిస్తూనే వున్నాడు
ఎన్నాళ్ళీ నిరసన అంటే
అదిపుడు నా దినచర్యగా మారిందంటాడు
ఈ నేలమీద మృత్యువిపుడు
అనేక రూపాలతోపాటు
పాలోని వలె సంచరిస్తున్నదంటాడు
తేనెపూసిన కత్తి అంచుల మీద వాలి
నిరంతరం గాయపడుతున్న సీతాకోకచిలకలం
ప్రాణాలు పోయే వార్తల మధ్య కూడా
వ్యాపార రాజ్యపు ప్రకటనలను
చూస్తున్న నిస్సహాయ ప్రేక్షకులం
అతడు పోరుదారిలో
ఒక్కొక్క మైలురాయి వద్ద రాలుతున్న
గోగుపూల ఆత్మలు రాసిన
అక్షరాలను కన్నీళ్ళతో తడుపుతాడు
లేచివుళ్ళను రుచి చూసి పాడే కోయిల
పదునెక్కిన పాట మోసుకొచ్చే
విరళ యానకం ఈ గాలి
భుజం మీద వాలి వర్షించే
బహు దుఃఖమీ ఆకాశం

కాళ్ళకు నీళ్లిచ్చి కన్నీరుదీసే
అతి సున్నితమీ సంబంధం
ఇక్కడి యోధుని ఖడ్గవిన్యాసం ఒక వీరత్వం
ఇక్కడి రూపాయి ఉరి, బుల్లెట్ కూల్చిన
పచ్చని చెట్టు ఒక అమరత్వం
ఈ భూమిని చీల్చుకొని వచ్చే
విత్తనపు నిరాకరణ అంకురపు లేత పచ్చదనం
ఒక ఆశయం
తడిగుడ్డతో కోసినగొంతు పాడే పాటల ఊట
ఇక్కడి నీరు
కుంపటిలో రగులుతున్నదిక్కడి
నివురు గప్పిన నిప్పు
పల్లె పొలిమేరల చుట్టూ చల్లుతున్న
పొలి ఒక నిశ్చిత సంకల్పం
పలు ప్రాంతాలు వేయి నెత్తుటి వ్యాప్తులతో
దశాబ్దాలుగా అతడు నడుస్తున్న
ఈ నేల నేలంతా ఒక నిరసనాలంకారం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 27 సెప్టెంబర్, 2010*

# కోవర్టు ముఖాలు

● పసునూరి రవీందర్

వలపన్నిన వేటగాళ్ళు
నాటక పరదాల పొదలమాటున నవ్వుకుంటున్నారు.
పొగడ్తల నూకలకు ఆశపడి......పడీ
వెనకపడ్డ నేలమీద ఆకలి పావురాలే రాలిపోతున్నయ్

సలుపుతున్న గాయాల తాడిచెట్టును
ఎడారి ఒంటె తీరు, నిండా ఆక్రమించుకున్నాకే
బలిసిన మర్రిచెట్టు కుట్ర
అర్థమయ్యింది

సమర్థించుకునే పాలుతాగే పిల్లుల నీతి
అన్ని కాలాల్లో ఒక్కటే
నీడనిచ్చే తావును ఛిద్రంచేసి...
ఎనగర్రను నరుక్కునే ఎడ్డితనం
ఇక్కడ ఎనకటి నుంచి ఉన్నది

అమ్ముడు పోవడం కొత్తకాదు
అమ్మను, ఆత్మగౌరవాన్ని
వేలంపాటకు పెట్టి
దళారులుగా మారడమే అసలు విషాదం
లోపల దాచుకున్న
ముఖాల్ని బయటకి తీసి
తెప్పలు తగలేసే వికృత శిశువుల చూసి
అవ్వాక్కతే దిక్కులుపిక్కటిల్లే దుఃఖమైతంది

ఇప్పుడు బయటపడ్డ దొంగలు కొందరే
ఇంకా నటిస్తున్న బద్మాష్‌గాళ్ళు ఎందరో....!

ఆశలమీద వ్యాపారం చేయడం
రేపటిని ఇవాళే తాకట్టు పెట్టడం
నడిచి వచ్చిన దారి మరచి
ఎడారి ఒంటెలతో సహవాసం చేయడం
అమరత్వాన్ని అవమానించడమే!

తోడేళ్ళ పంచన గుంటనక్కలు
రాయబార రహస్యంలో
ఇంటిని నిండా ముంచే యత్నం
చేతనత్వం కొంత . . అచేతనత్వం ఇంకొంత
కీర్తి పేరాశల ఊగిసలాట బానిసల లక్షణం

సమిష్టి కోసం...ప్రాణాలను సైతం వదులుకునే నేల ఇది
బందగీ నువ్ మళ్లీ పుట్టు
బలిదానమంటే ఏందో మరోసారి నిర్వచించు
కొమురంభీం.. .కొట్లాట ఎట్లుండాలో
ఒక ప్రైవేట్ క్లాసు తీసుకొని పో
వంగి పోతున్న నడుముల మీద
ఒక్క తన్ను తన్నిపో ..
శరీరం ముక్కలైనా
ప్రజల పాటను పడిపోకుండా
ఒడిసి పట్టుకున్న కోయిలమ్మా బెల్లి లలితా
చెంపదెబ్బలు కొట్టయినా . నీ తండ్లాటను
మాకు తలాకొంచెం పంచిపో

*ఆదివారం, ఆంధ్రజ్యోతి 10, అక్టోబర్ 2010*

# మిథికల్ ఫిలాసఫీ


● ఊడుగుల వేణు


"గ్లోబలైజ్డ్ వరల్డ్ లో సపరేట్ ఉద్యమాలా?"
ఇది లోకమంతా వినిపించిన గ్లోబల్ ఒపీనియెన్

ఊహకందని కొత్త తుఫాన్ కు
ఆలోచనలో పడిన ప్రపంచం

వేర్లని ఊడబీక్కుని వచ్చి...
వీధుల్లో తుమ్మ చెట్ల శాంతి యాత్రలు

రెక్కలతో కంజీరలు మోగిస్తూ
పాలపిట్టల పాటల కవాతులు

జ్వలించీ జ్వలించీ
విస్ఫోటనం చెందిన భావోద్వేగాలు
అవి ఆగిపోతున్న శ్వాసకు వాయుప్రవాహాలు
బిగుసుకున్న పిడికిల్లకు ఇత్తడి పూతలు
నాల్గో తరం తంతెలపై-
కలుపు తీసే తల్లుల కడుపు కోతలు
ఎర్రటి కలువలై పూచాయి

వేల క్యూసెక్ల కన్నీటిని కంటున్న ఊట చెలిమల్లో--
ఘనీభవించిన రుధిరం హిమద్రవమై కరుగుతోన్న క్రమంలో
పచ్చనాకుల సాక్షిగా--
పసుపుపచ్చని బీభత్సం- లెక్కలేనన్ని సమ్మెటపోట్లు

రెక్కలు తెగిన తుఫాను అనుకోవద్దు
తిరిగి లేచే ఫీనిక్స్ పక్షి నా తెలంగాణ

సూర్యుడికి కాసేపు
అడ్డొచ్చినంత మాత్రాన
కారు మబ్బులు గెలిచినట్లా?

త్యాగాల తీరాల్లో
తారాడుతున్న అలలపైన
అలవోకగా అపహాస్యాన్ని చిమ్ముతున్నారు—నీ
మావి
రాళ్ళని మేల్కొల్పిన స్వచ్ఛమైన ప్రాణాలు
ఒక మహోజ్వల స్ఫూర్తిని విరజిమ్మిన వజ్రాయుధాలు
కాబట్టే కదా
ఇక్కడ మరణాలు
మహాకావ్యాలయి పుడుతూ వుంటాయి
మేం రామని- ఇక కనబడమని భ్రమపడొద్దు
రాతి స్తూపాలే మా శరీరాలు
మా ఆత్మలు అఖండ కాంతి పుంజాలై .
అక్కడ నిక్షిప్తమై వుంటాయి
మా ఆలోచనలు దళిత బహుజనడప్పులై
గర్జిస్తూ వుంటాయి
తర్కం ఏమిటంటే స్వయంపాలనకోసం
"మా లోపలికి మేము వెళ్ళిపోవటమే"

"అసవస్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరన
అనాశినో ప్రమేయస్య తస్మాద్యుద్ధ స్వభారత"
ఇది కృష్ణ తత్వం
ఇక మీరు అడ్డుకోవడం - మేము ధిక్కరించడం లాంటి-
రెగ్యులర్ లొల్లిని అప్‌డేట్ చేసుకుందాం
ఈ మిధికల్ ఫిలాసఫీని అడాప్ట్ చేసుకుందాం
మీరు బ్రతుకు రహస్య మెరిగిన వాళ్ళు కదా
ఇక్కడ బహిరంగ యుద్ధమొకటి

పడిగాపులు కాస్తోంది
నిలువెత్తు కత్తులతో సిద్ధమవండి

మన కత్తులు రెండు రాసుకున్నప్పుడు
రాజుకునే మెరుపులలో శబ్దాలలో
పొలికేకలు కలగలుస్తాయి- ఎవరివైనా కావొచ్చు
హోరుగాలికి గులాబి రేకులు ఒక్కొక్కటి రాలి
పోయినట్లు దేహాల నుండి తెగిపడుతోన్న భాగాలతో-నెత్తురుతో
యుద్ధభూమి భీతిల్లిపోతుంది
ఎవరి భాగాలు ఎక్కడ పడ్డాయో తెలియదు
ఆ ఎర్రటి చెరువులో చచ్చిన చేపల్లా తేలుతోన్న అవయవాల నడుమ
ఏ మాంసం కండలైతే
పౌరుషం తో ఎగిరెగిరి పడుతుంటాయో
అవి తెలంగాణ బిడ్డలయని తెలుసుకోండి

మేం మృత్యు రహస్య మెరిగిన వాళ్ళం
భగ్గున మండే గుణమున్న భాస్వరాలం
We know how to feel the heat
We know how to feel the death
పోరాడుతూ అంతమొందటం - మాకు చిన్న విషయం
మరి మీ సంగతి?

ఇవాలో రేపో, తలవంచక తప్పదు
గాయపడ్డ పాలపిట్టని కాల్లుమొక్కి
తుమ్మచెట్ల పాదముద్రల్లోని
ఇంత మట్టిని గుప్పిట పట్టి
ఎదలపై రుద్దుకుని చూస్తే
ఆత్మగౌరవం అర్ధమవుతుంది
మనసు పరిశుద్ధమవుతుంది

*ఆదివారం, ఆంధ్రజ్యోతి, 24 సెప్టెంబర్, 2010*

## కాడెద్లు

• మహ్మద్ హనీఫ్ అలీ

జబర్దస్తీగ ఇంట్లకు జొర్రబడి
బబ్లింగమోలె అతుక్కొని పాకుతున్న
నల్లబల్లుల మజిలీలలు దొబ్బుకుంటున్న దొరతనం
మూసీలకు ముంచబడుతున్న ఆత్మబలం మా కనీసపు హక్కులు
మేధావుల ఆలోచన తీరులపైన
కమ్ముకుంటున్న తుఫాను మేఘాలు
చరిత్ర అమావాస్య చంద్రగ్రహణం
బలహీనుల్లో రాజుకున్న కుంపటి పోరాటమే చిరునామా లెక్క-
అమరుల స్థూపం సాక్షిగా పల్లెల్లో పూచిన గులాబి పూలు
అసలే వద్దు ముద్దు బిడ్డల్లారా క్షణిక ఉద్రేకాలు మూలకునెట్టి
చేపలోతిగ ఎదురీత నేర్చినోళ్ళం
నిఘాకండ్ల కెమెరాలతో కలెబడుదాం
మిమ్ములను కోల్పోయిన తెలంగాణ
పూలు పిందెలు రాల్చుకున్న నా వతన్
ఒక ఒంటరి వనం రోషం నిండి పారే ఆత్మగౌరవం స్వంతం
ఆత్మతేజం సూర్యరశ్మి వర్ణం శ్రీకాంతాచారి టు ఇషాంత్‌రెడ్డి
"ఇచ్చేది తెచ్చేది మేమే" నని బొంకులు
ఎదురు చూపులు వెదుకులాటలు
మన అసెంబ్లీ ఒక బందిల దొడ్డి
ముల్లుగర్ర గుచ్చేది కేంద్ర హస్తం
అధిష్టానం కండలు మంచుగడ్డలు
కాని కాలమొచ్చింది కాడెద్లు మార్చుకోవాలే

*వీర తెలంగాణ, అక్టోబర్ 2010*

# జరుగు - జరుగు

• దాసోజు జ్ఞానేశ్వర్

ఓనా వలస సామీ! నీజాత్కమంత
తిరిగేసి మరిగేసి ఎట్ల జూసినా
తెలంగాణ శెట్టుకు వట్టిన చెదపురుగువేనని
తేటతెల్లమైంది నిన్ను ఇంట్లెకు రానిచ్చింది మొదలు
వాసాలు లెక్కవెడుతుంటే
నాకు నీకు సోపెతెట్టగలుస్తది?
పేరు మార్చి పెండ్లి జేసినంత మాత్రాన
స్వభావం మారంది-సాపత్యమెట్ల నిలుస్తది?
మన మజ్జెన నక్కకు నాగలోకానికున్నంత తేదుంటె
ఇదాకులకు గాకుంట యింకేమిగురుం మిగిలిందని?
గుండెను చెరువోలె జేసుకొని బతుకొచ్చిన పతోన్ని
శాప పిల్లలోలె సూసుకొనేది నేను-
ఎండ్రికిచ్చలోలెజేరి పొలంల
బుంగలు వెట్టుకొనే దొంగవు నువ్వు
మా తాత ముత్తాతలు
బొట్టుబొట్టుగ రగుతంగార్శిన ఎఱ్రనేలల్ల
వానపామోలె తిరిగెటోన్ని నేను-
పచ్చగున్న కాడల్ల పత్తిపురుగులెక్క
రసం బీల్చెటోనివి నువ్వు
నల్లరేగడి నేలల్ల ఆరిద్రపురుగోలె
పందుమిరపతోని దోస్తాన జేసేది నేను-
పొగాకు తోటలల్ల ఎండిన
దరిద్రపు పీనిగోలే ఎల్లాడేది నువ్వు
చెరిసగం పారిచ్చుకుందామంటె నమ్మి

నా వూల్లను ముంచి - ఏర్లను మల్లిచ్చి
ఎదుమకాల్వను ఎండబెట్టి
కుడికాల్వ పేర్న కొల్లగొడుతున్నది నువ్వు
ఎట్లనోగట్ల వొచ్చిపడ్డ మ(ర్రిత్తుకు
జగ్గల మజ్జెన కుసింత జాగిచ్చి
జాలితోని సూసుకున్న తాటిబొత్తలె నేను-
ఆ బొత్తనే మొత్తంగా ఆక్రమించుకున్న
(ఛ)వటవృక్షానివి నువ్వు
సూశినావె-
నీకు నాకు నడుమ యింత ఏరుబందమున్నంక
మనమజ్జెన సోపతెట్ల కుదుర్తదే?
ఏదో సామెజ్జెప్పినట్టు తల్కాయె నాకు పంచిచ్చి
పొదుగు దగ్గరపొందుగ గూకుంటివి
మొదలుకు నీళ్ళు నాతోని పోపిచ్చి
సక్కదనంగ - కొమ్మల పండ్లు నువ్వేరుకోవడితివి
నీ "వలస తెలివి"నంత సూశి సూశి
సోయి దెచ్చుకోని నిలోయంగనె
'తెలంగాణోడు దేశద్రోహి' - అనుకుంట
నోటికొచ్చినట్లు మొరగవడ్తివి
సమైక్య రాష్ట్రం మోసంతోని నువ్వు-
మా బతుకుల్ల అమాసను అలుకుతుంటె
ఏకంగ ఎన్నెలను పుదిచ్చుకుంట నేనున్న
గిట్టున్నంక - నీ మోసానికి నా మమకారానికి
సోపతింకేలెక్కన గుదుర్తదే?
జరుగు జరుగు - శాంతనం సాలిచ్చు
నీళ్ళమీద - నేలమీద హద్దులు గీసుకున్నంకనే
గిప్పుడింకే మాటైనా- ముచ్చటైనా

*వీర తెలంగాణ, అక్టోబర్ 2010*

# తెలంగాణ వేదనాగీతం

● నారాయణమూర్తి

ఆర్తనాదం...
పల్లెలో వలస మూటలో చిక్కుకున్న ఆకలికేక
బయటికి వచ్చేందుకు
పదవులే పరమావధి ఒక తన్లాట
అనాదిగా దోపిడీకి గురవుతున్న ఉనికి సాక్షిగా
నిరంతర నినాదం ఆత్మాభిమానపు ఆరాటం వత్తై మండుతున్నది
నిష్కపటంగా ప్రాణాలిస్తూ ప్రజలు తెలంగాణ ఆర్ధి ప్రమిదలో

నవరసాల 'మాయబజార్'లో
నమ్మినవారికి కన్నీరు
నటుడి దొంగ నవ్వు నమ్మి మోసపోయిన ప్రాంతం ఈ నేల
ఇప్పుడు తెలంగాణ సాధనలో ప్రజలే నాయకులు
అమర జీవులభిమన్యుల ఆవేశంతో
ముందుకు నడవాల్సిన సమయమొచ్చింది
ఐక్యపోరాటమే మార్గం
ఎగువ గోదావరి ఎడారిలో
తెలంగాణ గళాల ఉద్యమ హోరులో
విరజిమ్మే నెగడిదగడు ఎరగళ్ళు
కపటనటుల నాటకాల్ని బద్ధలుచేస్తయి
నరనరాల్లో సలసల కాగే
యువకుల రక్తం తెలంగాణ దిక్సూచీ

*కొలిమి కవిత్వ సంకలనం, అక్టోబర్. 2010*

# మీరు... మేము... మనం...

• కోవెల సంతోష్‌కుమార్

ఏ దేవతలూ రక్షించటం లేదు
ఏ మహాత్ములూ కాపాడటం లేదు
నమ్మకం కోల్పోయి కాళ్ళ కింది భూమి తొలగిపోయి
ఎక్కడా నిలువ లేక తల్లీ తెలంగాణమా...
ఒక్కరొక్కరుగా నీ దరికి చేరిపోతున్నారు
తెలంగాణమొక ఆకాశసముద్రంగ మారిపోయింది
ఈ సముద్రంలో ఎంత సేపు ఈదినా శరీరం అలసిపోదు
ఎప్పటికీ చేతికి ఏదీ అందదు
క్షణక్షణం మారే రంగులతో సమైక్యవాది వలె
ఈ ఆకాశం అంచనాలకు అందటం లేదు
దూరం తెలియనంత గమ్యంలో
తెలంగాణ కనిపిస్తోంది
ఆ దూరం తరగటం లేదు. గమ్యం చేరటం లేదు
మన ప్రయాణంలో ఆయుధాలను వారు దొంగలిస్తున్నారు
గమ్యం చేరకముందే రైలుపట్టాలను తొలగిస్తున్నారు
సంకల్పాలను విషపూరితం చేస్తున్నారు
సామరస్య ద్వారాలను మూయిస్తున్నారు
మృత్యు శార్దూలాలై మీదపడి దొంగదెబ్బ తీస్తున్నారు
డిసెంబర్ 9 బర్త్‌డే గిఫ్ట్‌ప్యాక్‌ను దారి దోపిడీ గాళ్ళు
దోచుకుపోయారు
వైఫల్యమే ఫలించబోతోందా అన్న అనుమానం
తెలంగాణమా నీ బిడ్డలు ఒక్కొక్కరే నీలో సంలీనమవుతున్నారు
అయినా ఇక్కడ ఎవరూ బలహీనులు లేరు
పర్బస్సు కోసం బలం కోసం శక్తి కోసం

ఈ మృత వీరులు శ్రీకాంత్, యాదిరెడ్డిల హస్తాల నుంచి
ధనుస్సులు అందుకుంటున్నాం
మీరూ...మేమూ...మనం అంతా కలిసి
తెలంగాణమంతటా ఆవరించిన వైరి చక్రాన్ని తప్పక అతిక్రమిస్తాం
ఈ వీరుల తెలంగాణ మాతృభూమి ఒడిలోకి
అధిక పర్చస్సును ప్రసరింపజేసేందుకు చేరుస్తున్నాం
తల్లీనీ బిడ్డను బలంగా నొక్కకు
ఆవేదనతో నీ దరికి చేరుతున్నారు
శిరీష కోమల శరీరాల్ని సుకుమారంగా నీలో పొదువుకో
తల్లి బిడ్డను పొత్తిళ్ళలో ఒదిగించుకున్నట్టుగా ఒదిగించుకో
మేము తెలంగాణ నిగళాలు తెగగొట్టి ఆకాశమంత ఎత్తార్చుతాము
వేయి అమర నక్షత్రాల సాక్షిగా తెలంగాణ మహోదయాన్ని స్వాగతిస్తాం

*కోవెలబ్లాగ్‌స్పాట్.కామ్, అక్టోబర్ 2010*

# బరిగీసి పోరాడాలె

• *దిలావర్*

బిడ్డలాల! గిట్ల అగస్తమార్గంగ
ఏ సుక్కలల్ల సుక్కలైపోతాంద్రు
చావును కావులించుకొనుడేంది?
మనం సచ్చుడంటే
జులుంను, దోపిడిని, అణిచివేతను
బతికిచ్చుడేకదా?
మన నరాలల్ల పిరికి నెత్తురు కాదు
మిత్తవతోని తొడగొట్టి సవాల్ చేసే రక్తం కావాలె
సాకలి అయిలమ్మ, దొడ్డి కొమురయ్య
కొమురం భీమ్, బందగీలను
యాది మర్సిన్రా నాయినలాల?
మనం ఏ సుఖాలు అనుబగిచ్చినమని
బతుకంటే యాష్టకొస్తాంది?
మన సెమటతోని తడిసిన చెల్కలు,
మన కలల పంటపొలాలు
వాళ్ల జంతర్ మంతర్ జాదూతోని
నక్షాల పత్తా దొరక్కుంట పోతన్నయ్
మన మూతులకు చిక్కాలు బిగిచ్చి
మన తిల్లరొమ్ముల పాలు - కృష్ణాగోదారుల్ని
వాళ్ళ దౌర్జన్యంగ తాగుతాంద్రు
మన బయ్యారం గనులు, సింగరేణి బొగ్గు గుట్టలు
ఫెర్రో ఎల్లాయిస్‌లు, కెటిపియస్‌లు
వాళ్ల వలలల్ల చాపలెక్క తండ్లాడుతున్నయ్
మన చాపల్ని మనమే పట్టియిచ్చే

లేబర్ గాండ్ల మయినం
కువకువలాడే మన వుద్యోగాలను
వాళ్ళు గద్దలెక్క తన్నుక పోతాంద్రు
మనం పెట్టుకున్న పుట్టలల్ల పాములై
వాళ్ళు బుసకొడుతాంద్రు
మన కంటి పాపలు పొదిగిన కలల్ని
వాళ్ళు ఆగమాగంగ చిదిమి పారేస్తాంద్రు
మనం ఏ కుషామతి పరుపుల్ల దొర్లుతున్నమని
గప్పుడే తనువులు సాలిచ్చ బట్టింద్రు తంద్రులాల!
పాండవులోల్ల కత - దాయాదులు నడ్మ జరిగిన జంగును
జర యాజ్జేసుకోండ్రి
అజ్ఞాతపు వేషాలు తీసేసి
జమ్మిచెట్టు జాడ కనుక్కోండ్రి
రాజోలి బండ షట్టర్ల సాక్షిగా
మన కలల చుట్టూతా వాళ్ళు కట్టిన
యినుప గోడల్ని కూలగొట్టాలె
మన అమ్మను బాంచెతనపు బతుకునుంచి
ఆజాద్ చెయ్యాలె
అరె.... మన పెయ్యి మంచుముద్దలెక్క
సప్పంగ సల్లారుదేంది?
మన నరాలల్ల బిజిలీ ప్రవహించాలె
మన గుండెలు అగ్గి గుండాలు కావాలె
మన వూపిరి నిప్పుల వుప్పెన కావాలె
మన జై తెలంగాణ నినాదాలు
పిడుగులై దద్దరిల్లాలె
బలిదానం కాదు బిడ్డలాల!
బరిగీసి పోరాడాలే - పాతాళం లోపటికెల్లి
మీరు ఆజాదీని పైకి తెచ్చేదాంక

అంపశయ్యమీద భీష్మని లెక్క
పానాలు ఉగ్గబట్టి బత్కుత
సంకెళ్ళు తెగిన మన తల్లి రామసక్కని రూపం
కళ్ళారా సూసినంక పానం యిడుస్త
నా బిడ్డలాల! గప్పుడు మీరు
పరాయితనం లేని మన సొంతగడ్డ మీద
నాకు తలకొరివి బెట్టనీకి రావాలె
గని- తరీకకు ఖిలాఫ్‌గ
మీరు బలిదానం చేస్తే
వొణుకుతున్న ముసలి చేతులతోని
నేనే మీకు ఎట్ల తలకొరివి పెట్టాలె బిడ్డా!
గప్పుడు నేననబగిచ్చె కదుపుకోత
కలికలి అయ్యే మనుసు తండ్లాట
తల్లడ మల్లడమై అవిసిపోయే గుండెల బాధ
గోదు గోదుగ గోసగోసగ
సుదులు తిరిగిపైకి పెకలని దుక్కం
ఎవరికి చెప్పుకుంటె ఎవరు యింటరు తండ్రీ!

*సింగిడి తెలంగాణ ముస్లిం ప్రత్యేక సంచిక, 1, నవంబర్, 2010*

# సిగ్గుపడుతున్నా

● సయ్యద్ ఖుర్షీద్

నేను సిగ్గుపడుతున్నాను
మీలో ఒకడ్ని కాలేక పోయినందుకు
మీతో పాటు
ఓ రాయి వేయలేకపోయినందుకు
మా నీళ్ళు మాక్కావాలని
మా కొలువులు మాకే దక్కాలని
మా భూములు గనులు మావేనని
మొత్తంగా మా తెలంగాణ మాక్కావాలని
వందల మంది పిల్లలు పిట్టల్లా రాలిపోతే
"అయ్యో, పాపం!" అన్న పాపానికి పోనోడు
మా అభిప్రాయాలను
పిసరంత కూడా పట్టించుకోనోడు
నిండు సభలో సమైక్యతా వాదమంటూ
సొల్లు కూతలు కూసినోడు
మా సగటు చావుల్ని
తన రాజకీయ ఖాతాలో వేసుకొని
"చారానా కోడికి బారాన మసాల " అన్నట్లు
ఓదార్పు అంటూ ఊరేగుతానంటే
కులమతాలకతీతంగా
వందలు వేలు కలసికట్టుగా
మీరంతా నిలబడి
కలబడ్డ తీరు చూసి
వలసవాదాన్ని ఎదిరించిన
మానుకోట తెగువకు ముచ్చటపడి

మీలో ఒకడ్ని కాలేకపోయినందుకు
నేను సిగ్గుపడుతున్నాను
"ఇంటి దొంగల్ని
ఈశ్వరుడైనా పట్టలేడంటారు"
ఇప్పుడిక్కడ ఇంటి దొంగలే ఈశ్వరావతారులు
మననీళ్ళు మన ఊళ్ళు దోచి
మన భూముల్ని బీళ్ళుగా మార్చి
మన కొలువుల్ని కార్పోరేట్ పరం చేసి
మన సేద్యాన్ని సెజ్‌లకిచ్చి
మన వాదాన్ని వెక్కిరించే వెధవలకు
వంత పాడే తాబేదార్లను
వెంటబడి ....తరిమి....తరిమి.....
తెలంగాణ తెగువను చూపిన
'మానుకోట' ను చూసి
మీలో ఒకడ్ని కాలేకపోయినందుకు
మీతో పాటు
ఓ రాయి వేయలేకపోయినందుకు
నేను చాలా సిగ్గుపడుతున్నాను.

*సింగిడి తెలంగాణ ముస్లిం ప్రత్యేక సంచిక, 1, నవంబర్. 2010*

# నీది నీదే నాది నాదే

● కందుకూరి శ్రీరాములు

అఆలు దిద్దింది చూసి
అక్షర జ్ఞానాన్ని
మెచ్చుకుంటావనుకున్నానుగాని
బడిమాని
పశుల కాపరినైతే చూసి
పరాచికం ఆడతావనుకోలేదు
కట్టడాలు కట్టింది చూసి
కళానిధిగా చూస్తావనుకున్నానుగాని
ఇసుక సిమెంట్ మోసే మేస్త్రీవైతే చూసి
ఆప్తునిగా గుర్తిస్తావనుకున్నాను గాని
పగలబడి నవ్వు తావనుకోలేదు
ఆకు పసరు మందిచ్చింది చూసి
తాయెత్తులు సాగ్గొట్టే
చేతగాని భూతవైద్యుడిగా చూస్తావనుకోలేదు
విలువిద్య నేర్పింది చూసి
విలుకానితో పోలుస్తావనుకున్నానుగాని
గురుదక్షిణ ఎరబెట్టి
బొటనవేలు నరుక్కుపోతావనుకోలేదు
రాజకీయాల్లో రాణిస్తుంది చూసి
సాటి నాయకునిగా సరిదిద్దుతావనుకున్నానుగాని
సుద్దులెన్నో చెప్పి
గద్దె ఎక్కి కూచుంటావనుకోలేదు
ఈడుకు సరిజోడును చూసి
భార్యాభర్తలు ఏడడుగులు వేసి

మురిసి పోదామనుకున్నాను గాని
నడుము వంగి పోయేదాకా
కొడుకు లొంగి పోయేదాకా
పిప్పరమెంటు చప్పరించినట్టు చప్పరించి
నగ్నంగా నడిబజారులో నిలబెడుతావనుకోలేదు
నగలన్నీ లాక్కొని నడిసముద్రంలో ముంచుతావనుకోలేదు
కాలికి పోటు రాయిలా
నెత్తిమీద బండరాయిలా
అటు గోడదెబ్బ ఇటు చెంపదెబ్బనై పోతాననుకోలేదు
కంట్లో వేళ్ళు గుచ్చి చెవుల్లో మేకులు కొట్టి
ముక్కుకు ముంతపొగ పెట్టి
నోటికి గుడ్డ పేలికలు చుట్టి
కడుపు మీద గుద్దినా వీపు మీద తన్నినా
కాళ్ళు కట్టేసినా చేతులు ముడేసినా
ప్రేమను పంచుకున్నాను తప్ప
ద్వేషం పెంచుకోలేదు ఔదార్యం తప్ప
అహంకారం ప్రదర్శించిందిలేదు
మానవత్వం తప్ప మూర్ఖత్వంతో మాట్లాడలేదు
బతుకును కాష్టం చేసి కాల్చేస్తుంటే
జీవితాన్ని వేలంపాట వేసి అమ్ముతుంటే
ఎట్లా ఊర్కుంటాను
ఊతకర్రనే గుతపకర్ర చేసుకున్నాను

ఇక నీతోపొత్తూ కుదరదు ఇక నీ బోడి పెత్తనమూ వద్దు
గట్లు గట్లుగా విభజించుకున్నాక
ఎవరి పొలం వాడిదే! హద్దులు హద్దులుగా గుర్తించుకున్నాక
ఎవడి జాగ వాడిదే! నీది నీదే నాది నాదే

*వివిధ, సోమవారం,ఆంధ్రజ్యోతి, 22 నవంబర్, 2010*

# లారీలు తూటాలు తెలంగాణని ఆపలేవు

● సుజాత సురేపల్లి

కొట్టండిరా బాగకొట్టండి
మా తలలు చిట్లేటట్టు
ఇన్ని రోజులుగా మిమ్మల్ని
నమ్మినందుకు మా మెదళ్ళు పగిలెటట్టు
కొట్టండి లారీలు కాదు దుడ్డు కర్రలతో
ఒక్కళ్ళు కాదు పదిమంది కొట్టండి
బొక్కలు ఇరిగెటట్టు

మాకు ఈ శాస్తి కావలసింది
మాకు గుడిసె కూడ లేకుండా
మీరు మా జాగల బంగ్లాలు కట్టుకున్నప్పుడు
చెమటోడ్చి దగ్గరుండి కాపల
కుక్కల్లెక్క గూర్ఖాలైనము
ఇదెం అన్యాయం అని ఎన్నడూ అడుగలే
ఆ మంచితనం మచ్చుకైన లేకుండా
పోయెదాక కొట్టండి

మా నీళ్ళు మీరు తోల్క పోతుంటే
అంతా మావోల్లే అని మర్యాదగా
ఉర్కోని మట్టి పని చేసుకునెటందుకు
మూటముల్లె సర్దుకొని
ముంబయి దుబై పోయినము నీళ్ళు లేక

బోర్లు ఏసుకొని బొర్ల బడి
బతుకులు ఆగం చేసుకున్నం
చావులని చల్లంగ చూసినం

నర నరాల్లోంచి ఈ మర్యాద
పోయేదాక కొట్టండి

కింద మీద బడి గింత చదువు
చదువుకుంటే కొలువులొస్తయిలె అని
ఆశపడ్డ, ఏడినుంచో వచ్చి
గద్దలోలే తన్నుకు పోతే
మా రాజకీయ నాయకులు
కాపాడుతరులే అని
కోటి ఆశలు పెట్టుకొని
మా నమ్మకాలు అన్ని
నాశనం అయేటట్టు కొట్టండి

పాఠాలు నేర్చుకునే మా పిల్లల మీద
జలగాలు దింపి
బాష్పవాయువులు ఏయండి
హక్కులు అడిగినప్పుడల్లా
తూటాలతో పిట్టలను
కాల్చినట్లు కాల్చండి

రాజకీయ నాయకుల్లార
మా శవాలను తివాచిల్లాగ
పరచుకొని వాటిపై
మా రక్త మాంసాలను
అమ్ముకొని సంపాదించిన
సొమ్ములు పదవులు ఎంజాయ్ చేస్కుంట
ఆంధ్రా నాయకుల
తొత్తులుగా మారి
మాపై జరుగుతున్న విధ్వంసాన్ని
ఆహ్లాదంగా ఆస్వాదించండి

సిగ్గు లజ్జ లేని
శవరాజకీయాలను చేసే
నాయకుల్లారా మీరు
ఈ తెలంగాణ గడ్డ బిడ్డలైనందుకు
మా చావులు మా పై విరిగిన లాఠీలు
చిందిన రక్తం, మిమ్మల్ని
కదలించనందుకు
మీ మౌనాన్ని చూసి
మమ్మల్ని మేమే అసహ్యించుకుంటున్నం

రాపిడిలో పుట్టిన అగ్గి రవ్వలే
పిల్లిని పట్టుకొని కొడితె అయ్యేది పులే
ఇక్కడి రక్తంలా అమాయకత్వం ఉంది
ఇక్కడ విప్లవం కూడా ఉంది
బ్రిటీష్ రాజరికపు గోడలను
దొరలగడీలను రజాకార్ల అరాచకాలను
కూల్చిన రక్తం గుండుకు గుండె పట్టిన ధైర్యం
అన్యాయాన్ని భరించలేక
ప్రాణాలను కూడా లెఖ్ఖచేయని యువ రక్తం

ఈ అణచివేతలు, ఊచ కోతలు
హింసలు విధ్వంసాలు తెలంగాణని ఆపలేవు
మంచితనాన్ని అమాయకత్వాన్ని అణిచివేస్తే వచ్చే ఆవేశాన్ని
దాని రూపాలని అంచనా వేయలేవు సైన్యాన్ని దింపితె
ఇక్కడ జరిగేది యుద్ధమే
మర్యాద తప్పితే మారణ హోమమే
మానవత్వాన్ని మంచిని మరిస్తే
తయారయేది మానవ బాంబులే
శాంతి కావాల్న? అశాంతి కావాల్నా తేల్చుకోండి

*ప్రజాతంత్ర, శనివారం, 20 నవంబర్, 2010*

# మొదటి సంతకం

• కత్తి పద్మారావు

నక్షత్రాలు మాట్లాడుకొంటూనే వున్నాయి
సూర్యుడు తొంగిచూస్తున్నాడు
గొంతులు గీరబోయినా
అవతలి వారు వినరు
అభివ్యక్తంతా
గగన వాయువుల్లో సుడులవుతోంది
సముద్ర కెరటాలు
అగ్ని ఛటల్లో దుందుభులవుతున్నాయి
పాట మాట దేశీయతను పలవరిస్తున్నాయి
అన్ని అస్తిత్వాలు పొలికేకలవుతున్నాయి
మట్టి వాసన పరిమళభరితమై
కావ్య గానమౌతుంది
కారుమబ్బుల్లో వున్న మెరుపులు
విభజన రేఖను సూచిస్తున్నాయి
ఎవరు ఈ దుండగులు
తుంగభద్ర నదీతీరాన
రక్తపాతం చేసినవారేనా!
కృష్ణవారలో
దళితుల తలలు తీసినవారేనా
అక్కడ కులం ఇక్కడ ప్రాంతం
డప్పు నుండి వస్తున్న శబ్ధశృతికి
వేస్తున్న అన్ని నృత్యాలు
సామాజిక ప్రాంతీయ అణిచివేతకు వ్యతిరేకమే
దురాక్రమణ
తెల్లవాడిదైనా ఫ్రెంచివాడిదైనా

వలసకులవాదిదైనా
పోరాటం నేల పగుళ్లనుండే
పుట్టక తప్పదు ఎత్తిన పిడికిళ్ళలో ఆత్మగౌరవం ఉంది
దేశీయత వుంది పేగుబంధం వుంది
అంబేద్కర్ చూపుడు వేలు చెపుతున్న కదనంలో
హక్కుల పోరాటం వుంది రాజ్యనిర్మాణం వుంది
వూరి పొలిమేరల్లో ఎగురుతున్న జెండా
దొరల పెత్తనానికి కూడా పెనుసవాలే
భాషల్లో దాగున్న సాంస్కృతిక పునాదులు తవ్వబడుతున్నాయి
ప్రాంతంలో కుల పెత్తనం ప్రశ్నించబడుతోంది
భూమి, నీళ్లు, ఉపాధి దేశీయ హక్కులుగా ముందుకు వస్తున్నాయి
దోపిడి దొంగల రాజీ పత్రాల్లో వున్న
కుమ్మక్కులు బజారు కీడ్చ బడుతున్నాయి
అంతరాంతరాల్లో దాగిన
బౌద్ధ క్షేత్రాలు సమధర్మాన్ని బోధిస్తున్నాయి
ఎన్నో బూట్ల కవాతులు సైనిక ప్రహరీలు
రాచరిక ఆధిపత్యాలు రజాకారుల అకృత్యాలు
అగ్రకుల వలసవాదుల దురాక్రమణలు
ఎదుర్కొని రాటుదేలిన తెలంగాణ
ఇంటిలో కూడా అగ్రకుల ఆధిపత్యాన్ని ఎదుర్కొంటుంది
ఇదొక పోరాటాల చరిత్ర విజయాల గాథల్లో
ఎందరో వీరుల మరణ శాసనాలు వున్నాయి
ఆ తల్లి నిజమే చెపుతోంది విజయం ఇరువైపుల అనివార్యమే
దళిత బహుజనుల సమరశంఖానాదమే
ఆత్మవిశ్వాసం అంతిమ కవాతును నిర్ధేశిస్తుంది
తెలంగాణ రాష్ట్రం దేశీయులదే వారిది వారికి ఇవ్వడమే
సామాజిక ప్రజాస్వామిక న్యాయం అని
మొదటి సంతకం చేశాను

*సోమవారం, వివిధ, ఆంధ్రజ్యోతి 27, డిసెంబర్ 2010*

# యాభయేళ్ళ యాతన

• ఎలనాగ

కల తలక్రిందులయితే కలిగేది దుఃఖమే
తోటకాలిన దృశ్యంలోంచి
తొంగి చూసేది మోడువారిన హృదయచిత్రమే
ఒక మెరిసే స్వప్న వైఢుర్యాన్ని పొదిగిన
సొంత కుటీరం కోసం
వదలిన పీడితాంతరంగాల మీద
వసంతాలు పరుచుకునే మధుర క్షణం కోసం
యాభయ్యేళ్ళ ఆరాటంతో
యాతన పడుతున్నానంటే
క్షోభ ముసిరిన ఈ అంతరింద్రియాల్లో
ఎంత వేడిమి నిండి వుందో ఎరుగలేవా నువ్వు?
పాదం మోపిన భూమిని
పందేరం కోసం చాపలా లాగేసి
పొలాల పొడి నాల్కల మీద తుళ్లింతలయ్యే
జలాల చైతన్యపుటలల్ని దారి మళ్లించి
నేలతల్లి బిడ్డల బ్రతుకు తెరువును
కాలరాస్తూ పెట్టిన ఎసరు
కంటకథామాలుగా మార్చింది ఇక్కడి ఇంటింటినీ
నోటికాడి ముద్దకు రెక్కలు మొలిచి
వెక్కిళ్ళను మేం మూటగట్టుకోవడం
నీ లెక్కలోకి రాదనుకుంటా

చీమల బారులు చేసిన చిత్రాక్షరాలకు
స్థానిక బ్రతుకు లోపలి
సస్యశ్యామలత పరారు!

మానని గాయాల మీద మాటల కారాన్ని చల్లటం
రోజుకో నిప్పుల కుంపటి రాజేస్తూ
గోడమీది పిల్లిని సైతం సిగ్గిల్లగజేయడం
ఇలా సాగినందుకే కదా
ఇలాకాలుగా విడిపోవాలనటం

పొసగని స్నేహ సంబంధానికి
ముసుగేసి ఉంచడం ఇంకెన్నేళ్ళు?
దోసకాయకు చుట్టిన ఇనుపకట్టు
కుదురుగా వుండ గలిగేది ఎన్నాళ్ళు?
అందుకే
పచ్చని కల పరితాపపుచిచ్చులో దగ్ధమవ్వక ముందే
తోట పూర్తిగానే మాడి పాటరాలిపోకముందే
రెండు వసంత కావ్యాశ్వాసాలుగా
పరిచ్ఛేదమొందటమే పరమోత్తమం కదా!

*సజల నయనాల కోసం, కవిత్వ సంపుటి, డిసెంబర్ 2010*

# అసలు సంగతి

• *దానక్క ఉదయభాను*

ఒక్క తల్లి బిడ్డలమంటున్నావు కదా!
మరి ఇవతలి రొమ్ము పాలనూ
అక్రమంగా తాగేస్తున్నావెందుకు?
ఈ నిజాన్ని కాదంటావా..
కావలిస్తే రికార్డు తల్లినడుగు
ఏం చెప్తుందో

అన్నదమ్ములమిద్దరం
కలిసే ఉండాలంటున్నావు కదా!
'అంతర్వివాహపద్ధతి' దుర్మార్గంలా
నాకిన్ని శిక్షలు ఎందుకు వేశావో చెప్పు?
ఒప్పుకోనంటావా...
కాలాన్నో గాయాల్నో అడుగు
వాస్తవ చరిత్రది అబద్ధపు నోరు కాదు కదా

'కలిసిఉంటే కలదు సుఖం'
నినదిస్తున్నావు కదా!
ఆ సుఖం నీకా నాకా?
అప్రకటిత విషయాల్నీ మాట్లాడాలి కదా
గుండెలు నోళ్లు తెరిచిన బీళ్ళయిన
నా దగ్గర సుఖం ఉందా
నగ్నంగా నర్తిస్తున్న మాంసం ముద్దలపై
నోట్ల కట్టలు విసిరే
నీ దగ్గర సుఖం ఉందా
వాస్తవాల్ని గమనిస్తున్న ఆకాశాన్నే అడుగు
ఏం చెప్తుందో

భాష ఒక్కటి అన్నావు కదా
బతుకు స్మశానాల సంగతేమిటి?
సంస్కృతి ఒక్కటి అన్నావు కదా
అవాస్తవాలు లిఖించబడి
కన్నీరు మున్నీరవుతున్న కాగితాలపై
మా పండగేది?
మా బతుకుల్లో సంతోషాలు
గత స్మృతులెందుకయ్యాయి?
జాతి ఒక్కటన్నావు కదా!
మరి మీదీ దుర్బల జాతి కావాలి కదా?
నినాదాల వెనుక నిద్రిస్తున్న మోసాలు
ఎంజీబీఎస్ బస్టాండులో అడుక్కునే
పాలమూరు బిచ్చగానిక్కూడా తెలుసు సోదరా
నీవు నిలబెట్టిన నినాదాల్ని కాదు
నేను నిందిస్తున్నది
వాటికి ఆదర్శపు వయ్యారాలన్నీ ఉన్నాయి
కానీ
తీయనైన చక్కెర వెనుక
పళ్లికిలిస్తున్న మధుమేహం గురించి మాట్లాడుతున్నాన్నేను
విడిపోతే నక్సలిజం పెరుగుతుందంటావా
ఇక్కడేమిటి
గడ్డి మొక్కల్ని మేసే పశువుల్ని ఎదిరించడానికి
ఆరుద్రపురుగులు ఎక్కడైనా పుడతారు
అది నీదగ్గరైనా...నా దగ్గరైనా...

విశాలాంధ్రకాదు
విశాల భావనతో చూడు
నాలుగు కోట్ల మనోఫలకాలపై
ఎన్ని స్మశానాలు చావుసంతకం చేశాయో!

చూపున్న గుడ్డివాడిలా కాకుండా
మనసున్న మా తమ్ముడిలా ఆలోచించు
నాది నాకివ్వు
నీది నువ్వు తీసుకో
నీది నాకేమీ వద్దు
నాదీ నువ్వేమీ తీసుకోవద్దు
నువ్వు నన్ను తెలంగాణోడన్నావు
నేను నిన్ను ఆంధ్రోడన్నాను
కలిసుండి విడిపోవడం కంటే
విడిపోయి కలిసుండడం సముచితం
నా మాట విను

*జంగ్ కవితా సంకలనం, డిసెంబర్ 2010*

## వాగు-నేను-కల

● పొన్నాల బాలయ్య

వేలుపట్టుకొని  ఆత్మీయంగా
అరుకోషి - బురుకోషి ఆడిచ్చే
వాగు గుండెను నమ్రతతో తడ్మితే
మాతృత్వపు ఊటలు ఉప్పొంగుతూ
మది అంతరంగంలో నుర్గులు పొంగి
పదాల తెట్టు ప్రవహిస్తుంది
మొయ్యన పారే అడుగుల అందెల సవ్వడే
పదాలల్లుకోవడం నేర్పింది
పుట్టెడు ఉసికె మేటల మీద
ఆరబోసిన అక్షరాలలో పొర్లితే
వొంటికంటిన పంచవర్ణ పాదముద్రలే
బతుకు పుస్తకం మీద తడితడిగా తగుల్తయి
గుండుమీద గుండు 'దొంతులోని' గుండెక్కి
గొంతు విప్పుకొన్న నీలిమేఘం
కుండపోతగా జ్ఞాపకాలను కుమ్మరిస్తు...
మోయతుమ్మెద అలల మీద
మోదుగాకు పడవలో ఉహోలు
పచ్చటి చెట్లమీద స్మృతి పతంగులై
రెపరెపలాడుతయి.
వంటికి రంగులద్దుకొన్న సింగిడి
పిల్లనగొయ్యిస్వరాలు పెదాలపై వన్నెలాడి
పురివిప్పిన బుగ్గల మీద రంగురాళ్ల
గంధం దిద్దుకుంటు రోమ రోమాన నెమలీకలు
చాటంత కండ్లతో తానమాడుతయి

దమనుల్లోని పురాస్మృతులు మత్తడి దుంకి
తంగేడుపూల ఉసికె తెప్పల మీద
కట్టుకొన్న పిట్టగూళ్లు జఱ్ఱున జారి
మఱ్ఱి ఊడల కొసన వేలాడుతున్న
బాల్యం లోతు దొరకని చేపపిల్ల
మత్తడి శిఖరం నుండి మెత్తగా జారి
అలిసిన శరీరానికి. .
పక్కబొంతల్ల మగత నిద్రలో
హృదయాంతర నిర్మాణము
వాగు జలాలతో అనుసంధానమై
జోల పాటలతో ఓలలాడిస్తుంది
వాగుకు ఇరవైపుల పచ్చని చెట్లు
జట్లు జట్లుగా నీడనిస్తు...
బురక పిట్టల బుఱ్ఱు బుఱ్ఱులు
అగ్గిపెట్టెలో దాసుకున్న బంగారి పురుగు
గుగ్గూగూ... గుగ్గూగూ..గుగ్గూగూ.
బుడిబుడిగా వాలే తూనీగలు
గాలిలో ఎగుర్తున్న సీతాకోక చిలుక
రెక్కల ముఖం, పాలపిట్ట ఈకల అందాలతో
ప్రాణం ఖుషీగా అలుముకుంటది
నాచుల దాచుకున్న కొఱ్ఱమట్ట - నీరుగట్టె
మడుగులో మత్తుగా నిద్రిస్తున్న కప్పపిల్ల
గుండె పొరల్ని నాజూగ్గా - స్పర్శిస్తు
వాగు వొడ్డుకు ఈత చెట్టమ్మ
నోట్లో దాసుకున్న తీపిపండ్లు
నాల్కలీరబోసుకున్న తాటిగొల రాల్చె
కమ్మని కల్లుబొట్లు కడుపునిండ తాగిన యాదులు



తడలు తడలుగా తన్నుకొచ్చే
వూరి దుఃఖపు కాల్వలు కల్సేచోట
జీవన పోరాట అంతిమ యాత్రలో
దింపుడు కల్లంలో దిగుల్తో దుఃఖిస్తు
జీవన మరణ రహస్యాలను
మౌనంగా పరీక్షించె వాగు
కొండపాకగట్లు 'సింగరయ్య లొద్ది' దాక
అనామత్‌గా రెక్కలు కట్టుకొని ఎగిరే జీవాత్మ
అర్ధమరాత్రి కలికి గాంధారి యాల్ల
బసవన్న కట్టెకొరకని సమయాన
వాగుపుట్టువడి గిరాయిపల్లి అడివిలో
పచ్చని కలలను కాలుస్తున్న శబ్దం
నెత్తిమీద ఖడ్గాలు మొల్సిన చెట్లను
కసితో నరుకుతున్న అలికిడి
కారిన రక్తధారలె ..
తూర్పు నెత్తుటి సూర్యుల ప్రవాహం
పౌరుషంగా పారే ఈ వాగులో
ఎన్ని బాలకిరణాలు ఎదురు ఈదెనో
ఇప్పుడు నడివాగుల భగ్గునమండే సూర్యుడు
వొంటికి పెట్రోలు పోసుకొని
నిత్యం.... దహనమౌతున్న దృశ్యమే!

*ఆదివారం ఆంధ్రజ్యోతి, 23, జనవరి, 2011*

# పొక్కిలి నేల

• *ఎస్.ఆర్.భల్లం*

స్పర్శకే కాదు
స్వప్నానికి కూడా ప్రాంతీయ వాసన
కోరుకుంటున్న నేల మీద
కొన్ని దీర్ఘ విరామాల తర్వాత
కొన్ని ఆశ్చర్యార్థక కామాల పిదప
చల్లబడిందనుకొన్నది
మళ్లీ అగ్గి రగల్చుకుంటుంది
గుండె గొంతులో
గంధపు గనులు దట్టించికొన్నట్లు
నిరసన స్వరాలతో
రహదారుల్ని
హఠాత్తుగా దిగ్బంధిస్తూ
ఆత్మహత్య మళ్లీ రోడ్డెక్కుతుంది
సమీపాలు సైతం
దూరమౌతున్నట్లు
కొన్ని పరిచయ
ముఖాలపుడు ప్రశ్నార్థకాలే..
కొన్ని పరిమళ
గొంతులపుడు వేప పిందెలే.
చేపల్ని ఎరవేసి
జాలరిని పట్టే
సముద్రపు కెరటాల్లా
కుటిల కుత్సిత కుమ్ములాటలు
చిగుళ్ళని నెత్తురు కత్తులతో నరుక్కుంటున్న

మొండి చేతుల మొక్కల్లా మనుషులు
చావు బతుకుల మధ్య
వొలుక బడుతున్న కన్నీటి ఏకులు
వొదిలి వెళ్ళని వేర్పాటు ఆయుధం
ఒకే కోరిక ఒరల్లో
నిలువెల్లా ఒదిగిపోతుంది
ఒకే ఒక్క బాధ,
నదై ఎగసెగసి పడుతుంది
లేత రెక్కలప్పుడు
ఎర్రెర్రగా మెత్తగిల్లుతుంటే
నేల నేలంతా కన్నీటి చెమ్మ
తడారని గోడల్ని తడుముతూ
దోసిట్లోంచి జారిపోతున్న నమ్మకంతో
ఎదుటివాడి చేతితో గాయపడ్డంలో కూడా
ఇంకేదో కొత్త అర్థం స్ఫురిస్తుంది
రెండు అయస్కాంత ధృవాల మధ్య
ఒక అస్థిర ప్రకటన
అవిచ్ఛిన్నంగా ఊరిస్తూనే వుంటుంది.

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 24, జనవరి 2011*

# సింగరేణి గానం

• యన్.హరిక్రిష్ణ

చమట కారింది
రక్తపు బిందువై
శ్రమించీ శ్రమించీ
బొక్కలు బర్పిగడ్డలైనయ్
నెత్తిమీద దీపంతో
సూర్య చంద్రుల్ని మరిచారు
రాక్షసి కోరల్లో
బతుకు నడిపే ధీరులు
మృత్యుగుహల్లో తిరుగాడే
నిరంతర జీవన సాధీలు

వెలుగులోని గనుల లోకంలో
ఎలా ఉన్నావని అడిగేవోల్లు రారు
విషవాయువుల ఊపిరికి
అనుక్షణం రణం
బాధలో సుఖాలు బంధింపబడని బందీలు
ఆకల్ని పోరాటం గడియ గడియకు ఆఖరి పోరాటం
కరిగిపోతుంది ప్రాణం

ఎగుడు దిగుడు లోకంలో
ఎట్లాంటి బతుకాయె
సింగరేణి అన్నల్లి! దుఃఖింప నీళ్ళులేని బిడ్డలారా
చాలా దూరం నడిచివచ్చాం తెలంగాణ
సూర్యోదయం దగ్గర్నే ఉంది

*ప్రజాసాహితి - జనవరి, 2011*

# పేగు బంధం

● దామెర రాములు

ప్రపంచం ప్రేమార్తితో
భూగోళం కలయజూసినప్పుడు
భారతావనిలో భాగ్యనగరం
ప్రేమకు ప్రతిరూపం

ఆత్మకు అణువాదం
సుఖదుఃఖాల ద్వంద్వాలకు
పర్యాయ పదం త్యాగానికి సంకేతం
కోట్లాది తెలంగాణ బిడ్డల
చెమటా నెత్తురు కంకరగా
నిర్మించబడినది
శ్రమైక స్వప్నం
సుందర నగరం .....

మసక వెన్నెల రాత్రి
మూసీనది వొడ్డున
మంద మారుతం

మనసు దిగంతాల్ని
మరులు గొల్పే కవాలి గజళ్ళతో
తబలా హార్మోనీయం సంగీతాన్ని
మోసుకొచ్చినపుడు
పురాజ్ఞాపకాల
వల విసిరినట్టన్పిస్తోంది.

అనాదిగా అరుణారుణవీరుల
జయగాథలు మా గుండె తలుపుల్ని తట్టి
హైద్రాబాద్ మీద షికారుజేసే
రాంబందుల రెక్కల చప్పుళ్ళని
గుర్తు చేసేస్తున్నప్పుడు మేమెట్లా
చేతులు ముడుచుకుకూర్చుంటాం
గురి ఎట్లా తప్పుతాం

ఎవరో కౌన్ కిస్కా గాళ్ళు
తెల్ల వాణ్ణి తలపించే వలస పక్షులు
గొల్కొండ ఖిల్లా బురుజులపై రెట్టవాల్చి
మైలపరుస్తున్నప్పుడు ఛల్‌మని అదలించకుండా
ఎట్లా ఉంటాం

కో అంటే కోటి మంది
తెలంగాణ వీరులు దండులా బయల్దేరి
మా నుంచి మా తాతముత్తాతల నాటి నగరం
ఆత్మని వేరు చేయాలని చూసే
దుష్ట పన్నాగ నాగుల చేసే దౌష్ట్యాల్ని
ఎట్లా ధ్వంసం చేయాలో
మాకు కొత్తగా చెప్పాల్సిన పనిలేదు.

మా అందరి బొడ్డుకోసి పురుడు బోసిన
మా నాలుగు తరాల మహాతల్లి భాగ్యమ్మ
తలెత్తుకొని తిరిగే ప్రతి తెలంగాణ ముద్దు బిడ్డ
ఖజానా........

*నేటి నిజం, 3, ఫిబ్రవరి 2011*

# ధోకా 2009 అను ఆరవ ఆప్షను కథ

● హర్ష

దృశ్యం-1

కాళ్లు మొక్కితే కళ్లు మూసుకున్న .
నీ బాంచెన్ కాల్మొక్త దొరా
పిల్లలు ఆగమాగమయి పోతుంద్రు
సదువులు సట్టుబండలయిపాయె
ఊళ్లకు ఊళ్లె సడక్ మీద పడిపాయె
తొవ్వలన్నీ ఒకటే ఒర్లబట్టె

కాల్మొక్త దొరా...
ఒక్క రాజీనామా యియ్యి దొరా
తెలంగాణొస్తది పోరల దూప తీర్తది

దృశ్యం-2

హస్తినాపురం-10 జనపథ్...
పెద్దమ్మ తల్లి గుడ్లురిమె
24 పరగణాలు చిదంబరాలు భజంత్రీలు వాయించె
పదకొండు గుండెలు గుబగుబలాడినయి
శాంతించమ్మా...శాంతించు...అమ్మతల్లీ శాంతించు
నువ్వు జెప్పినట్టే యినుకుంటం
మా నోళ్ళన్నీ కుట్టేసుకుంటం
మా ఏడుపు మాలోనే మింగేసుకుంటం
ఇరవై రెండు కళ్లూ
వెలుగును చూడలేక చీకట్లోకి పారిపోయే
కాళ్లు పట్టుకున్నా కనికరం లేకపాయె
కళ్లు రెండూ మూసుకుపాయె

దృశ్యం-3

తన ముఖాన్ని తనే చూసుకుని
ఫక్కున నవ్వే చరిత్ర

2009
వెనక్కు నడిచి 1969గా మిగిలింది
గద్ద మనుషుల ఒప్పందం
పేరు మార్చుకుని పెద్ద మనుషుల ఒప్పందమాయె
రాజ్యాంగ భక్షనలకు
ఆరవ ఆప్షను కర్పూర హారతి పట్టె

ప్రజల ఆకాంక్షలు వేరు
పాలకుల అవసరాలు వేరు, వేరు
మరోసారి నొక్కి చెప్పిందా ఉద్యమం
పదవుల గాలానికి ఉద్వేగాల ఎర చిక్కడమే యిప్పటి వాస్తవం
తన ముఖాన్ని తనే చూసుకుని
ఫక్కున నవ్వింది చరిత్ర
తన దుఃఖాన్ని తనే చంపుకుని
నిట్ట నిలువునా కూలిపోయే తెలంగాణా కథంతా

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 28 ఫిబ్రవరి, 2011*

# నిర్మాణ ప్రక్రియ

● శివారెడ్డి

నువ్వంటావు 'అది విధ్వంసమని'
నేనంటాను 'అది ఒక నిర్మాణమని అదొక నూతన ప్రక్రియ అని
ధ్వంసమో, విధ్వంసమో
నిర్మాణమో, వినిర్మాణమో
అంతా నువ్వు ఎంచుకున్న కోణాన్ని బట్టి
నువ్వు చూస్తున్న చూపును బట్టి వుంటుంది

ఒకటి మొదలయ్యాక అది జనంపరం అయ్యాక
అది నీ చేతుల్లో ఉండదు
జనం మొత్తం క్రియాశీలమై
జనం మొత్తం ఒక మహావ్యక్తిగా నిర్మితమయ్యే దశలో

అది దేనికీ లొంగదు ఎవడి అజమాయిషీకీ తలొగ్గదు
క్రియ జరిగి పోతుంది/తర్వాత తీర్పులు వెలువడతాయి
మోనింగులూ కర్సెంగులూ దిక్కు తెలియని ఏ ఒడ్డుకో కొట్టుకుపోతాయి
ఆ సందర్భం రాగూడదు
వచ్చాక, అది అసందర్భంగా అవ్యవస్థగా
అన్పించినా చేయగలిగిందేమీ లేదు
ఎవరు ఎవడికి జవాబుదారి?
శకలాలు గూడా చరిత్రను చెబుతాయి
వెనక ముందుల కాలానికి చరిత్ర చలనానికి
బహుశ అవి నిదర్శనాలవుతాయి-
నువ్వంటావు అది ఒక విధ్వంసమని
నేనంటాను 'అదొక కొత్త నిర్మాణ ప్రక్రియ' అని

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 21 మార్చి, 2011*

# నా రెప్పల కింద పాపా!

• బమ్మిడి జగదీశ్వరరావు

నాయమ్మా పెద్దమా!
నను పెంచిన నాతల్లీ తెలంగానమ్మా!
నీ నాలుగ కోట్ల బిడ్డల తీరుగ
నన్నూ నా బిడ్డల్ని పొదువుకొని పెంచిన తల్లీ తెలంగాణా
కడుపు జరక్క వచ్చినా కటిక నిజం జెప్పాలే
సిక్కోలు సిన్నోడ్ని ముక్కు నేలకు రాసి సెపుతున్నా
ముచ్చట ఇనుతల్లీ
నువ్ గాంధీని అనుసరిస్తే
రాజ్యం గాడ్సే అయి సంపుతది
నువ్ భగత్‌సింగువయితే
ఉరితీసి వుసురునుతీసి చంపుతది
నువ్ అల్లూరి వారసునివయితే
తను బ్రిటిషు వారసత్వమయి కాల్చుతది
ఎన్‌కౌంటర్లు ఎరగనిదానివా తల్లీ
మూడు రంగుల జెండాకి ఎనక ఎన్ని రంగులున్నాయో నీకు తెల్దా
అమ్మా?
అశోక చక్రం ఎనకాల ఎంతశోకముందో ఎరక లేదా అమ్మా
నైజమోడి నైజం తెలిసిన దానివి
ఆత్మగౌరవం కోసం అనాదిగా ఆరాటపడ్డదానివి
అరవై ఏళ్ళుగా ప్రవహిస్తున్న అంతులేని దుఃఖం నీది
అప్పుడు నాలుగొందల హత్యలు
ఇప్పుడు ఆరొందల ఆత్మ హత్యలు
రక్తపు చుక్క నేల పడకుండా తలలు రాలుతున్న శాంతి
సమయమిది

లోపల సముద్రాలు దాచుకొని పైకి ప్రశాంతగా సాగుతున్న
పోరాటమిది
కొమురం భీం బందగీల వారసత్వ సత్తువ నీది
సోనియమ్మ పాదాలు పట్టే దరిద్ర నాయక సంతతి నీది
ఏమైనా అమాయక ప్రజానీకానికి అద్దం నువ్వు
అందుకే అమ్మవీ తోబుట్టువ్వి అయినావు
నీ ఆశ తీరితే కదమ్మా నాకు ఆనందం
నీ ఆకాంక్ష నెరవేరితే కదమ్మా నాకు సంతోషం
రెండు రాష్ట్రాలయితే యేం కొంపకూలుతుందని
విడి విడి జిల్లాల్లో ఉన్నట్టే వేరు వేరు రాష్ట్రాల్లో ఉంటాం
రెండు కుటుంబాలయినప్పుడు పేగుబంధం తెగిపోతుందా?
మా నాయకుల నాటకాలలో మా ప్రజలూ
పాత్రలవుతున్నారు...
తెలియక చేసిన నేరమే తల్లీ...
అర్థం చేసుకోని అపోహలేనమ్మా...
అమ్మా నీ ఒడిలో పదమూడేళ్ళుగా ఉన్నానమ్మా
ఇక్కడందరూ ఆత్మ బంధువులే!
ఇక్కడ కష్టానికి నిలబడ్డ వాళ్ళేగాని కష్టపెట్టిన వాళ్ళు లేరు
ఉన్నదే ఊరు- పెంచిందే కన్నతల్లి
అమ్మా నువ్వెప్పుడూ మాకు ఆసరావేగాని ఆపదవుగావు
దోపిడిగాళ్ళు తెలంగాణల పుట్టినా ఆంధ్రల పుట్టినా దోపిడీగాళ్ళే
వాళ్ళు రెచ్చ గొట్టినా మేం రెచ్చిపోం
మీ రణంలో సహాయనిరాకరణంలో మేమూ ఉన్నాం
దారి తప్పిన తమ్ముళ్ళని క్షమించుతల్లీ...
అమ్మా...తెలంగాణ నీ తిండి నువ్వు తినాలే
నీ బట్ట నువ్వు కట్టాలే నీ గాలి నువ్వు పిల్వాలే
అప్పుడే నీ ఒడిలో నేను జీవితాన్ని రుచిచూస్తాను

*అరుణతార, జనవరి - మార్చి 2011*

# మిలియన్ మార్చింగ్ సాంగ్

• దాసరాజు రామారావు

"విగ్రహాలు మీవి
శవాలు మావి"
అన్న కవి ధర్మాగ్రహ ప్రకటన
తథాగతుని అభయముద్ర నీడలో
గెలిచే తీరింది-
నాలుగు దిక్కుల
సర్కారు పళ్ళ బిగువున
రహదారుల్ని బంధించినా
చట్టాల చట్టు బండల్ని పలుగ జీరి
ట్యాంక్ బండంతా
తెలంగాణ అలుగై పారింది
వ్యూహాలెన్ని పుడ్తున్నయో
ఉద్యమ రూపాలన్ని పుడ్తున్నయి
గిప్పుడు చీకి, శిథిలమై
నూకలు చెల్లిన అసెంబ్లీ మాసికానికాడికి వచ్చినం
మా వాకిట్ల బొడ్డెమ్మ పెట్టుకోవడానికి
టాంక్‌బండ్ చెరువు కట్టమీద
బతుకమ్మ పాట పాడుకోవడానికి
అనుమతి నియ్యని నీ మతిలేనితనాన్ని
విధ్వంసం చేసిన
ధ్వంసరచనగా చదువుకో

మా మట్టిల ఘూర్ణిల్లుతున్న
మా మూలుగులు
మరో ప్రపంచంలో ఏ ప్రస్థానం చేరలే

చాపకూడుతో సమతను నేర్పివుండొచ్చు
మనమధ్య మమతానుబంధాన్ని
ఒక్క విస్తరాకు వేసి తినిపించలేదు గద
వూహలకే పుట్టినిల్లైన కవి
వూహాచిత్రమే దొరకక,
అబద్ధమైన ఆదికవి నన్నయ
అక్కడెట్ల భీష్మించుకు కూచున్నడో
గబ్బిలం సాక్షిగా
ఎగబడ్డ ముప్పది మూడుకోట్ల దేవతల్లో
ఈ జగడం గాండ్లను కలిపితే
అంటరానివాళ్ళ తీర్గనే తెలంగాణను పీక్కుతిన్న సందేశం
లోకానికి ఇంకా బలంగా అందివుండేది

ఇచ్చుకపోయిన పొత్తుల
ధర్మయుద్ధానికి
నాలుగక్షరాల సెగ తోడంటించాలని
ఆశించడం
ఐక్యరాజ్య సమితిని కూల్చేసే కుట్ర కాదే
సోదర మైత్రీబంధంల
పాకులాడడం ఒక హక్కే-

ప్రాంతపు మట్టిల
పరిమళించడం దుఃఖించడం
తనదైన ప్రాథమిక స్పృహలో, స్ఫురణలోవున్నట్టు
అక్షరం ఎల్లలు దాటాలె
కాలికింది మట్టిని బొట్టు పెట్టుకునే-

కూల్చిన విగ్రహాలనే
తిర్లేసి మర్లేసి మల్ల మల్ల కూలుస్తున్నట్టు
చూపుతున్నరు గని

అర్ధశతాబ్దంగా మంట బెట్టిన
మా అస్తిత్వ ఘోషలకు
మీ వెన్ను పూసలు ఇయ్యాల్టికీ కరగక పాయె
విగ్రహాల విధ్వంసం
ఒక క్రమాగత హెచ్చరికా,
పర్యవసాన క్రోధాగ్ని ఘటనే
కొమురంభీం, పొన్నగంటి తెలగన, కాళోజి
అక్షరబద్ధమే మా కర్తవ్యదీక్ష

మట్టిమూర్తులందర్నీ
ఆవాహన జేసుకుందాం
ఈ మట్టిమీద
మన మనసులనిండా

మహాకవీ
నవ్వయినా, నేనైనా
నేల విడిచి రాసిన అక్షరం
జనసమ్మతం కాదని
రజువైంది కదా ఈ క్షణాన
మతిల బెట్టుకుందాం

*అరుణతార, ఏప్రిల్, 2011*

# మోదుగుపూల సాక్షిగా...

● గద్దపాటి శ్రీనివాస్

విగ్రహం
విధ్వంసం
అవును
ఎంత ఘోరం!?
మరి .
పానం తీసుకున్న
పాలకంకుల సంగతేంటి?!

1, 3 ,699,,,700
రోజు కొక్కరు లెక్కన
ఇంకెంత కాలం?
ఇంకెంత మంది??
ఈ విగ్రహవిధ్వంస బాధసరే
మరి దశాబ్దాల
ఆ విధ్వంసంపై మాట్లాడవేం?!
విడికాగితంపై
ఈ మౌనం బద్దలవ్వదేం
నా ప్రాణం
మీ ఒక్క విగ్రహం ఖరీదు కాదా...?
కట్టకట్టుకొని
కొట్లాడుకుంటున్న నాలుకలు
మాకోసం
ఒక్కసారి.. విప్పుకోవెందుకు?!

సాంస్కృతిక విధ్వంసం
మోసపూరిత వ్యాఖ్యానాలు
భలే విచిత్రంగా లేదూ..?!
బతుకమ్మ
పీరుసాయిబు
సమ్మక్క
సారలమ్మ
అలాయ్
బలాయ్
మోదుగుపూల సాక్షిగా
విధ్వంసం
కాన్షియస్‌గానే...
ఎంతకాలం?
మా కొమురంభీం
ఐలమ్మ
కాళోజీ
కొమురయ్య
తెలుగుసంస్కృతికి వారసులు
చరిత్ర మరిచిన
సచ్చు సన్నాసుల్లారా
ఇకచాలు
మీ నక్కజిత్తుల
కలవరింతలు
పలవరింతలు

*ఉపాధ్యాయ మాసపత్రిక, ఏప్రిల్, 2011*

# My Dear మానుకోట రాళ్ళు

● తమ్మనబోయిన వాసు

రాళ్లు. .
రాళ్లు....

నాగరికతల బ్రహ్మాండ రహస్యాలన్నీ
బట్టబయలైంది రాళ్లమీదే

ఆది మానవుడి అడుగులు
సింధు మెసపుటోనియా. .గ్రీకు ఈజిప్టు
నాగరికతలు నడయాడిన తీరును
పెయ్యిమీద పచ్చ పొడిపిచ్చుకుంది ఈ రాళ్లే
అశోకుడి సాంచి స్తూపం కాడ్నించి
రాళ్లపై రాజులు వాతలేస్తే శాసనాలైనయ్

రాయి ...

పసుపు కుంకుమ రాసి కొబ్బరికాయ కొడ్తే
కట్టమైసమ్మ తల్లైతది..
మానుకోట పోరగాడి చేతిల పడితే
గురిచూసి కొట్టే ఆయుధమైతది

రాజుల సింహాసనాలను తన్నిన అక్షరాలు
అధిక్షేపమై ప్రశ్నించిన కావ్యాలు

మా చరిత్రంతా..
నిలదీయడమే...ఎదురుతిర్గడమే

అక్షరాలు దిద్దని చేతులు
బందూఖ్‌లు తయార్జేసిన నేల ఇది. ..

దిక్కులేనోళ్ళ కోసం దిక్కైన తుపాకుల కోసం
ఎదురించి నిలబడ్డ సాహసం

గిదే తెలంగాణ
గదే మానుకోట బాట .!

ఆకాశం నిమ్మలంగుందని భ్రమ పడకు
చుక్కలే పిడుగులై నడినెత్తిల కూల్తయ్

చెర్వు ఈదు బోయిందని
కుశాల్గా దిగుతామనుకోకు
బురద మట్టే ఇసుక తుఫానై
కళ్లల్ల పేర్కున్న మబ్బు తెరల్ని తునాతునకల్జేస్తది

చిన్న పోరగాళ్లే గదా .
ఏం చేస్తర్లే అని అలకగా తీసుకున్నవ్
తూటాలతో తూటాల్జేసింద్రు

గిదీ తెలంగాణ
గదీ మానుకోట పోరడి దెబ్బ

ఎవ్వడ్నీవ్వు. .?

ఎవల్ల మీద నీ పెద్దిర్కం
తెల్వద్..
గీ గడ్డ గురించి నీకు తెల్వదు

పిడికెడు ఇజ్జత్ కోసం
దుమ్ముగూడ కాశే బోస్తది

బజార్ల కొంటేందుకు సర్కు కాదు
కాలికింద నలిపేస్తందుకు చీమ కాదు ఉద్యమం

కుండల కెల్లి కుందేల్ను గుంజే మేజిక్కులెక్క
మాయలు జేద్దామనుకున్నవ్..
దండయాత్ర షురు జేద్దామనుకున్నవ్...

ఇన్మ కాదు చెదలుపట్టనీకి...ఉద్యమం
భగభగ మండే పోరు మంగులం

నిజాం సైన్యాన్నే ఎన్నుపూసల ఇగం బెట్టించి
అడ్డుబెట్టనీయకుండా ఉర్కించిన గడ్డ...మా వంగపల్లి

గడీలను కూల్చి...అర్కగట్టి దున్ని
మక్కలు పండించిన నేల..

గాలినే పోరాటంగా చేస్కోని...గుండెల్నిండా పీల్చుకునే ఇలాకా...

చెట్లు ఆకులు బదులు పోరాటాలు పుష్పిస్తాయ్...

ఎయ్యేళ్ళకిందే కొరివి శాసనమై
సాహిత్య ఘుమ ఘుమలు వీచిన గడ్డ
గిది మా తెలంగాణ
గది మా మానుకోట మొగిలిపువ్వుల తొవ్వ

గదీ...
నాలుగు కోట్ల గుండెలు చిక్కపట్కున్న సిదం
తెలంగాణ రోషం..ఇజ్జత్..ఉంటదా...ఊడ్తదా...
జంగ్ సైరన్ ఊదిన సమయం....

లెక్క తప్పలే...
ఇచ్చిన మాట మర్వలే..పోరాట ఇలవర్స మారలే...

వలసాధిపత్య...ధనాంకాహారాన్ని తర్మేంద్కు
పొలిమేరే పొలికేక బెట్టింది...

గడ్డిపోసలు గడగొయ్యలైనయ్

ఎవ్వడేమి చేస్తాడన్న నీల్గుడి కళ్లల్లో
తూల్సూరి భయం

ఏలిన ఆత్మగౌర మహోగ్రరూపం చూడలేక
కళ్ళు బైర్లు కమ్మినయ్ పట్టపగలే చుక్కలు కనపడ్డయ్

నెత్తిమీద పడబోతున్న ఇన్నపాదాన్ని
తుక్కు తుక్కు చేసే కంకర్రాళ్లు

రాళ్లు....
రాళ్లే...
గవి రాళ్ళు గావు
ఆత్మగౌరవ జెండాలు

తూటాలను ముద్దాడుతూ
రక్తాన్నే దట్టించి మందులా మార్చి
రాళ్ళని ఫిరంగి గుండ్లల్లా పేల్చిన
పోరాట వీరులు
మా మానుకోట పోరలు

తెలంగాణ ఇతిహాసంలో
తొడగొట్టి నిల్చిన మానుకోట ధీరులు రాళ్లు
సగర్వంగా నిలబడ్డయ్ ..

కాలికింద చీమ కాదు. ఉద్యమం
అది నిలువెత్తు మానుకోట రాయి

లెట్స్ సాల్యూట్ టూ మానుకోట

*మానుకోట 28 మే 2010 సంకలనం, మే 2011*

# డొల్లతనం

● సి. హెచ్. ప్రకాశ్

మహాసముద్రపుటలలా
ఉద్యమమై నేనెగిసి ఎగిసి పడుతుంటే
ఎక్కడో భూమికి దూరంగా అంతరిక్షంలో
అపురూపంగా నిర్మించుకున్న
ఆకాశ హర్మ్యంలో ఒంటరిగా సేదదీరుతూ.
నిచ్చెన వేసుకొని చెలి విరహపు భావాలను
పేజీల కొద్ది చిత్రీకరిస్తూ
కురుల జడలో తురుముకున్న
విరుల సుగంధ సౌరభాలను ఆస్వాదించే
నీ డొల్లతనం పారదర్శకమే,
'ప్రత్యేక' పవనాలే ఊపిరిగా
వేణువునై నేనాందోళనా రాగాలు దీస్తుంటే
ఎక్కడో ఉద్యమానికి ఆవల
ఆనందనిలయంలో ఆర్తితో అల్లుకున్న
అనిర్వచనీయ 'ఊహల ప్రపంచంలో కలలు కంటూ
తలగడ దిండ్ల కింద దాచుకున్న సుఖాలను
బస్తాల కొద్దీ నెమరేసుకుంటూ...
తన్మయత్వంలో ప్రేమగీతాలు ఆలపించే
నీ కీర్తి కాంక్షా సుపరిచితమే,
చివరికి ఏయెండ కే గొడుగో కూడా తెలియని
మానసిక రుగ్మతలో అలమటిస్తూ..
అభద్రత కనపడనీయకుండా దాగిన కలుగులో
ఎలుక దొరికితేగాని యవ్వారం బయటపడదు.
పీకలు కోస్తుందో లేక మేకలే కోస్తుందో

అడిగిచూడు కత్తిని మర్మం బయటపడుతుంది
శార్దూలమో లేక చంపకమాలో
అడిగి చూడు కలాన్ని? బుద్ధి తేటతెల్లమవుతుంది
ఆమరణదీక్షో లేక నిరాహారదీక్షో
అడిగిచూడు కవిని? ఉద్యమాల సత్తా తెలుస్తుంది
'పోరాడితే పోయేదేమి లేదు బానిస సంకెళ్ళ తప్ప'
నాడది ఓ వీరుడి పోరాట పటిమకు ప్రతీక
"ఉద్యమిస్తే ఊడేదేమీ లేదు బడుగు జీవుల బాదలు తప్ప"
నేడిది ఓ పౌరుడి ఆరాటానికి స్ఫూర్తి పతాక
బ్రతికినన్నాళ్ళు మర్మగుహల్లోగాకుండా
మనుషుల మనసుల్లో బ్రతుకుదాం,
స్మశానం వరకు నడిచి వెళ్లి నెత్తిన నీళ్ళు జల్లుకొని
తంతు ముగిసినదన్నట్లు గాకుండా
మానవత్వమున్న మనుషులుగా మసలుదాం
విలువలు త్యజించిన ఉదాసీనుల్లారా
ఉలుకూ పలుకూ లేకుండా ఉండిపోండి
కలాలను సంధించిన కవి సూర్యుల్లారా రాండ్రి
ఉద్యమ గళాన్ని విప్పుదాం
వైప్లవ్య గీతాన్ని పాడుదాం
దగాపడ్డ చరిత్రను మలిపేద్దాం
సరికొత్త శకానికి నాంది పలుకుదాం

*'క్యాలి' ప్రత్యేకసంచిక తెరవే మే, 2011*

## విముక్తి పోరు

• సూరారం శంకర్

ఈ మట్టి మీద గౌరవం మరింత మరింత పెరుగుతోంది
ఉద్యమం మీద ఒట్టు-
గెలుపు మీద విశ్వాసం మరింత మరింత సుదృఢమౌతోంది
పార్టీల ప్రాపకంలోంచి ప్రజాశ్వాసల్లోకి విస్తరించిన
ప్రాణశక్తి నా ఉద్యమం....

ఒక్క పాచిక కాదు - నువ్వు
వేల పాచికలు విసురుకో
ఒక్క పన్నాగం కాదు - నువ్వు
లక్ష పన్నాగాలు పన్నుకో
ఒక్క కుట్ర కాదు - నువ్వు
కోటి కుట్రలతో మోరలెత్తు
వెల్లువెత్తిన ప్రజా తిరుగుబాటు ముందు
నీ ఎత్తుగడలన్నీ చిత్తవక తప్పదు
ఇది చారిత్రక సత్యం.

మోసపోయిన వాళ్ళ తెగింపు ముందు
చచ్చిన నీ తరాలు సైతం మోకరిల్లక తప్పదు
విగ్రహాలదేముంది?
మా నిగ్రహాలను తెగటార్చిన నీ కుతంత్రాల ముందు
ఒక నిజం చెబుతా విను-
ఆవేశం ఆలోచనను నియంత్రించదు
అణగారిన తనం అణుకువకు తలొగ్గదు
నాది సాంస్కృతిక విధ్వంసం అని నువ్వనుకుంటున్నావు
చారిత్రిక ధ్వంస రచనగా నువ్వు అభిశంసిస్తున్నావు

చరమాంక పోరాట అభివ్యక్తి సుహృత్ క్రియగా నేను తలపోస్తున్నాను
నీకూ నాకూ తేడా స్పష్టంగా వుంది-
నువ్వు దగా చేసిన వాడివి నేను దగాపడిన వాణ్ణి-
మరింత బొక్కటం కోసం
నానా యాగీ చేస్తున్న లఫూట్ గాడివి
నేను దగా పడ్డవాణ్ణి-
యాభైనాలుగేళ్ళ విధ్వంసంలోంచి
విముక్తిని కోరుకుంటున్న వాణ్ని
కన్నీరు మున్నీరై ప్రాణాలు వదిలిన
నా తమ్ముళ్ళ ఆత్మబలుల సాక్షిగా
కళ్ళల్లో అగ్నికీలలు ధరించి
ముక్కలు చెక్కలైన నా చారిత్రిక నేపథ్యం సాక్షిగా
ఉల్కాపాతమై నేల రాలిన నా ఉనికి ఉజ్జ్వలత సాక్షిగా
కళ్ళల్లో అగ్ని కీలలు ధరించి
పిడికిళ్ళలో అణువిస్ఫోటనాలు మోహరించి
అడుగుల్లో పిడుగుల్ని కురుస్తూ.
అమ్మునై.... అస్త్రాన్నై.. శస్త్రాన్నై ... శతఘ్నినై
దూసుకు వస్తున్నా.. .
కుబుసం కమ్మిన నీ కళ్ల అనైతికతన్ని కుళ్లబొడిచి
వలసవాద రాజకీయ పెట్టుబడిదారీ కుయుక్తులతో
కొవ్వెక్కిన నీ బలుపుని బ్రద్దలు చేసి
నా 'తెలంగాణాని నేను రక్షించుకుంటా
ఇది ప్రజా పోరు.... స్వరాష్ట్రసిద్దే దీని అంతిమ సందేశం
కాచుకో-
ఓటమి నీది - గెలుపు నాది

*దిమ్మిస, వినిర్మాణకవిత్వం మే, 2011*

# సరిహద్దు ప్రయాణం

● జ్వలిత

ఏ గుమ్మంలోకి తొంగి చూచినా
గుమ్మటమై దోపిడి నిలిచినపుడు
మనింట్ల మనం కిరాయి/ పరాయి అయినపుడు
అసలు మనకంటు ఏమి మిగలనపుడు
పసికూనలు పాలపిందెలై రాలుతున్నప్పుడు
చలన రహితమైన అహంకారం
పాతరాతి విగ్రహమై నిలిచింది
మది లోపలి గోడల్ని డైనమైటై పేల్చింది

విగ్రహాలతో విద్రోహపు పునాది పడి
చరిత్ర చిత్రంగా చిద్రమవుతున్నపుడు
చితుకుల బతకులు భగ్గుమన్నపుడు
కత్తుల వంతెనల కుత్తుకలకు
ఉత్తరేణి ముళ్ళుత్తరాలిస్తయి

అణువణువున అణిచివేయబడి
రుధిర స్వేదం చిమ్మి సొమ్మసిల్లి
భూతల్లి పై ఊరడిల్లుతుంటే
'భూమిపాప'పై కుట్టికుట్టి
తుదముట్టిస్తున్న మిన్నాగుల గుంపును
గడ్డిపోచలు ఉరి తీసి ఉప్పు పాతరేయ్యడం చూస్తున్నం

ఇక్కడ - అప్రకటిత ఎమర్జెన్సీని
అమలు చేస్తున్న రాజ్యానికి
అనివార్యంగా ఊపిరి పోసుకున్న ఉద్యమం
కునికిపాట్లు ప్రభుతకు

ఉనికిని చాటుతున్న వైనం చూస్తున్నాం
ఇల్లు కాలి లొల్లి పెడుతున్న ప్రజ ఒకటి
చితులతో చలి కాగుతున్న సమూహం ఒకటి

మరేదో కాలిందని గాయి పెడ్తున్న గుంపొకటి
విడివిడిగా కదులుతున్నప్పుడు
విగ్రహాలు విద్రోహాలకు ప్రతీకలై నిలచినపుడు
ఆత్మాహుతుల హోమంలో 'హుతబుక్కు' ధవళశిల్పం

మెడ మీద తలలునుండి యోచన చెయ్యని వాళ్ళు
మాటలవసరమయినపుడు మూగనోములయినవాళ్ళు
రాజకీయ చదరంగమాడుతున్న శకుని మామలు
సంగీతార్చనలు ఆచరిస్తున్న నీరో చక్రవర్తులు

బుట్టదాఖలవుతున్న బుద్ధిజీవులారా
అచ్చరభశ్శరభ అంటూ గావు పట్టాలిప్పుడు
కూతనేర్చిన కోళ్ళు గద్దెలెక్కి నపుడు
పట్టపగలు తెల్లారిందనే వాదనలు సహజం

పచ్చని పక్షుల మధ్య నిప్పు పెట్టే నక్కలకు
పిట్టల పోరు తీర్చే పిల్లులకిది సవాల్
అసంతృప్తి పరమాణువు అణిచివేయబడి
హక్కుల అణుబాంబై పేలింది

దోపిడి మరగిన దొరతనం వంగాల్సిందే
రేడియేషన్‌కు తరతమ భేదం లేదు కదా....
ప్రత్యేక తెలంగాణమే ప్రత్యామ్నాయం
తెలివున్నోడు వొంటి మీద సోయున్నోడు
'తెలంగాణ సరిహద్దు ప్రయాణం' ప్రారంభించాలిప్పుడే...

*దిమ్మిస వినిర్మాణ కవిత్వం, మే, 2011*

# కాయకల్ప చికిత్స

● రావణ్

"జుగుప్స మన ఆదర్శం
ప్రేయసి మన విధ్వంసం"

----

అమృతం అవతలి వాడి దగ్గరే ఉంది
ఇకనైనా వాడు పంచిన విషాన్ని
వాడి ముఖమ్మీదే చిమ్మెయ్ ఉమ్మెయ్!

మనలో పిరికి వాళ్ళెవరన్నా
ఇంకా మిగిలి ఉన్నారా!
ఉంటే గింటే వారిని అడ్డంగా నరికెయ్!

మెత్తటి ఎముకల పుట్టు మృతులను
పాతిపెట్టేయండి ఎక్కడికక్కడ
ఇంధనేంద్రియులు
దివిటీధారులు ఏరీ? ఎక్కడ?
కాలుని కడపటి వారసుల్ని
కట్టెదుట ప్రవేశపెట్టండి!
నల్లని దుప్పటి కప్పి పంపండి!

"నేనొక్కడినీ నా గదిలో "అనకండి
"నేను - నా రాక్షసి" అనండి!
గది వీడి బయటకు వచ్చి
"గోడలు పగలుగొట్టడమే మా పని" అని చాటండి
తోవ దొరకని కటిక చీకటిలో

నీరవ నిర్నిద్ర నిశీధిలో

వెలిగించండి విద్వేష జ్వాలలు
ఆర్పేయండి గతకాలపు స్వాహా హవనాలు

జడత్వమా! గతితప్పిన తర్కమా
నీపేరు ఆవలికి మొన్న అభ్యుదయం
నిన్నగాక మొన్న ప్రగతి, విప్లవం

కానీ జరిగిందేమో నాటకం
ఫక్తు పరిషత్ నాటకం పచ్చి బూటకం. ఆత్మహననం
స్వీయ మానసిక కుబ్జత్వ ప్రదర్శనం
చిలకమర్తి వారి చిరు ప్రహసనం

అంతా పంతుళ్లే, ప్రభోధకులే కానీ
కోటి రతనాల వీణ మేని నిండా
మానని గాయాలే
నెత్తుటి కోతలే!

అందుకే....
సిద్ధాంత రాద్ధాంతాలకు,
అసత్య ప్రవచనాలకు
'పోనియ్‌రా బై"లకు, జానేదో యారోలకు
జరూరుగా ఇప్పుడు కాలం చెల్లింది

ఇప్పుడిక్కడ కాలసర్పం బుసలుకొడుతుంది
ఒంటిస్తంభం మేడలో దాక్కొన్న
పరీక్షిత్తుకు మరణం తప్పదు
తక్షకుదు ఒళ్ళు విరుచుకున్నాడు
తప్పదు ఇక బంధు నాశనం!

ఈ రాత్రికిరాత్రి శత్రువు ఇంటికి
కన్నంవేసే ఖల్‌నాయక్‌లున్నారు
కనుక బేచెయినీ వద్దు మనకు

నిన్నటి పరాజితులు, రేపటి విజేతలుగా
వస్తున్నారొస్తున్నారు ఒక్కరొక్కరు
మన కార్తవీర్యార్జునుడు, మన నర(లో)కాసురుడు
మన మహిషాసురుడు, మన హిరణ్యాకశ్యపుడు
మన బలి, మహాబలి
మన సర్వాయి పాపన్న, మన బందగీ
మన పెరియార్, మన సురవరం
మన చాకలి ఐలమ్మ, మన కట్ట మైసమ్మ
మన కొమురం భీమ్, మన నల్ల ఆదిరెడ్డి
మన ఉపేందర్, మన శ్రీకాంతాచారి
మన ఉమ్మడి శత్రువు ముఖాన
ఖాండ్రించి ఉమ్మేయ్యడానికి వస్తున్నారొక్కరొక్కరు

తెలంగాణ ఇంటింటా ఇప్పుడు
తుర్రెబాజ్ ఖాన్‌లే, తురుమ్ ఖాన్‌లే
వీధి వీధినా విగ్రహంతకులే, ఐకొనోక్లాస్ట్‌లే.

*దిమ్మిస, వినిర్మాణ కవిత్వం, మే, 2011*

# రేపటి సూర్యోదయం

• అరసవిల్లి కృష్ణ

రెండు పాయలుగా విడిపోయిన
ఎండిపోయిన జీవనది
తీరం దగ్గర నిలబడ్డాను

చేప కనులలో దారి కనబడుతుంది
నదిని దారి చేసుకుని వెళ్లగలను
విడిపోవడం అంటే
రెండుగా చీలిపోవడం అంటే
ఓ దివిటీ నుండి
ఇంకొక దీపాన్ని వెలిగించడమే

చూస్తున్నాను
మృత్యువు శరీరంపై పాకుతున్నా
చెదిరిపోని చిరునవ్వును

క్షణక్షణం నేల కదలుతున్నా
చెట్లవేళ్లను గట్టిగా
పట్టుకున్న చేతులు
ప్రతిరోజూ
బొడ్డు పేగు తెగిన రక్తం
కొత్త నీరులా ప్రవహిస్తుంది
తెలంగాణ పురిటిపాటల సంగీత వీణ

అనేక ఉదయాలు పొలబారి
చీకటి తాడులోకి వెళ్లిన నల్లకలువ
కన్నీళ్లు తుడిచే చేతుల్ని
హృదయంలో దాచుకున్న పిల్లలకోడి

తొలి ఏరు పూసినప్పుడు
నాగలి దున్నిన భూమి తెలంగాణ
భూమినుండి మొలకెత్తిన శిరస్సులు
ఖండించబడుతున్నప్పుడు
ఆయుధం ఏకపక్షంగా మాట్లాడుతున్నప్పుడు
నేలకొరిగిన అమరత్వపు జెండా
తెలంగాణ
పాదం మోపిన గాయాలభూమిపై
సూదులు గుచ్చలేదు
తల్లిని గాయపర్చి
తల్లిపంచిన శరీరాన్ని చిగురింపలేను
ప్రతిసారీ పచ్చిబాలింతరాలిలా
గాయపడుతున్నది
ఉలికిపడుతున్నది
ఆశను వెక్కిల్ల మధ్య దాచుకున్నది
ఇసుక రేణవుగా నిలబడిఉన్నది
పెనుగాలి వీచినా
ఇసుక రేణువు ఎగిరిపోదు
వెలుగుతున్న దీపం ఆరిపోదు
తెలంగాణ
రేపటి సూర్యోదయం

*తెలంగాణ విరసం కవిత్వం మే, 2010*

# ఛలో ఉస్మానియా ఆర్ట్స్ కాలేజి

• రాంకీ

ఉస్మానియా విద్యార్థుల ప్రశ్నలు
లోకానికి వినబడకుండా చేయాలని
జరుగుతోంది అడుగడుగున కుట్ర
వేలాదిగ లక్షలుగ తరలి రండి
రగిలిన ఆర్ట్స్ కాలేజ్ నిప్పును రాజేద్దాం
కంచెలన్నింటిని కూల్చేసి గోడలన్నింటిని కూల్చేసి
ప్రశ్నల్నీ పోరాటాల్నీ బతికించుకుందాం...
ప్రశ్నలకు కంచెలను కట్టడం
మనుషుల మధ్య
గోడలను నిలపడం రాజ్యం చేసేపని

సీమ దొరల నోరు మూయించి
అవకాశవాద రాజకీయాల తోలుతీసి
'నోరులేని' ముఖ్యమంత్రికి
క్యాంపు ఆఫీసునిప్పించి
ఆంధ్ర ఖల్ నాయకుల కుహకాల్ని బయటపెట్టి
తెలంగాణ (వి) నాయకులకు చూపునిచ్చి
జైబోలో తెలంగాణ అంటూ
సాగుతోందిక్కడ ప్రజా ఉద్యమం...
న్యాయంగా ఆలోచించడానికి
చూసే దృష్టి కాస్త వివేకం చాలవూ...
ఇక్కడి కన్నీళ్లు చూసిన వాణ్ని
పారిన రక్తం కన్న కలలూ
బతుకుల వెతలు తెలుసునాకు
అందుకే అడుగుతున్న తెలంగాణ....

మరేం బాధ లేదు మరేం నష్టం లేదు
విడిపోయి నీళ్లు
మళ్లీ కలిసినప్పుడు కన్నీళ్లో కవిత్వమో
చక్కనైన చిక్కనైన తెలుగు మాటనో
బతుకు పాటనో
పంచుకుందాం...పాడుకుందాం...

నా ప్రియసోదరులారా!
అయిదు దశాబ్దాల అపనమ్మకం
నిజమయ్యాకే ఈ పోరాటం ముక్కలైన
'సమైక్యత' కోరుకోదు
ప్రజాస్వామిక ఆంధ్ర
రాయలసీమల కోసం
ప్రజాస్వామిక ఆకాంక్షలకోసం
మీరూ నినదించండిక

తెలంగాణ పొత్తిళ్లలో
దాగి ఉంది బడబాగ్ని
అది వెలుగును తనకే కాదు
పంచి ఇస్తుందందరికీ
ఇది న్యాయమైన లెక్క
నేడైనా రేపైనా తేలాల్చిన లెక్క....

ప్రాంతేతర దోపిడినే కాదు
ప్రాంతం లోపల దోపిడిని
ప్రశ్నించే తెలంగాణ చైతన్యాన్ని
నిక్కమైన బతుకుకు దారులు
చూపగలిగే తెలంగాణను
మనసారా ఆహ్వానిద్దాం...

*తెలంగాణ విరసం కవిత్వం, మే, 2011*

## కాలానికి బొండ్రాయిని...

• రివేరా

పేరుకి ముందోవెనకో ఖాందాన్ చెప్పుకోని వాడ్ని
చేవ్రాలు క్రితమో, తర్వాతో ఇలాకా రాసుకోని వాడ్ని
ధిల్లానా రాగానికి, 'థ్రిల్లర్' స్టెప్పులేయలేను-క్షమించు

ఇన్నాళ్లుగా ... ఈ పీనుగులు లేచిన ఇంట్లోనే
తలదాచుకుంటున్న వాడ్ని
పాడుబెట్టిన గుళ్లోనే పొట్ట పోసుకుంటున్న వాడ్ని
ఆకలి పోగులకు అద్వైతం ప్రభోదించలేను...మన్నించు

పావురాయి రెక్కల కింద ప్రేమ లేఖలు చదువుకున్న వాడ్ని
పాపాయిలు గుక్కపెట్టని రాత్రులను కలగంటున్న వాడ్ని
ఆకురాలు కాలంలో విజేతల పక్షాన నిలవలేను ....క్షంతవ్యుణ్ని

నీళ్లవెంట నాగరికతలు విస్తరిస్తాయని
గాలికి కరిగి ఊపిరి మేఘాలు వర్షిస్తాయని
కాలం కంట్లో చుక్క నీరు ఊరుతుందని నమ్మిన వాడ్ని
ఇప్పుడిలా..... ఎడారయిన ఊరికి, ఉరి పోసుకున్న శవానికి
కాపలా కాస్తున్న వాడ్ని
నా ప్రాంతానికి బొండ్రాయినే కానీ, నీ పాపాల పంటకు
వడిసెలరాయి కాలేను...అపరాధినే

పాల గుండెల్లో పొంగును చూసిన వాడ్ని
నూనూగు మీసాల పౌరుషం పారాడిన నేల మీద నిలబడ్డ వాడ్ని
బతుకు తండ్లాటలో బరి మీదికొచ్చాను
ఇప్పుడిక రాజ్యానికే కాదు
నీ నయా వలస కుట్రలకూ దేశ ద్రోహినే

*తెలంగాణ విరసం కవిత్వం, మే, 2011*

# తెలంగాణ 1

● పాణి

నీవొక చుక్కానివి. నీవే ధిక్కారం. కలయిక అన్నా నీవే భంగపాటు అన్నా నీవే. విడబాటు కాంక్షారవం నీవే పాలూ నీళ్ళూ వేరు చేయగల జీవనతత్వం నీది. ఎంతటి వాళ్ళయినా నీదగ్గర ఇట్టే తేలిపోతారు. నీచేతిలో ఏ మహత్తు ఉన్నదో గాని ఒక గీత గీసి తేల్చుకోమంటావు. లోకాన్ని తూచే సున్నితపు త్రాసువి నిన్ను చూస్తే ఎంత సంబరమో అంత సంక్షోభం

అన్నీ నీవే అయిన నీకు ఏమివ్వగలను?

నీవొక గగుర్పాటు. నీదొక అవిశ్రాంత కల నీవెల్లరికీ తెరిచిన వాకిలి. నీకిది తుది పెనుగులాట.

నీవే నా అంతశ్చేతన. నీవొక గీటురాయి నీవు నిప్పులపై నడిచి నన్నెప్పుడూ పరీక్షిస్తుంటావు. అనాది నుంచీ నన్ను నిర్మిస్తావు దుఃఖమో, ఉద్విగ్నమో, విషాదమో, విజయోత్సాహమో ఆశ నిరాశల సంధ్యా వర్ణమో నిరంతర ప్రయోగతత్వమో...

అన్నీ కోల్పోయిన నీకు హృదయం తప్ప ఏమివ్వగలను?

కోల్పోవడమే ఆర్జన కావడం నీ అంతర్ తర్కం ఒక రూపంలో రక్తమోడుతూ మరో రూపంలో వొళ్ళు విరుచుకుంటావు జారిపోయినట్టుండి అమాంతం లేచి నిలుచుంటావు ప్రతి మలుపు దగ్గర నీ జెండా ఎగరేసి చూపుడు వేలవుతావు నీ దారి నీదే కాదని, నీనెత్తుటితో చదును చేసి నీవే ఒక బాటవై అందరినీ లాక్కెళుతావు. జీవితం కోసం జీవితాన్నే బలిపెట్టి పునర్జీవితమవుతావు

అందరి పోరాటమైన నీకేమివ్వగలను?

నీకు ఇవ్వడమేగాక తీసుకోవడమూ తెలుసు ఎవరెవరు ఎంతెంత పంచుకోవాలో ఎందుకు పంచుకోవాలో తెలుసు అధికారాన్ని కూలదోయడమూ నీ తొలి తుది అభ్యాసం, నీ వెప్పుడూ కొంగొత్త పార్శ్యాంశానివే. మనిషిని తయారుచేయడమే నీకు పరమం అట్టడుగు నుంచి ఆకాశం దాకా ఇప్పుడు నీవే ఒకే ఒక్క నీవే .ఆత్మ సాక్షీ...నీ ఆత్మగౌరవమే నా స్వాభిమానం

*తెలంగాణ విరసం కవిత్వం, మే, 2011*

# విరిగిన విగ్రహాల తీరంలో

● ఎలనార

మురికి పేరిన నీరు - మకిలపట్టిన
గుడ్డి అద్దం
ప్రతిఫలించవు ప్రతిబింబాలు
ఎప్పుడో జరిగిన తప్పిదానికి
ప్రతిరూపం "ప్రతిమాతీరం"
వక్రీకరించబడ్డందుకే హరివిల్లులైనవి
తల్లడిల్లే తెల్ల కిరణాలు వంచించబడినందుకే వాడి బాణాలైనవి
నోరులేని నాల్కలు నిట్టనిలువునా చీలిన
నింగినీడల్లో సాగరం కాని సాగరం
ఉవ్వెత్తుగా ఉద్యమిస్తున్న తరంగాలు
కడలి కడుపులోతుల్లో ఎక్కడో
కదలి ఉంటాయి భూగర్భ శిలాఫలకాలు
తీవ్రఝంఝను నిర్దేశించడం ఎవరితరం?
కల్లోలినీ కడలి కల్లోలం కాకముందే
కట్టవేయాల్సింది ఉద్యమ పర్జన్యం ఉరిమినప్పుడే
ఇంటి కప్పును కప్పుకోవాల్సింది
కంటికి కనిపించే కారణాలను కట్టిపెట్టి
మూల విబేధాలను మూలకు నెట్టి
కాకమ్మ కధలతో కాలయాపన
చేసినన్నాళ్ళు / విగ్రహాలు విరిగి పోతూనే వుంటాయి
నిగ్రహాల ముగుతాళ్లు తెగుతూనే- వుంటాయి
సాగరంనడిమధ్యలో స్థాణువైన బుద్ధుని-
సమాధి భగ్నమౌతూనే వుంటుంది

*వీర తెలంగాణ జూన్, 2011*

# తెలంగాణ తొవ్వ...

• సిద్దినబోయిన వెంకట్‌యాదవ్

బొందల గడ్డ పక్కన నల్లతుమ్మ పొదలల్ల
తెలంగాణ తొవ్వ మాది

మాకు ఆంజనేయ దండకం మీరు

అమాస రాతిరి వలస
గుడ్లగూబల కూతలల్ల
బుగులువడ్డ బతుకు మాది

మాకు ఫకీర్‌సాబ్ కట్టిన
బేఫికర్ తాయత్తు మీరు
జాతర్ల కొడుకు చెయ్యి వదలని
నాయిన భరోసా మీరు

గద్దల దొంగ చూపుల నుండి రెక్కల కింద
పిల్లల్ని దాచే తల్లి ప్రేమ మీరు

మా సద్దిగంపల మీద కన్నేసిన
గుంటనక్కల మీదికి
సూటి జూసె తుపాకి మీరు
మా దూపల మీద కట్టిన
ఆనకట్టల మీదా మీదే నజర్

పది జిల్లాల పారాహుషార్ మీరు
ఆఖర్ తెలంగాణ వఖాల్తా మీరు
మా కడుపునొప్పికి గూడా
మీరే సొంటి బుక్కింద్రు ...గదా
జయశంకర్‌సార్!

మాది మాకే సోయిలేదు

ఎవనికోసం వాడు సచ్చినోళ్ళని
శానా చూసినం
జనం కోసం బతికిన నిన్ను జూసి
పద్మాక్షమ్మ గుట్ట
జన్మ ధన్యమయిందనుకుంది

తెలంగానోళ్ళ గుండెల్ల నీ ఎత్తు జూడనీకి
గుట్ట గూడ ముఖం
పైకెత్తి చూడాల్సొచ్చింది

స్వర్గం జేరంగనే తెలంగాణ
అమర వీరులను యాద్జేసినమని...
మా అందరి శణార్తులు జెప్పుండ్రి

మీరు జల్లిన యిత్తులు పంట పండి
కోత కొచ్చిందని చెప్పుండ్రి

ఇగ మేమందరం గిప్పుడు కొడవళ్ళు వద్దాం

*జయశిఖరం కవితా సంకలనం జూలై 2011*

# నేర్చుకుందాం రండి

• *నాగవరం బలరాం*

ఈ భూమి పుత్రులెంత మంది మరణించాలి
ఈ నెత్తురు ఎన్ని కాల్వలై పారాలి
ఈ మట్టి తన కోసం
తానెంత కాలం ఏడ్వాలి
కృష్ణా గోదావరులు
మా గుండెల్లో ఉప్పొంగినా
ఈ దుఃఖం తీరుతుందా
తమ పార్టీ తమ సిద్ధాంతం
తమ సీట్లు
తమ కులం, మతం చుట్టి
జాతిని దిగ్బంధం చేసిన
ఓదూర్తులారా!
మీరేం చెప్పినా
మీరెన్ని మాట్లాడినా
పదవుల పంపకం
అధికారాల వాటాల కోసం కాదా
జాతి మనగడ కోసం
చిట్ట చివరగ తమదైన ఉనికికోసం
ఊపిరి బిగపట్టిన
ఒక్కడంటే ఒక్కడుగా చివరిదాకా బతికిన
ఉక్కు మనిషిని చూసైనా
నేర్చుకుందాం రండి.

*జయశిఖరం కవితా సంకలనం జూలై 2011*

# ప్రజలే ఊపిరిగా....

● టి.వేణు

నిజాన్ని ఊపిరిగా మల్చుకొని
జీవించిన వాడికి ఇజంతో పనేముంది

విశ్వాసాన్ని వెన్నెముకను చేసుకుని
ప్రస్థానం సాగించిన వాడికి
అవిశ్వాసంతో పనేముంది

గెలుపైతేనేం
ఓటమైతేనేం
బరిగీసి బడుగుల పక్షాన నిలిచిన వాడు
హక్కులకోసం శాసనాల పెడరెక్కలు విడిచినవాడెవడైనా
ప్రజలగుండెల్లో నాయకుడవుతాడు

మానవత్వపు విలువలకోసం
చట్టం మెడలు వంచినవాడెవడైనా
ప్రజాస్వామ్యానికి న్యాయసాధకుడవుతాడు

రాజ్యా హింసను ధిక్కరించిన స్వరానికి
జనం గోంతుకలు కవాతు చేస్తాయి
రాజ్యాంగ స్ఫూర్తిని రక్షించే చేతులకు
జనం గులాములై సలాము చేస్తారు

వ్యక్తిత్వాన్ని పతాకంగా ఎగరేసిన
రారాజుకు అశ్రునివాళుల ఔన్నత్యాన్ని పరిమళంగా విరజిమ్మిన
ప్రొఫెస్సర్‌కు అక్షరనీరాజనాలు

*జయశిఖరం, కవితాసంకలనం జూలై, 2011*

# వెన్నెల వేడికాసారం

• చెరుకు సుధాకర్

కాలం తలుపు తట్టంగానే
పుట్టెడు మట్టిపూల
సాంబ్రాణి వాసన

ఇహలోకమో... ఇప్పుడు పరలోకమో .
ఎట్లుంద్రు సారు అంటే
జై తెలంగాణ అంటిరి సారు!

సర్వ తంత్రులను మీటినట్టు
పరతంత్రుల పారదోలినట్లు

నిలువెల్లా పులకించి పోతదు
ఆయన...ఆచార్య జయశంకర్
తెలంగాణ ప్రతి కొత్తపల్లెకు,
బాటకు ఎత్తుకున్న పల్లవి పాట

తుపాకుల మోతమధ్య
జమిందారి హుకుం మధ్య బిడ్డ
ఏడ్పు కూడా వినపడని కాలం .
చనుబాల నిండా కన్నీళ్ళు
కురుస్తున్న గాయాల జ్ఞాపకం ..
మరిచిపోని బాల్యం నుండి యవ్వనానికి
నడివయసుకు, జీవిత చరమాంకానికి - ఒకేలంకే-
వన్‌బైట్రాఫిక్ ...తెలంగాణ పసిఫిక్
నా తెలంగాణెందుకు ఇంత పొక్కిలయింది!
నా తెలంగాణ బతుకు

తెల్లారెదెప్పుడు! పక్కున నవ్వెదెప్పుడు
మొగులు దిక్కుచూసుడు
వేల పోరాటాల తెలంగాణ
దిక్చక్రం మీద సూర్యుడు
ఇప్పుడన్న పొడుస్తదో ఏమోనని
ఆశపడుడు దిగులు దిగమింగుడు
పాలపిట్ట నవ్వుతో రేపటి
పొద్దుకు ఎదురు చూసుడు
చేతికందిన ముద్ద
చేతికొచ్చిన జీతం
చేతికొచ్చిన పదవి
కుచ్ బీ నై జాంతా - సిరఫ్ తెలంగాణ
బతుకంతా తెలంగాణ - బాధంతా తెలంగాణ

ఎక్కిన గడప - దిగిన గడప
కడుపు నింద ఒక్కటే...
భుజానా ఎత్తుకున్న సారెగంప
తెలంగాణ...తెలంగాణ
ఎట్లదెస్తరు? ఎప్పుడిస్తరు? ఎన్నడొస్తది తెలంగాణ
విస్తరిలో ఎన్నన్నబెట్టు ఒక్కటే ప్రశ్న తెలంగాణ

ఆయన కలల సాకారంలో ఇప్పుడు
తెలంగాణ వెన్నెల వేడి
కలబోసుకున్న కాసారం

*జయశిఖరం, కవితా సంకలనం జూలై, 2011*

# అతడు భూమి ఊపిరి

• సీ. హెచ్. ఆంజనేయులు

అతడు నాలుగుకోట్ల
భూమి ఊపిరి
అతడు మిణుకు
మిణుకు మండిన
తెలంగాణోద్యమ జ్యోతికి
చమురు పోసిన త్యాగి

దస్త్రాల అస్త్రాలతో
ఇక్కడి బతుకులను
కొల్లగొట్టిన తీరును
నిరూపించిన ధీరుడతను

స్వరాష్ట్ర అధికారం కోసం
నిండుగుండెతో శ్వాసించిండు . .

మేమెవరికి గులాములం కాదని
ప్రేమతో సలాము చేసే
అందరి స్నేహితుడతడు

ధ్యాసంతా పచ్చ పచ్చని తెలంగాణ మాగాణం
అతను చెరబడ్డ తెలంగాణ తల్లి కన్నీళ్ళు
తుడిచిన పెద్దకొడుకు
అతనిప్పుడు తెలంగాణ దిక్సూచి
తెలంగాణ వెన్నెల దారి దీపం

*జయశిఖరం, కవితా సంకలనం జూలై,నవంబర్ 2011*

# మట్టిలో మాణిక్యం

• సంకేపల్లి నాగేంద్రశర్మ

తెలంగాణ మట్టి మాణిక్యానివి
నాలుగున్నర కోట్ల ప్రజల ఆశాజ్యోతివి
డెబ్బైయారెళ్ళ జీవితంలో
తెలంగాణ మాటే ఊపిరి నీది

పల్లెపల్లెన ఉద్యమాన్ని రగిలించి
వలసవాదుల రాక్షస రాజకీయాల్ని తరిమికొట్టి
ఇక్కడి ప్రజల పౌరుషాన్ని విద్రోహులపై ఎక్కుపెట్టి
విజయం సాధించావు
తెలంగాణ సంస్కృతికి పెద్ద దీపమై నిలిచావు

కాళన్న కవిత్వాన్ని వడపోసి
మన భాషయాసల్ని గద్దెనెక్కించె ప్రయత్నాలు చేసినావు

కలం పట్టి కన్నీళ్ళను తుడిచి
ఈ నేలను సారవంతం చేసినావు
మట్టి పిడికిళ్ళను సమీకరించి
వెలుతురులోకి నడిపించి
నువ్వు చిమ్మచీకటిలోకి మాయమైపోయావు
అందుకో ఇవే జయంశంకరా మా జోహార్లు

*జయశిఖరం కవితా సంకలనం, జూలై 2011*

# నా తల్లి తెలంగాణ

• అలాజ్‌పూర్ కిషన్

తల్లి తెలంగాణా ఏం కలగంది?
బిడ్డలెవరి కళ్ళల్లో కన్నీరు చూడనంది
కండ్లేమన్నాయి?
కళ్ళల్లో వెయ్యి సూర్యుళ్లను దాచమన్నాయి
సూర్యుడేమన్నాడు సముద్రమై హోరెత్తమన్నాడు
సముద్రమేమంది?
విశ్వమంతా ఒకే నినాదమై ధ్వనించమంది
తల్లి తెలంగాణ ఏమంది?
తారవై ఆకాశానికి తాకమంది
ఆకాశం ఏమంది? వర్షమై నేలపై కురవమంది
ఈనేల ఏమంది?
మరణించిన వీరుని రక్తం తన నుదుటి పై దిద్దమంది
వీరుడేమన్నాడు?
తల్లి కడుపులో మళ్ళీ జన్మిస్తానన్నాడు
ఆ తల్లి ఏమంది? ఈనా బిడ్డకు మరణం లేదంది
తల్లి తెలంగాణా ఏమడిగింది?
అరణ్యమై విస్తరించమంది
అరణ్యం ఏమంది? యుద్ధ భూమిపై జీవించమంది
యుద్ధ భూమి ఏమంది?
ఆయుధం ఇచ్చి సాగనంపింది
ఆయుధం ఏమంది?
శత్రువు గుండెలో పేలమంది

*కదం కదం కవితా సంకలనం, జూలై, 2011*

# మా తెలంగాణ మాగ్గావాలె

• *నందిని భగవాన్‌రెడ్డి*

తుంటరి తనానికి
అమాయకత్వానికి
భాషతో బంధమేసినపుడు
మనుషులు కదాని
మాటల్ని నమ్మినం
కుట్రలేవో కుతంత్రాలేవో
కనిపెట్టలేకపోయాం
ఒప్పందాల తప్పిదాలతో
మోసపోయినం
పెనం మీంచి పొయ్యిలో పడ్డాం
కల్సిఉంటే కష్టాల పాలైందెవరో
సుఖాలు దక్కిందెవరికో
సమైక్య రాగంలో
సమానత్వమెంతో చూశాం
సమస్యలపై సమరాలు
ఉల్లంఘనలపై ఉద్యమాలు చేశాం
బలైందెవరో బాగుపడింది ఎవరో
బాగానే తెలుసుకున్నం
నెర్రెలు బారిన నేలలు
బండలైన బతుకులు
కమిలిన గాయాలు
రగిలిన గుండెలు
రాలిన ప్రాణాలు
ఒక్క బాధ గాదు

తీరోక్కబాధలు పడ్డం
నిలువెల్ల గాయాలె
ఐదు దశాబ్దాలుగా
దగా పడిందెవరో
దగా చేస్తుందెవరో చూశాం
ఐదేండ్ల జాతర్లో లేని ఆటంకం
డిశంబర్ తొమ్మిదికెందుకొచ్చిందో
రాజకీయ రంకుతనం తెల్సింది
ఇగ చాలు మీ హుషారు
ఏకాభిప్రాయం పేరుతో
భిన్నాభిప్రాయాల్లో
ఏకాభిప్రాయం కుదరదు
కావాల్సిందొక్కటే
బలగాలొద్దు బందూకులొద్దు
కవాతులొద్దు - ఊరూ వాడా
చిన్నా పెద్దా - పేద గొప్ప
కులం మతం ఏదీ లేదు
జన చేతనమైన తెలంగాణ
పిడికిళ్ళెత్తి నినదిస్తూ
గజ్జెకట్టి పాడుతుంది
మా తెలంగాణ మాగ్గావాలి
మా తెలంగాణ మాగ్గావాలని

*కదం కదం కవితా సంకలనం, జూలై 2011*

# ఇవి హత్యలే

● తోట అశోక్

కత్తులు దిగవు
కుత్తుకలు ఎగరవు
బుల్లెట్స్ దూసుకుపోవు
రక్తధారలు పారవు
కానీ...
ప్రాణాలు పోతాయి
ఇంటి దీపాలు ఆరిపోతాయి
నిలువెత్తు ఆశను...
నాటకాల మంటలు కాల్చేస్తాయి
ధైర్యానికి కపటపు వురితాళ్ళు బిగుస్తాయి
విశ్వాసాన్ని ...
విషం మాటల గోళీలు మింగేస్తాయి
ఇవన్నీ...
నిరాశవాద ఆత్మహత్యలంటారు
కానీ.... ఇవి ముమ్మాటికీ ఆంధ్రా పెత్తందార్ల హత్యలే
ఇప్పుడు వేణుగోపాల్ లేదు...యుద్ధగానం వుంది
శ్రీకాంత్ లేదు...పౌరుషాగ్ని మండుతుంది
పర్షరాములు లేదు...విడిచిన గొడ్డలి వుంది
శ్వేత లేదు... ఉద్యమ సౌధముంది
వీరులను వేరు చేసావేకాని
వీరత్వం ఉప్పెనలా రగులుతుంది
హంతకులకు, ద్రోహులకు శిక్షలు తప్పవ్
అమరుల రాష్ట్ర స్వప్నం సిద్ధించక తప్పదు

*కదం కదం కవితా సంకలనం, జూలై 2011*

# నిజంగా...

• *వంగా గాలిరెడ్డి*

నిజాయితిగా. .
నువ్వూ-నేను
కలహము లేకుంటున్నామా!
కలిసి మెలిసి వుంటున్నామా!?
తల్లీబిడ్డల తీరుగనా!
పిల్లీ ఎలుకల తీరుగనా!
రామలక్ష్మణుల తీరుగనా!
రావణబ్రహ్మ తీరుగనా
కొవ్వుబలిసి పొగరెక్కిన
పోకిరి పొట్టేలు తీరుగనా!
చాకిరిలోనూ చతికిలబడిన
చితికిన రైతు తీరుగనా.
దొంతులకుండ తీరుగనా!
దోభీఘాటు తీరుగనా!
అడుగున వున్నది నువ్వా-నేనా
అగ్గిపెట్టినది నువ్వా -నేనా !
నిజంగా....
నిజాయితీగా నువ్వూ-నేను
కలిసి మెలిసి వుంటున్నామా.
కలహము లేకుంటున్నామా . !?

*కదం కదం కవితా సంకలనం జూలై 2011*

# కడుపుకోత

● పి. యాదగిరి

బిడ్డా...
నీ పానం దీస్కున్నవ్ తెలంగానొస్తదా ..
కొడుకా. .
తెలంగానొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా .
కౌసు మరిగిన రాకాసులకు
నీ పానం ఏపాటిది తండ్రీ
రంకు నేర్చినోడు బొచ్చె ఇరుసుక తిరుగవట్టె
కడుపు మండినోడు కాలిసావవట్టె

బిడ్డా...

నీ పానం దీస్కున్నవ్ తెలంగానొస్తదా...
కొడుకా...
తెలంగానొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా...
గోరెచ్చని లీల్లు తాక్తెనే...తల్లడిల్లెటోనివి
అగ్గితోని తానం ఎట్లజేసినవ్ బిడ్డా
పేగుబంధమని పేగుమాడ్చుకొని పెంచుకొన్న
ఈ తీగబంధం తెంపుకొని నాకడ్పు కాల్సినవా నాయిన
దిక్కు దిక్కున పిల్సుకుంట
ఎక్కి ఎక్కి ఏడ్చిన బిడ్డా
నా కండ్లల్ల లీల్లు రాలేదురా
బిడ్డా...

నీ పానం దీస్కున్నవ్ తెలంగానొస్తదా ..
కొడుకా...
తెలంగానొస్తె నువ్వు మల్ల కండ్లబడ్తవా..

మూలసుక్కల కనబడ్తవా నాయిన
పొద్దు పొడుపుల కనబడ్తవా తండ్రి
ఎన్నీలల కనబడ్తవా నా బంగారమూ
తోకసుక్కవై వత్తవా నా కన్నయ్య
ఆఖరికి నా కాష్టంల అగ్గివైయన్న కనవడు
నువ్వు తింటెనే నా కడుపు నిండేది బిడ్డా
ఇగ నాకన్ను మూతవడితెనే
నా మదుసు నిండుతదిరా..

నా పాడె ముందల
మారాజోలె నడ్తవనుకున్న
జాడలేకుంట యాడబోయినవురా నావెండి

తెలంగానల కొట్లాటలు కొత్తగాదు
నెత్తురు వాసన కొత్తగాదు
నువ్వు పుట్టంగనే నానెత్తురుతోనే
నీ పెయ్యిగడిగిన బిడ్డా..
మీ తాతలు
నెత్తురు మోటలు కొట్టిండ్లు
పోరు పంటలే పండించిండ్లు
తుఫానుకు జోరు మన పోరే నేర్పింది
లీల్లకాల్వకు రువ్వడి నెత్తుడి కాల్వే నేర్పింది
బిడ్డా....
నీ పానం దీస్కున్నవ్
తెలంగానొస్తదా...
కొడుకా...
తెలంగానొస్తె నువ్వు
మల్ల కండ్లబడ్తవా...
సంపుడుదెల్సు, సచ్చుదు దెల్సు

బందూకుల గుండ్లు బుక్కకొక్కటి
గుటుక్కున మింగుడు దెల్సు
ఉరి శిక్షలతో ఉయ్యాలూగుడుదెల్సు
పానం దీస్కునుడు మాత్రం దెల్వదిరా
బద్మాషీ ....
నువ్వు ఈరుడవెట్లైతవ్
నేను ఈరమాతనెట్లయిత కొడకా....
ఉర్ములకు గాండ్రించ్చుడు నేర్పింది
మబ్బులకు కత్తిసాము నేర్పి
ఆ కత్తులల్ల
మెరుపులు పుట్టించింది
పిడుగులకు అగ్గిరాజేసింది
సింహాలకు పురుడు పోసింది
పానాలు దీస్కునుడు మాత్రం
చెయ్యలేదు మన తెలంగాణ

బిడ్డలారా కొడ్కులారా
పానాలతో తెలంగాణ సాధించుకుందాం
శవాలతో మాత్రం కాదూ....

*కదం కదం కవితా సంకలనం, జూలై, 2011*

# శీర్షబద్దది

• వద్దెబోయిన రమణ

నువ్వు
నన్ను
ఏళ్ళకేళ్లు
ముక్కలు ముక్కలు దోచుకున్నావు
గ్రానైట్ కొండలా
ద్వేషంతో

నేను
నా గుండె మీద
ఒకే ఒక్క క్షణం
నీ విగ్రహాన్ని ముక్కలు చేశాను
ప్రేమతో

అంతే
నీకు
శీర్షబద్దది
కుండకు బద్దట్టు!

*హాస్పైదుల సంకలనం, జూలై 2011*

# కలలతడి అంటుకుంటున్న మట్టి

• వేముగంటి మురళీకృష్ణ

నీళ్లు నింపిన మోతుకు దొప్పలల్ల
మనముఖం అస్పష్టమైన చోట
మేల్కొనడమే యుద్ధం!

కండ్లల్ల కలలతడి ఆరిపోయిన చోట
అనుభూతుల్ని తోడుకోవడమంటే
గతంలోకి తొంగి చూడకుండా
ఉద్యమం తొవ్వెంబడి
గుంపులు గుంపులుగా నడవడం
మట్టి రెండు మొండి చేతుల్ని చాపి
స్వేచ్ఛకోసం విలపిస్తున్నప్పుడు
కలల అనుభవాల్ని
నిజం చేసుకోకపోవడం
ఒక నేరమే

ఇంకా ఎంత కాలం
దుఃఖపుపాటల్ని
గాయపడ్డ పావురంలా
భుజం మీద మోసుకొని తిరగడం
కాష్టాలమంటల మధ్య నిలబడి
కన్నీటి ధారల్ని అర్పించడం

పొక్కిలైన నేలమీద లేపిన
ఆకాశహర్మ్యాల మధ్య
పిట్టపిల్ల లెక్క
ముడుచుకొని పండుకోవడం

పట్టుకోవాల్సిన సమయంల
దివిటీని చేతులల్ల ధరించకుండా
ప్రమిదలల్ల వత్తులమై కాలిపోవడమేనా?
స్వప్నాల్ని దాచేసుకుని
మనసుకు గాయాలు చేసుకుంటు
సమూహాలు కూడలిలో
కూడుతున్నచోట నిలబడక జారుకోవడం
మున్మాటికి మట్టికి చేసే ద్రోహమే

సారవంతమైన పచ్చదనాన్ని మేస్తూ తిరుగుతున్న
ఎండ్రికాయల మధ్య సహజీవనం
గొంతులోకి గడ్డపారలను గుచ్చుకోవడమే

రెప్పల దర్వాజల్ని తెరిచి
ముందర నుంచి
కదులుతున్న అద్భుతదృశ్యంలోకి
రెండుపాదాల్ని నడిపిద్దాం!!
నమ్మకాన్ని పిడికిట్ల ఒడిసిపట్టుకొని
కలల దిక్కు నడుద్దాం
గొంతెండబెట్టుకుంటున్న
జీవికింత తడందిద్దాం!

*అలుకు బోనం కవిత్వ సంపుటి, జూలై, 2011*

# కొత్త ఉపాధ్యాయులు

● దేశరాజు

'ఓటమి విజయానికి తొలిమెట్టు'
'ఓటమి పోరాటాలకు ప్రాణవాయువు'
ఈ వాక్యాలు ఇప్పుడెంత అర్థరహితమైనవి?

1969 కావచ్చు, మరో నలభై ఏళ్ల తర్వాత కావచ్చు
కానీ, కల మాత్రం ఈ నాటిది కాదు
తాతలనాటి మట్టి గోడల గుడిసెలాంటి కల
పిడికెడు మట్టి, సడలని పిడికిల్లాంటి కల
యాది చేసుకున్నప్పుడల్లా యెదలో
పులకరింతలు రేపే కల

గులాబీకంటే ఎరుపైన, ఘాటైన నెత్తురుతో
అతడు ఒక్కటంటే ఒక్కటే వాక్యం రాశాడు
'మాది మాగ్గావాలె'
అదీ కల

నవ్వులపైలాన నిస్సిగ్గుగా
నవ్వే రాజకీయం నడుమ
నిచ్చెనలే వుండే పార్టీల
పరమపద సోపానపటంలో
ఊపిరి బిగపట్టుకుని ఆఖరి గడికి చేరినా
ఓటమి బిగబట్టుకుని ఆఖరి గడికి చేరినా
ఓటమి రాకాసి నోటితో మింగేస్తున్నప్పుడు
ఆత్మవిశ్వాసం ఓ ప్రశ్నార్థకమే అవుతుంది కదా!

ఆత్మహత్యల జన్మసార్ధక్యతలను
నిలువరించగల రెండు జతల చేతులు కూడా
కరువయ్యే స్థితి ఎంత దారుణమైన వ్యధ!

తేదీలు మారినప్పుడల్లా కల
చిగురుటాకులా వణికి పోవడాన్ని
కేవలం విషాదమనే అనగలమా?

కళ్ళలోకి కల రాకుండానే వుండాలి,
ఒకసారి కల అంటూ వచ్చాక, ఇక కల్లోలమే
గెలిచి ఓడినా, ఓడి కలిసినా
కల ఇద్దరిది అయినప్పుడు రెండు కళ్ళకూ దుక్కమే
కన్నీటి తలపోతలో వుండగానే
ఒక విద్యార్థి వచ్చి తొలి వాక్యాన్ని సరిజేశాడు
'పోరాటమే విజయానికి తొలిమెట్టు' అని
ఇక అతడే మన కొత్త ఉపాధ్యాయుడు

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 11, జూలై, 2011*

# ప్రతి పుట్టుక యుద్ధమే

● ఎం.వి.రమణ

ఇక్కడ ప్రతి పుట్టుక
వాణ్ణి భయపెడుతుంది
పొత్తిళ్ళల్లో శిశువు
జై తెలంగాణ నినాదమిస్తుంది
చావు వాణ్ణి భయపెడుతుంది
నేలకొరిగిన వీరుడి శవం
సమాజాన్ని యుద్ధంలో మోహరింపజేస్తుంది
ఏక్కడైనా ఎవ్వరైనా తమ వాళ్ళ శవాల పై బడి
ఏడ్వడం సహజం
కాని ఇక్కడ మేం
మా వాళ్ళ శవాల కోసం
యుద్ధాలు జెయ్యాలె..
ఏడ్వడం కోసం యుద్ధం జెయ్యాలె
ఇక్కడ చావు...పుట్టుక...
రెండూ యుద్ధాలే
ఆ రెండింటి మధ్య జీవితం
మరింత పుడుతూనే...
ఇంకా చెప్పాలంటే
అమ్మ కడుపులోనే
అభిమన్యులమై యుద్ధం నేర్చుకుంటాం
జీవించడం కోసం యుద్ధం చేస్తాం
ఇక్కడ యుద్ధంలో తప్ప
సహజ మరణాలుండవు
చనిపోయాక యుద్ధం చేయడం ఎక్కడైనా చూశారా

ఇక్కడ వీరుల శవాలు నినాదాలవుతాయి
పిడికిళ్ళవుతాయి ..
సమూహాలవుతాయి
ఒకటి...రెండు. .మూడు .
లక్షల జన సముద్రాలవుతాయి
ఊరేగింపులవుతాయి
క్యాంపస్‌ల నుండి
గల్లీల నుండి
పల్లెల నుండి
సరిహద్దు మిలట్రీని దాటడానికి
శవాలు గెరిల్లా పోరాటాలవుతయ్
వీరోచిత శవం!
ఆదిరెడ్డి కావచ్చు . యాదిరెడ్డి కావచ్చు
శ్రీకాంతైనా, సంతోషైనా
చిన్నయ్యకావచ్చు యాదయ్య కావచ్చు చనిపోయిన
తీరు వేరు కావచ్చు
సందర్భం మారిపోవచ్చు
ఒకరి లక్ష్యం మరొకరి మజిలీ కావచ్చు...
కానీ శవం అంటే వాడికి భయం

*నమస్తే తెలంగాణ, చెలిమె, బుధవారం 27, జూలై 2011*

# ఒకటి రెండు కావడమే నేటి సైన్స్

• మల్లీశ్వరి

రెండు ఒకటవడం కన్నా
ఒకటి రెండవడం బాధాకరమే
కానీ...
ప్రియా
ఒకటయ్యేటపుడు పెంచుకున్న నమ్మకాల్ని
పంచుకున్న ఆశల్నీ
ధ్వంసం చేస్తూ
ఈ రోజు భవిష్యత్తుని
నా ఒడిలోని నవజాత శిశువుగా
నువ్వెంత అభివర్ణించినా..
చెదిరిన విశ్వాసాలనూ
చెదిరిన స్వప్నాలనూ
మోసుకుంటూ నీతో కలసి ఎలా నడవను?
ఐతే
ఒకటి మాత్రం నిజం
నువ్వు ఎక్కడ ఐక్యతా రాగాన్ని ఆలపించినా
నా శిథిలాలపై నువ్వు ఎప్పటికీ
కోటని నిర్మించుకోలేవు

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ 27, జూలై 2011*

## నినాదం

• వెల్దండి శ్రీధర్

పల్లెవాకిట్లో
ఒక దేహం కుదేలయినప్పుడు
పాదాలన్నీ బిగించిన పిడికిళ్ళన్నీ
రగిలిన గుండెలన్నీ ఒకటే పరుగు
మృతదేహం చుట్టూ దడికడతాయి

చెట్టునలాగే వుంచి పత్రహరితాన్ని
హరించినట్టు
నదినలాగే వుంచి నీటిని దొంగిలించినట్టు
పంటనలాగే వుంచి గింజను
గుంజుకుపోయినట్టు
పల్లెనలాగే వుంచి అవ్వను చంపినట్టు
బొక్కనలాగే వుంచి మూలుగును కాజేసినట్టు
దేహాన్నలాగే వుంచి ప్రాణాలు తీసినట్టు
ఎవడో....
అక్టోపస్ రూపమెత్తి సహస్ర బాహువుల్తో
ఇక్కడి మట్టిని శిధిలం జేసి
లోతైన పునాదులు తీసి
సరికొత్త సమాధులు కడుతున్నాడు .

పునాది భవంతిని చూడకపోవచ్చు
కానీ కుట్రల అంతస్తులు పెరిగినప్పుడు

నాలుగు గదుల నిండా
కల్మషం పరుచుకున్నప్పుడు
పునాది రాళ్ళే చింతనిప్పులై
భవంతిని, మెలితిరిగిన మీసాల్ని
సమూలంగా కూల్చివేస్తాయి
చివరాఖరికి
'తనదైన గుడిసె నిర్మాణానికై'
ప్రాణాలనైనా గరిక పోచల్లా వదిలేస్తాయి

ఈ మట్టి
ఇంకెన్ని మరణాల్ని మొలకెత్తిస్తుంది?
జీవంలేని మహావృక్షం కన్నా
సజీవమైన గడ్డిపువ్వయినా
నెత్తి మీది రుమాలులా
మట్టికి అందాన్ని తెస్తుంది
కోట్ల కంఠాల నినాదమై నిలుస్తుంది.

*ముంబయివన్ 16-31, జూలై, 2011*

# అంత్యక్రియలు జెయ్యాలే

• ఉదయ మిత్ర

ఆంధ్రప్రదేశ్ ఊపిరాగి పోయ్యింది
అంత్యక్రియలు జెయ్యాలె
ఇక ఆంధ్రప్రదేశ్ భావన
కాలపు నేలమాళిగల్లోనే
కవులారా ఎలిజీలు రాయండి
మేధావుల్లారా జ్ఞాపకాలు నెమరేయండి
ఢిల్లీ పెత్తనానికి
సీమాంధ్ర పెత్తందార్లకీ పుట్టిన
అక్రమ సంతానం ఆంధ్రప్రదేశ్!
పాపం వెంటిలేటర్ల సాయంతో
బతికి, చితికి, ఆఖరి శ్వాస విడిచింది
అంత్యక్రియలు జెయ్యాలె
అందరూ రండి!!
సంఘర్షణలో
గురువులుగా ఎదిగిన విద్యార్థులారా
పాడెకట్టెలు తేండి
భద్రతా పొరలు చీల్చి
పిడికిళ్లెత్తిన ఉద్యోగుల్లారా!
ఇంత గడ్డీ, సొప్పకట్టెలు తేండి
నల్లకోటుకే వన్నె దెచ్చిన
లాయరన్నలారా!!
ఇంత బుక్క, కుంకుమతేండి
విద్యుత్ ఉద్యోగుల్లారా
పూలు సిద్ధం చేయండి

ఏడుకట్ల సవారి సిద్ధం చేయండి!
ఎత్తండి దీన్ని
మోగించండి డప్పుల్ని
గోవిందా ..గో...హో విందా
ఎంకటరమణా గోయిందా..గోయిందా
తెలంగాణ తల్లీ....!
కుండ పట్టుకుని ముందుకు నడువు
పూటకొక్క నాటకానికి
రక్తి కట్టించే నాయకులారా
ఇక ఊరేగింపుల గలవండి
సీమాంధ్ర సోదరులారా!
కావడికుండలం మనం
స్మశానందాకా పోయొద్దాం...రండి
జయ జయహే తెలంగాణ
జయశంకరా... ఇది నీ స్వప్న వీణ
పైన ఆరువందల మంది అమరులు
గుప్పిట మట్టితో
మన్నెయ్యడాన్కి సిద్దంగా ఉన్నారు
భూమ్యాకాశాలు, నదీ నదాలూ, ఘోషించే సముద్రాలూ
చెరచబడ్డ ప్రకృతీ
బానిస సంకెళ్ళు దెంచుకున్న
సమస్త రాజ్యాలూ
ఎదురు చూస్తున్నాయ్
తొందరగా బొందపెడదాం రండి.

*చెలిమె, నమస్తే తెలంగాణ బుధవారం, 27, జూలై, 2011*

# జోహార్ యాదిరెడ్డి .....

• షేక్ హారూన్ ఉల్‌రషీద్

నపుంసక పాలకులు నాన్చివేతతో వెతచెంది
వేదనా తప్తహృదితోనీ అసువులు బాసినవా
క్రౌర్యపు గుండెలనీ కదిలిస్తాయని ఈ లోకపు
వాకిలి విడిచి అమరుడయ్యావా?
నీ తల్లి కడుపుకోత కోటి సూర్యుల విస్ఫోటనమై
ఈ గడ్డ పరాధీనతను బద్దలు చెయ్యదా?
ఈ భూమి పుత్రుల గోహాలాహలమై ఉప్పెనై
వలస పాలకులను ముంచెత్తదా?
త్యాగపు ఎత్తులపైకి నీవు ఎగబ్రాకి
మమ్ము తీరని
దుఃఖపు సాగరంలో నెట్టివేయ భావ్యమా?
ప్రాణం తృణమై బాధ బ్రహ్మాండమై
నిర్బంధపు కలత మా అందరి అసమర్ధత మధ్య
నీ బలవన్మరణం మా మనసు
పై యాది కి వచ్చి సలుపుతున్న గాయం

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, 3, ఆగస్ట్, 2011*

# దడి కడుదాం

● నమిలికొండ బాలకిషన్‌రావు

తెలంగాణ గోల గోలే ..
మా బతుకులు బతకనియ్యండి
దొరా! బాంచెను
కాల్మొక్త రోజులు పోయినయ్
మా పొలిమేరులు మాకు ఇవ్వండి
మా కాయ కష్టం మా పంట లక్ష్మీ
తెలంగాణ తల్లి
మా పోశవ్వ మైసవ్వ గద్దెపెరమాళ్ళు
బొడ్రాయిల దేవుళ్ళు
మా భాష, యాస, కావ్యాలు
ప్రబంధాలు తెలుగుతనం ఆనవాళ్ళు
మా యాస, భాష వక్రీకరిస్తారు ఎందుకు?
కృష్ణరాయ బారాలు సీనులు- శిబిరాలు ఎందుకు
మా ఊరూ, ప్రజల గోడు
అవ్వతోడు, మా తెలంగాణ మాకివ్వు
ముంచుక పోయేది ఏమిలేదు
మా నీళ్లు మాకే మా వనరులు మాకే
మా హద్దు బందు మాకే కావాలి!!
జర్ర విడిపోవడానికి కుత కుతల మంతనాలెందుకు
కిరి కిరి చేస్తే పుట్టగతులుండవు
ఇక నాన్పకుండి
మా హద్దు బందు అంతట దడి కడుతాం

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, ఆగస్ట్ 17, 2011*

# తెలంగాణ నమస్తే

• ముక్కెర సంపత్‌కుమార్

నిబద్ధతతో సాగుతున్న చీమలదారుల్లో
నిప్పులు చిమ్మిందెవలు?
బతుకు పాఠాలు చదువుకుని
ఎదగాలనుకున్న యువత భవితవ్యాన్ని
ఇనుప బూట్లతో నలిపిందెవ్వలు?

తల్లిదండ్రుల ఆశలు - ఆశయాలై
పేదరికపు చెరనుంచి విముక్తికై
యూనివర్సిటి విద్యార్థుల ఎన్నెన్నో ప్రణాళికలు!
వలసవాద పాలనలో సవతి తల్లి ప్రేమ.
నడి సంద్రంలో తుపాను చుక్కాని లేని పడవ ప్రయాణం!

నిన్నటి దాకా కలిసే తిరిగిన సోపతిగాడు
తెలంగాణ సాధించాలనే తెగువతో
కళ్లముంగటనే ఆత్మబలిదానం నేలను సూదులతో పొడిచినట్టు
సూసైడ్ నోట్‌తో మరోవిద్యార్థి
మృత్యువు కోరల్లో గిలగిలలాడుకుంటనే
ఓ ఆడబిడ్డ మరణవాంగ్మూలం
విద్యార్థుల పోరాటపటిమ గుర్తించని
ఢిల్లీ పీఠం ఒక కదలని బండరాయి
ఇప్పుడు చరిత్రలో నూతన అధ్యాయమై లిఖించబడుతోంది
అందుకే నాలుగుకోట్ల గొంతులొక్కటై
విద్యార్థులకు సలాములు జేస్తున్నయ్
నమస్తే తెలంగాణ అంటున్నయ్

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, 23 ఆగస్ట్, 2011*

# రెండు దేహాల ఆత్మకథ

● అఫ్సర్

చూడూ, ఈ చరిత్రలోకి మనిద్దరం
మనకి తెలియకుండానే కాళ్లీడ్చుకుంటూ
వొళ్లీడ్చుకుంటూ వచ్చాం
అసలు చరిత్ర నీకు తెలుసు
నా ముఖమ్మీదనే వుమ్మి రంగులద్ది
నీ ముఖమ్మీదనే రక్తపు చారికలు అలిమి

ఇద్దరికిద్దరం వొక అబద్ధాన్ని మోస్తూనే
భరిస్తూనే ఖర్మ ఖర్మ అంటూనే

చూడు, ఈ చరిత్రలోకి మనిద్దరం
ఎవరో తోస్తే ఎక్కినట్టు ఎక్కి తకదీమ్ తకదీమ్ తై
నీ పాత్ర నేనూ
నా పాత్ర నువ్వూ
ఎవరూ ఎవరి పాత్రకే న్యాయం చేయలేక

ఇద్దరికిద్దరం అన్యాయమయ్యి తోస్తూనే వున్నాం
నవంబరు వొకటి రంగస్థలమ్మీదికి
నా పొలాల్నీ
నా నీళ్లన్నీ నువ్వు
నా చేతుల్లోంచి మోచేతుల్లోంచి కాలివేళ్లలోంచి
కంటి నీడల్లోంచీ ఎటు కనిపిస్తే అటు దోచేస్తూ పోతావ్

నా దేహంలోకి వలస వచ్చి నన్ను ఆసాంతం ఆక్రమించుకొని
"ఓహో, నీకూ వో వొళ్లున్దా, నాకు తెలీనే తెలీదబ్బా."
అని కులుకులు పోతుంటావ్!
నాకు తెలీదనా!

నీ అందమైన పదాలని
నీ ఆద్యంత సుందరమయిన వాక్యాల పక్షులబారుల్ని చూస్తూ
నన్ను కాసేపు ఏ ఆకాశంలోకో తోసి
నువ్వు నేలంతా ఆకుకూర దూసుకుపోయినట్టు దూసుకుపోతావ్
నీకు తెలీదనా!

నేను ఆ ఆకాశమ్మించి దభీల్మని పడేలోగా
నా విస్తరినిండా నువ్వే విస్తరించుకొని వుంటావ్
నాకూ నీకూ తెలీదనా!
ఈ అజ్నబీ అన్ జాన్ మారో నాటకానికి గోలీమార్!

చూడు, ఈ విస్తరిలోకి మనిద్దరం మనకి తెలియకుండానే వచ్చాం
నువ్వు నాకు కనీసం ఎంగిలి మెతుకులు కూడా
విదిలించని పిచ్చి కాకిని కాదని నీకూ తెలుసు

నేను నీ మోచేతి నీళ్ల కోసం కాచుక్కూచోని
కావు కావుమనే ఉషారు పిట్టవని నాకూ తెలుసు

సర్లే, ఈ నాటకం ఆడింది చాలు!
నన్ను నా దారిన పోనీ
నీకెటూ వందదారులు!

నా వొంటి మీదికి నీ ఆక్రమణలు వద్దులే ఇంక
నీ ముళ్ల కంప మీద
వస్త్రాన్ని కానులే ఇంకా!

పై చర్మం వొలుచుకుపోయినా సరే
నీ చేతుల ఇనప తాళ్ల నించి
నా వొంటిని చీల్చుకు రావడం ఎట్లానో తెలుసులే నాకు!

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, 24 ఆగస్టు 2011*

# యుగసంధి

● శేఖర్ ఆర్.కె

ఈ పరుగు ఎన్నాళ్ళు? ఈ నిరీక్షణ ఎన్నేళ్లు
గుండెలు పగిలిపోతున్నయ్
విప్లవం రాలేదు చివరకు తెలంగాణ కూడా రాలేదు
జీవితమంతా పోరాటమే మెదడునిండా నిరంతర ఆరాటమే
నిద్రకనులు చెమ్మగిల్లుతున్నయ్
ఓటమి భయపెడుతున్నది...నిరాశ కృంగదీస్తున్నది
స్తబ్ధత పరివ్యాప్తమవుతున్నది మౌనం రాజ్యమేలుతున్నది
తేలుకుట్టిన దొంగలు దర్బారు కలుగుల్లో దూరిపోయారు
ఆశల ముహూర్తాలు అనంతంగా మారిపోతుంటాయి
శత్రువు విలనీ వెక్కిరిస్తున్నది
కలిసొచ్చే కాలం కోసం ఎన్నాళ్లుగా ఎదురు చూపులు
ఎండమావి ఎప్పటికీ చేరువ కాదు ఉరితాళ్లు పేనుకుంటున్నయ్
ఎండోసల్ఫాన్ డబ్బాలు నేలంతా పరుచుకుంటున్నయ్
మనుషులు నిలువునా కాలిపోతున్నారు
అయినా నేను ఎదురు చూస్తాను
స్తబ్ధత భళ్లున బద్దలయ్యే తరుణంకోసం
నిరాశల సమాధులపై ఆశల జెండా ఎగుర వేసే క్షణం కోసం
మౌనం ప్రళయకాల గర్జనగా మారే ముహూర్తం కోసం
శాంతి అశాంతిల సరిహద్దులు ధ్వంసమయ్యే రోజు కోసం
కాలం అఖండమై స్తంభించిపోయే సమయం కోసం
స్వేచ్ఛా పవనాల కోసం
మృత్యువును జయించలేక పోతే శత్రువును జయించలేం
జీతే రహేంగే...! లడ్తే రహేంగే!!

*నమస్తే తెలంగాణ, బుధవారం, 24, ఆగస్టు, 2011*

# భూమి తున్క

• రమేశ్ హజారి

మూగవోయిన విశ్వనరుని ఆత్మగౌరవ గీతా ాపన
అంధకారమైన సీసపు గాయాల ఇంద్రియ జ్ఞానం
అమృతం తాగకుంటనే హిందూ సముద్ర మధనానికి విరామం
అరణ్య రోదనల నడుమ తాళం తెరుసుకోని సింహాల బోను
అయిలవ్వలకు గర్భశోకం మిగిలిస్తున్న మహావీరుల నిష్క్రమణ
అన్నీ. .శిథిలమౌతున్న దృశ్యాలే
పుట్టిన రోజునే స్వీయ తద్దినపు ప్రసాదాల ఆరగింపు
అవకాశవాద ఏ మార్పులు స్వీయాత్మక వ్యూహాలు
గాంధారి గంతలు కట్టుకొని దృతరాష్ట్ర కౌగిలిలో
ఒదిగిన తన్మయత్వం
పోరాటతత్వాన్ని వదిలి సుఖ ప్రసవాన్ని కోరుతున్న బానిసత్వం
నడి సంద్రంలో నీల్లు ఇంకి చిక్కుక పోయిన యుద్ధనౌకలు
అన్నీ ..అంతుచిక్కని దృశ్యాలే
యజ్ఞ గుండంలో పడి కాలుతున్న ఆత్మల కమురు వాసన
గతి తప్పి కాళ్ళు చేతులు తెగిపడి తన్లాదుతున్న వసంతమేఘం
ప్రతిధ్వనిస్తున్న శవాల మీద ప్రమాణపు మంత్రోచ్చారణలు
మరణ మృందంగపు మార్మోతలో కొట్టుక పోయిన తీన్మార్
గుండెల చప్పుళ్లు
మానవత్వాన్ని రోజుకింత తనలోకి లాగేసుకుంటున్న
రాజకీయ కృష్ణబిలాలు
అన్నీ మాయా దృశ్యాలే
ఇప్పుడు బలిదానాలు కాదు తెలంగాణే జన్మ హక్కు
మాకిప్పుడు స్వపరిపాలనకోసం ఓ భూమి తున్క కావాలే

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ 7 సెప్టెంబర్ 2011*

# ఉస్మానియా ... సలామా లేకుం

● అమర్

ఇక్కడ పుష్పించిన తొలిమందారం
వందేమాతరమయినా
ఎక్కడో అడవుల నుండి వీస్తున్నదంతా
త్యాగాల మకరందమే కదా
ఉస్మానియా ! ఉస్మానియా!!
ఒక్కొక్క ప్రతిఘటన మెట్టెక్కుతున్న
విశ్వవిజ్ఞానవీధి మహోగర్జనకు సాష్టాంగపడి
ఇప్పుడే నేను కదిలే అక్షరాలను
ఏరుకుంటున్నాను-
'జీనా హైతో మర్‌నా సీకో' అంటూ
జార్జి కొసనుండి పిడిదాకా చేరుకుంటున్నాను
కండ్లపై నల్లటి చారల్ని తుడుచుకుంటూ
పాడుతున్నవన్నీ జంపాల ఉయ్యాల పాటలే
రణంలో ఏరుకుంటున్నవన్నీ
మదన్న వీరన్న సంతోష్‌రెడ్డీ జ్ఞాపకాలే
అవనతమై అరుణపతాకం నీడన
పిడికిట ముదుచుకుంటున్నవీ రుధిర జ్వాలలే-
చెకుముకి రాయితో రగలి
నిప్పు నినదించినప్పుడల్లా ఒక 'యాది'
నల్ల సూర్యుని చుట్టూ మూగి
తెల్లవార్లు జాగారం చేస్తూ వేణుగానం
కారుమబ్బులు ముసురుకుంటున్నప్పుడల్లా
తనువులు కాలిన అగ్గే రాజుకుంటుంది
ఎప్పుడూ ఆకురాయి మీద పదునెక్కుతున్న చోట

ఇప్పుడు అగ్ని గోళాల బంతాట-
పల్లె మట్టి వాసనల మాధుర్యం
ఢిల్లీ వీధుల్లో ఉరిదీయబడ్తుండగా
లస్కరు బోనాల దీపం సలసల కాగుతుంది
చార్మినార్ ఆవేశంతో ఊగిపోతుంది
నీ కొవ్వొత్తుల వెలుగులో
నల్ల కలువలు  విచ్చుకుంటున్నాయి
భవిష్యత్తు శూలాలై గుచ్చుతుండగా
ఎండిన నదుల్లా ఏడ్చే కన్నీల్లు ఇంకుతున్నాయి
ఏ కుబేరుల ఫర్మానాల కింద నలిగి
నేలతల్లి  నజరానా అయిపోతుంది.?
ఏ అధికార ఫత్వాల కింద
ఎస్మామృత్యుగంటలు మోగుతున్నవి?
ఉస్మానియా ...ఉస్మానియా
టియర్ గ్యాస్‌లు పొగజూరిన చీకట్లో

నిన్ను నీవు తడుముకోవడానికి సమరమే
నిన్ను నేను చేరుకోవడానికి రణమే
నేనే నాలుగోడల మధ్య  బంధీననుకున్నాను
నీవెన్ని ముళ్లకంచెల గజిబిజివి
పరీక్షల సంకెళ్ళు తెగిపడ్తుండగా
నీ సరిహద్దులు చెరిగే శంఖారావం వింటాను
ఉస్మానియా సలామాలేకుం
నీ ఆరాటానికి పోరాటానికి
అందుకో బేడీల చేతుల కరచాలనం

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ 26, సెప్టెంబర్, 2011*

# నువ్వే ఆయుధమైతే...

● కాంచనపల్లి రాజేంద్ర రాజు

కోరుకున్నది దక్కనప్పుడు
దక్కినదేదీ సహించదు
ఆత్మ సాక్షిగా....నాలుగు కోట్లమంది
కోట్లాటకు సిద్ధమన్నాక
ఒక్కడివి...ఒంటరిగా ఆత్మను బలివ్వటం
ఓటమి పాల్వటమే

తేల్చుకోవాల్సింది చావో...రేవో కాదు
ఖచ్చితంగా రేవే-
కాల్చుకోవాల్సింది నిన్ను కాదు
ఖచ్చింతగా వాన్నే-

అతిథిగా వచ్చిన వాడి పెత్తనాన్ని
తన్ని తరిమేయాలే కాని
నిన్ను నువ్వే పెరట్లో పాతర పెట్టుకుంటే
రోత నా కొడుకలకు జాతర జాతరే కదా

విడిపోవాలనుకున్నాక
ముడివేయాలనుకుంటే
అది ఉరితాడే అవుతుంది

అయితే -
ఉరి వేయాల్సింది ఖచ్చితంగా నీ ఊపిరి కాదు
ఖచ్చితంగా వాడి ఉనికినే-
బొంద పెట్టాల్సింది నీ పౌరుషాన్ని కాదు
ఖచ్చితంగా వాడి పౌరసత్వాన్నే

పోరాటంలో...
ఎప్పుడూ అంతం కావొద్దు
ఆయుధమవ్వాలి

నువ్వొక్కడివి కాదు
ఒంటరివసలే కాదు
నువ్వొక సైన్యం

నువ్వు పేలితే...
వందమంది దగాకోర్లు నేలకొరగాలి

నువ్వు కాలితే...
వేయి మంది నమ్మక ద్రోహులు బూడిదవ్వాలి

నువ్వు రాలితే...
లక్షమంది పుండాకోర్లు మట్టి కరవాలి

పిడికిలి బిగించి నువ్వే ఆయుధమైతే
నాలుగుకోట్లమంది యోధులవుతారు
స్వరాష్ట్ర సాధనలో సాయుధులవుతారు.

*ఆత్మ బలిదానాలు వరంగల్ అమరవీరుల సంకలనం, సెప్టెంబర్, 2011*

# తెలంగాణ పొద్దు చూడకుండా పోవద్దు

• సీతారాం

వాళ్ళు ఎవరినీ ఏమీ అనకుండా పోతున్నారు
వాళ్లు ఎవరినీ ఏమీ అనలేక పోతున్నారు
వాళ్ళు ఎవరినీ ఏమీ చెయ్యకుండా పోతున్నారు
అందరినీ హెచ్చరించి మరీ వెళుతున్నారు
ఇక...ఇదే...చివరి మరణం కావాలని రాసిమరీ
ఆశించి మరి చెప్పి మరీ, అప్పగించి మరీ
మనమధ్య నుంచి మాయమవుతున్నారు.
1,2,3 కాదు,
ఆరువందల నాలుగో..అయిదో.. ఆరో.
ఏడువందల తొమ్మిదో..పదకొండో..
పందొమ్మిదివందల అరవై తొమ్మిదో
రెండువేల తొమ్మిదో/ ఇరవై పద్నాలుగో
చిదంబర రహస్యాలు చెప్పిపోతున్నారు
ఆజాదుల గుట్టు విప్పిపోతున్నారు
ప్రణబ్‌ల లబ్‌డబ్‌లను వినిపించిపోతున్నారు
శివమెత్తిన తెలంగాణకు శవాలనెత్తిందని చెప్పిపోతున్నారు
కోపమొచ్చి శాపమిచ్చిపోతున్నారు
క్షమించు బిడ్డా... మన్నించు కొడుకా
నిన్ను బతికించుకోలేక పోయినం
ఇది యుద్ధం యాదిరెడ్డీ!
ఇక తెలంగాణ తథ్యం యాదయ్యా
వొద్దొద్దు ...చావొద్దు
చూడకుండా ఎవరూ ఎటూ పోవద్దు ...

*ఆత్మ బలిదానాలు వరంగల్ అమరవీరుల సంకలనం, సెప్టెంబర్ 2011*

# రాజ్య హత్యలు

• శ్రవణ్‌కుమార్ రక్తాని

ఆత్మ బలిదానాలు కావు ముమ్మాటికీ
రాజ్య హత్యలే అవి
ప్రజల కోరికను మన్నించని
ప్రజాస్వామ్య రాజ్యపు హత్యలు
తెలంగాణ విముక్తి కోసం ఉద్యమిస్తున్న
యువకుల కత్తిరించిన కుత్తుకలు
బిగిసిన పిడికిల్లనీ .ఆజ్ఞలతో అదుపు చేయాలని చూస్తే
అగ్గై మండుతరు
గుడిసె చూరుకు అలముకుంటున్న విషాదంలోంచి
ఊరితో పెనవేస్కున్న ఊపిర్ల బంధంలోంచి
ఆర్ధి వీరభద్ధమై మొలుస్తున్నది
నేల నేలంతా ఒక యుద్ధ ప్రకటన చేస్తున్నది
"ఆప్తులారా ఆత్మ హత్యలతో కాదు
ఆవేశంతో పోరాటం చేద్దాం" అని
అదే తెలంగాణ ఆకాంక్షల కొత్త నినాదం

***ఆత్మబలిదానాలు, తెలంగాణ ఉద్యమం,సెప్టెంబర్ 2011***

# మూడు బతుకులు

• అయినంపూడి శ్రీలక్ష్మి

ఒక్కేసి పువ్వేసి సందమామ
ఒక్క జాము ఆయె సందమామ
ఆకాశంలో చందమామకి ఒకటే వర్ణం
మా ఇంట్లోని 'సిబ్బి' పై పూసిన
చందమామకి సప్తవర్ణాలు
నిన్నటిదాకా-
చెల్కల్లో-చెరువు కట్టమీద పూసిన
గునువు పూలు- కట్లాయిపూలు
తెల్లారగట్లల్లనే మా ఇంటికి నడిచొస్తాయి
సూరీడు నిద్ర లేవడానికి ముందే లేచిన ఊరు
స్నానించిన శిరోజాల తడిదనాలను తలపై మోస్తూ సందడి చేస్తుంది
నట్టింట్లోని ఈతచాపపై తంగెడు పూల పసుపుదనం
మా ఇంటికి కొత్త నిగారింపును తెస్తుంది
ఒక్కో గునుగు పువ్వూ ఒద్దికగా రంగుసిరాలో మునకేసి
పండుగ బట్టలను చుట్టేసుకుని షోకులు పోతుంది
ఇపుడు మా ఇల్లు ఇల్లంతా పూల నర్సరీ అవుతుంది
బతుకమ్మ-
ఓ పూల పండుగ-
ప్రకృతి తల్లికి మన 'థ్యాంక్స్ గివింగ్' పండుగ!
వర్షాకాలానంతర ఋతువు
వలన వచ్చిన కొత్త నీరుతో నిండిన చెరువు
కొత్త రోగాల బారినపడే పసిబిడ్డలు
చెరువును ప్రక్షాళన చేయాలి
పూలు తప్ప బాణాలు తెలీనివాళ్ళం కదా

పూల పుప్పొడితోనే చెరువులను పరిశుభ్రం చేద్దాం
బతుకు పోరాటాన్ని బతుకమ్మతోనే ఆరంభిద్దాం
ఇపుడు పూలన్నీ-
మార్చ్ ఫాస్ట్ చేస్తున్న సైనికుల్లా
ఒకదాని పక్కన ఒకటి వరుసగా పేర్చుకుని
ఒక మహా ప్రాకార నిర్మాణానికి
ఇటుకలుగా మారతాయి
తెలంగాణలోని ప్రతి ఇంటా
ఓ పూల పిరమిడ్‌ని సృష్టిస్తాయ్
ఏళ్లనాటి స్వప్నానికి
సరికొత్త జీవం పోస్తాయ్
శ్రీలక్ష్మి నీ మైమలు గౌరమ్మ
సిత్రమై తోచునమ్మ గౌరమ్మ సిత్రమై తోచునమ్మ
పూలు సున్నితం .సుకుమారం
పూలు లలితం ..నిర్మలం
కానీ పూవులన్నీ కలిసి
కత్తుల వంతెనగా మారిన దృశ్యం ఇది
పూవులన్నీ నిలిచి
ఉద్యమ గొంతుకగా నినదించిన క్షణం ఇది

సందులు - వాడల్లోంచి
నడిచి వచ్చే పాదాల జడికి
కాలిగజ్జెలు - గాజుల సవ్వడి తోడవుతుంది
చేతుల్లో పూసిన బతుకమ్మ
బతుకు కాంక్షను నేర్పే ఒడి అవుతుంది
చప్పట్లు - పాద ధ్వనులే నేపథ్య సంగీతంగా
విడివిడిగా ఉన్న చేతులని జోడి కట్టినవి
మెతుకు మెతుకులోని మన బతుకు పాటపై
బతుకమ్మపై నిలిచిన పసుపు గౌరమ్మ

దోపిడీ ట్యాన్లను ధిక్కరిస్తుంది
గుండె చప్పుడు జ్వాలాగీతంగా మలుస్తుంది
ఇపుడు బతుకమ్మ-
పర్యావరణ పండుగ మాత్రమే కాదు
పూలు-పుప్పొడుల ఆహ్లాద వేడుక మాత్రమే కాదు
పల్లెపల్లెనా రగులుతున్న సమర సంబురం
గల్లీ గల్లీలో వెల్లువెత్తిన పూరేకుల ఆయుధం
బతుకమ్మ బతుకమ్మ ఉయ్యాలో
బంగారు బతుకమ్మ ఉయ్యాలో
ఆకాశంలో సంజె కెంజాయి చీకట్లు
కొంగులు బిగించిన ఆడబిడ్డలు
చప్పట్లు చేతుల మధ్య గుమికూడిన బతుకమ్మలు
గుంపులు గుంపులుగా పలకరించుకుంటాయి
సత్తుపిండి..పల్లీల పొడి-నువ్వుల పొడుల్ని
వాయనం ఇచ్చుకుంటాయి
నీ బతుకుకు నేను రక్ష
నా బతుకుకు నువ్వు రక్ష
మనిద్దరం ఈ నేలకు రక్ష అని
బాసలు చేసుకుంటాయి
చూస్తుండగానే-
నేలపైని బతుకమ్మలు
గాజుల చేతుల్లోకి వస్తాయి
సరికొత్త ఆయుధాలుగా మారతాయి
చెరువు వైపుగా పాదాలు కొత్త  తూరుపు కోసం పదాలు

ఇప్పుడు బతుకమ్మ
ఈ ప్రపంచంపై పొడిచే సరికొత్త సూరీడు

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి 3, అక్టోబర్, 2011*

# ఆయుధ పూజ

• *కలకుంట్ల రంగాచారి*

విరాట పర్వం ముగిసింది
సైనికులారా ఇక కురుక్షేత్ర సంగ్రామానికి
సిద్ధంకండి ..
ఆయుధపూజచేసి
జంబి చెట్టు పై దాచిన ఆయుధాల్ని దించి
భుజాలకెత్తుకోండి
హస్తినాలో ధృతరాష్ట్రుడు ఫిడేలుపై
మన్మోహన్ రాగాన్నే వాయిస్తున్నాడు
సోనియా గాంధారి కళ్లకు కట్టుకున్న
గంతలు ఇంకా మీనమేషాల
లెక్కింపులోనే తలమునకలై ఉన్నాడు
రహస్యాన్ని బయట పెట్టేదెన్నడో
అదేం చోద్యమో అదేంవిచిత్రమో
అర్ధ రాజ్యమిప్పిస్తానని రాయబారానికెళ్లిన
శ్రీకృష్ణుడు బేరాలకు మొగ్గి
కౌరవులపంచన జేరిందు
సైనికులారా ఇక ఆయుధాలకు
పదును పెట్టండి
అర్జునా..సవ్యసాచి...
అంతా మనవాళ్లే కదా అని
ఆయుధాన్ని దించితే
గీతబోధ చేయదానికి
శ్రీకృష్ణుడు ఇప్పుదు మన దిక్కులేదు
సర్వసైన్యాన్ని ముందుండి నడిపించి

అభిమన్యునివై పద్మవ్యూహాన్ని ఛేదించాలి
కోమురం భీమ్‌లమై శత్రువు గుండెల్లో
ఫిరంగులు మోగించాలి
సమ్మక్క సారక్కలమై
చాకలి ఐలమ్మలమై యుద్ధ శంఖం పూరించండి
దొడ్డి కొమురయ్య బందగీ వారసులారా
జంగ్ సైరన్ మోగించండి
ఏకలవ్యులమై దారికి అడ్డం వచ్చే
కీచకుల్ని సైంధవుల్ని అడ్డు తొలగించండి
ఇచ్చేది తెచ్చేది మేమేనని ప్రగల్భాలు పలికే
ఉత్తర కుమారుల్ని ఉరికించి, ఉరికించి కొట్టండి
రెండుకళ్లని చెప్పి ఒకే దిక్కు చూస్తున్న
పచ్చకామెర్ల నాయకుల్ని
ప్యాంట్లూడగొట్టండి
సైనికుల్లారా....ఇక సమరానికి సమాయత్తంకండి

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ 5, అక్టోబర్, 2011*

## ఎర్రగాజులు

• శారదా హన్మాండ్లు

జమీందారీ పెత్తందార్ల అరాచకానికి
ఉవ్వెత్తున ఎగిసిన విప్లవ కెరటాలు
సమ్మక్క సారలమ్మలు

ఆ పునాది గద్దెలపై వెలసిన
గాజుల సవ్వడులే
ఉద్యమ నినాదాలు

మగనిలో సగభాగమై
కాయకష్టంలో పెద్ద భాగమై
కంటి కునుకును కావలి జేసిన
పంట కంట సూదక ముందే
గద్దలా తన్నుకు పోయిన
భూస్వామ్య రెడ్డీలపై
సివంగిల దుంకిన సాకలి ఐలమ్మ
పుట్టిన పోరుగడ్డపై
గాజులు కవాతు జేస్తున్నై

అహం
అమాయకత్వాన్ని వెక్కిరించింది
కొవ్వెక్కిన మదం
ఆత్మాభిమానాన్ని వెలివేస్తున్నది

బగ్గ తిన్న బలుపు
ఎండిన డొక్కలపై
మేడ కట్టుకున్నది

వంద సంవత్సరాల
బానిసత్వానికి నిరసనగా
ఎత్తిన పిడికిలి బిగిసి
నరాలు చిందించిన రక్తానికి
గాజులు ఎర్రబడినయి

లాలిపాటల ఊయలలూపే గాజులు
నల్ల గొంగడేసి విప్లవ గీతమై
వేదికపై ఘల్లు మంటున్నది

కలం గాజులు
ఉద్యమ మృందంగమై
సరిగమలు పాడుతున్నవి

రాట్నం వడికిన గాజులు
ఉరితాళ్ళను పేనుతున్నాయి

బతుకమ్మ ఆడిన గాజులు
బతుకు పోరుకై సమ్మె జేస్తున్నయి

కాసుకోండి
ఎర్రగాజు
ఉద్యమ సూరీడై ఉదయించింది.

*బతుకమ్మ ఆదివారం, నమస్తె తెలంగాణ, 16, అక్టోబర్ 2011*

# ఈ యుద్ధగానాన్ని ఆపొద్దు....

• అనామధేయుడు

విగ్రహాల్నే కాదు సమస్త వేదికల్నీ
ధ్వంసం చేయాల్సిన సమయమొచ్చింది
పాత్రధారులే సూత్రధారులుగా మారే
పరిణామక్రమం మొదలయ్యే గడియొచ్చింది
భావోద్రేకాల బండిచక్రాల్ని సరికొత్త రాజ్యాంగం
దిశగా మరల్చాల్సిన చివరి క్షణమొచ్చింది

నేనూ నీలాగే విసిగిపోయాను తెలంగాణా
యుద్ధాన్ని ప్రతిబింబించని కవితల్తో
యోధులు కాని కవులతో, తేనీటి కవిసమయాల్తో
తప్పదిక - ఈ దుకాణాల్ని శాశ్వతంగా మూసేయాలి

తెలంగాణా! యిది నీ ఒక్క యుద్ధమే కాదు
యిదీ నీ ఒక్క భవిష్యత్తే కాదు నాది కూడా.
కచ్చితంగా గెలిచి తీరాల్సిన యుద్ధమిది
ఎట్టి పరిస్థితుల్లోనూ ఓడిపోకూడని ఆకాంక్షలివి

ఒట్టి దిగ్బంధనం కాదిది
ఏదో వట్టి నీటిధార కాదిది
కేవలం సెలయేటి గుస గుస కూడా కాదిది
జలపాతం ఎక్కుపెట్టిన ఝుంకార నాదమిది
సకల జనం సమస్తాన్ని ఒడ్డుతున్న తుదిసమరమిది
కళాశాలలు పోరుశాలలుగా మారుతున్న తెగింపిది
విరిగిపడని బొగ్గుపెళ్ల విసురుతున్న చీకటి శస్త్రమిది
రహదారులన్నీ బతుకమ్మలుగా విరబూస్తోన్న ఆగ్రహమిది
పసిబిడ్డలు సైతం సూటిగా సంధిస్తోన్న చీత్కారమిది!

అసంఖ్యాక విభజనల ఆదిమకణాల చరిత్రలో
యిదే అసలైన బతికిన క్షణం
బతికించే క్షణం
ఓ జాతికి జాతి మూకుమ్మడిగా
ముందుకు దూసుకొచ్చిన పోరులో
యిదే అసలైన పరివర్తనం
పరిణామ క్రమం!

విముక్తి కోసం నీ యుద్ధాన్ని నేనూ ఆలింగనం చేసుకుంటున్నాను
నా నరాల్లో పోటెత్తుతున్న నెత్తుటిలో
నిన్ను ఆవిష్కరించుకుంటున్నాను
నిజానికి - యిప్పుడు నేనంటు ఏమీ మిగలిలేను

జీవితం పొడవునా వెంటాడుతున్న
కన్నీటి నదీతీరాన నీవు నాటిన
నీ అస్తిత్వ పతాకం రెపరెపల్లోనే
నా ఉనికి వుంది

ఈ యుద్ధగానాన్ని ఆపొద్దు
తెలంగాణ!
కావాలంటే నా తలను తుంచిస్తాను.
తుడుం కట్టి మోగించు!

తెలంగాణ నేను నిన్నిప్పుడు స్పష్టంగా చూస్తున్నాను
నిలువెల్లా నెత్తుటి గాయాల్తో
చిటికెన వేళ్ళకి వేలాడుతున్న చితికిన పల్లెలతో
వేలాది తల్లుల గర్భశోకాల్నే భుజానికి ఆయధంగా దరించి
సింహంలా ముందుకు సాగుతున్న నిన్ను నేను చూస్తున్నాను
నీ చుట్టూ ఎగురుతున్న నక్షత్రాల సీతాకోక చిలుకలు
నీ చుట్టూ విరుచుకుపడుతున్న పెనుతుఫానుల హోరులు
ప్రతీ సాయం సంధ్యపై నీ నగ్న పాదాల నెత్తుటిమరకలు

బద్ధలుగా చీలిన నేల పగుళ్లలో పారుతున్న నీ స్వేదం
నేను చూస్తునే ఉన్నాను.
నీ వెంటే పొంచి వస్తోన్న తోడేళ్ళమందల్ని సైతం

అయినా నీవు నడుస్తూనే వున్నావు
నాకు తెల్సు - యిప్పుడు సమస్త యుద్ధాన్ని
నీ చేతుల్లో తీసుకున్న
సుదీర్ఘ కాలపు అవిరామ యుద్ధ వీరుడివి నీవు
మాయం చేసిన ప్రతీసారి తిరిగి ప్రత్యక్షమయ్యే
'మాటిగరి'వి నీవు

తప్పదిక తెలంగాణా
చావోరేవో తేల్చుకోవాల్సిందే
అడుక్కుంటేనో, దేబిరిస్తేనో
భిక్షంగా విసిరేసే రొట్టెతుంపు లాంటి.
స్వేచ్ఛపైన తుపుక్కున ఉమ్మేసి
ఆయుధాన్ని అందుకోవాల్సిందే
అవసరమైతే ఛిద్రం చేసి పారేయాల్సిందే
ప్రతీదాని మీద దాడి చేసి తీరాల్సిందే
అచ్చం మనదైనదేదో మనమే సాధించుకు తీరాల్సిందే
సగర్వంగా విముక్తంటే యిదేనని ఎలుగెత్తి చాటాల్సిందే!

భాషని కోల్పోయిన తరం
యుద్ధాన్నే వ్యక్తీకరణంగా ఎక్కుపెడుతుంది
శబ్దాన్ని జారవిడుచుకున్న జాతి
విధ్వంసాన్నే విన్యాసంగా గురిపెడుతుంది
తెలంగాణా!
అసలు నీవే ఓ ఆయుధాగారానివి
యుద్ధానికి అసలైన
పర్యాయపదానివి

సమస్తాన్నీ స్థంభింపజేసే
అసలైన యుద్ధం యిప్పుడే మొదలైంది
ఊపిరాడని ఉక్కబోత ప్రారంభమయ్యింది
ఇక పొలమారొద్దు ఇక ఏమారొద్దు
నేలనేలంతా నిప్పులగుండమైపోతోంది
ఘనీభవించిన కారుమబ్బుల్ని పింజలుగా చీల్చి
బంజరుభూముల్లో విత్తనాలుగా విరజిమ్మాలి
గుబురుగా ఎదిగిన వెదురు పొదల మధ్య పెనుగాలై
సుడి తిరిగి విల్లంబులుగా పదునెక్కాలి
అలుపెరగక మోగే తుడుం దెబ్బల్ని
కళాశాలల్లో సరికొత్త పాఠాలుగా మల్చాలి
బొగ్గు గనుల్లోని చీమలదండులకు
చిరుతల దాడుల్ని గురించి బోధించాలి
సరిహద్దులై మొలిచిన శిలాశాసనాల్ని
తునాతునకలు చేసి పారేసి
లిపిలేని భాషలేని సరికొత్త బతుకు వాక్యానికి
సగర్వంగా అంకురార్పణ చేయాలి

తెలంగాణ
అప్పుడు నీవు నేనూ కలిసి
సమస్త నిఘంటువులూ మరణించాయని
సగర్వంగా ప్రకటిద్దాం

*వివిధ, సోమవారం, ఆంధ్రజ్యోతి, 17, అక్టోబర్, 2011*

# ఏన్జీవోస్ కాలనీ టు సెక్రటేరియట్

• మోహన్‌రుషి

గీ రెండు కండ్లు ఎంత పుణ్యం చేసుకున్నె?!
మల్ల మల్ల అవుపడ్తదా ఈ సీను?!

'బండెనక బండికట్టి' పాట విన్నప్పటికంటె
బస్సెనక బస్సు కట్టిన ప్రభుత్వాన్ని చూస్తుంటే ఏం మజా?!
సకల జనుల సమ్మె ట్రాష్
సీమాంధ్రోల్లకి సర్కార్ చేస్తున్న సకలమర్యాదలు బిగ్ బ్యాష్!

బస్సుకోసం, బస్సు చేత, బస్సు వలన, బస్సు లోన, బస్సు ముందు
బస్సు వెనక
పోలీసులు డ్యూటీ చేసుడే కొత్త ప్రజాస్వామ్యం
ఈడి గాలి, ఈడి నేల, ఈడి నీళ్ళు, ఈడి
అణువణువు అనుభవిచ్చుకుంటగూడ
ఈడి జనానికి పరాయోల్లుగ పనిచేసుడే
అసలు మానవత్వం !

వున్నకాడ వున్నట్టు రోడ్డుమీదనే తీన్‌మార్ చెయ్యాలన్పిచ్చింది...
బతుకు టెంటు కింద బరిబాతల స్ట్రైక్ చేస్తున్న నా దోస్తులకి సలాం
కొట్టాలన్పిచ్చింది .
గీ బస్సుల వూరేగింపుని చూపిచ్చి పిచ్చిపిచ్చిగ నవ్వాలన్పిచ్చింది...
ఎవడో సపరేట్ చేసుడుకాదు
వాళ్లకు వాళ్లే వెలేయబడ్డోళ్ళ లెక్క పోతుంటే మస్తు ఖుషి అన్పిచ్చింది!

గీ రెండు కండ్లు ఎంత పుణ్యం చేసుకన్నె?.
మల్ల మల్ల అవుపడ్తదా ఈ సీను?!

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, 19 అక్టోబర్, 2011*

## గోముఖ వ్యాఘ్రాలు

● కొండపల్లి నీహారిణి

వాళ్ళవన్నీ శుష్కప్రియాలు
శూన్య హస్తాలు!
వాళ్లతో చెలిమి శవజాగారమే!!
ఆవిర్భవించినప్పటి ఆశయం ఆవిరైందానాడే!
అవకాశవాదులు అందలాలెక్కడం కోసమే ఆరాటం
అవును మరి,
బానిసత్వపు తంట, కడుపులోమంటై రగులుతున్నది
భారతమాత సంకెళ్ళుతుంచి
ప్రాణాలు తృణప్రాయంగా వెదజల్లి
తెల్లవాడినెదిరించిన
నిరంకుశ నిజామును మెడలువంచిన
నిజాయితీ నిబద్ధత, నిండుదనం!
మరిప్పుడు?
వడ్డించిన విస్తరది! అందుకొని ఉంటరు!
అంతర్ముఖునివై ఆలోచించు
నిజమెందుకు నిప్పై మండుతున్నదో
భాష వైరుధ్యాలు, సంస్కృతి అవమానాలన్నీ
సరదాలే వీళ్ళకి
ఇంకో యాభై ఏళ్లయినా ...
ఘనీభవించి ఉన్న వీరి హృదయాలు ద్రవించవేమో!
విముక్తి విద్రోహాల
గాయాలన్నీ మానలేదింకా!
అడిగడిగి గొంతు పూడ్కపోయిన మోటబాయైంది
అయినా అమ్మ నోట్లెకెల్లి ఒక్క మాట రాల్తలేదు.

కాబోయే రాజుకు కాకానైనాపట్టమంటరు
కట్టకట్టుకొని పోయి
కాళ్ళేళ్ళ పడైనా తెలంగాణ సాధించనోళ్ళు
శల్యసారధులు కాక, రధసారధులెట్లైతరు?
నిశ్శబ్ద ప్రకంపనలు, నిర్మోహమాట వైఖరులు
పోగొట్టడం ఆవశ్యమిప్పుడు
అందుకే యుద్ధం అనివార్యమిప్పుడు
అదే....
అందరిని కూర్చోబెట్టి మతలబు కనుక్కొనే టైమొచ్చింది
ఆలోచించాలి మేధావి వర్గాలిప్పుడు
పోయినదారులు వెతకాలిప్పుడు

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ 26 అక్టోబర్ 2011*

# చరిత్ర పుటలనుంచి...

● జోగు అంజయ్య

సకలాన్ని విరగొట్టి
ఆశలన్ని వమ్ముచేసి
చేదు వార్తలు మా
చెవిలో వేసినందుకు

చరిత్ర పుటల నుంచి
మీ పేర్లు తొలగిస్తున్న
చిన్నపిల్లలు కొట్టినా
సిగ్గు మీకు రాదని!

మోసపు విద్యలు
ముఖములో దాచుకొని
కుట్రల సెగలు
కళ్లతోటే చేస్తూ
మరణపు త్యాగాలను
మంత్రి పదవులతో మరిచి
అధికారం పదిలమని
అంధత్వం నటించినందుకు

ఇంద్రుడు తెలంగాణ ఇస్తుండని
చంద్రుడు దాన్ని తెస్తుండని
ఢిల్లీ దిగుతుందని
దివిటీలు పెట్టుండ్రని
ఊరందరికి చెబుతుంటే
సకల జనులు నమ్మిండ్రు
ఊకదంపుడు మాటలు ఉట్టిగనే చెప్పరని

బలమైన ఆకాంక్షను
అంగట్లో పెట్టినందుకు
రాజకీయ ద్రోహానికి
వేయిమంది బలైనందుకు

చరిత్రపుటల నుంచి
మీ పేర్లు తొలగిస్తున్న
చిన్న పిల్లలు కొట్టినా
సిగ్గు మీకు రాదని

విజయాన్ని కాంక్షిస్తూ
ఇల్లలికి ముగ్గు పెట్టి
ఇష్టంగా బంగారు చెల్లెమ్మ
పాడి మా బతుకమ్మలెత్తింది
తోబుట్టువని చూడక
దొంగనాటక మాడినందుకు
కన్నీరు తెప్పించి కష్టపెట్టినందుకు

చరిత్ర పుటల నుంచి
మీ పేర్లు శాశ్వతంగా తొలగిస్తున్న
చిన్నపిల్లలు కొట్టినా, తిట్టినా
సిగ్గు మీకు ఈ జన్మలో రాదని
అసలు మీరు మనుషులే కాదని. ..

*వరంగల్ ఎడిషన్, ఆంధ్రజ్యోతి 26 అక్టోబర్, 2011*

# ఉద్యమం ఒక పండుగ

● మద్దెర్ల రమేశ్

ఇప్పుడు తెలంగాణలో
ఉద్యమమే ఒక పండుగయ్యింది
పది జిల్లాలు చింతనిప్పులయిన కొలిమిలో
ఉద్యమం మెరుగులు తీరిన మెరుపయ్యింది
అరవయి యేండ్లుగా ఆరిపోని ఆశలు
దీపాంతల పత్తి వత్తులయి
ఉద్యమానికి అరుణ కిరణాల దారులయినయి
పిడికిళ్లెత్తిన జై తెలంగాణ నినాదాలు
ఆకాశం నుండి నేలకు పొడిచిన
తోరణాల మామిడాకులయినయ్
ఉద్యమంలో ఎగిరే పాదాలు
నేల తల్లిని లయబద్ధంగా ముద్దాడడం చూస్తూ నిలబడితే
రోడ్డుకు నడి నెత్తిన
భగభగ మండే సూర్యుడు కూడా
మంచు ముద్దై
తలపై తళ తళలాడుతున్నట్టే ఉంది!
జై తెలంగాణ సంగీతాలాపనతో
పిడిచ కట్టిన నోళ్లకు
మంచినీళ్ళ సీసాలే
దసరా 'విందులై మత్తెక్కిస్తున్నయ్!
'ఆడుదాం డప్పుళ్ళ దరువెయ్‌రా' అంటూ చేసే
నృత్యం చూసి మురిసిన
చేతుల హర్షధ్వానాలే
అలాయ్ బలాయ్ ఆనందాల కౌగిలింతలయినయ్!

ఉద్యమ స్ఫూర్తి భావాలే
పండుగ ప్రాముఖ్యతల పరవళ్లయినయ్
దారిన ఎదురయ్యే దండులన్నీ
బంధుమిత్రుల ఆహ్వాన గీతికలయినయ్
ఇప్పుడు తెలంగాణలో
ఉద్యమమే ఒక పండుగయ్యింది
దిక్కులు చూసుకుంటూ ఇంట్లో కూర్చుని
కరెంటు లేని ఉక్కపోతనుకుంటే పొరపాటే
ఉద్యమంలోకి రానందుకు ఉబ్బరింత అది

*బాణం - 3, కవుల ఉద్యమ స్పందన, అక్టోబర్, 26, 2011*

# సకల జనులం చెప్తున్నం

● *కందుల శ్రీనివాసరావు*

వద్దనుకొనేటోన్ని తెలంగాణ
నువు నా యాసల బాసల
బతుకమ్మల నెక్కిరించకుంటే
కలిసి బతుకుతుంటి నీతోనె...
నువు నా ముల్కి నియమాల
పెద్దమనుషుల ఒప్పందాల
పాతరేయకుంటే
కావలించుకునేటోన్ని నిన్ను
నీవు నా నీళ్లను నిధులను  దారి మళ్ళించకుంటే
నమ్మెటోన్ని నువు నా 'ఆరుపది' జీవోను
ఆగం బట్టిచ్చి సెక్రెటేరియట్‌ల చక్రం తిప్పకుంటే
గొప్పొడనుకొందు నిన్ను
నువు నీ పోలవరానికి నా ప్రాణహిత చేవెళ్ళకీ
తేడా సూపకుండుంటె
కుట్ర కాదనుకొందునీది...
నాడు నన్నొద్దన్నప్పుడు జై ఆంధ్రని
న్యాయమున్నదను కొందు నీకాడ..
నాడు నిన్నొద్దనప్పుడు సమైక్యాంధ్రనీ అనకుంటె
నీ తల్లి తిరుపతమ్మగుడి కాడ
నావోళ్ళ తన్ని పంపకుంటె
అసహ్యించుకోకపోదు నిన్ను
పిట్టల్లా రాలుతున్న నా పిల్లల్ని చూసి
నువ్వో కన్నీటిసుక్క కార్చివుంటే -

కావురం కాకపోతే ఒక్కే రోజుకు 'హోం' మిస్తే
తెలంగాణ అడిగేటోళ్ళ
ఆత్మాహుతితో సంపేస్తర?

పిల్లల పానాలతో ఆటాడుతున్నరు
తిరిగి మేమే కారణమంటున్నరు
మాది యాభైఏండ్ల పోరాటం
నీది ఆడుతున్న నాటకం
నోట్లెబడిన ముద్దలు తన్నుకపోయిన గద్దలు
ఇంతదాక వచ్చినంక యింకనీతో సోపతేంది?
తుప్పున ఉమ్మేసినా తుడుసుక పోతవేంది?
ఇగో... సకల జనులం చెప్తున్నం
అన్నతమ్ముల లెక్క విడిపోదాం
ఆత్మీయులుగా కలిసుందాం

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, 26, అక్టోబర్, 2011*

# తెలంగాణ అమరవీరులకు ప్రకృతి జోహార్లు

• *బి.మల్లయ్య*

మహోజ్వలిత సూర్యగోళం
చల్లని కిరణాలని చిమ్ముతూ
కన్నీటి అశ్రువుల ఆలింగనంతో
మీ త్యాగాల గురుతులను
నీటి అణువుల్లో నిక్షిప్తం చేస్తూ
చరితార్ధం చేస్తున్నాయి.

పడిలేచే కడలి కెరటాల హోరు
జోహారులు పోరు పాటలై
మీ ఆత్మార్పణ ధీరత్వాన్ని
రాగాలై పల్లవిస్తూ
గొంతు గొంతులో తారాడుతూ
రాగ రంజితం చేస్తున్నాయి

అల్లన సాగే చల్లని మేఘాలు
అమరుల రణరంగ అవనిని ముద్దాడుతూ
మీ అకాల మరణ పరిత్యాగాలను
మట్టిలోని అణువణువులో
నిక్షిప్తం చేస్తున్నాయి.

నిశీధి తోటలో పూసిన తారకలు
జ్వాజ్వల్య మానంగా ప్రకాశిస్తూ
అవనిపై వెలసిన అమరవీరుల శూరత్వానికి
నేల రాలి, మాలగా మారి శ్రద్ధాంజలి ఘటించి
మమేకమై ఆకాశానికి ఎగిరిపోయినై

*నమస్తే తెలంగాణ, వరంగల్, అక్టోబర్, 2011*

# కువ్వార్కం

• మోతుకూరి అశోక్ కుమార్

కండ్ల ముంగట
పచ్చగ నిమనిమలాడుతున్న శేను-
పానమాగుతాది?
ఊరు మీదిడ్శిన పోతుకు
ఇగ పండుగే పండుగ!
అగావుగ మేశెతందుకే ఎల్లిందాయె
ఆగమెందుకుండది?
అందినకాడ్కి బర్కుదేనాయె
ఇశార ఇంకెక్కడిది-? దళాలిగాళ్ళదే తొవ్వ-
ఒకటి గాదు రొండు గాదు
అతరావులున్న మందనంత పట్కచ్చినంక
ఏదాగుతది జెప్పు
అంతా బర్బాద్ జేసుడే

దొంగ మేతకల్వాటు వద్దంక
గెట్ల సంగతి ..పొల్మేర సంగతి, యావకుంటాది?
గీడ ఇత్న మవద్దం గాదు ..
పార్కమవద్దం గాదు
యవుసమవద్దం గాదు .
నోటి ముంగటి బుక్కెత్త గొట్టినట్టు
గీ శేనుకు దొంగెడ్ల సుడిగావట్టె
కువ్వార్కమంత గీడ మేతకు దోలినోంతోనే .
ఏశం గట్టినోంతోనే...
ఏండ్ల కొలె గిదే అద్రగాణం

గిప్పుడు జాప్తాకచ్చింది.. జప్తు కచ్చింది
కడ్పుగాలి జరంత సుర్కుదల్గిందా
సోయిలకచ్చి ఇగ కంప నాటుతమంటిమా
గాళ్ళ కండ్లు మండవట్టె కడ్పు మండవట్టె
మేతకు కొత్త మెరమెర మొదలయ్యింది

యోలెన్ని తుంటలు గట్టినా
గదేరీతి ..గదేనడ్క.. ..
బంగారి గుడ్లువెట్టే బాతోలె దొర్కిందాయె
ఇడ్శిపోను మన్సైతాది?
దోస్కునే తొవ్వల్దెల్శిందాయె
తొవ్వ కడ్డం బడ్తె వశపోతాది?
ఏ దొక్క కిరి కిరి దల్గియ్యజుస్తది
మేత దొర్కని మన జంగిడంతా
అడ్విల ఆగమైపోతుంది?
పాలపండ్ల ల్యాగలసుంటిది
కటికొల్ల కమ్మిడు పోతున్నయి....
ఆని తలపండువల్గా...! నజర్కగ్గివెట్టా!
ఎంత బర్బాదయ్యింది? ఎంత బత్తలయ్యింది?
కరవుల తోనే గీడ కాలం పండుగ జెయ్యవట్టె
కత్తుల్లేకనే పొలగాండ్ల కడ్పులు జీర్కపోవట్టె..
శెదని దైర్నంతోనే
ఇగనన్న ములుగర్ర వట్టక దప్పది-
గెట్టు దాటిందాక గెద్మక దప్పది-

*ఆక్రోధక్కా సంకలనం, అక్టోబర్, 2011*

# నల్లజెండా

• ఎస్. రఘు

నవంబర్ ఒకటి
డిసెంబర్ తొమ్మిదికి మధ్య
అగణిత త్యాగాల్ని మోయలేక
బరువెక్కుతున్న చరిత్ర

బతుకంతా చీకట్లు నింపుకుని
వెలుగుతున్న కాగడాల్లా జనం
చుట్టూ నీళ్ళున్నా
గొంతు ఎండిన దేహంలో మరుగుతున్న రక్తం
కన్నీళ్ళలో తడిసిన దారుల్లో
ఒక్కో గాయం పదునైన ఉద్యమ గేయం!
ఆవమానాల ముసుగుల్లో
అనుబంధాలు అశాశ్వతం
ఆనాటి అవతరణ
ఒక రాజ్యాంగబద్ధ దురాక్రమణ
ప్రాంతీయ సామ్రాజ్యవాద దినోత్సవం
దోపిడో ద్రోహమో
ఏదో ఒక నిజం తేలవలసిన పరీక్షాకాలం
తల్లినుంచి బిడ్డను దూరం చేసే
కేంద్రపాలిత కుట్రలకు
కొత్త కత్తులు నూరక తప్పదు
ఆత్మగౌరవమో అమానవీకరణో
ఆఖరి యుద్ధానికి ఇదే అదను
సహనానికి ఆగ్రహానికి మధ్య

చెరిగిపోతున్న సరిహద్దుల్లో
హింసా అహింసల మధ్య
తాత్త్విక చర్చల సంక్షోభం
ఇప్పుడు బుద్ధుడు కూడా
ఆత్మాహుతి కోసం నిరీక్షిస్తున్నాడు
సముద్రంలో అలలా
మా నిరసనలకు అలుపులేదు
ఆగిపోని ప్రవాహంలా ఉద్యమాలు
ఎవరూ చూడలేని అగాధాల్లా పోరాటాలు
తెలంగాణ దుఃఖ సముద్రంలో
ప్రతి ఉద్యమకారుడు ఒక వాయుగుండం
ఇక ఈరోజు
ఈ నేల మీద
సూర్యుడుకూడా
నల్లజెండాగా ఉదయించాల్సిందే!

*రఘు బ్లాక్‌స్పాట్.కామ్. నవంబర్, 1, 2011*

# ఇంకా తెల్లారలేదంతే

• సి. హెచ్. మధు

యుద్ధం అనివార్యమైనపుడు
నేను సిద్ధం
ఆయుధాలెందుకూ?
నాల్గున్నర కోట్ల
ప్రజలు
ఆయుధాలుగా నిల్చున్నారు
మేము తెలంగాణ కొరకు
పోరాడుతున్న వీరులం
నేనే ఒక ఆయుధం...
తెలంగాణ రాదనే నిర్వేదం లేదు నిరాశ లేదు
తలవంచని వీరులం మేం
పోరాట మట్టిలో పుట్టి
మట్టిలో పెరిగిన శూరుణ్ని నేను
ఘనమైన వారసత్వ సంపద
అడుగడుగు నింపుకున్న
ఆయుధాన్ని నేను
ఇంకా...
తెల్లారలేదంతే....
కోడికూయక తప్పదు
సూర్యుడు రాక తప్పదు

*చెలిమె, బుధవారం, నమస్తే తెలంగాణ, 16, నవంబర్, 2011*

# తీసేయంగా మాసూలు

● అమరవేణి

వద్దన్నా ఎంట పడుతవ్
నన్ను వట్టుకొని యేడ్తవుంటవ్
పెద్దలు బలవంతం జేస్తే
ఇష్టం లేకున్నా పెండ్లి జేస్కున్న
ఇన్నాళ్ళూ గలిసున్నా
నువ్వు వెట్టే బాధ లోర్చుకుంటు
ఇంకెంత కాలం ఉండాలె
ఇగనా వాల్ల కాదు
నే నిడి గానే ఉంటా

నెత్తి మీద సెయ్యివెట్టి నిమురుతూ
మంచిగ ముచ్చట్లు జెప్తుంటే
మంచోడివనే మురిసిపోయిన
నా యింటికి ఇల్లుటంగా వొస్తే
నా మీది ప్రేమతోనే అనుకున్నా
కానీ, నా యిల్లె గుల్ల జేస్తావనుకోలె
నాయింటిపై కన్నేసి
ఆస్తి పాస్తులను కరిగించినవ్
వద్దని వారించినా
అరిచి గీపెట్టినా
పెద్దలకోయి జెప్పుకున్నా
ఆళ్ళముందు యిగ మంచిగ ఉంటనని
ఒప్పందం జేస్కొంటివి
కాగితాల్రాసుకుంటివి
అవన్నీ పెంట కుప్ప పాల్జేత్తివి

తుంగ మడుగులో దొక్కేత్తివి
నన్నలుసుగా దీసుకుంటివి
భూములమ్ము కుంటివి
కాసులు కూడా గట్టు కుంటివి

నువ్వు జేసే దోపిడీ జూసీ
నా కడుపు మండుతోంది
నన్ను ముండ మోపిని జేసి
నిలువునా ముంచడానికే జూత్తుంటివి
నాగరికత పేరుతో
నా భాష నెక్కిరిత్తివి
కట్టూ, బొట్టూ నెగతాలి జేత్తివి
నన్నెర్రి దాన్ని జెయ్యవట్టివి
పుట్టే పోరగాండ్ల నోట్ల
మట్టి గొడ్తానంటే
ఆళ్ళ బతుకులకు
చెదలు వట్టిత్తనంటే
ఎటుగానోళ్ళను జేసి
అడివిల వద్దట్టు జేత్తనంటే
నే నెట్లూరు కోవాలె
ఎంత కాలం నోర్మూసుకోవాలె

పంచాయితీ లెన్ని వెట్టినా
పెద్ద మనుషుల గట్టు కుంటివి
ఆళ్ళను నీ జేబులో ఎట్టు కుంటివి
ఆళ్ళమీద మన్ను వడా
ఆళ్ళ కండ్లు జిట్లి పోను
కాసులకు కక్కుర్తివడి
నా కన్నాయమే జెయ్యవట్రి
నా నోరు ముయ్యవట్రి

నీ దుర్మార్గం జూడలేక
ఇప్పటికే ఎందరో బిడ్డలు
తమ ఉసురు దీసుకుండ్రి
గిసుంటోడివి నాకెందుకు?
వద్దంటే నా యెంట వడుతవ్
నన్ను పట్టుకొని గింజులాడ్తవ్
దోసుకున్న కాడికి చాలదా?
ఉన్నదంతా ఊర్సుకున జూత్తవ్
మా బతుకెట్ల గడువాలె
ఇంత కాలం యెంతో వోపిక వట్టిన
యిగ జాలు నీ నాటకాలు
నీ తొవ్వనీదే
నా తొవ్వనాదే
నీ జాగల నువ్వుండు
నా జాగల నేనుంటా
లేదంటే కాదంటే
చేతి చీపురు కట్ట మర్రేసి
నీ యీపంతా పగలగొడ్తా!
ఊరావలి దాకా తరిమి తరిమి గొడ్తా!

*బతుకమ్మ, ఆదివారం, నమస్తే తెలంగాణ 27, నవంబర్ 2011*

# ఉద్యమ కెరటం

• మందుల పరమాత్మ

హుస్సేన్ సాగర్ సాక్షిగా
జన ఉప్పెన ఆగ్రహంలో
విగ్రహాలు ధ్వంసమయ్యాయి

అది ఒక ఉద్యమ ఉద్వేగం

అమరులు కనుపాపల స్వప్నాల్ని
ఈ రక్తసిక్తమైన నేలకు అతికించి వెళ్ళి పోయారు

ఇది చితికిపోయిన జీవితాల ఆవేశం

రెండూ ఉద్యమ పాదాలే

కాని మరణాల చీకట్లతో కాదు తెలంగాణ
వెలుతురు రవ్వలతో సాధించుకుందాం

*హస్పెదుల, కవితా సంకలనం, నవంబర్, 2011*

# వెయ్యిన్నర తలల నాగు

● మోతె గంగారెడ్డి

ఎండి ఎండి పొయ్యి కట్టెలై రాలుతున్న యాపచెట్టు
పడగ విప్పిన ఆత్మగౌరవం
బిగించి బిగించి నలిపేయబడుతున్న అస్తిత్వం
నాటకాలు నేర్చిన మాయా సర్పం
నలుపుకు తినే నంగనాచితనం
అది వెయ్యిన్నర తలల అదృశ్య విషపునాగు
ఒక్కో తలకు ఒక్కో పేరు
ఆధిపత్యం, అధికారం, కల్తీ కాపిటల్, రాజకీయం, రియల్ మాఫియా
పేర్లెన్నైనా వాటి లక్ష్యం ఒక్కటే
పొక్కల్లో నక్కల్లా దాగిన గుణం
సమయానికి ఒక్కటై బుసలు కొడుతూ పడగలిప్పుతాయ్
మనషుల్ని మింగి మింగి బర్రె బలిసిన దాని కాళ్ళముందర
కొనపూపిరి అస్తిత్వాన్నీ బలిస్తున్న ధ్రుతరాష్ట్ర మీడియా
ఒంటి కన్ను రచయిత, రంగులకందువాలు, అరతల మేధావి
ప్రాంతాల గొడవ అసలే కాదు
ప్రజల మధ్య గొడవ అంతకంటే కాదు
శ్రీకాకుళం చిన్నోడు సిరిసిల్ల మగ్గం నేయొచ్చు
పాలమూరు లస్మవ్వ అనంతపూర్ క్వారీ మోయచ్చు
ఇద్దరు అలై బలైలాడి గోల్కొండ కాడ అడ్డా వేయొచ్చు
కష్టమెవరిదైనా సహానుభూతే ఘనం
స్వభావాల మధ్య సంఘర్షణే చరిత్ర
అసలు యుద్ధం
ఆత్మగౌరవం మీదెక్కిన ఆధిపత్యానికి
అహంకారాన్ని సవాల్ చేస్తున్న పాలితుడికి

ఎక్కి పీక్కపొడవడమే దాని నైజం
యాభయ్యారేళ్ళు తొక్కి పెట్టిన వోల్కనో
ఉపరితలాన్ని చీల్చిచీల్చి ఎగచిమ్మిన మాగ్మా
కళ్ళు మూసినా కనిపించే వెలుతురు
కడుపులోని పిండం కడుపులోనే ఉన్నా
పురుడు బోసుకోనిదే తల్లి బాలింతైనది
పుట్టని బిడ్డకు పాపడ తల దువ్వి
మురికి మైల కడిగేస్తూ లాల పోసింది
దాని కడుపు పగిలి చిమ్మిన నల్లటి నల్ల విషం
కాటు కాటుకి తల్లి పిచ్చి అరుపు
ఏండ్ల ఆకలిని తీర్చే అన్నం ముద్దను మన్ను చేస్తేఎంత దుక్కం
పానాలు పోసి కట్టుకున్న గూడును పొల్లు పొల్లు చేస్తే ఎంత దుక్కం
గర్భవిచ్ఛిత్తి రక్తంతో నిండిన తల్లి దేహం
రైలు కంటిన పేగులు, పార్లమెంట్ చెట్టుకు కారిన నోటి నురుగు
పెట్రోల్లో మునిగిన కమురు ముద్ద,
చిద్రిన మెదడును లాక్కెల్తున్న బుల్లెట్
కాల్వలై పారిన మోదుగు చెట్టు కన్నీరు.
వేలాడదీసిన తక్కెడలో
56 ఏళ్ళ రక్తమాంసాల ఆత్మ ఒక వైపు
13 రోజుల బలసినోడి బలుపు పీకిన కొబ్బరి బూరు మరోవైపు
కాంట జోకేదివాడే, లెక్క చెప్పేదివాడే
చూడూ సమానమన్నాడు, లేదా సరితూగదన్నాడు
దిక్కుల్లేని పగిలిన గుండెలు
తెరిచి మూసిన ఢిల్లీ దర్బారు సింహాసనం
కరెంటు తీగలకు వేలాడిన గొర్రెంక తలలు
కోట్ల జనం కవాతులో అదుపు తప్పిన
ఒక్క రాయిని చూసి ఉగ్రవాదమన్నారు
ఎండ్లకేండ్లు దాచిన బాధాగ్రహపు నినాదాలతో

గురితప్పిన ఒక్క మాటను చూపి హింసోన్మాదమన్నారు
నా నెత్తిన నీ పీరం మొయ్యనందుకు
జాతి సమగ్రతకు ప్రమాదకరమన్నారు
కృష్ణా, గోదావరులతో పారాల్సిన నెర్రెలు వారిన
నేల పోరాటాల రక్తాలతో ఇంకింది
సమైక్య రోలర్ కింద నలిగిన బతుకమ్మ పూరేకులు
హైటెక్ హర్మ్యాలు పగులకొట్టిన అవ్వెత్తిన బోనం కుండలు
ఓపిక ఎంత కాలం
తీర్పిచ్చే తండ్రి సవతి తండ్రినన్నాడు
మెజారిటీ కొలిమిలో మైనారిటి మాడిన మసే
దుడ్డు కర్రతో బాదుతు కలిసుండమనవట్టే
మెడకు కత్తెట్టి కాపురం చెయ్యమనవట్టే
జుట్టు ఎంటుకలు గుంజుతు రొమ్ముకొరకవట్టే
కలిసున్దామనే ఉద్యమం ప్రపంచంలో ఎనిమిదోది కాదు మొదటి
వింతే మూతికి బట్ట కట్టారు - గొంతు రావట్లే
మెడకు తాడు బిగించారు - పూపిరాడట్లే
మీద గంప కమ్మారు - మనిషి కనిపించట్లే
తండ్లాట, తండ్లాట, పానంకై తండ్లాట
ఇవ్వనన్న కోల్పోయినదాన్ని గుంజుకునే తండ్లాట
పది జిల్లాల్ల నిండా సందు లేకుండా పారుతున్న ఎర్రెర్ర చీమలు
సకల జనుల ఓపిక గీత దాటితే / అణు విస్ఫోటనమే
ఒక్కో తెగే విషపు నాగు తల అడ్రస్ ఒక్కో అఖాతంలోనే
ప్రజాస్వామ్యమా, సవతి తండ్రీ
అన్నతమ్ముల అంగీలు చించి, రక్తం
మానని గాయం చేయక
బిగించిన ఉరి తాడును విప్పి నీవు 'నిజం' అని చూపు
సత్యమేవ జయతే

*పాలపిట్ట, నవంబర్, 2011*

# అలసిపోని ఉద్యమ కెరటం!

• *జి. వంశీభార్గవ రాజశేఖర్*

ఈనాటిది కాదు
ఏనాటిదో ఈ వాంఛ
సవతితల్లి ప్రేమతో
చంపజూస్తున్న సంగతి
కపట ప్రేమతో
కబళించి ఉక్కు పాదంతో తొక్కిపట్టి
గనులు, నిధులు, నీరు, ఉద్యోగం, ఉపాధి
ఒక్కటేమిటి పంచభూతాలను
తల్లి చాటుకోడిపిల్లను
గద్దలా తన్నుకెళ్ళుతున్నవైనం
పసిడి భవిష్యత్ వసివాడుతుంటే
తల్లడిల్లినది యువత తనువుచాలించడం
ఈనాటిది కాదు
ఏనాటిదో ఈ అపురూపవాంఛ
ఇంటిదొంగల ఇష్టారాజ్యమై
రగులుతున్న కోర్కెల తపనకు
జీవోలంటూ - ఒప్పందాలంటూ కమీషన్లంటూ
కాలయాపన చేస్తూ...
ఏకాభిప్రాయమంటు ఏకరవుపెట్టి
మోకాలుకు బోడి గుండుకు ముడి పెడుతూ
నాన బెట్టి నటిస్తుంటే
ఊరు ఉద్యమ పతాకమైంది!
ఈనాటిది కాదు
ఏనాటిదో ఈ ప్రగాఢవాంఛ

కలసివుండనికే ఎందుకో?
విడి పోవడానికి విశేషకారణాలో
ఎండిన పంట భూములు
చిక్కిన సారం లేని క్షేత్రాలు
రైతు వేలాడిన యమపాశాలు
పోగు తెగి పడుగు నిలిచిన నేతన్న
వలసలతో ఊర్లు ఖాళీ లోగిళ్ళు
ఆకలి కేకలు, ఆడపిల్లల అమ్మకాలు
అమానవీయ ఆత్మహత్యలు
యువత ఆవేశంతో అడవులు పట్టిన నేపథ్యం
సజీవ దృశ్యాలమాలిక నా మట్టిగడ్డ
ఊరూరు ఉద్యమదారులై
సామాన్యుడు సమరానికి సిద్ధమంటే
విశ్వవిద్యాలయాలు ఉద్యమక్షేత్రాలై
త్యాగాల రహదారులేస్తూ సాగడం
ఈనాటిది కాదు-
ఏనాటిదో ఈ ప్రగతిశీల వాంఛ!
ప్రాణత్యాగాల పోరుగీతాలై
ప్రజాపోరు కెరటాలై
చైతన్యం నింపుకున్న సుగంధాలు వెదజల్లుతూ
చరిత్ర నిర్మించే చారిత్రిక నేపథ్యంలో
తొలి ఉదయపు సూర్యులైన ఆబాల గోపాలం
అందుకున్న గొంతుకల నినాదం
'జై తెలంగాణల మార్మోత !

*నమస్తే తెలంగాణ, నవంబర్, 30, 2011*

# ఉద్యమం - ఉన్మాదం

• సేనాపతి సంపత్కుమారాచార్యులు

స్వయం పాలనం
జాత్యుద్ధరణం
కోరుతూ నాలుగు కోట్ల జనరణనినాదం
సాగిస్తూ ఉద్యమిస్తున్న తెలంగాణం-

వలస దోపడి
పైస రాపిడి
ధనమదాందుల గుంటనక్కల చావిడి
పొంతనలేని వాదనల కలివిడి
సమైక్యవాదుల వంకర సవ్వడి-

ఆశయసాధనకు తాము దివ్వెలైతున్నా సందర్భం
తెలంగాణ తల్లి కాళ్ల మువ్వలై
అమరవీరులై
గుండె మొగులుపై తారలై-

మొగోళ్లను బజార్ల ముద్దు పెట్టుకొని
రంకు బొంకు ఒంటిలో నింపుకుని
సాగుతున్న సమైక్యభావం ఒక కంపు సిద్ధాంతం
చరిత్రలో ఓ నల్లని అధ్యాయము-
జీతాలు, జీవితాలు, ప్రాణాలు పందగలు
తృణంగా పణంగా, ధనంగా సాగుతున్న
తెలగాణ్యులు సకల జనులు
తాము కాలుతూ కష్టాల దారిలో సాగుతూ
ఆశయ సాధనకు చేరుతూ చరిత్రలో ధన్యులై, మాన్యులై మిగులుతూ..

*నమస్తే తెలంగాణ, నిజామాబాద్ ఎడిషన్, నవంబర్, 30, 2011*

# దుఃఖ సముద్రం

• *వంగాల సంపత్‌రెడ్డి*

కాలం సరళరేఖ కాదు కదా
ఒకే తీరుగా ఉండడానికి

మాటలు ఏమైనా మాట్లాడవచ్చు
మాటల మీద నిలబడనపుడు

ఒప్పందాలు ఎన్నుంటేనేం
ఉల్లంఘనల రాజ్యంలో

విశాలాంధ్ర రాజకీయం
ఊర పిచ్చుకల ఉర్లు పోసింది

విషం కలిపిన తేనె పలుకు
ఇక్కడి
మట్టి బతుకును వెక్కిరించింది
కత్తుల వంతెనపై
నడిచిన
మట్టి బతుకు
ఉరి తాడుకు నైవేద్యమయింది

పచ్చని పల్లెల నిండా
ఇపుడు
రియల్ ఎస్టేట్ విషపు గాలే

ఈ నేలంతా
ఊడలమర్రిలా
విస్తరించిన డబ్బు వాసన
మట్టి పరిమళాన్ని కబళించింది

కంచె చేనును మేస్తున్న కాలంలో
నా నేలపై నేను పరాయికరించబడ్డాను

దుఃఖ సముద్రం మధ్యన
నిలబడ్డ
నా చుట్టూ
మొసళ్ళ గుంపు!

కుట్రల కాలంలో
వంచనలకు బలైన అమాయకత్వందే అసలు నేరమని
మోసం గగ్గోలు పెడుతుంటే
వికృత ఆలోచనలు విందు చేసుకుంటున్నై

ఇపుడు
కలిసిన కాలం గురించి కాదు
విడిపోయే కాలం గురించే మాట్లాడుతాను

*సూర్యుడు ఉదయిస్తాడు సంకలనం, నవంబర్ 2011*

# నేనింక చావలేను

• కేతిరెడ్డి యాకూబ్‌రెడ్డి

1

పుండు
మానిపోదు
కాదు
మాననియ్యరు

సలపరం
పుట్టినప్పుడల్లా
కళ్ళ మీద కలలు రాస్తారు

పుండు
మరింత పుచ్చిపోతుంది

2

పెద్దమనుషుల ఒప్పందం
గద్దలు తన్నుకు పోయాయి
ఆరు సూత్రాల పథకం
అత్తరల వేసి
జాగ్రత్తగా గొళ్ళెం పెట్టారు
ఆరొందల పది
బొందల పాతరేశారు

3

జలగలు, రక్త పింజరలు
దేహమంతా
జరజరా పాకుతుంటాయి

ఆకాశం
దేగకన్ను తెరుచుకుంటుంది
రాబందులు
నిశ్శబ్దంగా సంచరిస్తాయి

4

అబ్బా
ఎంతకూ భరించలేని నొప్పి
నా కొడకల్లారా
ఇంక నేను చావలేను

5

నా పండ్లు
పటపట రాపిళ్ళ పాషాణమైనాయి
నా పిడికిళ్ళు
ఉక్కును సంతరించుకున్నాయి
నా గొంతు
గర్జనలైనాయి
నా చూపులు
మెరుపులైనాయి
నాకళ్ళు
జమ్మిచెట్టు కోసం
వెతుకుతున్నాయి

*సూర్యుడు ఉదయిస్తాడు సంకలనం, నవంబర్, 2011*

# అణిచివేతల పరాకాష్ట

● సైదులు ఐనాల

ఎవడ్రా వాడూ
భూక్తాయాసంగా
స్మృతి గీతాల్ని ఆలపిస్తున్నాడు
బిడ్డను పొగొట్టుకున్న తల్లి పేగు
ఎద తెగని దుఃఖంల మునిగితే
నోరిప్పడేం వాడూ?
దశాబ్దాల అణిచివేతలో
తనను తాను స్పర్శ కోల్పోయిన
తెలంగాణ
ఒకానొక సుదీర్గ సమయాన
అగ్ని కణమై
ప్రజర్విల్లింది

నేల కూలింది
నీటమునిగింది
విగ్రహాలు కాదురా
లౌక్యం నేర్పిన  మీ మాటకారి తనం
కన్నీటితో
పెదాల్ని తడుపుకోవడమూ నేరమేనా?
ఆకలికేకలకీ
ఆకాంక్షలకీ
సెక్షన్లు సిద్ధం చేశాక
పలగ్గొట్టటం
విరగ్గొట్టటం
భౌతిక చర్య కాదు కాక కాదు

అదొక నెత్తుటి సలుపు
బిగికౌగిల్లో బిగించబడ్డ
ప్రేయసి పలవరింతలు
ఇక ఆపండి
మిత్రుల్లారా
అలియాస్
నయవంచకుల్లారా
ఇప్పుడు కూలింది
వంచనే
కూల్చాల్సింది చాలా వుంది
భవిష్యత్ తెలంగాణ ముఖ చిత్రం
నల్ల నెత్తుటి దొబ్బలా
నిగ నిగ లాడ్తావుంది
ఇప్పుడు పల్లె కాన్వాస్ పై
డప్పు నగారా ధీరోదాత్తంగా మ్రోగుతుంది
ఛలోరే ఛలో. .

*సైదులు ఐనాల, బ్లాగ్, నవంబర్, 2011*

# శక్తి గల మూలపుటమ్మ

• కుమ్మరి భిక్షపతి

'తంగెడు పువ్వు'....
తల్వార్ అందుకొని....
తయ్యారైంది...తాడో పెడో తేల్చుకుందామని.. !
'బంతిపువ్వు'.....
బందూకు పట్టుకుని
బానిస బ్రతుకు...మా కొద్దేవద్దని...!
'గునుగు పువ్వు'....పోరుదండలల్లుత్నుది
ఈ రోజు 'మన బతకమ్మ'.....
ప్రత్యేక తెలంగాణ ఆశతీర్చే.. . 'శక్తి గల మూలపుటమ్మై
బొడ్రాయిమీద కూసోని లడాయి మొదలుపెట్టింది.

*ఇలాకా కవితా సంకలనం, డిసెంబర్, 2011*

# సర్వేంద్రియాలు

● వి.వెంకటేశ్

రెండు కండ్లలో సుదులు తిరుగుతున్న
తెలంగాణ ఆశలు
రెండు చెవులనిండా
జై తెలంగాణ నినాదాలే నిండిపోయినై
నాసికా రంధ్రాలు
తెలంగాణ మట్టి పరిమళాల్నే
ఆస్వాదిస్తున్నాయ్. ..!
కంఠ స్వరం గంభీరమై
ఇంటింటికి కలల తోరణాల్ని కడుతున్నది
జై తెలంగాణ అంటు గర్జిస్తుంది...!
స్వేధరంధ్రాల చెమట చుక్కలు తైలమై
ఆకాంక్షల జ్యోతిని ఆరిపోకుండ కాపాడుతున్నయి
నా సర్వేంద్రియాలు ఒకే ఒక నినాదం చేస్తున్నె
జై తెలంగాణ అని.. .!

*ఇలాకా కవితా సంకలనం డిసెంబర్, 2011*

# ఇంకేమున్నది

● గుండం మోహన్‌రెడ్డి

ఎందుకు కలిసుందమొ చెప్పరేందన్న
ఎకసెక్కమెందుకు గని, ఏం ఫాయిదో జెర
జెప్పి తేందని....?
కలిసుంటే సుఖమున్నదని సుద్దులేంటికి గని
ఇడిపోనికేందని యిబ్బంది సెప్పుమరి .!
కాని కాలంగని, కరువు కాలంగని
మీ కండ్లకు మే మానినమా....!
మీ కొబ్బరి సెట్లిరిగిన, కొంపలు గూలిన
మేం సెయ్యేసి ఆసర కాలేదా
మీ సైన్మాలాడించేది మేము
మీకు సన్మానాలుగినైతె సప్పట్లు గొట్టేదిసుత మేమే గాదా
మమ్ములెన్నడన్న మనుసుల్లెక్క జూసింండ్రేమో
జర యాద్ జేసుకొండ్రి
తాగనీకి నీళ్ళు లేకుండ జేస్తిరి,
కొల్వులు గుంజుకుంటిరి
మెల్లమెల్లగా మాకు జీవగంజి లేకుండా జేస్తిరి
ఇంకేమున్నదో గుంజుకోనికి,
ఇడిసిపోనీకి గింజుకోవద్దిరి
ఏకులోలొచ్చి గిప్పుడు మేకులోలై మీదిగాని
మా పట్నం కోసం కొట్లాడవద్దిరి,
వొక్కతా ఉండి వూకె రపరపేంది గని
ఎవల తావుల వాళ్ళుంటె మాకైతె మంచిగ మరి

*ఇలాకా కవితా సంకలనం డిసెంబర్, 2011*

# అనంత సౌరంగం

• దప్పోల్ల రమేష్

అరవయేండ్ల రాత్రిర్లన్నీ
అప్రశాంత రాత్రిర్లే
అరవయేండ్ల కలయిక కలలన్నీ
పీడకలలే గదా!

చదువుల తల్లి మెత్తటి ఒడిల
గుంపుల్గుంపుల్గా
నిలువెత్తు తుపాకులు సవారి జేస్తున్న
యాల్లయింది

యెంత అక్కసు గీల్లకుంటేగాని
గింత నిర్బంధాన్కి ఒడిగడ్తరు
ఐతెమానే!
అగ్నిపర్వతాల సత్తువని
ఆపజూసుడు
యెంత యెర్రితనం గాకుంటే

కమిలిన నా పెయ్యంతా
తగిలిన లారీల దెబ్బలు
కుర్సిన రబ్బరు గుండ్లు
టియర్ గ్యాసు సినుకులన్ని
ఒగ గిల్లిదండాటనే

గుండ్రాల్ల బంతాటాడినోల్లం
గుండ్లు మీదోలెక్కనా యేంది?
కరంటు వయిర్లనే ముద్దాడినోల్లం
ముండ్ల కంపలేం జేస్తయి?

యుద్ధం నా బతుక్కి పేరు
పెయినిండా వాతలు కవాతు
యెద నెర్రెలు జిమ్మిన మిరుగుల తాకిడి
ఓర్సుకునుడు చెరిత్ర పుటల్ల లేకపాయే

సూర్య కిరణాల ఊదల్ని
మూటగట్టాలనే సోంచుడు
వొద్దే వొద్దు!

యేరు నాపినా
పారే గుణంబోతదా?
మ్యాకలు సైతం పులుల్ని కావలి వెట్టుకునే
ఒనాలివి!
కృత్రిమ కుయుక్తులు
పల్టీలు గొట్టె దినం దెగ్గిర వద్దది

సూదండి....!
సూస్తనే ఉండండి....!
కండ్లు రొండైనా సూపొక్కటే
గానీ,
కారేటి కన్నీటి ధారలు కలుస్తయ?
అది జరుగుతదా?
చంద్రం
నువ్వేజెప్పు?

నినాదాలను
కేరింతలనుకునుడు
బతుకుపోరు పాటను బ్రేకు
పాటనుకునుడు వెకిలితనమే!
మనిషి తోలు కింది నరాల్ల మర్మం
పసిగట్టుడు

యెవడి తరం?
నరాలే లేనోన్కి
నరాలు తెగేటంత వుద్రేకం
తెలుస్తదా?

సముద్రం కామూషిగా గనవడ్డా
అలల పరుగు
వొడ్డును చరిచే దాక తెల్వదు గదా!
పొంగే బాధకు దుఃఖమే గాదు
పగులుడు గూడ తెలుసు

కిరణాల శఖల పసిగట్టకుండా
పొద్దుపొడుపును మింగాలనుకునుడు
అవిటితనమే

పొద్దు గూకుతున్నా
సూరుకింది ముసల్దిజెప్పె
యెతల పేగుసుద్ధి గూకదిక్కద

భాష పేరుమీద బజార్ల
గిరికీలు కొడ్తున్న
నాలుగున్నర కోట్ల జిందగీల్మాయి

గిదంతెందుకే?
యెవన్మాడే జెవానిప్పుడు
యెదురీదుడే తప్పొ
యెన్కకు మర్లుడుండది

తుపాకులతో అల్లిన ఇకారపు
అడ్డుకట్టల నదుముల ఇరుగదన్నాలే
అనంత సొరంగం సృష్టించాలే!

*మెతుకుసీమ కవితల సంకలనం డిసెంబర్ 2011*

# నా తెలంగాణ

● ఆనంద మహి

ఘనమైన సంస్కృతి
గలది నా తెలంగాణ
గొప్ప సంప్రదాయపు వలపు నా తెలంగాణ

భాష
తల్లి మెడలోని పచ్చల హారం నా తెలంగాణ

వీర వనితల గన్న త్యాగాల మట్టి
పోరు బిడ్డల గుండె ధైర్యం

నైజాంను వణికించి వరిదంట్ల
దండయాత్ర చేసి పరువును జండాలా ఎగిరేసిన
నా తెలంగాణ

నల్ల బంగారం
గుండెలోతుల్లో నింపుకొని
ఒంటి నిండా గాయాలతోని
బాధల తట్టులతోని
మట్టిమోస్తున్నది

కల్లా కపటం లేని అవ్వై కష్టాలెన్నున్నా బిడ్డలకు
పాలామృతాన్ని పంచుతూ
గతుకులనేల మీద వడుస్తున్నది
నా తెలంగాణ నిండు ముత్తైదువై మిలమిల మెరిసేది
కాని కాలమెచ్చింది వలస పంజరం చిలకైంది
స్వేచ్ఛ కోసం పరితపిస్తున్నది

*న్యూస్ టైమ్, డిసెంబర్, 2011*

# ఇకనైనా జారుకోండి

• అమ్మఒడి రత్నమహర్షి

మా హక్కుల సాధనకై ఆయుధం బట్టలే
మాది కానిదేది మేము మాకియ్యమనలే
ఏంది భాయి మాకేసి ఎగాదిగా జూస్తవ్
కళ్ళముందు చరిత్రను కాళ్ళరాయకుర్చున్నవ్
మా రక్త మాంసాలను అగ్గిలో ఉడికిస్తున్నమ్
మీ చీము నెత్తురుకి సిగ్గు గుర్తు చేయాలని
మా బొందలో పేనాలను ఇంగితం కలిగించాలని
ఆవిరైన మా బిడ్డల భౌతికరూపాలను
కళ్ళనిండా నింపుకొని ఖాండ్రించి ఉమ్మినా
మట్టి పామోలే నువ్ మాటేసివున్నావు
మధగజమోలే నువ్ మోరేసి జూస్తున్నవ్
నీ ఉనికి కనిపెట్టామ్ నీ కుట్రను పసిగట్టామ్
తెలంగాణ బిడ్డల తెగువ నీకు తెలియకుంటే
గతకాలపు మండిన అన్నలు గుణపాలు తీస్తుండ్రు
కడుపు కాలిన తల్లులు కత్తులు సాన బెడ్తుండ్రు
సకల జనుల సమ్మెటలు చేత బట్టుకుంటున్నమ్
అమర వీరుల మీద ఆనవేసి చెప్తున్నామ్
ఎత్తిన ఆయుధం దించం నీ నెత్తిన దించుడే
మా దారిల నిలవకండి ఇకనైనా జారుకోండి

*న్యూస్ టైమ్, డిసెంబర్, 2011*

# భవిష్యత్కవితా వేదిక

• పిన్నంశెట్టి కిషన్

అందరూ అనుకుంటున్నట్టు
పాతుకుపోయిన కాపలాకాదు-
గోడ
నిస్తేజానికి ప్రతీకా కాదు-
అది
రొమ్ము విరిచి నిలబడి
అక్షరాల అంగి వేసుకుని
తెలంగాణ వాదాన్ని మోస్తున్నది

నాలుగు కోట్ల గొంతుకల
నాదాన్ని అలుపెరుగక
నినదిస్తున్నది
గోడపై పూసిన అక్షరాలు
తెలంగాణా సాంస్కృతిక
పరిమళాలు
ఒక్కో అక్షరం
వలసవాదుల మస్తిష్కాలపై
గూడు కట్టిన
సమైక్య వాద సాలీళ్ళను
ఛేదించే ఖడ్గపాళి

ఆ అక్షరాలు
మా భావోద్వేగాలకు
సజీవ సాక్ష్యాలు

ఆ అక్షరాలు
సబ్బండ వర్ణాల పాదముద్రలు
ఆ అక్షరాలే
ఆశల పొలంలో రైతులు నాటుకున్న
పోరు విత్తనాలు
అందుకే
అందరూ అనుకుంటున్నట్టు
గోడ నిస్తేజానికి ప్రతీక కాదు-
అది
నిత్యచైతన్యాన్ని నింపుకున్న
నిజమైన దిన పత్రిక-
తెలంగాణ పుత్రిక

*నమస్తే తెలంగాణ, 7, డిసెంబర్, 2011*

# రెండు దేహ(శ) బాషలు

● ఎ.కె. ప్రభాకర్

అన్వయం అందినట్టే అంది
చేజారిపోతుంది
యిన్నాళ్లుగా యిన్నేళ్లుగా వొకరితో వొకరం
నిర్విరామంగా మాట్లాడుతూనే వున్నా
వేర్వేరు మాండలికాలై ధ్వనిస్తుంటాం
వైవిధ్యం వైరుధ్యంగా పరిణమించడం తెలుసా?



గుండెమీద చెవి పెట్టి వింటే
వొకటే హోరు
అది కుంతల జలపాతమో
సాగర తీర ఘోషో అర్థం కాదు
పాలపిట్టల కువకువలు
హృజ్ఝురాల పలవరింతలు
వసంత మేఘ గర్జనలు
నిర్ణిద్ర మృదంగస్వనాలూ
కలగలిసి పైకెగసి
వొకరిలోకి వొకరం ప్రవహించినప్పుడు కూడా
భిన్న అస్తిత్వాల గీతల్లోపల
యింకా పూర్తిగా తెలుసుకోలేని రహస్యం ఏదో
యిద్దరి మధ్య
యీ గోడలెప్పుడు లేచాయో చెప్పగలవా?



కంటిచూపులో
పెదవి విరుపులో
మొలక నవ్వులో
హస్త చాలనంలో
అర్థాల్ని అవగతం చేసుకుందామంటే
నిఘంటువు నిండా దేహభాష
హృదయభాష లేదని ఆరోపణ
హృదయాన్ని దేహంలోకి వొంపుకొని
అనువదించుకోవడం కూడా కళేనని ప్రత్యారోపణ
యిదంతా సారాంశం తేలని
ముగింపు లేని చర్చగా మిగలాల్సిందేనా?

మనసు పొరల కింద నలిగే స్వరాలు
గొంతు గోడల మీద ప్రతిధ్వనించే పాటలు
అగాధాల అంచున నిలబడి పిలిచే కేకలు
యెన్నెన్నో ఆరోహణలు - అవరోహణలు
యెవరి గోల వాళ్ళదే అయి
వుమ్మడి అనుభూతుల్ని మిగల్చలేకపోయాయి
దోచుకోవడం తప్ప పంచుకున్న జాడలేవి?



మాటలూ మౌనాలూ
మాటలకందని ఆకాంక్షలూ
పరిహాసమైనపుడు
మనశ్శరీరాలూ
మోహ ప్రపంచాలూ
మార్కెట్‌కి పునాదులైనపుడు
జీవ కణాలపై అనుక్షణం

ప్రకటిత - అప్రకటిత
ఆధిపత్యాలు చవి చూసినపుడు
వొకరి పరివేదన మరొకరికి వినోదమైనపుడు కూడా
'సబ్ ఠీక్ హై" అంటూ
సమైక్య రాగమాలపించగలమా?
ప్రియా! యిది పొసగదు
విడిగా వుంటూ
వొకరి సుఖం వొకరు కోరుకుంటూ

ప్రేమలు నిలుపుకుందాం
యిక తప్పదు.

*ఎ.కె. ప్రభాకర్ బ్లాగ్‌స్పాట్.కామ్ డిసెంబర్,* ***2011***

# యౌవ్వనం చిగురిస్తుంటే

• చిర్రాసుదర్శన్ రెడ్డి

యౌవనం చిగురిస్తుంటే కల కిల రాగాల
పక్షుల ఏక మాత్రమై
ఎదకు రెక్కలు మొలుస్తాయ్
నువ్వు కొమ్మన పాడే కోయిలవై
కోటి చిగురులు పూయిస్తావ్
నువ్వు క్షణ క్షణం పలికే
కొత్త గొంతుకవై కోటి
కలలకు ప్రాతినిధ్యం వహిస్తావ్

యౌవనం చిగురిస్తుంటే
నవ్వు భూమి మీది నడుస్తున్న
చందమామ వౌతావ్
ప్రాక్రుతిక సౌందర్యం
నీ రీవికి నిదర్శనమై
పెదాలపైన పూస్తుంది
కోరికల తీగలనిండా
రేపటి కలలు మొగ్గలు
తొడుగుతుంటాయ్

యౌవనం చిగురిస్తుంటే
నువ్వు కవితా మేఘానివై
పాఠకభూమిని తడిపేస్తావ్
ప్రతి ఆకారం అద్భుతమై
కొత్త ఆశలురేపుతుంది
లక్ష్యం నీ అడుగుల్ని ఆకర్షిస్తుంది

యౌవనం చిగురిస్తుంటే
నువ్వు ఉద్యమం
పిడికిలిగా నిలబడతావ్
స్వాభిమానం భూమిక మీద
రక్తం పరవళ్ళు తొక్కుతుంది
ప్రజల కోసం పరుచుకున్న
నీ ఎద
స్వయం పాలనమై
వికసిస్తుంది
తెలంగాణమై తెగిస్తుంది

*న్యూస్ టైమ్, డిసెంబర్, 2011*

# వెయ్యి ఉరుల మర్రి

● ఎ.వి. మూర్తి

ఆకాశాన్ని ఆకుపచ్చగా మారుస్తూ
ఊడలు కాలపురుషుని కేశాల్లా
వ్రేలాడుతాయి ఎర్రనేల ప్రతి చిగురులో
ఆవేశపు జీరలు ప్రవహింపజేస్తుంది
ప్రతి ఆకు కదలికలో
నిరంకుశపు దేగల చప్పుడు వినిపిస్తుంది
ఈ చెట్టును చూసినా
తెల్లని కన్నులు ప్రదర్శన పరదాలౌతాయి
ఈ నేల - ఈ గాలి
ఈ గానము మా తెలంగాణది
స్వేచ్ఛ మా సొంతం అని నినదించిన
వెయ్యి గొంతులు ఈ మర్రి
తొర్రలో ఇంకా నిక్షిప్తమై ఉన్నాయి
ఇది విద్యార్థి వీరులకు బోధి వృక్షమౌతుంది
ఆప్తులను కోల్పోయిన రాంజీ గోండు వారసులకు
పెద్దన్నై ఓదారుస్తుంది ఈమె దగ్గరికి వచ్చిన వానపాములు సైతం
నాగుబాములై బుసకొడుతాయి
గడ్డిపరక కూడా త్రిశూలంగా మారుతుంది
అయినా ఈ వెయ్యి ఉరుల మర్రి
వేలకాంతులు దర్శించే యోగినిగా
శాంతి మంత్రం జపించే గురువుగా
గంభీరంగా నిలిచి ఉంది

*న్యూస్ టైమ్, డిసెంబర్, 2011*

# తెలంగాణ యువతకు ఒక కవి లేఖ

● వి.ఆర్. విద్యార్థి

ఉద్యమం, త్యాగం, విజయం
ఇదే గదా తెలంగాణకు తెల్సిన పదాలు
ఇవెక్కడివి - ఎప్పుడూ విననివి
ఈ నిస్పృహలు, నిరాశలు, ఆత్మహత్యలు
తెలంగాణ యువతనావహించినవి..

ఉద్యమంలో షహీదులైపోవడం తెల్సు
ఆత్మహత్యల క్షణికోద్రేకాలని గెల్చు
తెలంగాణా యువతరమా
ధీరగణమా!
శతాబ్దాల ఉద్యమ చరిత్రలో
పిరికి చావుకు చోటే లేదు

మీ తరం ఆత్మహత్యలు
మా తరం గుండెల్లో ఆరని మంటలు
రెండు తరాలకు తీరని బాధలు

తెలంగాణ - ఒక
ఉద్యమ సముద్రం పోరాట గీతం
చేతనాకేతనం తెలంగాణ
యోధసంతతకి స్వగ్రామం
స్వేచ్ఛాకాంక్ష శౌర్యపునైజం
సమ్మక్క సారక్కల వారసత్వం
బతుకు తత్వాన్ని
'బతుకమ్మ'గా చాటే ధిషణం
ప్రేమైక సౌభాతృత్వమే భూషణం

పిల్లలూ మీరిట్లా
పిరికి పాలు తాగుతారా
ఆత్మహత్యల కోరుతారా
ఉద్యమంలో మేమెవరము మీ వెంటలేమా?
అవసరంలో దిశ నిర్దేశించలేమా
ఎందుకీ నిరాశ నిస్పృహ మీలో
సత్వరమే భరతభూమిన
తెలంగాణ రాష్ట్రం ఖాయం

మీ తరం తెలంగాణ నిధి
మిమ్మల్ని కాపాడుకోవడం మా విధి

అందుకే అంటున్నాను
అనన్య సామాన్యుడ్ని అర్థిస్తున్నాను
మండే చైతన్యంతోనే ఓపిక పట్టండి
మీ ఆలోచనల గుంపు నుండి
ఆత్మహత్యలను తరిమికొట్టండి

*ఊపిరి కవితా సంపుటి, డిసెంబర్ 2011*

## అమరుల సందేశం

● వైద్యం భాస్కర్

సకల జనుల
ఆకాంక్ష
తెలంగాణ కోసమై
పట్టణ చౌరస్తాలో
పట్టపగలు
నిన్ను నీవు దహించుకున్న శ్రీకాంతాచారి
నీకు జోహార్
అసెంబ్లీ సాక్షిగా
ప్రజాస్వామ్యం
బద్ధలయిన రోజు
మన యాదయ్య
మనకు దూరమైన రోజు
పార్లమెంటు మౌనాన్ని
ప్రశ్నించిన
యాదిరెడ్డి నిలువెల్ల కుంగిపోతూ
మననుండి దూరమైన
ఎందరో....
అమరత్వం పొందుతుంటే
కన్న పేగు కమిలిన గురుతులు
తెలంగాణ నిత్యం
ఓ పచ్చిపుండు

*న్యూస్‌టైమ్, డిసెంబర్, 2011*

# నివురుగప్పిన నిప్పు

● వేము

మా
కన్నీళ్ళలోనూ
రూపాయల్ని వెతికే
వాడికేంచెప్పను
దశాబ్దాలసంది
మా వేదనలని
మా
నిశ్శబ్దంలోనూ
నోట్లను కురుపించుకొనే
వాడికేం వినిపించను
రోజులసంది
మా
ఆకలి కేకల్ని
తవ్వినకొద్దీ
జలగకజాడలే
మోసపూరిత
మహాకావ్యాల వెలుగుల్లో
మా
మొఖాలు గిడసబారాక
ఇంకా
ఎదుగుదల ఎన్నటికి
దేహం కన్నా దేశమే గొప్పదని

మా
నల్లని రక్తం మీకెరుకలే .?
భాషాభిమానం ముసుగులో
ఒనగూడింది వలస ప్రయోజనమే
సలువుతున్న గాయాలసాక్షిగా
నాటి మా భయాలు
భయంకర నిజాలయ్యాక
మౌనంగా వుండలేం
కోట్ల గొంతులొక్కటై
నినదిస్తాం
లేస్తాం
నివురుగప్పిన నిప్పు
నా తెలంగాణ

*న్యూస్ టైమ్, డిసెంబర్, 2011*

## డిసెంబరు 9

- కదిరె కృష్ణ

డిసెంబరు 9 ఎక్కడ మాయమైంది
నాకు దాని చిరునామా కావాలె
అది ఎట్లా అదృశ్యమైందో తెల్వాలె
అది నా నెత్తురు స్వరూపం
నా సింగరేణి
నా బయ్యారం
నా కొత్తగూడెం, నా కృష్ణాగోదావరి
నా వరల్డ్ ట్రేడ్ సెంటర్ల కొల్లగొట్కపోయిన
ఈ హైటెక్ గజనీ మహ్మద్ ఎవడు?
ఓరేయ్! హైజాక్ ఆంధ్ర కబ్జాదారుల్లారా
నా డిసెంబరు తొమ్మిదినెక్కడ దాచిండ్రో చెప్పండ్రి
వందరూపాల నోటు మీద గాంధీ తాత
కొప్పెరయ్యిందా?
శ్రీకృష్ణ కమిటీ కోటు జేబుల రూపాయి బిల్లె
రూపుమారిందా?
రూటెట్లా మారిందో చెప్పు
అన్ని సరిగ్గానే ఉంటే
లూటీ ఎట్లైందో ఇగిలియ్యిమల్ల
ఏమైంది?
ఏ దిక్కు మర్లింది?
ఆనవాలు కావాల్నా గురజాడ అప్పారావ్?
ఓనా దేవులపల్లి కృష్ణశాస్త్రి (శ్రీశ్రీ)
కాళోజి కాలికింది మట్టే చెప్తది
ఇట ఎచ్చట తవ్వుకున్నా

కోట్లాది జనగానాల ప్రజాజీవితాల ప్రతిబింబాలుంటయ్
ఇంకా గుర్తులు అదుగుతవా?

చిదంబరం నోట్లనించి ఊడిపడ్డ నాల్గచ్చరాల ముత్యపుజల్లు
ప్రధానమంత్రి పెదాలమీద
అలవోకగా ఎగిసిపడ్డ అమృతధారాఝరి
కామన్ మినిమమ్ ప్రోగ్రాంలో
మిరుమిట్లు గొల్పిన మెరుపుతీగ
రాష్ట్రపతి ప్రసంగమై
దిక్పాలకుల నాసికా రంధ్రాల్లో జొరబడ్డ
శబ్ద తుఫాను

అది నా జన్మ రహస్యం
నా ఆరువందల ప్రాణత్యాగాల జీవిగంజి
అది నా చార్మినార్
నా మాయిముంత నా నెత్తుటి ఘోష
కమ్మటి అమ్మ పాలవాసన
అది నా దప్పు తెలంగాణ
ఊర్లు దూపగొన్నయ్
వాడకట్లు - మండలాలు - జిల్లాలు
పరిగడుపుతో పల్లెలు - దినాలు - ఏండ్లు - దశాబ్దాలు
గుత్పలు వీపున గట్టుకున్న గూడాలు
గడ్డం ఈరబోసుకున్న పనిముట్లు జడలు బార్నయ్
ఆశల రెక్కలు విప్పుకున్న కవితా పంక్తులు
మెదల్ల మొదల్లలో నెత్తురు గక్కుతున్నై
సమైక్యాంధ్ర సంకపిల్ల శ్రీకృష్ణ కమిటి
దోపిడిదారుడు ఇప్పేసిన గోసిగుడ్డ
పరిమళవాసన శ్రీకృష్ణ నివేదిక
వలస దొరల ధనబలానికి
మరోసారి నెత్తుడి తడి

మట్టసంగ మా పీకలు గోసి
అట్టహాసంగ ఊరేగుతున్న ఆంధ్రవలస
తుపాకీ సమూహాల మదపుటేనుగులు

యిది బొమ్మా బొరుసు ఏస్కోవటమా్రనా?
నా నాలుక్కోట్ల హృదయ పల్కులపై చెక్కిన
శిలాక్షరాలజరామర నికర ప్రభాతతి జనతాధ్యుతి
ఆత్మ గౌరవ నినాద జలధి
ఇక్కడ ఇనుప కచ్చదాలకెవడు భయపడదు
ఇక్కడ తుపాకీ తూటాల తుఫానుకెవడు జన్కడు
ఇక్కడ పోలీస్ బెటాలియన్లు కొత్తేం కాదురా బట్టెబాజీ
ఇక్కడ ప్రాణాలు ఎంటికతో బరాబార్
ఆస్కమీ వై?
మా ప్రాణమంతా తెలంగాణే
నెత్తురోడుతున్న పదిజిల్లాల మాగాణే
నాకు ఈ చల్లగాలి హాయి గొల్పటం లేదు
ఎముకలు గొరికే చలి ఏమాత్రం వొణ్కుపుట్టిస్తలేదు
సంకురాతిరి మంటలు సెగ తలుగుతలేదు
వెన్నెల రాత్రులు ఎందుకింత ఇకారం?
ప్రియురాలి తీపిగానం చేదెక్కెనెందుకు?
అద్దుమ రేతిరి భూమి బద్దలైతున్నట్టు
ఆకాశం నిలువునా చీర్కపోయినట్టు
ఎందుకింత మనోవిలాసం...
చింతామణి నగ్ననాట్య పైత్యమా
గోసంగి యాక్షగాన యాల లెల్లాయి పాటలా? తేల్చుకుందాం రారా...
మళ్లీ అదేనోరు అదే గొంతు
తొడుగు మొఖం అతికించుకున్నట్టున్నదు?

కానీ ఈసారి...
మగతనిదర్లో చావు డప్పుల మోత
కలో నిజమో తేల్చుకునే లోపే
ఊరు బూడిదైపోయింది

అది డిసెంబర్ 23
మరో రూపమెత్తి శ్రీకృష్ణ రిపోర్టు

ఓ నా డిసెంబరు 9
వలసొచ్చిన వాళ్ళ విషపు కోరలు
దోపిడి దొంగల మోసపు కత్తులు
నెత్తురు జుర్రె సాదుపల్వల హస్తనైపుణ్యం
చిన్నికృష్ణుడైన మమ్ముల చావగొట్టి
నీ చెవులు మూసింద్రా
బరితెగించిన వలసాంధ్రుల భాగోతంలో
నీదో భ్రూణహత్య అనుకోనా
పీర్లపండుగ ఊదుపొగలో ఎంకులాడ్న
అలావగుండం సెగల్లో దేవులాడ్న
నీ దివ్య మనోహర రూపరేఖా విలాసం కోసం
తిరగని రోజున్నదా
అడగని ఊరున్నదా
నెత్తురుబొట్ల కడంచున నిలబడి చెప్తున్న
ఆరునూరైనా ఆరే కాదురా
తొమ్మిది తొమ్మిదొందలైనా తొమ్మిదేరా దగుల్బాజి
ఓ డిసెంబరు 9
ఇది నా చివరి చూపు కానేకాదు
కన్నుల కొలిమిలో చూపుల కత్తులు
కసాబిసా మారుతున్న ఎదురుచూపు

*పో, రాకాసి కవుల కవిత్వం, డిసెంబర్, 2011*

# శిబిరం

● సుచరిత

శిబిరమా! ఓ శిబిరమా!!
ఉద్యమాల ఊపిరీ
నల్లమల తలమాణిక్యమా
అచ్చంపేట దీక్షాశిబిరమా! పిడికెడు మందితో ప్రారంభమైనావు
జన ప్రభంజనమై వెలిగావు
అనునిత్యం నూతన ఉద్యమఉషోదయాలే
ధర్నాలు దీక్షలు రాస్తా రోకోలు, దిష్టిబొమ్మల దహనాలు
చాక్ డౌన్లు పెన్ డౌన్లు, బందులు బాయ్‌కాట్లు
హర్తాళ్ళు విద్యార్థుల ర్యాలీలు మానవహారాలు ఎత్తిన పిడికిళ్ళు
కొవ్వొత్తుల కన్నీళ్ళు కాగడాలై మండిన ఆకాంక్షలు
ఉద్యమ నినాదాలు, జెండాల జెమిలీలు
బతుకమ్మలూ వంటవార్పులూ నెత్తిన బోనాలు
తెలంగాణ ఆటల కలగాపులగాలు
న్యాయస్థానాల తీర్పులు, గాడిదలతో ఊరేగింపులు
పల్లె పల్లెన ధూం..ధాం..లు
చిన్నారుల చిందుల్లో గొత్తెత్తిన గజ్జెలు గళాలు
చెంచుల విల్లంబుల పదును మెరుపులు
బట్టల నేతా జందెం పోగు
ఉద్యోగులు నిరుద్యోగులు ప్రజాప్రతినిధులు
ప్రజలు పాలబుగ్గలు, పండుటాకులు
తెలంగాణ పోరాటానికి సై అన్నోళ్లే.!
ఎంతని చెప్పను ఏమని చెప్పను గుండెల చప్పుడే నీవైనప్పుడు
శిబిరమా! శిబిరమా!!

*అడుగులు కవిత్వ సంపుటి, డిసెంబర్ 2011*

# వీడు సాహసి

● పి. వెంకటేశ్వర శర్మ

వీడు సాహసి
తల్లిని విడిపించాలనుకుని
తలకుమించిన
భారాన్ని తలకెత్తుకున్నాడు
వీడు సాహసి

దశాబ్దాల దుఃఖం
సర్వం ధ్వంసమైన గతం
ఇంకా కొనసాగించాలన్నదే
సమైక్యవాద అభిమతమైనపుడు
సాగదింకా అంటూ
సకలజనుల పిడికిలైనాడు
వీడు సాహసి

వాడు చట్టం చేయితో
చుట్టూముడతాడని
మట్టుబెట్టడానికైనా
వెనుకాడడని తెలిసి
చైతన్యంగా కదులుతూ
చరిత్ర సృష్టిస్తున్నాడు
వీడు సాహసి

గర్భం చీల్చుకుని
వచ్చే పుట్టుకే కాదు
వలస పాలనలో
చావు బతుకులు

రెండూ పోరాటమే
సమిధనవుతానుగాని
సమరం మాననంటాడు
చావును సవాలు చేశాడు
వీడు సాహసి

ప్రాణం విలువ తెలియని
పైశాచిక వలస పాలనకు
ఆత్మ బలిదానాలు అర్థం కావు
అస్తిత్వం కోసం అంతర్యుద్ధము
సాహసి అడుగులు అటువైపే
మూడు తరాల పోరుకు
ముగింపు పలకాలి
తెలంగాణ కోసం తెగించాలని
నినాదాలు చేస్తునే ఉన్నాడు
అందుకే వీడు సాహసి

*అడుగులు కవిత్వ సంపుటి, డిసెంబర్, 2011*

## మా బడి

● ఎం. రాఘవచారి

కూల్చిన గోడలు
రాల్చిన ఇటుకలు
ఎగిసి ఎగిసి పడుతున్న
దుమ్ము ధూళికింద
నేల మీద ఆకాశాన్ని పరిచినట్టు
తారుమీద జారిపోయే వాహనాల పొగలో
కదించిన మైదానంలో మా బడి

ఆ ఇల్లు మరొక ఇల్లు
విసిరిన అందమైన చుక్కలు
నక్షత్రాలు నేలకు దిగి ఆడుకుంటున్నట్టు
ప్రకృతిలోని వర్ణాలన్నీ
పరవశంతో కౌగలించుకుంటున్నట్టు
మా పిల్లలు

అవతల ఆకాశవు గొడుగు కింద
జరుగుతున్నదేమిటో
చిన్న చిన్న అంగళ్లను మింగుతున్న
ఏ వ్యాపారం జీవితాన్ని కమ్మేస్తున్నదో
ఎంతెంత వ్యాపారం
నేలను ఆకాశాన్ని పిడికిట్లో పట్టి బిగిస్తున్నదో
విరిసీ విరియని మొగ్గల్ని
గాలికి సుగంధాలద్దే పూవుల్ని
ఎట్లా తుంచేస్తున్నదో

ఊహాలకందని పిల్లల ప్రపంచం
మా బడి

పై పైన అందని వేవైనా
తెలియాలంటే...పదండి...
వేర్లలోకి తలుపులు తెరుచుకుంటే తప్ప
తెలియవు నిజాలు
కత్తిరిస్తున్న వేర్లను
తిరిగి తిరిగి అతికించుకునే
యాతనలో పిల్లలు

అంటారొకరు
అమ్మ అనే మాట వింటేనే
కన్నీళ్లు కురుస్తాయని
గొంతు పూడుకుపోతుందని
అనారోగ్యానికి
ఆ పూటకు లేని క్రౌర్యానికి
చూస్తు చూస్తుండగానే
రాలిపోయిన అమ్మ బొమ్మగా
కన్నీటిలో రూపుకట్టుకున్నదని
మరొకరంటారు
అమ్మానాయిన తమకు తెలియరని
ఎంత కష్టం
తలిదండ్రుల్ని పిలుచుకు రమ్మనేమాట
ఎట్లా తట్టుకుంటారు వాళ్లు
ఒంటరి పిల్లల
ఏడుపు నిండిన సముద్రం మా బడి

మరికొందరుంటారు
ఏడ్చి తప్ప సాధించుకోలేని వాళ్ళు
ఏడిపిస్తే తప్ప
ఏదీ నెరవేర్చుకోలేనివాళ్ళు
వాయిదాల అగాధంలో
దొరకని తీరం కోసం సంఘర్షించేవాళ్ళు
అడిగీ అడిగీ అడిగీ ఆగిపోయినవాళ్లు

అన్నీ దండిగా ఉన్న దేశంలో
అన్నీ నిండుకున్న జీవితాలు వాళ్ల తలిదండ్రులు
అప్పుల భాగహారాలు
ఆస్తుల తీసివేతలు తప్ప
వారసత్వంగా ఏవీ దక్కని వాళ్లు
పంచుకున్న అప్పులు
సంసారాలను పంటచేలను చుట్టిన అప్పులు
వ్యాపారపు తడిగుడ్డలు
బిగుసుకుంటున్న బతకులు వాళ్ళ తలిదండ్రులు

ఈ పిల్లలు
విలవిలలాడుతున్న జీవితాలు
గాలానికి చిక్కిన చేపలు రాల్చిన కన్నీళ్లు

ఎంత ఇష్టంగా కనివుంటారు వీళ్లని
ఎంత కష్టమైపోయింది పెంపకం

బిడ్డను పనిలోకి దింపి
గిజగిజ లాడుతున్న తల్లికి
తోడూ లేక నీడా లేక
పనిలోనే మిగిలిన బిడ్డకి

హెచ్చరికలు జారీ చేయకండి
పనిలో వాళ్లు నడుస్తుంటే
రెక్కలు అరుగుతున్న చప్పుడు వినండి
మీ స్పందన మొద్దుబారిపోతే
క్షమించుకోండి మిమ్మల్ని మీరే
మేమూ వున్నాం
నీళ్ళలోంచి ఆకాశం కింద
మొలిచిన నేలమీద
నాల్గు జీతపురాళ్ళకోసం
సంతకాలు చేస్తున్న వాళ్ళం

ధిక్కారం తప్ప
ఏదీ తోడు రాదని
తెలుసుకుంటున్న పిల్లల
దైన్య హృదయాలలో
సంతకానికింత చోటు కోసం
తండ్లాడుతున్న వాళ్లం

మా బడి మా పిల్లలు మేము
ఎవడెవడి ఆనందానికో
ఎగరేసిన
రంగు రంగుల పతంగులమైనాం
దారం ఆధారంగా
నేలకు దిగుతాం
తల్లి ఒడిలాంటి ఒక బడికి రూపుకట్టి
కొత్త అక్షరాలు దిద్దుకుంటాం.

*రచన, డిసెంబర్ 2011*

# అమ్మ తెలంగాణ

● *విజయచంద్ర*

అమ్మా తెలంగాణా ఎంత మోసం నీకు
ఎంత దుఃఖం నీది
రణరక్తసిక్తం నీ దేహం
నా జ్వర తీవ్రతకు థర్మామీటర్ పేలిపోతుందే

నా తల్లీ నీకు  వందనాలు
నా కవిత్వంతో నీ చుట్టూ కాపలా కాస్తా
నీ చేతిలో అస్త్రశస్త్ర మౌతా
నీ కన్నీళ్లు తుడుస్తా

ఎవడు నిన్ను ఆపగలడు
ఉద్యమ గంగా
సర్వశక్తి సంభూతా - దుర్గామాతే

జనం అలలు
జనం కలలు
ఉస్మానియాలో పోటెత్తుతున్న కెరటాలు
ఉప్పెన రాదా
ఉద్ధృతి లేదా
నువ్వొస్తావు తల్లీ
శత సహస్ర దళాలతో విప్పారిన పద్మంలాగ
శిరసెత్తిన కలలాగా
ఫెళ ఫెళ ఫెళ ఫెళ రేగిన అగ్ని జిహ్వాల్లాగ
వియత్నాంలా రా...
నికరాగ్వేలా రా...
విముక్తి నేలలా రా...

ఈజిప్టులా రా... సిరియాలా రా...
అరబ్బు వసంతంలా రా...
ప్రజా తెలంగాణవై చెంగు చెంగున
గెంతుకుంటూ గెంతులేసుకుంటూ రా తల్లీ
నిన్ను స్వాగతిస్తా
దొడ్డి కొమురయ్యలా రా..
కొమురం భీమ్‌లా రా..
కామ్రేడ్ అచ్చమాంబలా రా..
మెల్లి షోలింగర్ స్వప్నంలా రా...

నీకోసం పోరాడి నేలకొరిగిన సాయుధ పోరాట యోధుల సాక్షిగా
ఆత్మబలిదానం చేసిన వందల విద్యార్థుల వేదనా కాంక్షలా
మరిగి మరిగి కరిగి కరిగి పిగిలి పిగిలి
రా తల్లీ రా..

దొంగలను ఓ కంట కనిపెట్టుకొని రా
ద్రోహులకు చెంప పెట్టులా రా
నీతో వ్యాపారం చేద్దామనే వారిన కాలితో తన్ని రా
అన్నదమ్ముల మధ్య కలకలం రేపుతున్న
వారి మొహం మీద ఉమ్మిరా

ఆకాశ గవాక్షాలలోంచి తిలకిస్తున్న కవి కాళోజి
కన్నుల్లో ఆనంద భాష్పంలా రా రాతల్లీ రా...

స్వాతంత్ర్యం భిక్ష కాదుగా
స్వాతంత్ర్యం రాజకీయ దేబిరింపు కాదుగా
స్వాతంత్ర్యం అమ్మకానికి వస్తువు కాదుగా
రా నీ బిడ్డలతో పోరు చేసి రా
మా అందరికీ ఆదర్శంగా రా
మా కంటి వెలుగులా రా

అలిగినారు
రోడ్ల మీద కూర్చున్నారు
రైలు పట్టాల మీద నిల్చున్నారు
ఆఫీసులు మూసినారు
సైకిల్ యాత్రలు చేసినారు
రైళ్ళు ఆపినారు
నినాదాలతో ప్రళయఘోష చేసినారు
చీకటిలో కాంతి పుంజాలు నింపినారు
కొత్త చరిత్ర రాసినారు
ఇప్పుడు నిశ్శబ్దానికి కుములుతున్నారు-నా తముళ్ళు
రాతల్లీ రా
పోరు బాటలో రా
నా కలం అక్షరాలతో
నీకు సైనిక వందనమిస్తా...

*రచన, డిసెంబర్, 2011*

# మాయమైన ముద్దబంతి నవ్వు

• లక్కిరాజు నిర్మల

బిడ్డా!
మదమెక్కిన వలస ఏనుగును
శూలంతోని పొడవాలెగని
నిన్ను నువ్వు కాల్చుకుంటె
ముద్దబంతి పువ్వొసొంటి నవ్వు మాయమైపోయి
మా గుండెల్ల గడ్డపారలు దిగుతున్నయగదా!

పాటలు పాడితివి
పంచాయితి గద్దెనెక్కి మాటలు చెప్పితివి
తెలంగాణ బిడ్డ! దోపిడిదార్లమీద తిరగబడాలె అన్నవ్

తెలివి ఒకరి సొత్తు కాదంటివి
తెగించి కొట్లాడాలంటివి
భగభగ మండే నిప్పు రవ్వలై
ఆధిపత్యం చెలాయించేటోడిమీద విరగపడాలంటివి

నువ్వెందుకు మంటల్ల దూకినవ్ బిడ్డా!
ఆడెప్పుడూ మనల్ని జూసి ఇగ్లిచ్చినవ్వుతడు
అని ముందరనే బొక్క బోర్లవడితివి
ఇగ మనల్ని బోర్ల పొక్కలల్ల బొందవెట్టకుండుంటడా
నువు గివన్ని ఆలోచిస్తె ఎంత బాగుండే!
కంసేకం బొ్రాయి మీద కుసోని
గోసబడ్డ బతుకు రస్తా సాఫ్ చేస్తెనే
తెలంగాణకు మంచిగుండు

*రచన, డిసెంబర్ 2011*

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 1. | రామగిరి శివకుమారశర్మ | సిద్దిపేట | 9440192959 |
| 2 | అంబటి వెంకన్న | నల్లగొండ | 9966376072 |
| 3 | కౌముది | వరంగల్ | - |
| 4 | అద్దంకి తిరుమల వాణిశ్రీ | హైదరాబాద్ | 9949125250 |
| 5 | జగన్‌రెడ్డి | హైదరాబాద్ | 9490491551 |
| 6 | పగడాల నాగేందర్ | హైదరాబాద్ | 9849872230 |
| 7 | పులిపాటి గురుస్వామి | హైదరాబాద్ | 9848887904 |
| 8 | సుంకిరెడ్డి నారాయణరెడ్డి | నల్లగొండ | 9885682572 |
| 9 | ఏలేశ్వర నాగభూషణాచార్య | మెదక్ | 9441125372 |
| 10 | అల్లం నారాయణ | హైదరాబాద్ | 8096677444 |
| 11 | జయధీర్ తిరుమలరావు | హైదరాబాద్ | 9951942242 |
| 12 | సహచరి | మిర్యాలగూడ | 9440970454 |
| 13 | మోతుకూరు శ్రీనివాస్ | హైదరాబాద్ | 9866061350 |
| 14 | మడిపల్లి రాజ్‌కుమార్ | హైదరాబాద్ | 9949699215 |
| 15 | ఉదారి నారాయణ | ఆదిలాబాద్ | 9441413666 |
| 16 | నాళేశ్వరం శంకరం | హైదరాబాద్ | 9440451960 |
| 17 | అనిశెట్టి రజిత | వరంగల్ | 9849482462 |
| 18 | కాసుల ప్రతాపరెడ్డి | హైదరాబాద్ | 9848956375 |
| 19 | దాసోజు కృష్ణమాచారి | హైదరాబాద్ | 9849529168 |
| 20 | యం వెంకట్ | నల్లగొండ | - |
| 20 | అన్వర్ | వరంగల్ | 9866089066 |
| 21 | శ్రీదాస్యం లక్ష్మయ్య | కరీంనగర్ | 9440155240 |
| 22 | పప్పుల రాజిరెడ్డి | సిద్దిపేట | 9652215043 |
| 23 | ఒద్దిరాజు ప్రవీణ్‌కుమార్ | హైదరాబాద్ | 9849082693 |
| 24 | కందాళై రాఘవాచార్య | నిజామాబాద్ | 9908612007 |
| 25 | వి ఆర్. శర్మ | కామారెడ్డి | 9177887749 |
| 26 | జింబో | హైదరాబాద్ | 9440483001 |
| 27 | పరిమళ్ | మహబూబ్‌నగర్ | 9441081842 |
| 28 | లోకేశ్వర్ | హైదరాబాద్ | 9160680847 |
| 29 | బియ్యాల జనార్ధన్‌రావు | వరంగల్ | - |
| 30 | గాదె వెంకటేష్ | హైదరాబాద్ | 9849722127 |
| 31 | దేశపతి శ్రీనివాస్ | సిద్దిపేట | 9553955330 |
| 32 | యాకూబ్ | హైదరాబాద్ | 9849156588 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 33. | రేడియం | హైదరాబాద్ | 9291527757 |
| 34. | వేణు సంకోజు | నల్లగొండ | 9948419881 |
| 35. | దార్ల రామచంద్ర | ........ | 8143455526 |
| 36. | కె.అంజయ్య | సిద్దిపేట | 9848005676 |
| 37. | జానా పోశెట్టి | ఆదిలాబాద్ | 9397393832 |
| 38. | కారం శంకర్ | హైదరాబాద్ | 9440207311 |
| 39. | పంజాల జగన్నాథం | కరీంనగర్ | 9948531985 |
| 40. | సిద్దెంకి యాదగిరి | సిద్దిపేట | 9441244773 |
| 41. | గుడిహాళం రఘునాథం | హైదరాబాద్ | - |
| 42. | వడ్డెబోయిన శ్రీనివాస్ | వరంగల్ | 9885756071 |
| 43. | ఆర్.రత్నాకర్ రెడ్డి | జనగాం | 9848625060 |
| 44. | హనీఫ్ | కొత్తగూడెం | 9247580946 |
| 45. | నూటెంకి రవీంద్ర | లక్షెటిపేట | 9491533295 |
| 46. | టి.కృష్ణమూర్తి యాదవ్ | హైదరాబాద్ | - |
| 47. | బి.వి.ఎన్. శ్రీను | - | - |
| 48. | సతీష్ | మహబూబ్‌నగర్ | 9949219213 |
| 49. | కమలేకర్‌శ్యామ్‌ప్రసాద్‌రావు | మహబూబ్‌నగర్ | 9441076632 |
| 49. | ఎస్వీ సత్యనారాయణ | హైదరాబాద్ | - |
| 50. | జీగురు అయిలయ్య | గోదావరిఖని | - |
| 51. | అన్నవరం దేవేందర్ | కరీంనగర్ | 9440763479 |
| 52. | జనజ్వాల | వనపర్తి | 9949163770 |
| 53. | యెన్నెం ఉపేందర్ | సూర్యాపేట | 9441268861 |
| 54. | జూకంటి జగన్నాథం | సిరిసిల్ల | 9441078095 |
| 55. | చిత్తలూరి సత్యనారాయణ | నల్లగొండ | 9030703730 |
| 56. | మల్లావఝల సదాశివుడు | గోదావరిఖని | - |
| 57. | మునిమడుగుల రాజారావు | నిర్మల్ | 9246240871 |
| 58. | తుమ్మల దేవరావ్ | నిర్మల్ | 8985742274 |
| 59. | ఎస్. వేణుశ్రీ | కరీంనగర్ | 9440064033 |
| 60. | కలేకూరి ప్రసాద్ | కృష్ణ | - |
| 61. | జూలూరి గౌరీశంకర్ | హైదరాబాద్ | 9440169896 |
| 62. | బెల్లి యాదయ్య | నల్లగొండ | 9848392690 |
| 63. | ఎం. రాజు | - | - |
| 64. | పి.వేణుగోపాలస్వామి | హైదరాబాద్ | 8096677001 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 65 | బుర్ర తిరుపతి | పెద్దపల్లి | 9963242525 |
| 66. | ఎండ్లూరి సుధాకర్ | రాజమండ్రి | 9246650771 |
| 67 | యం.డి. యాకూబ్ పాషా | హైదరాబాద్ | 9290043183 |
| 68 | హరగోపాల్ | హైదరాబాద్ | 9949498698 |
| 69 | అంబటి శ్రీనివాసరాజు | వరంగల్ | - |
| 70. | పసుపులేటి గీత | హైదరాబాద్ | 9985423111 |
| 71. | వరవరరావు | హైదరాబాద్ | - |
| 72. | భీంపల్లి శ్రీకాంత్ | మహబూబ్‌నగర్ | 9032844017 |
| 73. | కందుకూరి దుర్గాప్రసాద్ | నల్లగొండ | 9440452156 |
| 74. | పొట్లపల్లి శ్రీనివాసరావు | వరంగల్ | 9849254078 |
| 75 | వద్య పంతులు నాయక్ | - | - |
| 76 | బి. వేణుగోపాలరెడ్డి | ఆదిలాబాద్ | 9908171441 |
| 77. | చింత రమేష్ | ఖమ్మం | 9000284695 |
| 78 | వడ్ల శంకర్ | కామారెడ్డి | 9440798954 |
| 79. | యం.డి. అహ్మద్ | మెదక్ | 9441536433 |
| 80. | పిట్టల రవీందర్ | హైదరాబాద్ | 9963062266 |
| 80. | మాళవత్ బాలాజీ నాయక్ | - | - |
| 81. | కందేపి రాణీప్రసాద్ | సిరిసిల్ల | 9866160378 |
| 82. | వెలపాటి రామిరెడ్డి | వరంగల్ | 9885921444 |
| 83. | కాసుల లింగారెడ్డి | జనగాం | 9948900691 |
| 84. | ఏనుగు నరసింహారెడ్డి | హైదరాబాద్ | 9440815870 |
| 85. | కట్టా భగవంతరెడ్డి | నల్లగొండ | 9246988801 |
| 86. | అప్పాల చక్రధారి | నిర్మల్ | 9912729988 |
| 87. | కొల్లాపురం విమల | హైదరాబాద్ | 9848098333 |
| 88. | కోట్ల వెంకటేశ్వరరెడ్డి | మహబూబ్‌నగర్ | 9440233261 |
| 89. | భైరెడ్డి కృష్ణారెడ్డి | నల్లగొండ | 9440072211 |
| 90. | నందిని సిధారెడ్డి | సిద్దిపేట | 9440381148 |
| 91. | మద్దికుంట లక్ష్మణ్ | సిరిసిల్ల | 9441677373 |
| 92. | ఓదెల వెంకటేశ్వర్లు | హైదరాబాద్ | 9849705688 |
| 93. | కొలిపాక శోభారాణి | సిరిసిల్ల | 9491367409 |
| 94. | గాజోజు నాగభూషణం | కరీంనగర్ | 9885462052 |
| 95. | ఆర్. దామెర | నిర్మల్ | 08734422494 |
| 96. | బాణాల శ్రీనివాసరావు | హైదరాబాద్ | 9440471423 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 97. | రామాచంద్రమౌళి | వరంగల్ | 9390109993 |
| 98 | పి విద్యాసాగర్ | పాల్వంచ | 9963570174 |
| 99 | సి.కాశీం | హైదరాబాద్ | 9701444450 |
| 100. | ఆసం శ్రీనివాస్ | - | - |
| 101. | కాలువ మల్లయ్య | హైదరాబాద్ | 9849377578 |
| 102. | తూర్పు మల్లారెడ్డి | భువనగిరి | 9849192154 |
| 103 | బోరెడ్డి మధుసూదన్‌రెడ్డి | సిద్దిపేట | 9491331611 |
| 104. | నాంపల్లి సుజాత | హుస్నాబాద్ | 9848059893 |
| 105. | పోగుల రాజన్న | సిద్దిపేట | - |
| 106 | కోటం చంద్రశేఖర్ | తాండూరు | 9490157371 |
| 107. | నలిమెల భాస్కర్ | కరీంనగర్ | 9704374081 |
| 108. | పొన్నాల చంద్రశేఖర్ | ... | - |
| 109. | నిఖిలేశ్వర్ | హైదరాబాద్ | 9177881201 |
| 110. | మంచికంటి | ఒంగోలు | 9949535695 |
| 111. | అరుణ్‌సాగర్ | హైదరాబాద్ | 9948254504 |
| 112. | గోపగాని రవీందర్ | ఉట్నూరు | 9440979882 |
| 113. | సుంకర రమేష్ | నల్లగొండ | 9492180764 |
| 114. | షాజహానా | హైదరాబాద్ | 9440322361 |
| 115. | కోడం కుమారస్వామి | జనగాం | 9848362803 |
| 116. | జిందం అశోక్ | సిరిసిల్ల | 8978532225 |
| 117. | పద్మ | మహబూబ్‌నగర్ | - |
| 118. | వనపట్ల సుబ్బయ్య | నాగర్‌కర్నూలు | 9492765358 |
| 120. | లోచన్ | హైదరాబాద్ | 9346483577 |
| 121. | కల్వకుంట్లరఘునాధాచార్యులు | కరీంనగర్ | 9493264449 |
| 122. | బూర్ల వెంకటేశ్వర్లు | కరీంనగర్ | 9491598040 |
| 123. | బెల్లంకొండ సంపత్‌కుమార్ | హైదరాబాద్ | 9908519151 |
| 124. | అందెశ్రీ | హైదరాబాద్ | 9848560986 |
| 125. | సిద్ధార్థ | హైదరాబాద్ | 9603318460 |
| 126. | కాంచనపల్లి | హైదరాబాద్ | 9676096614 |
| 127. | జాంభవ | - | - |
| 128. | శిలాలోలిత | హైదరాబాద్ | 9391338676 |
| 129. | పొన్నాయిల కృష్ణవేణి | వరంగల్ | 9441326246 |
| 130. | సతీష్ ఉసిరికపల్లి | వరంగల్ | 9949406695 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 131. | ఇక్బాల్ | మహబూబ్‌నగర్ | 9440425769 |
| 1'32. | ఎ.సూర్యప్రకాష్ | హైదరాబాద్ | 9030017933 |
| 133 | విప్లవదత్ శుక్లా | హైదరాబాద్ | 9849185878 |
| 134 | సరిగొండ నరసింహరాజు | నల్లగొండ | 9441364022 |
| 135. | రూప్‌కుమార్ డబ్బీకార్ | హైదరాబాద్ | 9177857389 |
| 135. | అమ్మంగి వేణుగోపాల్ | హైదరాబాద్ | 9441054637 |
| 136 | కూర్మాచలం శంకరస్వామి | హైదరాబాద్ | 9703268858 |
| 137. | చిర్ర రాజేష్‌ఖన్నా | వరంగల్ | 9603231459 |
| 138 | ఎన్. గోపి | హైదరాబాద్ | 04027037585 |
| 139. | కోయి కోటేశ్వరరావు | ఒంగోలు | 9440480274 |
| 140. | నారాయణస్వామి | న్యూజెర్సీ | 0012013236665 |
| 141. | ఎన్.లోహిత వెంకటస్వామి | - | - |
| 142. | వంశీకృష్ణ | ఖమ్మం | 9491959062 |
| 143. | కృష్ణుడు | న్యూఢిల్లీ | 09810223863 |
| 145. | చందనం శ్రీకాంత్ | హైదరాబాద్ | 9493946649 |
| 146. | చింతం ప్రవీణ్ | వరంగల్ | 9346886143 |
| 147. | స్కైబాబా | హైదరాబాద్ | 9985921379 |
| 148. | మసన చెన్నప్ప | హైదరాబాద్ | 9885654381 |
| 149. | కోడూరి విజయకుమార్ | హైదరాబాద్ | 9493173897 |
| 150. | వఝల శివకుమార్ | హైదరాబాద్ | 9441883210 |
| 151. | సంగివేని రవీంద్ర | ముంబయ్ | 09987145310 |
| 152. | లింగకారి మహేష్ | వనపర్తి | 9440830275 |
| 153. | ఎన్. నరసింహ శర్మ | వనపర్తి | 9441357400 |
| 154. | ఆశారాజు | హైదరాబాద్ | 04024064195 |
| 155. | జూపాక సుభద్ర | హైదరాబాద్ | 9441091305 |
| 156. | తిరునగరి దేవకీదేవి | వికారాబాద్ | 9949636515 |
| 157. | హిమజ | హైదరాబాద్ | 04027610182 |
| 158. | అడువాల సుజాత | కరీంనగర్ | 9059961130 |
| 159. | తాయమ్మ కరుణ | హైదరాబాద్ | 9989206397 |
| 160. | గోగు శ్యామల | హైదరాబాద్ | 9866978450 |
| 161. | ఎన్. అరుణ | హైదరాబాద్ | 04027037585 |
| 162. | రత్నశ్రీ | హైదరాబాద్ | 9553955320 |
| 163. | పరమాత్మ | హైదరాబాద్ | 9848552512 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 164. | ఐతా చంద్రయ్య | సిద్దిపేట | 9391205299 |
| 165. | రేణుక అయోల | హైదరాబాద్ | 9963889298 |
| 166. | తుర్లపాటి లక్ష్మి | నిజామాబాద్ | 9704225469 |
| 167. | తమ్మెర రాధిక | తొర్రూర్ | 9440626702 |
| 168. | శేషం సుప్రసన్నాచార్యులు | వట్టెం | 9000245963 |
| 169. | దూడం మనోహర్ | సిరిసిల్ల | 9440544479 |
| 170. | ఆడెపు లక్ష్మణ్ | సిరిసిల్ల | 9849157752 |
| 171. | దేవి యాదగిరి | కరీంనగర్ | 9866069151 |
| 172. | ఎ. మోహన్‌రాజ్ | కామారెడ్డి | 9705207615 |
| 173. | ఎనిశెట్టి శంకర్ | నిజామాబాద్ | 9866630739 |
| 174. | సిరిసిల్లా గఫూర్ శిక్షక్ | కామారెడ్డి | 9849062038 |
| 175. | దర్భశయనం శ్రీనివాసాచార్య | వరంగల్ | 9440419039 |
| 176. | పి.లక్ష్మినారాయణ | హైదరాబాద్ | 04027150895 |
| 177. | కృపాకర్ మాదిగ | హైదరాబాద్ | 9948311667 |
| 178. | సతీష్‌చందర్ | హైదరాబాద్ | 9866192685 |
| 178. | దార్ల వెంకటేశ్వరరావు | హైదరాబాద్ | 9989628049 |
| 179. | ధేనువకొండ శ్రీరామమూర్తి | హైదరాబాద్ | 9885297983 |
| 180. | చల్లపల్లి స్వరూపరాణి | విజయవాడ | 9440362433 |
| 181. | జుగాష్ విలి | హైదరాబాద్ | 9848266384 |
| 182. | తైదల అంజయ్య | హుస్నాబాద్ | 9866862983 |
| 183. | పసునూరి రవీందర్ | హైదరాబాద్ | 7702648825 |
| 184. | ఊడుగుల వేణు | హైదరాబాద్ | 8099603532 |
| 185. | మహ్మద్ హనీఫ్ అలీ | నల్లగొండ | 9346491023 |
| 186. | దాసోజు జ్ఞానేశ్వర్ | నల్లగొండ | 9912138152 |
| 187. | మాడుగుల నారాయణమూర్తి | ఆసిఫాబాద్ | 9441139106 |
| 188. | కోవెల సంతోష్‌కుమార్ | హైదరాబాద్ | 9052116463 |
| 189. | దిలావర్ | పాల్వంచ | 9866923294 |
| 190. | సయ్యద్ ఖుర్షీద్ | మహబూబాబాద్ | 9989511786 |
| 191. | కందుకూరి శ్రీరాములు | హైదరాబాద్ | 9440119245 |
| 192. | సుజాత సూరేపల్లి | కరీంనగర్ | 9849468281 |
| 193. | కత్తి పద్మారావు | గుంటూరు | 9849741695 |
| 194. | ఎలనాగ | హైదరాబాద్ | 9866945424 |
| 195. | దానక్క ఉదయభాను | హైదరాబాద్ | 9966989083 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 196. | పొన్నాల బాలయ్య | హుస్నాబాద్ | 9908906248 |
| 197. | ఎస్.ఆర్. భల్లం | తాడేపల్లిగూడెం | 9885442642 |
| 198. | యన్. హరికృష్ణ | సింగన్నగూడెం | 9652639908 |
| 199. | దామెర రాములు | నిర్మల్ | 9866422494 |
| 200. | హర్ష | - | - |
| 201. | శివారెడ్డి | హైదరాబాద్ | 04024064195 |
| 202. | బమ్మిడి జగదీశ్వరరావు | హైదరాబాద్ | 9490696911 |
| 202. | దాసరాజు రామారావు | హైదరాబాద్ | 9618224503 |
| 203. | గద్దపాటి శ్రీనివాస్ | ఖమ్మం | 9951660789 |
| 203. | తమ్మనబోయిన వాసు | హైదరాబాద్ | - |
| 204. | సి.హెచ్. ప్రకాష్ | కామారెడ్డి | 9346403040 |
| 205. | సూరారం శంకర్ | కామారెడ్డి | 9948963141 |
| 206. | జ్వలిత | ఖమ్మం | 9989198943 |
| 207. | రావణ్ | హైదరాబాద్ | 9912199386 |
| 207. | అరసవిల్లి కృష్ణ | విజయవాడ | 9247253884 |
| 208. | రాంకీ | హైదరాబాద్ | raamki70@gmail.com |
| 209. | రివేరా | హైదరాబాద్ | 9347560498 |
| 210. | పాణి | కర్నూలు | 9866129458 |
| 211. | ఎలనార | హైదరాబాద్ | 9963041474 |
| 212. | సిద్దినబోయినవెంకట్‌యాదవ్ | హైదరాబాద్ | 9347350545 |
| 213. | నాగవరం బలరాం | వనపర్తి | 9440678603 |
| 214. | టి.వేణు | సిద్దిపేట | 9908752292 |
| 215. | చెరుకు సుధాకర్ | నకిరెకల్ | 9848472329 |
| 216. | సి.హెచ్. ఆంజనేయులు | ఖమ్మం | 7702537453 |
| 217. | సంకేపల్లి నాగేంద్రశర్మ | కరీంనగర్ | 9346814782 |
| 218. | ఆలాజ్‌పూర్ కిషన్ | సిద్దిపేట | 9908708809 |
| 219. | నందిని భగవాన్‌రెడ్డి | సిద్దిపేట | 9492913165 |
| 220. | తోట అశోక్ | సిద్దిపేట | 9440039993 |
| 221. | వంగా గాలిరెడ్డి | సిద్దిపేట | 9391813526 |
| 222. | పి.యాదగిరి | సిద్దిపేట | 9299909516 |
| 223. | వడ్డెబోయిన రమణ | వరంగల్ | 9966532456 |
| 222. | వేముగంటి మురళీకృష్ణ | హైదరాబాద్ | 9052203843 |
| 223. | దేశరాజు | హైదరాబాద్ | 9948680009 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 224. | ఎం.వి.రమణ | హైదరాబాద్ | 9949488151 |
| 225. | మల్లీశ్వరీ | విశాఖపట్నం | 9246616788 |
| 226. | వెల్దండి శ్రీధర్ | కోహెడ | 9866977741 |
| 226. | ఉదయమిత్ర | మహబూబ్‌నగర్ | 9985203376 |
| 227. | షేక్ హారూన్ ఉల్ రషీద్ | - | - |
| 228. | నమిలికొండ బాలకిషన్‌రావు | కరీంనగర్ | 9849382399 |
| 229. | ముక్కెర సంపత్‌కుమార్ | హుస్నాబాద్ | 9959618206 |
| 230. | అఫ్సర్ | అమెరికా | afsartelugu@gmail.com |
| 231. | శేఖర్ ఆర్.కె. | హైదరాబాద్ | - |
| 232. | రమేష్ హజారీ | హైదరాబాద్ | 9390919090 |
| 232. | అమర్ | హైదరాబాద్ | - |
| 233. | కాంచనపల్లి రాజేంద్రరాజు | హైదరాబాద్ | 9849226423 |
| 234. | సీతారాం | ఖమ్మం | 9866563519 |
| 235. | శ్రవణ్ కుమార్ రక్తాని | వరంగల్ | 9704560801 |
| 236. | అయినంపూడి శ్రీలక్ష్మి | హైదరాబాద్ | 9989928562 |
| 237. | కలకుంట్ల రంగాచారి | సిద్దిపేట | 9553586159 |
| 238. | శారదా హన్మాండ్లు | నిజామాబాద్ | 9912275801 |
| 229. | అనామధేయుడు | ఒంగోలు | - |
| 240. | మోహన్ రుషి | హైదరాబాద్ | 9393010981 |
| 242. | కొండపల్లి నీహారిణి | హైదరాబాద్ | 9866360082 |
| 243. | జోగు అంజయ్య | జనగాం | 8008957480 |
| 244. | మద్దెర్ల రమేష్ | డోర్నకల్ | 9985135771 |
| 246. | కందుల శ్రీనివాసరావు | - | - |
| 247. | బి.మల్లయ్య | వరంగల్ | 9440744605 |
| 248. | మోతుకూరి అశోక్‌కుమార్ | కామారెడ్డి | 9247380976 |
| 249. | ఎస్.రఘు | ఖమ్మం | 9848208533 |
| 250. | సి.హెచ్.మధు | నిజామాబాద్ | 9949486122 |
| 251. | అమరవేణి | ఖానాపూర్ | 8500027004 |
| 252. | మందుల పరమాత్మ | వరంగల్ | 9573812249 |
| 253. | మోతె గంగారెడ్డి | హైదరాబాద్ | 9000022443 |
| 254. | వంశీ భార్గవ రాజశేఖర్ | ఖమ్మం | 9959852154 |
| 255. | సేనాపతి సంపత్కుమారాచార్య | నిజామాబాద్ | 9441092774 |
| 256. | వంగాల సంపత్‌రెడ్డి | వరంగల్ | 7396732936 |

| నెం. | పేరు | ఊరు | సెల్ నెం. |
|---|---|---|---|
| 257. | కేతిరెడ్డి యాకుబ్‌రెడ్డి | వరంగల్ | 9989584549 |
| 258. | సైదులు ఐనాల | ఖమ్మం | 9948714105 |
| 259 | కుమ్మరి భిక్షపతి | నర్సాపూర్ | 9704878679 |
| 260 | వల్లందాసు వెంకటేష్ | నర్సాపూర్ | 9505555197 |
| 260. | గుండం మోహన్‌రెడ్డి | నర్సాపూర్ | 9440161636 |
| 261 | దప్పోల్ల రమేష్ | సంఘారెడ్డి | 9550923323 |
| 262. | ఆనంద మహి | ఖమ్మం | 9652226083 |
| 263. | అమ్మఒడి రత్నమహర్షి | ఖమ్మం | 8978741733 |
| 264 | పిన్నంశెట్టి కిషన్ | హైదరాబాద్ | 9030614983 |
| 265. | ఎ.కె.ప్రభాకర్ | హైదరాబాద్ | 9676676028 |
| 266. | చిత్రా సుదర్శన్‌రెడ్డి | హైదరాబాద్ | 8142534499 |
| 267. | ఎ.వి.మూర్తి | మంచిర్యాల | 9963371637 |
| 268. | వి.ఆర్.విద్యార్థి | వరంగల్ | 9989139498 |
| 269. | వైద్యం భాస్కర్ | ఖమ్మం | 7799722861 |
| 570. | వేము | ఖమ్మం | 8500665105 |
| 271. | కదిరె కృష్ణ | హైదరాబాద్ | 9963698577 |
| 272. | సుచరిత | అచ్చంపేట | 9912797719 |
| 273. | పి.వెంకటేశ్వర శర్మ | అచ్చంపేట | 9912797719 |
| 274. | ఎం.రాఘవచారి | మహబూబ్‌నగర్ | 9490909792 |
| 274. | విజయచంద్ర | బరంపురం | 9438720409 |
| 275. | లక్కిరాజు నిర్మల | హైదరాబాద్ | 9949299618 |

17856

మడినిచ్చి ఇదుగిరువాలు దున్ని
నీళ్ళువెట్టి నాట్లకు తోడైన...

ఈ పుస్తకం తేవడానికి ప్రత్యక్షంగా పరోక్షంగా సహాయం చేసిన హరగోపాల్, పి.సి.రాములు, నాళేశ్వరం శంకరం, పరమాత్మ, కందుకూరి శ్రీరాములు, కాకిరాల రాంచంద్రశర్మ, సిద్దినబోయిన వెంకట్ యాదవ్, కరుణాకర్ (చిన్నా) వేముగంటి సమీర్, వేముగంటి శ్రీనివాస్, వేముగంటి రఘునందన్, బి. వేణుగోపాల్‌రెడ్డి కాంచనపల్లి వేకువ, దాసరి దయాకర్‌రెడ్డి, సూరారం శంకర్, పసునూరి రవీందర్, మడిపల్లి రాజ్‌కుమార్, ప్రవల్లిక, తమ్మనబోయిన వాసు, శ్రీరాం, ఐనాల సైదులు, హనీఫ్, వి.వి. శివారెడ్డి, రవీందర్, కుకల శకుంతల, అన్నవరం దేవేందర్, అన్వర్, విధుమౌళి, ఓదెల విజయనిర్మల, మోతె గంగారెడ్డి, గుర్రాల మహేందర్‌రెడ్డి, తోట అశోక్, ఆదర్శజిరాక్స్ సెంటర్, ఎం.డి.అబ్దుల్ మజీద్, ఎల్లారెడ్డి పేట పుస్తకాన్ని అందంగా ముద్రించిన అనుపమ ప్రెస్ రమణమూర్తికి మరియు సిబ్బందికి, టైటిల్ పేజి చేసిన చరిష్మా ప్రింటర్స్ సుధాకర్‌రెడ్డి మిగతా అందరు తెలంగాణ మిత్రులకు...... కృతజ్ఞతలు.

munum
telangana kavitapushkaram

నాలుగు దశాబ్దాలు గడచినా ఏకత ఏర్పడని విఫల అస్థిత్వం. వివక్షలతో అణగారిపోయిన ఉనికిపై ముంచుకవచ్చిన ప్రపంచీకరణ పెనుముప్పు, క్షేత్రస్థాయి గ్రామీణ వాస్తవికతలో వచ్చిన వాస్తవ, మార్పులు- ఇవీ బహుశా తెలంగాణ ఉద్యమాన్ని మోసుకువచ్చిన రుతుపవనాలు.

తెలంగాణలోని శైథిల్యాన్ని మొదటగా కనిపెట్టి దానికి గొంతునిచ్చింది కవిత్వమే. తెలంగాణ క్షేత్ర వాస్తవికత ఒక రాజకీయ ఆకాంక్ష దిశగా నడుస్తున్నదని అతి త్వరలోనే కనిపెట్టింది కూడా సాహిత్యకారులే. 2000 నుంచి పన్నెండేళ్ల కాలంలో, ఉద్వేగపరచిన ఏ సందర్భాన్నీ కవి వదిలిపెట్టలేదు. ప్రారంభం వాదపు ఆరంభాన్ని మత్తడి, పొక్కిలి ప్రతిబింబిస్తే, దాని రాజకీయ వాస్తవ రణరంగాన్ని 'మునుం' ప్రతిఫలిస్తుంది. ఇది పోరాటాల మునుం.

-డా. కె.శ్రీనివాస్

